వందేమాతరమ్.

# మనకీదారిద్ర్యమేల?

అను

# భారతవర్ష-ఆర్థికచరిత్ర.


గ్రంథకర్తలు:

దేశరాజు రామచంద్రరావు, బి. ఏ.

(గుజరాతు విద్యాపీఠము.)

దేశరాజు సత్యసుబ్రహ్మణ్యము, బి. ఏ.

(గుజరాతు విద్యాపీఠము.)


[illegible]

[illegible]

(ఆంధ్రయువజనస్వరాజ్యసభవారిచే ప్రకటితము.)


|| కోటమర్తి చినరఘుపతిరావుగారిచే,

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

కాకినాడ,

1923.




వెల రు 1—8—0.

III

# విషయసూచిక.


| ప్రకరణము. | | పుట. |
| --- | --- | --- |
| 1. | సహజసంపద. ... ... ... | 1 |
| 2. | చరిత్రప్రశంస. ... ... ... | 9 |
| 3. | వ్యవసాయము; భూమిపన్ను. ... ... | 50 |
| 4. | వస్త్రపరిశ్రమ. ... ... ... | 85 |
| 5. | నౌకావ్యాపారము. (ఓడల వర్తకము) ... | 117 |
| 6. | ఇతరపరిశ్రమలు. ... ... ... | 145 |
| 7. | పరిశ్రమలు క్షీణించుటచే గల్గిన యార్థికఫలితములు; ఎగుమతి దిగుమతుల వ్యాపారము. | 158 |
| 8. | ధనప్రవాహము. ... ... ... | 170 |
| 9. | కఱవులు. ... ... ... | 194 |
| 10. | దారిద్ర్యము. ... ... ... | 221 |
| 11. | పన్నులు, అవియెట్లు వినియోగింపబడుచున్నవి. | 237 |
| 12. | సైనికవ్యయము. ... ... ... | 272 |
| 13. | రైల్వేలు. ... ... ... | 293 |
| 14. | హిందూదేశపు ఋణము. ... ... | 317 |
| 15. | ఉపసంహారము; మనకీ దారిద్ర్యమేల ? ... | 331 |

# పీఠిక.

మొట్టమొదట మనదేశమున రాజకీయ ఉద్యమము ఉత్పన్నమై నపుడు, అది ... ంక్షలతో ప్రారంభమైనది. ఈ కాంక్షలలో మొట్టమొదటి ... ంత్ర్యము. డిగ్బి, దాదాభాయి నౌరోజీ, రమేశ చంద్ర ... లగువారు 19 వ శతాబ్దమున రెండవభాగ మునందు గాం ... ప్రయత్నములన్నియు నిట్టివే. రానురాను ఆర్థిక స్వాతంత్ర్యకాం ... స్వపరిపాలనా కాంక్షగా మారినది. అనంతరము స్వపరిపాలనా కాంక్ష, స్వరాజ్య కాంక్షయైనది. ఆర్థికసమస్య రాజకీయ సమస్యగను, రాజకీయసమస్య పరిజ్ఞానసమస్యగను పరిణామము నొందెను. ఆర్థికసమస్య రాజకీయసమస్య యైనప్పుడు దేశము నావ హించిన దారిద్ర్యమును, దేశమందలి కాటకములను, వాణిజ్యపరిశ్రమల వినాశమును ప్రజలుమఱచిరి. రాజకీయసమస్య పరిజ్ఞాన సమస్యగా మారినప్పుడు పరిపాలనకు సంబంధించిన వివిధవిషయములను నిర్లక్ష్యముచేసి, స్వరాజ్యము జన్మస్వాతంత్ర్యమను ధర్మసూత్రముమీద ప్రజలు తమయాందోళనము నంతను నాధారపఱచి యున్నారు. కాని బ్రిటిషుపరిపాలనమందు జరిగిన ఆర్థిక పరిణామములు చరిత్రాంశములు. వీటిని మఱచుటెట్లు? అంతియకాదు. వీటిని సవరించుటెట్లు? సంస్థలయొక్క పూర్వపరిస్థితులను తెలియకయే సంస్కరణమునకు పూనరుగదా! కావున స్వరాజ్యము వచ్చినను, ప్రజలు గమనింపవగిన విషయములును, గావింపవలసిన సంస్కరణములును, అవగాహనము చేసికొనవలసిన చరిత్రాంశములును అనేకములు గలవు. వీనిలో ప్రాధాన్యమైనది ఆ ... ప్రజల

కన్నవస్త్రములని నిర్వచనము చేసినచో అతిశయోక్తి కాదు. ఉద్యోగములు భారతీయులకు వచ్చుటవలన ప్రజల కన్నవస్త్రములు లభింపవు. కొన్ని శాఖలు ప్రజాయత్తముచేయుట ప్రజల కన్నవస్త్రములువలనలభింపవు. ప్రజలకు అన్నవస్త్రములు లభింపచేయగల్గిన ఏర్పాటులు సంపూర్ణస్వరాజ్యమువలననే కలుగును. సంపూర్ణస్వరాజ్యము ఈక్షణమునందు వృక్షమునుండి ఫలమువలె మనహస్తములందు వ్రాలినచో, దాని నమలులో పెట్టువారికి ఈయన్నవస్త్రముల పూర్వచరిత్ర, ప్రస్తుతసందర్భములు, భావ్యభివృద్ధి సాధ్యములు తెలియవలెను. కావున నీ సముజాయిషి యావత్తును క్లుప్తముగను, సమగ్రముగను తెలియజెప్పు పుస్తకము లనేకములు ప్రచురము కావలసియున్నది. ఇట్టి కుసుమావళికి ఈపుస్తకము ప్రథమపుష్పము. ఇది రాజకీయసందర్భములను తెలియగోరు పౌరులకెల్ల అమూల్య సహాయము నొసంగగలదు. ఇట్టిపుస్తకమును రచియించిన దేశిరాజు రామచంద్రరావు, సత్యసుబ్రహ్మణ్యముగార్లకులకు నాయభినందనముల నొసంగుచు, ఆంధ్రు లెల్లరు దీనిని చదివిప్రయోజనము బొందెదరుగాక. యని కోరుచున్నాను.

భోగరాజు పట్టాభిసీతారామయ్య.



# విజ్ఞాపనము.

---

గాంధిమహాత్ముఁడు రాజకీయరంగమునఁ ప్రవేశించిన దాది, హిందూదేశమున నొక నూతన శక మారంభమైనది. మాతృదేశము యొక్క ప్రస్తుతదైన్యమును తొలగించి, ఔన్నత్యమును బడయుటకై యార్థిక స్వాతంత్ర్యమును సంపాదింపవలెనను విషయమెల్లరకును గోచరమైనది. ఇట్టిసమయమున, భారతవర్షము పూర్వకాలమున నెట్టి యైశ్వర్యము ననుభవించినదియు, నేడెట్టి దారిద్ర్యము ననుభవించుచున్నదనియు, ఇట్టిపతనమునకు హేతువులెవ్వియైనవియు, ఆంధ్రలోకము తెలిసికొనుట మిగుల యవసరమని తలంచి, మేమీభారతవర్షార్థిక చరిత్రను వ్రాయఁబూనితిమి.

బ్రిటిషుపరిపాలనమునందలి హిందూదేశముయొక్క ఆర్థికచరిత్ర విషయమున, కీర్తిశేషుఁడైన శ్రీరమేశచంద్రదత్తుయొక్క "India Under the Early British Rule," "India In the Victorian Age" అను గ్రంథములును, భారతపితామహుఁడనదగు దాదాభాయినౌరోజీయొక్క "Poverty and Un-British Rule in India" అను గ్రంథమును, ఆంగ్లేయుఁడైనను భారతీయుల నిజావస్థయెడ జాలినొంది సత్యమును ప్రకటించిన విలియమ్ డిగ్బియొక్క "Prosperous British India" అను గ్రంథమును, ప్రమాణగ్రంథములుగ నున్నవి. వీనియుండియు, శ్రీగోపాలకృష్ణగోఖ్లే, హిండ్మను, డి. యి. వాచా, పండిత మదనమోహనమాలవ్యా, లాలాలజపతిరాయి, కె. టి. షా. మున్నగు మహాశయుల గ్రంథములనుండియు, విషయముల గ్రహించి వ్రాసియుంటిమి. మఱియు, కీర్తిశేషులైన కొమర్రాజు లక్ష్మణ

రావుగారి చరిత్రలును, శ్రీ రాధాకుముదముఖర్జీగారి నౌకాచరిత్రమును (Indian Shipping and Maritime Activity) మాకుం దోడ్పడియున్నవి.

ఈపుస్తకమునకు పీఠిక వ్రాసి యొసంగిన శ్రీ భోగరాజు పట్టాభిరామయ్యగారికి మేమెంతియు కృతజ్ఞులము.

పుస్తకమును తొందరగ ముద్రించుటలో ముద్రణమునకల్గిన తప్పులకు పాఠక మహాశయులను క్షమింప వేడుచున్నాము.

ప్రాచీన భారతవర్షముయొక్క ఐశ్వర్యమును, ఆర్థికౌన్నత్యమును, ప్రస్తుత దారిద్ర్యహేతువులను గుర్తించి, మరల భారతవర్షము సంపూర్ణమగు నార్థికస్వాతంత్ర్యమును బడయునట్లు ఆంధ్రులు మాతృసేవ చేయుదురుగాక! వందేమాతరం.

ఇట్లువిన్నవించు
సుజనవిధేయులు,

కాకినాడ,
16—12—23.

దేశరాజు రామచంద్రరావు.
దేశరాజు సత్యసుబ్రహ్మణ్యము.
గ్రంథకర్తలు.





శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# మనకీదారిద్ర్యమేల?



(హిందూదేశముయొక్క ఆర్థికచరిత్రము.)

## 1. వ ప్రకరణము.

### సహజసంపద.

భరతవర్షము లేక సర్వసాధారణముగ హిందూదేశమని పిలువబడు నీదేశముయొక్క ఆర్థికచరిత్రమును తెలిసికొను పూర్వము హిందూదేశమన నెద్దియో దాని వైశాల్యజనబాహుళ్యము లెట్టివియో, స్వతసిద్ధముగ నీదేశము సస్యసమృద్ధికలదియో, భాగ్యవంతమో, లేక నిస్సారమై నిరంతరదారిద్ర్యపీడితమైయున్నదో కనుగొనవలయును.

హిందూదేశమని పిలువబడుచున్న నీదేశమును మనపూర్వులు భరతవర్షమనియు, జంబూద్వీపమనియు, ఆర్యావర్తమనియు పిలుచుచుండిరి. ఈదేశమునకుత్తరమున, మహోన్నతములై, ఎడతెగని మంచుచే గప్పబడి, సార్థకనామములగు హిమాలయపర్వతములుగలవు. ఈపర్వతములు 1500 మైళ్ళ పొడవును సామాన్యముగ మూడుమైళ్లెత్తుకలిగి, యాకసమునంటుచు, హిందూదేశము నితరదేశములకు [illegible] కేర్పడిన భగవన్నిర్మితములగు కుడ్యములో యననొప్పు [illegible] తములుత్తరధ్రువమునుండి దక్షిణాముగాజనుదెంచు శీతల [illegible] భారతదేశవాసులకు మహోపకారమొనరించుటయే [illegible] [illegible]ముమండి యేతెంచు మహాశత్రులడకొని వానినిచ్[illegible] ము మెచ్చవి. ఆర్యావర్తము నెల్లరు ఫలవంతముగను [illegible]

నుజేసి, భారతీయులకృతజ్ఞతకు పాత్రములగు, గంగా సింధు బ్రహ్మపుత్రా నదు లుద్భవించినదీ మహానగమునుండియే. ప్రపంచమందలిపర్వతములకెల్ల హిమాలయమే అత్యున్నతమైనదగుటచే, పర్వతరాజమనుపేరు హిమాచలమునకుజెల్లును.

హిందూదేశమునకు దక్షిణమునందును, పూర్వపశ్చిమముల కొంతవఱకును సముద్రముకలదు. దక్షిణమందలిసముద్రము హిందూమహాసముద్రమనియు, తూర్పుననున్న సముద్రము బంగాళాఖాతమనియు, పశ్చిమముననున్న సముద్రము అరేబియాసముద్రమనియు, ప్రస్తుతము పిలువబడుచున్నవి. ఉత్తరమునందలి యగమ్యములగు పర్వతములును, పూర్వపశ్చిమదక్షిణదిశలయందలి మహోదధియు, భారతదేశమును చాలకాలమువఱకితరులకు దొరకనసాధ్యముగ జేసెను. వాయువ్యదిక్కునందున్న కైబరు బోలాను కనుమలు రెండుచుమాత్రము సింహద్వారములవలెనొప్పుచు భూమార్గమున నితరదేశములతోడిసంబంధమును గలుగజేయుచున్నవి. దక్షిణమునందలి సేతువుమొదలు, ఉత్తరమునందలి హిమాలయములవఱకునుగల యీభారతభూమివైశాల్యము 17 లక్షల చతురపుమైళ్ళు.

హిమాలయములేగాక, పశ్చిమసముద్రతీరమున పడమరకనుమలనెడి సహ్యాద్రిపర్వతములును, తూర్పుసముద్రతీరమందు తూర్పుకనుమలనబడు మహేంద్రపర్వతములునుగలవు. వింధ్యపర్వతము [illegible]హిందూస్థాన విశాలమైదానమును, త్రికోణాకృతిగల్గిన దక్షిణ[illegible]స్థానపు పీఠభూమినుండి వేఱుచేయుచున్నవి. వీనియన్నిటికం[illegible]యందలి పర్వతములన్నిటికంటెను గూడ హిమాలయము [illegible]లైనవి. అందు 'ఎవరెస్టు' శిఖరము సుమారారుమైళ్ళ [illegible]

[illegible], బ్రహ్మపుత్రా, సింధు మొదలగునదీనదమ్ము లుత్తరహిం

స్థాన మైదానమునబ్రవహించుచు, తమమందగమనముచే వ్యవసాయమునకును వాణిజ్యమునకును మిగులతోడ్పడుచున్నవి. రెండుకొండల మధ్య ప్రవహించుటచే జూపరులకానందముగొల్పు నర్మదయు, దానికి కొంచెముదక్షిణమున తపతియును, పశ్చిమముగాప్రవహించి అరేబియా సముద్రమున గలియుచున్నవి. దక్షిణ హిందూస్థానమున మహానదియు, గోదావరియు, కృష్ణయు, కావేరియు, పశ్చిమకనుమలం దుద్భవించి, దక్కను పీఠభూమిని జీల్చుకొనుచు బారి, తూర్పుకనుమలకును బంగాళాఖాతమునకును మధ్యనుండు కర్ణాటకతీరమును ఫలవంతముగ జేసి, తూర్పుసముద్రమున గలియుచున్నవి. ఈనదులన్నియుగూడ ననేక సస్యములనుపోషించుచున్నవి. ఈనదులు ప్రవహించు ప్రదేశములు పూర్వకాలమునుండియు విశేషసంపదకును, నాగరకతకును, నాస్పదములైయుండెను. ఇదియగాక, కావేరినదీపాతమువలన గల్గు విద్యుచ్ఛక్తి నేను భౌతికశాస్త్రవేత్తలచే నుపయోగములోనికి తేబడుటచే, కావేరినది మైసూరురాష్ట్ర పురోభివృద్ధి కెంతయు తోడ్పడుచున్నది.

హిందూదేశమునకు భగవంతుడు వివిధములగు శీతోష్ణములను ప్రసాదించియున్నాడు. భూమధ్యరేఖకు సమీపమున నుండుటచే హిందూదేశము సాధారణముగ నుష్ణముగనుండును. అందుచే, ఉష్ణప్రదేశములందు పెరుగువృక్షములును, జంతువులును, హిందూదేశమున గన్పించుచున్నవి. మఱియుచుష్ణప్రదేశము లేగాక, కొన్ని సమశీతోష్ణప్రదేశములును కొన్నియమితశీతలప్రదేశములునుగూడగలవు. ఉత్తరమునగల హిమాంచలము చాలశీతలప్రదేశము. మండువేసంగియందునైనను హిమపర్వతములు మంచుచేకప్పబడియుండును. ఇట్లుండుటచే, సమశీతోష్ణము అమితశీతలములునగు వాతావరణములందు వృద్ధిపొందు సస్యములుగూడ హిందూదేశమున పెరుగుటకు వీలగుచున్నది.

వర్షపాతమునందుగూడ నీవిధముగు వైపరీత్యమే కాన్పించుచున్నది.

ఆస్సామునందలి చిరపుంజియనుచోట సంవత్సరమునకు 530 అంగుళముల వర్షముకురియును. ప్రపంచమున మరెచ్చోటను ఇంతవర్షపాతము లేదు. హిందూదేశమునందంతటను నేదోయొకవిధమగు సస్యమున కనుకూలించు వర్షముపడుచున్నది. కానిపూర్తిగావర్షశూన్యములైన యెడారిప్రదేశములుకూడ కొన్ని ఆరావలీపర్వతప్రాంతముల రాజపుత్రస్థానమున గలవు.

ఇదియే హిందూదేశపు సృష్టివైచిత్ర్యము. ప్రపంచమందెచ్చోటనుగానరాని మహోన్నతశిఖరములుగలవు. విశాలమైదానములుగలవు. జలపూరితములగునదులుగలవు. స్వతస్సిద్ధముగ నమితోష్ణమైనను, సమశీతోష్ణములును, నమితశీతలములును నగుప్రదేశములు గూడగలవు. విశేషవర్షపాతముగలతావులున్నవి. కానియెడారులుగూడగలవు. ప్రపంచమునంతను నొకసారికలయజూచినప్పుడెట్టివస్తువిభేదముకన్పడుచున్నదో హిందూదేశమునను నట్టివస్తువిభేదమే కానవచ్చుచున్నది. ఈకారణముననే, ఆఫ్రికామొదలగు ఉష్ణప్రదేశములందు ద్భవించు మహావృక్షములను క్రూరమృగములను హిందూదేశమున జూడగలము. ఇంగ్లాండు, అమెరికామొదలగుసమశీతోష్ణప్రదేశములఫలించుసస్యములుగూడ,హిందూదేశమునందు ఫలింపగలవు. చివరకు ఉత్తరధ్రువప్రాంతములందుజూడబడు మంచుగుట్టలనుసైతము, హిందూదేశమున కనుగొనగలము. అందుచే సకలవిధములగు సస్యములకును, ఫలములకును, వృక్షములకును, హిందూదేశము పుట్టినిల్లై ప్రపంచస్వభావమును తనయందు వ్యక్తమొనర్చుచున్నది.

వరి, రాగి, గోధుమలు మొదలగునవి యీదేశమునందలి ముఖ్యాహారపదార్థములు. ఈధాన్యము లెన్నికోట్లపుట్లో యీదేశమున పండుచున్నవి. పప్పుదినుసులు విశేషముగ నుత్పత్తియగును. వస్త్రములకుపయుక్తమగు ప్రత్తి యీదేశమున విశేషముగ తయారగుచు

న్నది. పంచదారను బెల్లమును తయారుచేయుటకై చెఱుకు పెరుగుచున్నది. వంగదేశమునందు జనుముపండుచున్నది. మఱియు వంగి దేశములోని మూర్షిదాబాదు, రాజషాహి, బరద్వాన్ జిల్లాలందును, సంయుక్తరాష్ట్రములందలి పరితాపగడము డెహ్రాడూను జిల్లాలందును, పంజాబునందలి కోహాట్ పెషావరులందును, కాశ్మీరమునందును, అస్సామునందును, పట్టుతయారుచేయబడును. ఇవికాక యనేకవిధములగు నూనెగింజలు పండింపబడును. వైద్యమునకు సహాయమొనర్చు నోషధులు వేనవేలుపండుచున్నవి. నల్లమందు, నీలిమందు విస్తారముగా తయారుచేయబడుచున్నవి. పొగాకువిశేషముగా నుత్పత్తియగుచున్నది. తుదకు పాశ్చాత్యులచే నీదేశమునకు తేబడిన కాఫీ తేయాకులుకూడ విస్తారముగ పండుచున్నవి. వేయేల, ప్రజోపయోగములగు సకలవస్తువులును హిందూదేశమునపండునని నదిపొక యతిశయోక్తి కానేరదు. ఇదియే హిందూదేశముయొక్క ప్రాముఖ్యలక్షణము.

సస్యములేగాక, హిందూదేశమున ప్రజలకు మిక్కుటముగ నుపయోగించు అడవులుగలవు. ఈయడవులనుండి తేబడునవి ముఖ్యముగ కలప, వెదురు. హిందూదేశములోని టేకుకలప ప్రపంచములోని కలపకంటె శ్రేష్ఠమైనదని చెప్పవచ్చును. మఱియు అగ్గిపెట్టెలు కాగితములు మొదలగువస్తువులు తయారుచేయుటకు కావలసిన వివిధములగు కలపను హిందూదేశపుటడవులు సమకూర్పగలవు. 1918-19 వ సంవత్సరపు లెక్కలనుబట్టి 27 కోట్ల 38 లక్షల ఎకరములు వ్యవసాయమొనర్పబడు ప్రదేశమును, 1561 లక్షల ఎకరములు బంజరుభూమియు, 875 లక్షల ఎకరములు అడవులును, ఉన్నట్లు తెలియుచున్నది. మఱియు 1918-19 వ సంవత్సరములో ఉత్పత్తియైన (సస్యములు మొదలగు) పదార్థముల మొత్తముల దిగువ గాననగును.

| పదార్థములు | పంటయొక్క వైశాల్యము | ఉత్పత్తియైన పదార్థముల పరిమితి. |
|---|---|---|
| వరి (ధాన్యము) | 7,75,37,820 ఎకరములు. | 47,34,40,000 హండ్రెడువెయిటులు. |
| గోధుమలు | 1,91,47,899 ,, | 75,02,000 టన్నులు. |
| చెఱుకు (పంచదార) | 30,14,611 ,, | 23,37,000 టన్నులు, |
| తేయాకు | 6,39,614 ,, | 38,04,59,000 పౌనులు. |
| కాఫీ | 98,221 ,, | |
| నువ్వులు | 32,33,350 ,, | 2,58,000 టన్నులు. |
| ప్రత్తి | 1,44,35,084 ,, | 36,71,000 (400 పౌన్ల బేళ్ళు.) |
| జనపనార | 24,72,634 ,, | 69,55,600 ... |
| నీలిమందు | 2,86,588 ,, | 44,100 హండ్రెడువెయిట్లు. |
| నల్లమందు | 1,89,940 ,, | |
| పొగాకు | 10,45,033 ,, | |
| పట్టు | | 1,00,000 కైలోలు. |

ఖనిజములందును హిందూదేశము గొడ్డుపోలేదు. ఈఖనిజములలో ప్రధానమైనది రాక్షసిబొగ్గు. వంగదేశమందలి రాణీగంజిప్రాంతములందును నైజాము రాష్ట్రములోని సింగరేణి ప్రాంతములందును మధ్యపరగణాలలోని మోహపాణి వరోరా ప్రాంతములందును బొగ్గుగనులుకలవు. బంగారుగనులు ద్వితీయస్థానము నాక్రమించుచున్నవి. మైసూరు రాష్ట్రమందలి కోలారుగనులింటు ముఖ్యమైనవి. నైజాము రాష్ట్రములోనిహట్టి ప్రాంతమునను అనంతపురము జిల్లాయందొకచోటనుగూడ బంగారుగనులుకలవు. బర్మాదేశమునందు విశేషముగను అస్సాముదేశమునందు తక్కువగను కిరసనాయిలు నూతులుగలవు. ప్రపంచమునఉత్పత్తియగు అభ్రకములో హిందూదేశము సగముకంటె నెక్కువభాగమె సమకూర్చుచున్నది. గయా మాంఘీర్ హజారిబాగ్ నెల్లూరుప్రాంతములగొప్ప అభ్రకపుగనులు కలవు. విశాఖపట్టణము జిల్లాలోను మధ్యపరగణాలలోను (manganese) మాంగనీసు విశేషముగ దొరకుచున్నది. చోటానాగపురమందలి హజారిబాగ్‌నందును బర్మాయందును తగరముత్పత్తియగుచున్నది. సురేకారము వంగదేశమున విశేషముగనున్నది. దక్షిణ హిందూస్థానమునను రాజపుత్రస్థానమునను రాగిదొరకును. ఈప్రాంతములందే కొద్దిగ వెండికూడకలదు. ఇయ్యది హిందూదేశముయొక్క ప్రకృతిసిద్ధమగు ఖనిజసంపత్తి. 1919 వ సం॥ లోని ముఖ్యఖనిజముల యుత్పత్తి యీక్రిందివిధమున నున్నది.

| | | |
|---|---|---|
| రాక్షసిబొగ్గు | రూ. | 10,11,92,560. |
| బంగారము | ,, | 2,62,40,880. |
| కిరసనాయిలు | ,, | 1,83,43,080. |
| ఉప్పు | ,, | 1,82,35,210. |
| మాంగనీసు | ,, | 1,54,63,300. |
| అభ్రకము | ,, | 86,34,480. |

| | | |
|---|---|---|
| సౌఁడి | రూ | 48,72,460. |
| సీసము | ,, | 66,86,420. |
| సురేకారము | ,, | 47,12,470. |
| తగరము | ,, | 24,11,500. |
| కెంపులు ఇంద్రనీలమణులు మొదలగునవి | ,, | 1080,870. |
| రాగి | ,, | 5,24,160. |
| ఇనుము | ,, | 4,58,870. |
| వజ్రములు | ,, | 2,08,250. |
| మొత్తము ఖనిజోత్పత్తి | రూ | 22,21,88,100. లు. |

సస్యములు విశేషముగ పండును. ఖనిజములు చాల నుత్పత్తి యగుచున్నవి. వీని నెల్లనుపయోగార్హముగ జేయుటకై కార్మికులు విశేషముగ దొఱకగలరు. మఱియు భారతవర్షమునందలి 31 కోటి 90 లక్షలమంది జనులును సరియగు పరిశ్రమలను కల్గియుండి వస్తువుల నుత్పత్తిచేసినచో ప్రపంచమున వారికి భాగ్యమున నాటియగు దేశముండజాలదు. మఱియునీదేశమున పరిశ్రామికుల కివ్వబడుకూలికూడ అతిస్వల్పము. ఇట్టి ప్రకృతి సంపత్తిని జనసంఖ్యను కల్గియున్నప్పటికిని భారతవర్ష మైశ్వర్య విషయమున కడపటి స్థానమాక్రమించియున్నది. ఈపరిస్థితులు విపరీతముగను అస్వాభావికముగను గన్పట్టుచు. సకలసంపదల కాలవాలమైయుండవలసిన మనదేశమునకుచు మనకును ఈదారిద్ర్యమేల ? ఈప్రశ్నకు సమాధానము రాబోవు ప్రకరణముల జెపనగలము.

2 వ ప్రకరణము.

చరిత్ర ప్రశంస.

I

భారతవర్షేతిహాసము మిక్కిలి ప్రాచీనమైనది. ఇంగ్లాండు మొదలగు దేశములందు మనుష్యులు వస్త్రముల ధరించుటనైన నెఱుగక జంతువులవలె నివసించుసమయమున, భారతీయులు నాగరకతయందు ప్రథమగణ్యులుగనుండిరి. వారిమతకర్తయగు క్రీస్తు జన్మించకపూర్వమే, యీదేశమునప్రశంసార్హములగు వ్యవస్థలు వర్ధిల్లుచుండెను. ఆర్థిక రాజకీయస్థితులందును, మతసాంఘిక వ్యవస్థలందును, నీదేశ మగ్రస్థానమలంకరించెను. పురాతనమున భారతవర్షముయొక్క సంపదయెట్టిదో, ఆర్యుల నాగరకతయెట్టి మహోన్నతినిగాంచెనో, వేదముల పరిశీలించినచో విదితముకాగలదు.

నాగలితో వ్యవసాయమొనర్చుటయు, విత్తనములను నాటి, వర్షాధారమునగాని, నూతుల సహాయమునగాని పంటలు పండించుటయు నార్యులెఱిగియుండిరి. పండినపంటను కొడవళ్ళతోగోసి, ధాన్యముగుప్పవేసి, బండ్లపై యిండ్లకు గొంపోవుచుండిరి. బావులను త్రవ్వుటయు, వానిలోనుండి ఘటయంత్రముల మూలమున నీరుతోడి, కాలువలగుండా పారించుటయు వారునేర్చియుండిరి. సేద్యమునందు వారు గుఱ్ఱములను, యెడ్లనుగూడ నుపయోగించుచుండిరి.

పశువులమందలను సంగ్రహించుట ఆర్యులకు మఱియొకవృత్తియైయుండెను. వారు పశువులనే ధనముగా నెంచుచుండిరి. ఎవనికెక్కువపశువులుండిన వాడే యెక్కువధనవంతుడుగను, నారు పాడియావులైనను లేనివాడు బీదవాడుగను పరిగణింపబడుచుండెను. దారము వడుకుటయు, పడుగుపేకలు వేసి బట్టలునేయుటయు, రంగులువేయుటయు

నార్యులెఱుగుదురు. రాతిలో కట్టబడిన నూరుపురములున్నట్లు ఋగ్వేదమందు చెప్పబడినదిగాన, భవననిర్మాణకళయు, రాతిదుర్గముల నిర్మించుటయు నార్యులెఱిగియుండిరని స్పష్టమగుచున్నది. ఆర్యులు లోహములయొక్క యుపయోగమునుగూడ నెఱిగియుండిరి. ధరించునగలును, యుద్ధములలో నుపయోగించు నాయుధములును వారు బంగారము యినుము మొదలగు లోహములతో జేయుచుండిరి. కవచము, శిరస్త్రాణము, డాలు, కత్తి, గండ్రగొడ్డలి, విల్లునంబులు, అమ్ములపొది మొదలగునవి వారిఆయుధములు. యోధులు రథారూఢులై యుద్ధముచేయుచుండిరి. రథాశ్వములు సువర్ణముతో చేయబడిన నగలతో శోభిల్లుచుండెను. కొన్నిరథములు వెండితో చేయబడినవైయుండెను. కావున వారు ఖనిజములను భూమినుండిత్రవ్వుటయు, వానినిశోధించుటయు బాగుగనెఱిగియుండిరని గ్రహింపవచ్చును.

వ్యవసాయము, పరిశ్రమలు, వీనినేగాక, ఆర్యులువాణిజ్యము గూడచేయుచుండిరి. భూమార్గమున నేగాక, సముద్రమార్గమునగూడ, నన్యదేశములతో వర్తకముచేసి, ధనమార్జించుచుండిరి. ఫొనిషియా, పేలస్టీను, అస్సీరియా, గ్రీసు, రోము, యీజిప్టుదేశములతో నౌకావ్యాపారము సల్పుచుండిరి.

బౌద్ధమతస్థాపకుడగు గౌతమబుద్ధుని కాలమునుండియు హిందూదేశముయొక్క చరిత్ర తెలిసికొనుటకనేకసాధనములు గలవు. మన దేశమును జూడవచ్చిన అన్యదేశీయుల వ్రాతలవలన నాటిసౌభాగ్యము తెల్లమగుచున్నది. చంద్రగుప్త చక్రవర్తి యాస్థానమున నుండిన మెగాస్తనీసను యవనరాయబారి హిందూదేశముయొక్క ఔన్నత్యమును శ్రవణరసాయనముగవర్ణించియున్నాడు. "భారతదేశమున బానిసత్వము లేకుండుటను, స్త్రీలపాతివ్రత్యమును, పురుషుల ధైర్యసాహసములను నతడు మిగుల ప్రశంసించెను. శౌర్యమున భారతీయు లితరాసియావా

సులను మించియుండిరి. వారి తలుపులకు తాళములక్కరలేదు. మఱియు ముఖ్యముగ నసత్యమునాడు భారతీయు డొక్కడును గానబడకుండెను. వారు తెలివిగలవారును, శ్రద్ధగలవారును, కుశలులగు కర్షకులును, నిపుణులగు చేతిపని వాండ్రును నైయుండిరి. వారెన్నడును వ్యాజ్యములలో దిగక స్వదేశసంస్థానాధిపతులక్రింద శాంతముతో నివసించుచుండిరి. మనుధర్మశాస్త్రమున నిర్వచింపబడినటులనే పరిపాలనము నిర్వహింపబడుచుండెను. ఆయవసరాయబారి గ్రామకట్టుబాట్లనెల్లను విపులముగ వర్ణించియున్నాడు. ప్రతిగ్రామమును ప్రజాస్వామ్యము ననుభవించు దానివలె తోచుచుండెను. యుద్ధములతోగాని ప్రభుస్వామిత్వహరణములతో గాని వైశ్యులకు సంబంధము లేకుండెను. మఱియు మెగాస్తనీసు ఆనాటిరంగులయొక్కయు, నారలయొక్కయు, దుస్తులయొక్కయు, సస్యములు జంతువులు ఖనిజములు వీనికి సంబంధించిన వస్తువులయొక్కయు పట్టికనిచ్చియున్నాడు."(H. H. Wilson's History of India.)

మనదేశమున నానకట్టలు కట్టించుటయు కాలువలు త్రవ్వించుటయు ఆంగ్లేయులే నూతనముగ ప్రారంభించిరని తలచుట మిక్కిలి పొరబాటు. "రాజ్యంబునందు కాలువలుత్రవ్వించి జలసమృద్ధిగలుగజేసి ప్రజల వ్యవసాయము నభివృద్ధిచేయుట కీయద్వితీయచక్రవర్తి (చంద్రగుప్తుడు) మిగులశ్రద్ధవహించెను. చెఱువులు వేయించి, యానకట్టలు కట్టించి, కాలువలు త్రవ్వించి, వానిలోనుండి పిల్లకాల్వలు తీయించి, వానికి తూములుపెట్టించి, యందునుండి కొందఱికిమాత్రము నీరుపోయి కొందఱికి పోకుండునేమోయని యాతూములమీద నధికారుల నియమించి, యందఱిభూములకు సరిపోవునటుల నిష్పక్షపాతబుద్ధితో నీరు పంచిపెట్టుడని శాసించెను. ఈవిషయమున తనరాజధానియొద్దనున్న ప్రజల నెట్లుకాపాడెనో యటులనే దూరముననున్నవారినిగూడ రక్షించుచుండెను. పాటలీపుత్రమునకు వేయిమైళ్ళమీదనున్న గిరనారులో

గూడనొకనదికి యానకట్టవేయించెను" (కొమర్రాజు వెంకటలక్ష్మణ రావుగారి హిందూమహాయుగము.)

"భూములన్నియు నమరకమై జలసమృద్ధిగలిగి సంవత్సరమునకు రెండు పంటలిచ్చుచుండెను. అందువలననే హిందూదేశమునందు గఱవులు లేవనియు జీవనాధారమగునాహారముప్రజలకందఱికిని దొఱకుచుండెననియు జెప్పబడును. ప్రతిసంవత్సరము కఱవువచ్చి లక్షలకొలది ప్రజలు నాశమొందెడి యీకాలమునబుట్టిన మనకు రాజుయొక్క శ్రద్ధచే దుర్భిక్షమన్నమాటలేని యాచంద్రగుప్త చక్రవర్తి కాలము కృతయుగముడవంటిదిగదా!" (హిందూమహాయుగము) చంద్రగుప్తునివలెనే యాతని వెనుక పరిపాలన మొనర్చిన భారతక్ష్మాపాలురెల్లరుగూడ వ్యవసాయము విషయమై యెక్కుడు శ్రద్ధవహించిరి.

రాజులు ప్రజల ద్రవ్యమపేక్షింపక వారిక్షేమమునే ప్రధానముగా నెంచి పరిపాలించుచుండిరి. అందశోకమహారాజు మిగుల సంస్తవనీయుడు. అతడు ప్రజల యుపయోగార్థమై బాటలప్రక్క వృక్షములు నాటించెను. మామిడితోపులను వేయించెను. ప్రతిమైలునకును నూతులుత్రవ్వించెను. ఆరామగృహముల నిర్మించెను. రోగపీడితులగు మనుజులయొక్కయు జంతువులయొక్కయు ఉపయోగార్థమై ధర్మౌషధశాలల నుకట్టించెను. ప్రజల యైహికాముష్మిక జీవనమును సకలవిధముల బాగొనర్చెను.

మౌర్యసామ్రాజ్య మంతరించినవెనుక ఆంధ్రులు విజృంభించి భారతదేశమున సామ్రాజ్యవైభవము ననుభవించిరి. వీరికాలమున నంతర్జాతీయ వ్యాపారము వృద్ధియయ్యెను. భారతీయులు రోముదేశస్థులతో సుగంధ ద్రవ్యములు, మిరియములు, ముత్యములు, కెంపులు, పట్టుబట్టలు, దుకూలములు, సాధారణపువస్త్రములు,మున్నగువానితో వర్తకముచేయుచుండిరి.మఱియుతూర్పుఆఫ్రికా అరేబియాదేశములకుద్రవ్యా

జ్ఞానము నకై సొంకాయమాన మునర్చుచు వాణిజ్యము సల్పుచుండిరి. ఈవర్తక మున దక్షిణదేశము ప్రాముఖ్యమును వహించెను. రోమకనాణెములిప్ప టికి నైతము దక్షిణహిందూస్థానమునం దచ్చటచ్చటగాననగును. మఱియు కొలదిసంవత్సరములక్రిందట నీలగిరికొండలలో భూమియందు కప్పడి యున్న రోమకపాత్రములు కొన్నికనుగొనబడినవి. ఇంతియకాక యుధి ష్ఠిరుడింద్రప్రస్థమున రాజసూయము మొనర్చునప్పుడు రోమకు లాయనకు కానుకల నర్పించిరని మహాభారతమున వ్రాయబడియుండుటనుబట్టి రోము దేశముతోడి వర్తకముచాల ప్రాచీనమైనదని గ్రహింపవలసి యున్నది. భారతదేశము రోముదేశమునకు పంపిన వస్తువులకు ప్రతి ఫలముగ, 10 కోట్ల సెస్టిర్సీలను రోమకనాణెములు ప్రతిసంవత్సరము ను రోమునుండి హిందూదేశమునకు చేరుచుండెను. భారతదేశమును ప్రవేశించుచుండిన నీధనప్రవాహమునుగూర్చి ప్లైనీ, యను ప్రసిద్ధరో మకుడు తలపోయుచు "మనభోగములకొరకును స్త్రీలనిమిత్తమునను నిం తవ్యర్థవ్యయమగుచున్నదని" చింతించెను.

భారతీయుల వృత్తులను గుఱించియు, అన్యదేశములతోడి వా ణిజ్యమునుగూర్చియు, రోమకుల గూర్చియు ననేక తమిళగ్రంథముల నుదాహరణములుగలవు. ఒకతమిళ కవిపుంగవుడు 'కావేరీపట్టినమ'ను పట్టణమును వర్ణించినాడు. ఈపట్టణము కావేరీనది యుత్తరపాయమొ క్క ముఖద్వారమునగలదు. ఈపట్టణము రెండుభాగములు గనుండెను. అందొకటి 'మహాలుపాకమ'ను పేరబరగుచు, సముద్రపు టొడ్డుననిర్మింప బడియున్నది. ఈమహాలుపాకమున, నన్యదేశములనుండి దిగుమతియగు వస్తువులను నిలువచేయుటకై, ననేక వేదికలును, కొట్లును కట్టబడియుండె నని యా కవి వర్ణించుచున్నాడు. వర్తకులు దిగుమతి సుంకములను చెల్లిం చినతర్వాత, రాజకీయోద్యోగులు చోళరాజచిహ్నమగు 'వ్యాఘ్రము' నావస్తువులపై ముద్రించుచుండిరి. మఱియు సముద్రమున కెదురుగా నను

ననున్న దుకాణములలో యవనవణిజులు తమసరకులనమ్ముచుండిరి. వీరుకాక యితరదేశస్థులు గూడ నాయుహాలుపాకమున వసించుచుండిరి. సుగంధద్రవ్యములును, పానములును, పుష్పములును, సాంబ్రాణియు నమ్మబడుచుండెను. పట్టువస్త్రములను, ఉన్నివస్త్రములను, నూలుబట్టలను కుట్టు దర్జీలు సతతము పనిచేయుచుండిరి. మంచిగంధము, ముత్యములు, బంగారము, రత్నములు మొదలుగాగల మూల్యములందు వ్యాపారముసల్పు వణిజులుండిరి. ధాన్యపువర్తకులుండిరి. మఱియు చాకలివాండ్రు, చేపలనమ్మువాండ్రు, కసాయివాండ్రు, కమ్మరులు, చిత్రకారులు, శిల్పికారులు, కంసాలివారు, ముచ్చిలు మొదలగు ననేకులాపట్టణమున నివసించుచుండిరనియు నాకవివ్రాసినాడు. (Radhakumud Mukherjee's Ancient Shipping and Maritime Activity in India.) ఆనాడు వృత్తులు బహుసంఖ్యాకములై యుండెను. హైందవులొనర్చుచుండినవర్తకము నిరుపమానముగ విస్తరించియుండెను. రోమకదేశమునుండి బయల్వెడలిన ధనప్రవాహము, భరతవర్షమును జేరుచుండెను. ఇకభాగ్యమునకేమికొదువ? సంపదలకేదిలోటు?

ఆంధ్రసామ్రాజ్యమువెనుక, హిందూదేశమున బ్రసిద్ధివడసినది గుప్తసామ్రాజ్యము. గుప్తరాజులు పరిపాలించిన కాలముస్వర్ణయుగమని చెప్పవచ్చును. చీనాదేశపు యాత్రికుడగు ఫాహియాన్ వ్రాసిన వ్రాతలను బట్టిచూడ, యానాటిభారతవర్షము, రామరాజ్యము ననుభవించుచున్నదా యనిస్తోచును. "పన్నులవలనగాని రాజకీయోద్యోగస్థులవలనగాని బాధలులేక ప్రజలు సుఖముగనున్నారు. కమతపుభూముల వ్యవసాయముచేయువారు మాత్రము పంటలోని కొంత భాగము రాజునకియ్యవలెను. వీరయినను ఇష్టమున్న వ్యవసాయముచేయవచ్చును. లేనియెడల భూమినివిడిచివెళ్ళవచ్చును. అపరాధులకు శరీరశిక్ష

విధింపకయే రాజులు రాజ్యముచేయుచున్నారు. అపరాధులకు వారి వారి యపరాధముల ననుసరించి కొద్దిగనో, గొప్పగనో దండుగలు విధింపబడును. రాజుపై మరల మరల తిరుగబడువారి కుడిచేయి, తెగవేయుచున్నారు....చండాలురుతప్ప రాజ్యమందెవ్వరును జీవహింసచేయరు. కల్లుత్రాగరు ఉల్లిపాయగాని వెల్లిపాయగాని తినరు. కసాయి దుకాణములుగాని, సారాబట్టీలుగానిలేవు" (హిందూమహాయుగము. పే. 187) గుప్తరాజ్య మంతరించినపిమ్మట, హూణుల దాడమూత్రమూలమున హిందూదేశమున కొంతయరాచకము ప్రబలెను. కాని దేశములోనికి చొరుచుకొని వచ్చుచున్నహూణుల మూకలన్నియు, విక్రమాదిత్యుడనుమాళవదేశాధీశునిచే (క్రీ. శ. 525 లో) నోడింపబడెను. విక్రమాదిత్యుని వెనుకవిఖ్యాతిజెందినరాజు హర్షవర్ధనుడు. ఈతనికాలముననే,చీనాదేశస్థుడగు హూయన్ సాంగను బౌద్ధయాత్రికుడు హిందూదేశమునకేతెంచినది. అతడు 13. సం॥ములు (క్రీ. శ. 630-643. వఱకును) హిందూదేశమున ప్రయాణమొనర్చి, యచ్చటచ్చట నాగుచు, నీదేశమందలి విచిత్రములను, గ్రహింపదగిన యంశములను, ప్రజలస్థితిని, పరిపాలనావిధానమును, తనపుస్తకమున వ్రాసియున్నాడు. ఇతడు వంగదేశమందలి తామ్రలిప్తియను పట్టణమునుగురించి యిట్లువ్రాసెను: "తామ్రలిప్తిలోనిజనులు, శ్రమకోర్చువారుగను, శూరులుగను, చురుకుదనము తొందరపాటు గలవారుగనుయుండిరి. (హిందూమహాయుగము. పే. 173.) మఱియు సముద్రతీరమున ప్రభవిల్లిన వల్లభివంశజుల రాజ్యమునుజూచి, సముద్రవర్తకము వలన విశేషధనాఢ్యులైన అచటివారినిగూర్చి "యిచట కోటీశ్వరుల కుటుంబములు నూరుగలవు. దూరదేశమునుండివచ్చిన మిక్కిలి వెలగలద్రవ్యముల యమితమైన సంగ్రహమిచ్చటగలదు." (హిం. మ. యు.) అనివ్రాసియుండెను. మఱియు నప్పటిరాజ్యస్థితిని గూర్చియిట్లువ్రాసెను: "రాజునకువచ్చు నాదా

యము నాల్గుభాగములుగా విభజింపబడును. మొదటిభాగము రాజ్యవ్యవస్థకును, యజ్ఞయాగాది క్రతువులకును, రెండవభాగము మంత్రులకు నితరముఖ్యులైన యుద్యోగస్థుల యుపయోగార్థమును, మూడవభాగము గౌరవనీయులగు పురుషుల గౌరవించుటకును, నాల్గవది మతసంబంధమైన దానధర్మములకును, వెచ్చించుచుండిరి. ఇందుచే లోకులయొద్దనుండి తీసికొనుపన్నులు బహుస్వల్పముగానుండెను. జనులు రాజుకొరకై స్వయముగా చేయవలసినపనులు బహుస్వల్పముగానుండెను. రాజులయొక్క భూములు దున్నువారు, రాజునకు షష్ఠాంశమిచ్చెదరు" (హిం. మ. యు). మనపూర్వుల గుణగణముల నిట్లువర్ణించియున్నాడు: "జనసామాన్యమంతగా నాలోచనకలది కాకపోయినను, న్యాయప్రవర్తనకలదియు, గౌరవనీయమును అనిచెప్పుటకు సందేహము లేదు. డబ్బును గుఱించిన వ్యవహారములలో వారుజత్తు లెఱుగరు. న్యాయవిచారణచేయునెడ నాత్రపడరు. మోసముగాని, విశ్వాసఘాతముగాని వారెరుగరు. ఆడినమాటగాని బాసగాని తప్పరు." (హిం. మ. యు.) విదేశస్థులచే నైతమిట్టిపొగడ్తగాంచినవారిజన్మసార్థకముగదా!

మఱియు, శ్రీహర్షుడు ప్రయాగయందొనరించిన మహాయాగముయొక్క సంపూర్ణవర్ణనము నీభాటసారి వ్రాసియున్నాడు. ఈమహాయాగము 5 సంవత్సరముల కొకపర్యాయము త్రివేణీసంగమమునొద్ద (ప్రయాగపట్టణములో) 75 దినములు జరుగుచుండెను. హుయాన్త్సాంగు చూచినది హర్షుడు గావించిన మహాయాగములలో నారవదియు కట్టకడపటిదియునై యున్నది. ఈయాగసమయమున, కడచిన యైదు వత్సరములలోను తన ధనాగారమున నిలువయుండిన ద్రవ్యమునెల్లను హర్షుడు బీదవారికిని బ్రాహ్మణులకును బౌద్ధసన్యాసులకును పంచిపెట్టుచుండునాడు. ఈమహాసత్రమును జూచుటకై రమారమి యేబదిలక్షల

జనులు వచ్చుచుండిరి. మొదటి మూడురోజులలోను బుద్ధునిపేరిటను, సూర్యునిపేరిటను, శివునిపేరిటను హర్షుడు దానముచేయువాడు. నాల్గవదినమున బౌద్ధసన్యాసుల నాదరించువాడు. ఒక్కొక్కనికి నూరుబంగారునాణెములు, ఒకముత్యము, ఒకవస్త్రము చొప్పున 10,000 మందిసన్యాసులకతడు దానముచేయుచుండెను. పిమ్మట 20 దినములు బ్రాహ్మణులును, తరువాత 10 రోజులు నాస్తికులును సత్కరింపబడుచుండిరి. పిమ్మట ఒక నెలదినములు బీదలకును, నిస్సహాయులకును, తల్లిదండ్రులు లేనిపిల్లలకును, దానధర్మములు జరుగుచుండెను. హయములు, గజములు, సైన్యము తక్క తక్కినసర్వస్వమునెల్ల తన యాభరణముల సైతము హర్షుడీ యాగమున ధారపోయువాడు. మఱియు హర్షుడీయాగము నైదు సంవత్సరముల కొకరించువాడనిన, నాతనియుదారబుద్ధియేగాక యాతనిధనాఢ్యతయు ప్రజానురంజకత్వమును నెంతయధికముగ నుండెనో యూహింపవలసె యున్నది.

హర్షుని యనంతరము ఉత్తరహిందూస్థానమున తలయెత్తిన వివిధరసపుత్రరాజ్యముల యార్థికస్థితి యంతగ తెలియకున్నది. ఆర్యావర్తమంతయును చిన్నచిన్న రాజ్యములక్రింద చీలిపోయెను. ఈరాజుల నందఱినుకలయదీసి ఏకచ్ఛత్రముగ పరిపాలింపగల్గిన చక్రవర్తి జన్మింపకుండెను. అయినను జనులయార్థికస్థితి సంతృప్తికరముగనున్నదనియే చెప్పవచ్చును. వ్యవసాయాభివృద్ధివలనను, ననేకములగు పరిశ్రమలవలనను, వాణిజ్యమువలనను, జనులు భాగ్యవంతులుకాజొచ్చిరి. రాజులు మారినను, యుద్ధములుజరిగినను, రణరంగముల రక్తము కాల్వలై పాఱి దేశమునుకలతపెట్టినను, ఆర్థికముగ ప్రజ లధిక సంక్షోభమును జెందరైరి. ప్రజలు సౌఖ్యపులై యుండుటచేతనే యీసంధి సమయమునను గూడ కళలభివృద్ధినొందెను. వాఙ్మయములు క్రొత్తశోభనుగాంచెను. నానాశాస్త్రములు ఉద్భవించెను. హిందూమతోద్ధారకు లావిర్భవించెను

పునరుద్ధరించిరి. దేశమున సుస్థిరమగు శాంతిలేకపోయినను, నిరంతర యుద్ధములు లేకుండెను. నేడన్ననో శాంతియున్నది. కాని శాంతికను వగు నార్థికసంపదగానరాకున్నది.

## II

క్రీ. శ. 1001సం॥ము మొదలు కైబరు బోలాను కనుమలగుండ ననేకపర్యాయములు మహమ్మదీయదండయాత్రలు జరిగెను. హిందూ దేశముపై దండెత్తివచ్చిన మహమ్మదీయులలో మొదటివాడు గజ్నీమ హమ్మదు. ఈత డీదేశముపై పదునేడు పర్యాయములు దండెత్తివచ్చెను. ప్రతిదండయాత్రయందును విశేషధనమును కొల్లగొని తనరాజధాని యగు గజ్నీపట్టణమునకు తీసికొనిపోవుచుండెను. అతని 1009వ. సం॥పు దాడిలో బహుసంఖ్యాకములగు వెండిబంగారు నాణెములను కొల్లగొ నిపోయెను. ముప్పదిగజములపొడవును, పదునైదుగజములు వెడల్పును గలిగినట్టి, వెండితో చేయబడిన గృహ మొకదాని నతడు తనదేశము నకు మోయించుకొని వెళ్ళెను. ఆగృహము విప్పుటకును, తిరిగి యమ ర్చుటకును వీలుగనుండెను. మఱియు 40గజములు పొడవుగలిగినట్టియు, 20 గజములు వెడల్పుగలిగినట్టియు, చాందినీనొకదానిని గూడ తీసికొనివె ళ్ళెను. ఈచాందినీ సన్ననివస్త్రముతో తయారుచేయబడి యుండెను. ఈచాందినీని పైన నిల్పుట కాధారములగుచు నాల్గుప్రక్కలనునుండు స్తంభములలో, రెండు వెండితోడను, రెండుబంగారముతోడను పోత పోయబడినవి. ఇవికాక, అనేకయాభరణములను, ముత్యములను, వ జ్రాలను, పచ్చలనుగూడ తనదేశమునకు తీసికొనివెళ్ళి యచటి విదేశ రాయబారులయెదుట ప్రదర్శించి వారికధికాశ్చర్యము గొలిపెను. గజ్నీ మహమ్మదు కొల్లగొనిన విశేషధనమును బట్టిచూడ యానాడు భార తదేశ మైశ్వర్యవంతముగ నుండవలెనని గ్రహింపవలసి వచ్చుచున్నది.

1193 వ. సం॥లో మహమ్మదుగోరీ స్థానేశ్వరయుద్ధమున జయ

ముగాంచినప్పటినుండియు, మహమ్మదీయ రాజ్యమారంభించుచున్నది. మహమ్మదీయులును కాలక్రమమున నిచ్చటనే స్థిరపడి హిందూదేశమునే తమమాతృదేశముగ భావింపజొచ్చిరి. వారిపరిపాలనమున ధనమన్యదేశములకు పోవుటకవకాశము లేకుండెను. దేశమున వసూలుచేసిన ద్రవ్యము దేశమునందే వెచ్చింపబడి, యేదోరూపమున ప్రజలనే తిరిగి చేరుచుండెను. గజనీమహమ్మదువలె ఈదేశమునుండి తమదేశమునకు ధనము కొల్లగొనిపోవుటకై తెంచినవారు మిగుల స్వల్పసంఖ్యాకులు. తైమూరులంగును, నాదిర్షాయును, అహమ్మదుషా అబ్దాలియు హిందూదేశముపై దాడివెడలినపుడు, వారిని హిందువులొక్కరే గాక మహమ్మదీయులు సైత మెదుర్కొనిరి.

1206 మొదలు 1526 వఱకును పెక్కుతెగలకు చెందిన మహమ్మదీయరాజులు హిందూస్థానమున పరిపాలించిరి. వీరుపాలించునప్పుడు రాజకుటుంబములలోని యంతఃకలహములవలనను, హిందువులతోడిపోరాటముల వలనను, దేశమున కొంత కల్లోలము కల్గినది. కానిప్రజల యార్థికస్థితి కెట్టి భంగమునుకలుగలేదు. యుద్ధములు జరుగుచున్నను, రాజులుమారుచున్నను, గ్రామములందు వ్యవసాయ వాణిజ్యములు నిర్విఘ్నముగ సాగుచుండెను. అందు ఫిరోజతుగ్లకు పరిపాలనము చాలసౌఖ్యావహముగనుండెను. ప్రజలు భాగ్యవంతులుగనుండిరి. వారిగృహములు ధనధాన్యములతోడను, గృహపరికరములతోడను నిండియుండెను. ఆభరణములులేని స్త్రీ లేకుండెను. ఇట్టిసౌభాగ్యస్థితికి ఫిరోజతుగ్లకుయొక్క సత్పరిపాలనమే కారణము. అతడు ప్రజోపయోగార్థము "40 మసీదులు, 30 పాఠశాలలు, 100 ధర్మశాలలు 200 పట్టణములు 100సార్వజనిక స్నానగృహములు, 20 రాజమందిరములు 100 రోగచికిత్సాలయములు 10 నక్షత్రశాలలు, 10 పెద్దబావులు 30 తటాకములు 50 ఆనకట్టలు 150 వంతెనలు ఇవిగాక గొప్పకాలువలును త్రవ్వించెను. అంనుమూ

డు ముఖ్యమైనవి. యమునానదిలోనుండి యొకకాలువ తీయించి దానిని పానిపట్‌వద్దనుండి బికనీరు మరుస్థలములలోని హాంసీహిసార్లను గ్రామములవఱకుగొనిపోయెను. అదియిప్పటివరకును పారుచున్నది. రెండవ కాలువయొకటి త్రవ్వింపగా దానివలన భోగాని సట్లజ్ నదులు యమునతోగలుపబడినవి. మూడవకాలువ సరస్వతీనది మొదలు కగర్ నది వరకు త్రవ్వింపబడియె. ఇది జీవనదివలె ననేక సంవత్సరముల వఱకు పాఱుచు సర్‌హింద్ మన్‌సూర్‌పూర్ ప్రాంతమందలి జనులకు మహోపకారిగ నుండెను. ఈకాలువ త్రవ్వనపు డేబదివేలజనులు పని చేయుచుండిరి."

"ఉత్తరహిందూస్థానమున నాకాలమున కాలువ లెవ్వియు లేక యుండెను. తెలుగు దేశములోనున్న కాలువలను, వానివలన వ్యవసాయమునకు గల్గులాభములను, గనుగొని యీబాదుషాహా యుత్తరదేశములో బైని వర్ణింపబడినట్లు కాలువలు త్రవ్వించెనట! ఈసమాచారము తెలుగువారికిభూషణాస్పదము. (మహమ్మదీయమహాయుగము పేజీ 59)

ఈకాలమున హిందూదేశమును దర్శించిన 'నికోలోడికొంటీ' 'మార్కో-పోలో' మొదలగువారు హిందువులగూర్థికస్థితిని పరిశంసించి యున్నారు. వీరిలో మార్కో-పోలో వ్రాతలు జూడదగియున్నవి. అతడు పూర్వపశ్చిమతీరముల తిరిగి, కన్యాకుమారివద్ద తనవృత్తాంతమును వ్రాసెను. ఆకాలమునందు 'కాయల్' అనుగ్రామము విఖ్యాతవర్తకస్థలమైయుండెను. అచ్చటికి పారసీకము నుండియు అరబ్బీస్థానమునుండియు గుఱ్ఱములు దిగుమతియగుచుండెను. చీనాదేశమునుండియు పెక్కుసరకులు దిగుమతియగుచుండెను.

"ట్రావెన్కూర్ రాజ్యములో క్విలాన్ అనునది గొప్పవర్తకస్థలమైయుండెను." కొంకణదేశమునుగూర్చి మార్కో-పోలో యిట్లువ్రాసియున్నాడు "వర్తకవిషయములో నీప్రాంతమందలి బ్రాహ్మణులకుగల

చాతుర్యము లోకములో మరెవ్వరికిని లేదు. ఎట్టికష్టము సంభవించినను వారబద్ధములాడరు. మద్యమాంసములుంటరు. యజ్ఞోపవీతముల ధరించెదరు. వారుతమభార్యలయెడ విశేషానురక్తులైయుందురు. వారుప్రతి సూర్యపూజకులు. శకునములను నమ్ముదురు. చల్లయన్నము తిని వారు విశేషకాలమువఱకు బ్రతికియుండెదరు. కొందఱు నూటయేబది రెండు వందలయేండ్లవఱకుబ్రతికియుండిరట!" ఈకట్టకడపటి విషయము ప్రస్తుత విషయస్థితిని జ్ఞాపకముచేయుచున్నది. సగటున నేటి భారతీయుని జీవిత కాలము 23 సం॥లు మాత్రమైయున్నది. ఆకాలమునగుజరాత్ దేశము లో తోళ్ళవర్తకము అల్లికపని కోష్టాపని చక్కగజేయుచుండిరి. తానా ఖంబాయత్, సోమనాథ్ మొదలైనస్థలములు వర్తకమునకై విఖ్యాతి జెందియుండెను". (మహమ్మదీయమహాయుగము.)

1526 న. సం॥ లో ఢిల్లీరాజ్యము మొగలు చక్రవర్తులపాలయ్యెను. మొగలాయి రాజ్యస్థాపకుడగు బేబరును అతని కుమారుడగు హుమయూనును దేశాభ్యుదయమునకు తోడ్పడిరి. తరువాత హుమయూనుని పదచ్యుతునిచేసి తానే మొగలు సింహాసనము నాక్రమించుకొని యుత్తరహిందూస్థానము నేలిన షేర్షా కాలమున దేశము విశేషముగ నభివృద్ధిజెందెను. మొట్టమొదట భూములుకొలిపించి భూమియొక్క వైశాల్యమునుబట్టియు ఫలసాయమును బట్టియు పన్నును విధించియున్నదితడే. బీదలును ధనవంతులునుగూడ న్యాయమునట్ల సమముగ పాలింపబడుచుండిరి. వ్యవసాయమునకు భంగముకలిగించినవారు తప్పక శిక్షనొందుచుండిరి. రాచబాటలను వేయించుటయందును, మార్గములప్రక్క వృక్షములు నాటించుటయందును, విశ్రాంతిగృహములుకట్టించుటయందును, నిశడకోసము మొదలగుపూర్వరాజుల ననుకరించెను. ఆతడు వంగదేశము మొదలు సింధునదమువఱకును వేయించిన రాచబాట యిప్పటికినిగలదు. మఱియుహిందూదేశమందలి ప్రజలయుపయోగార్థమై వెం

డినాణెమగు రూపాయిని మొదట నుపయోగించిన దీషెర్షాప్రభువే. షెర్షా మొదలిడినకట్టుబాటులనన్నిటిని అక్బరు పరిపూర్తి నొందించెను. ఇతడుతనఔదార్యమువలనను, ధైర్యసాహసములవలనను, పరమతసహనముచలనను జగద్విఖ్యాతిగాంచిన మొగలాయిచక్రవర్తి. ఈతనికాలమున మొగలాయి సామ్రాజ్యములోని భూములుసర్వేచేయబడి భూమిశిస్తు నిర్ణయములను † గాంచెను. జమాబందియనునది ప్రారంభింపబడినదీ యక్బరుకాలముననే. శిస్తునిర్ణయముల గావించుటకు నియమింపబడిన యుద్యోగుల ముఖ్యాధికారి, రాజాతోడర్ మల్. తోడర్ మల్ మొదట "రాజ్యములోని భూమినంతయు గొలిపించెను. అనగా సర్వేచేయించెను. తరువాత, భూములయొక్క యోగ్యతనుపట్టి యుత్తమ మధ్యమ కనిష్ఠ భూములని మూడు తరగతులేర్పఱచెను. ఒక్కొక్క భూమియొక్క 19 సంవత్సరముల యాదాయమునుబట్టి యీభూమిపన్ను నిర్ణయింపబడెను. ఆదాయములోని మూడవ భాగము పన్నుగవిధింపబడియె. షెర్ షాహచే విధింపబడిన పన్నింతకంటె తక్కువయనుటకు సందేహము లేదు. కాని యక్బరు రాజ్యములో నేలపన్నుతప్ప తక్కినపన్నులన్నియు విడిచిపెట్టబడియె. అధికారుల కిచ్చుచున్న బహుమతుల నీయవలదని యాతడు శాసించెను. ఇజారాపద్ధతివలననిజారాదారులు ధనవంతులగుటయు రైతులు దరిద్రులగుటయు గని యీపద్ధతినిమాన్పి రైతులయొద్దనుండి పన్ను తానే రాబట్టుకొనజొచ్చెను. అక్బరురాజ్యములో రైతే భూస్వామిగనుండెను. రైతుపన్నిచ్చు చున్నంతవఱకును వానినిభూమినుండి వెడలగొట్టుటకు నెవ్వరికిని నధికారములేకయుండెను. భూమినిగొలుచుట, పన్నునిర్ణయించుట, ప్రతిగ్రామములోని రైతులయొక్కయు వారియ

---

† భూమిశిస్తునిర్ణయములకు బందోబస్తను నామమును తోడరుమల్లు వాడియుండెను. బందోబస్తును ఆంగ్లములోనికి తర్జుమా చేసినపుడు సెటిల్మెంటను పదమును వాడుచున్నారు.

వలసిన పన్నుయొక్కయు లెక్కలు క్రమముగానుంచుట మొదలైన, జమాబందికి సంబంధించిన యంశములన్నియు నిప్పటిరాజ్యకర్తలగు నింగ్లీషువారు అక్బరుయొద్ద నుండియే నేర్చుకొనిరి." (మహమ్మదీయమహాయుగము : పేజీ 102) అక్బరుకాలమున వర్తక మభివృద్ధిఁ గాంచెననియు, ప్రజలైశ్వర్యము ననుభవించిరనియు వేఱుగ జెప్పనక్కఱలేదు.

ఇతని వెనుక జహాంగీరు రాజ్యమునకువచ్చెను. ఇతనికాలములో భూమిశిస్తువలన 17 కోట్లరూపాయ లాదాయమువచ్చుచుండెనట! ఇతడు 1613 వ సంIIలో, ఆంగ్లేయులు తనదేశమున వర్తకము చేయుటకుననుజ్ఞనిచ్చి, చాల తెలివిమాలినపని నొనరించెననియు, యిట్లు చేసి తనవంశమునకు భవిష్యద్వినాశముదెచ్చి పెట్టుకొనెననియు, డాక్టరు ఆనిబిసెంటు వ్రాయుచున్నది. (How India wrought for Freedom 28) జహాంగీరు దర్శనార్థమైవచ్చిన, సర్ థామసురో అను నాంగ్లేయుడు, మొగలుదర్బారువైభవమును వర్ణించియున్నాడు. అచ్చోట రమారమి రెండుయెకరముల ప్రదేశము పట్టువస్త్రముతో కప్పబడియుండెను. బంగారుతివాసులును, బంగారుపుష్పాలతోడను వజ్రములతోడను శోభిల్లుచు గోడలనుండి వ్రేలాడు చీనాంబరములును నాతని నివ్వెఱపరచెను.

అక్బరు మనుమడగు షాజహానుకాలమున భారతదేశము మహావైభవము ననుభవించెను. షాజహాను సింహాసనము నధిష్ఠించునప్పుడు తులాభారముతోనచ్చి బంగారమును, రత్నములను, నచ్చటివారిపై వెదజల్లెను. ఈతడే సుమారు 10 కోట్ల రూపాయలు విలువగల మయూరాసనము నిర్మించినవాడు. ప్రపంచమందలి కట్టడములలో కెల్ల నందమునకును, శోభకును ప్రసిద్ధిగాంచిన 'తాజమహాల్' భవనమునుగట్టించినదీ షాజహానుచక్రవర్తియే. ఇతని కాలమున మొగలాయి ప్రభుత్వమునకు 22 కోట్లరూపాయ లాదాయమువచ్చుచుండెను. మఱియు, ఇతనికిని ప్రజలకునుగల సంబంధము, పాలకునకును, పాలితులకును గలదా

నివలెగాక, తండ్రికిని, బిడ్డలకును గలయనురాగమువలె నుండెనని టా వర్నీరు (ఒకఫరాసుబాటసారి) వ్రాయుచున్నాడు.

షాజహాను తరువాత గద్దెనెక్కిన ఔరంగజేబు, మొగలాయి సామ్రాజ్యమును దక్షిణమున కావేరినది వఱకును వ్యాపింపజేసెను. ఇతనికాలమున మొగలాయి ప్రభుత్వము నకాదాయము 38 కోట్లవఱ కుండెను. కానియితడు తనపరమతద్వేషముచే ప్రజలను రెచ్చగొట్టెను. ఒకవైపునసిక్కులును, మఱియొకవైపున రాజపుత్రులును, దక్షిణహిందూస్థానమున మహారాష్ట్రులును తిరుగుబాటునకు తలపడిరి. ఔరంగజేబు మరణించినవెంటనే వీరందరు స్వతంత్రరాష్ట్రములను స్థాపించుటచే, మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. అయినను మొగలాయివంశజులు ఢిల్లీయందు 1858. వ. సం॥ము వఱకును, నామమాత్రముగ పాలించుచుండిరి. మొగలాయిలలో కట్టకడపటివాడగు బహదూరుషాహ, సిపాయి విప్లవమున జేరినాడను కారణముజూపి, 1858 వ. సం॥ములో ఇంగ్లీషువా రతనిని సింహాసనమునుండి వెడలనడచిరి.

మహమ్మదీయ పరిపాలనము మొత్తముమీద దేశమునకు సౌఖ్యావహముగ నున్నదని చెప్పవచ్చును. సంపూర్ణాధికారముతో పరిపాలించిన రాజులలో, హిందూమహమ్మదీయ రాజులకు సములెక్కడను లేరు. హిందూరాజులకును, మహమ్మదీయ రాజులకును గూడ ప్రజానురంజకత్వమే ప్రథమకర్తవ్యముగ నుండెను. మహమ్మదీయులైననేమి? హిందువులైననేమి? అశోకమహారాజు నిర్మించిన ధర్మచికిత్సాశాలలకును, బాటలకును, ఆరామగృహములకును ఏభారతీయుడుప్పొంగకుండును? ఫిరోజషాహ, షెర్షా చక్రవర్తులు త్రవ్వించిన కాల్వలను, వేయించిన రాచబాటలను, నాటించిన వృక్షములను, క్రొత్తగా కల్పించిన యాత్రికసౌకర్యములను నేభారతీయుడు మఱచును? అక్బరు నెలకొల్పిన హిందూమహమ్మదీయ మైత్రికిని, శాంతపరిపాలన

మునకును, ఆతని ధర్మ యుదార స్వభావములకును, నేభారతీయుఁడు కృతజ్ఞత జూపకుండును? జహంగీరు, షాజహానుల కాలమునాటి వైభవము వర్ణనాతీతముగదా! ప్రపంచములో ప్రజలనిట్టి ధర్మచింతతో పరిపాలించిన రాజులుగల దేశములు చాలతక్కువగ గనుపించుచున్నవి.

మహమ్మదీయ పరిపాలనమున దేశ మభివృద్ధిగాంచినట్లు, వారి కాలమున దేశమును జూడవచ్చిన విదేశజులవ్రాతలే సాక్ష్యము లిచ్చుచున్నవి. క్రీ. శ. 77 వ సం॥లో ప్లైనీ, యను రోమనుడెట్లు హిందూదేశమును విషయమై వ్రాసియున్నదియు చెప్పియున్నాము. ప్లైని వెనుక 17 శతాబ్దములు గడచినవి. కాని హిందూదేశముయొక్క ఆర్థిక కాస్కృత్యము గ్రుంగలేదు. 'బెర్నీర'ను పరాసుబాటసారి (షాజహాను కాలమున హిందూదేశమును దర్శించినవాడు) తనమిత్రుడగు 'కాల్బర్టు'న కుత్తరమువ్రాయుచు నిట్లువ్రాసెను. "ఈ హిందూస్థాన మొక గొప్పగుంటము. ప్రపంచమందలి వెండి బంగారములలో చాలభాగ మనేకరూపములవచ్చి యీగుండమును జేరుచున్నవి. కాని అన్యులకుబోవుటకొక్క ద్వారమైనను గన్పింపదు." వెండి బంగారములుగాని వజ్రములుగాని కల్గియుండని పాశ్చాత్యు లీదేశమందలి స్త్రీల యాభరణముల జూచినప్పుడు వింతపడజొచ్చిరి. మఱియు నిక్కడి కృషులును, చేతిపనులును వారికమితాశ్చర్యము గల్గించెను. వంగదేశములోని 'కాసింబజార' ను గ్రామము ప్రతిసంవత్సరము 22 లక్షుల పౌనులు బరువుగల 22,000 బేళ్ళ పట్టు నెగుమతిచేయుచుండెనని 'టావర్నీరను' మఱియొక పరాసు బాటసారి వ్రాసియున్నాడు. ఎచ్చోటజూచినను సంతృప్తియు సంతోషమును ప్రబలెను. వ్యవసాయదారులు, చేతిపనివాండ్రు, వర్తకులు, ఎల్లరును శ్రద్ధతోడను, పట్టుదలతోడను కష్టపడి పనిచేయుచుండిరి. విదేశములతో వాణిజ్యము వృద్ధిబొందెను. భారతీయులు విలు

వగల భోగ్యానుకూలములగు వస్తువులను తమకెక్కువగనున్న వానిని మాత్రమే యెగుమతి చేయుచుండిరిగాని, యెకప్పుడును ప్రాణాధార ములగు ఆహారపదార్థములనుగాని, పరిశ్రమానుకూలములగు దూది మొదలయిన ముడి సరకులనుగాని ఎగుమతి చేసియుండలేదు.

iii

మొగలాయి సామ్రాజ్యముయొక్క మహావైభవము దశదిశల మార్మ్రోగెను. ఆకాలమున నీదేశముతో వర్తకముచేయుటకై వచ్చి యుండిన మార్కోపోలో, బెర్నీరు, టావర్నీరు మొదలగుపాశ్చాత్యులు తమదేశస్థులకీ భారతదేశముయొక్క అభ్యుదయమును దెలియజేయు చుండిరి. భారతదేశము ధనరత్నాకరమనియును, సకలవస్తుసమన్విత మనియు ననేకు వార్తలు పాశ్చాత్యులకు జేరుచుండెడివి. మఱియు భరతవర్షమనినతోడనే రత్నశోభితమగు నొక మహావృక్షము వారిమన స్సులకు గోచరమగుచుండెను. ఈమహావృక్షమును దర్శించినంతనే తమ జన్మ పావనమగుననియు, సేవించినంతనే ఫలముల ప్రసాదించునని యు, నెకపర్యాయము దానిశాఖల నూపినచో వెలలేని కనకవస్తువా హానములు జలజల రాలుననియు వారు తలపోయజొచ్చిరి. ఈదేశము తో నెటులైన వర్తకము చేయవలెనను గట్టికోర్కె వారిమనముల నుదయించెను. భారతవర్షమునకు సముద్రమార్గమును గనిపెట్టునిమి త్తమై బయలుదేరిన 'కొలంబసు' అమెరికాను కనుగొని పాశ్చాత్యదేశ ములందు గొప్పమార్పును గలుగజేయుటకు కారణభూతుడయ్యెను.

వాస్కోడిగామా 'గుడ్ హోప్' అగ్రమును జుట్టి కొంకణతీర మును జేరగల్గుటచే, అతనిమార్గము నవలంబించి, పోర్చుగల్, హాలండ్, జర్మనీ, పోలండ్, ఫ్రాన్సు, యింగ్లాండు దేశములయొక్క వణిజులు అత్యాశాపూరితులయి సముద్రయాన మొనర్చి యీదేశమును ప్రవే శింప మొదలిడిరి. దేశమునందలి సంస్థానాధీశుల యనుజ్ఞబడసి, వారి

సహాయమున కొంకణ కర్ణాటక తీరములం దక్కడక్కడ తమవర్తకశాలల నేర్పఱచికొని, వర్తకముచేయ నారంభించిరి. కాని యీవిదేశజులొకరినిజూచి యొకరోర్వ లేకపోవుటంచే నంతఃకలహము లుదయించెను. జర్మనీమొదలగు దేశములు కొన్ని వెనుకకు తగ్గెను. డచ్చివారికి భరతవర్షమున నిలువ నీడలేకపోవుటచే, జావా, సుమిత్రా మొదలగు తూర్పుదీవులం దునికి నేర్పాటుజేసికొనిరి. పోర్చుగీసుల వర్తకమును ప్రాబల్యమును క్రమక్రమముగ తగ్గిపోయెను. ఇక భారత రంగమున నాధిక్యమునువహించుట నీవా, నేనా యనెడు కక్షబూని, ఆర్యావర్తమును యుద్ధ తరంగములచే సంచలింపజేయుటకు మిగిలి యున్నవి రెండుదేశములు: ప్రాంసు, ఇంగ్లాండు.

పరాసువర్తకులు 1537 వ సం॥న భారతవర్షమున నడుగుపెట్టిరి. తరువాత నూటముప్పది సంవత్సరములకు సూరతు గోల్కొండ పట్టణములందు వారి గిడ్డంగులు కట్టబడెను. 1672 వ సం॥న పుదుచ్చేరి పట్టణమును కొనిరి. ఈపట్టణమే తూర్పుసముద్రమున వర్తకమొనర్చు పరాసువారికి ముఖ్యస్థానమై, డూప్లే మొదలగు పరాసు నాయకుల నివాసమై, దాదాపాక నూరువత్సరములు దక్షిణహిందూస్థానమున ప్రాముఖ్యమును బడసియుండెను.

ఆంగ్లేయులను గూర్చి కొంతవిపులముగ వ్రాయవలసియున్నది. వీరు భరతవర్షమునకు పయనమైనవారిలో కడపటివారు. 1600 వ సం॥న డిసెంబరు 31 వ. తారీఖు నఆంగ్లేయ వణిజులు కొందఱొక వర్తకసంఘముగా నేర్పడి తూర్పు సముద్రముల భరతవర్షముతో వ్యాపారము చేయుటకు ఎలిజబెత్తురాణి యనుజ్ఞబడసిరి. వీరినావలు 1606 వ సం॥న సూరతుపట్టణము జేరెను. స్వదేశ సంస్థానాధీశు లీవిదేశజుల కెట్టిసహాయముల నొనర్చి వారివర్తకము ప్రోత్సహించినదియును కానరాదు. మచిలీపట్నము, పెట్టపోలి, వీరి ప్రథమవర్తక స్థానములు. సూరతు,

కాంజే, గోగో, అహమ్మదాబాదులందు గిడ్డంగుల నేర్పరుచు కొనుటకు జహాంగీర్ వీరికి 1613 వ సం॥ న ననుజ్ఞయిచ్చెను. మూడుసంవత్సరముల పిమ్మట కళ్ళికోటయందు వర్తకస్థానము లేర్పఱచికొనుటకై జామొరీను సెలవునుబొందిరి. 1639 వ. సం॥ న చంద్రగిరిరాజు చెన్నపట్నము నాంగ్లేయులకు దానముచేసి వారికొక వర్తకశాలనేగాక దాని సంరక్షణార్థమై కోటనుగూడ కట్టించియిచ్చెను. కాలక్రమమున పిప్లీ, బొంబాయి, కాళీఘట్టములందు వర్తకశాలలు నిర్మాణమయ్యెను. 1713—1719. సంవత్సరములమధ్య మొగలు సామ్రాజ్యమున వర్తకముచేయుట కనుజ్ఞలభించెను. 1725 వ సం॥ మగుసరి కీవర్తకశాలల సంరక్షణార్థమను నెపమున చెన్నపట్టణము బొంబాయి, కాళీఘట్టము సేంట్‌డేవిడ్ ప్రదేశములందు కోటలు వెలసినవి. 18 వ శతాబ్ద ప్రారంభముననే వివిధాంగ్లేయ వర్తకసంఘములన్నియు నేకమై "యునైటెడ్ యీస్ట్ యిండియా కంపెని" యనుపేర వాణిజ్యమును కొనసాగించుచు 1749 వ సం॥ వఱకును దేశీయరాజుల రాజ్యకార్యములలో సంబంధముల గల్పించుకొనక వర్తకముననే నిమగ్నులైయుండిరి.

ఈకాలమంతయును నాంగ్లేయ వర్తకులు భరతవర్షమునుండి నూలువస్త్రములు, పట్టువస్త్రములు, సుగంధద్రవ్యములు, నీలిమందు, నెగుమతిచేయుచు తమదేశమునుండి యిచటకు దిగుమతిచేయగల మాఱువస్తువులులేక బంగారమును తెప్పించుచుండిరి. 1747 నుండి 1757 వఱకునుగల యీపదిసంవత్సరముల మధ్యను సం॥ నకు సగటున 5,62,423 పౌనులు విలువగల బంగారము భారతదేశమున కెగుమతి యయ్యెననియు, తదనంతర మాగిపోయెననియు, బ్రూసు అను చరిత్రకారుడు వ్రాసియున్నాడు. (1757 వ సం॥ ననే ఆంగ్లేయులు వంగదేశమును జయించినది.)

మఱియు నీకాలమున వర్తకసంఘము చాలలాభమును బొందుచుం

డెను. మొదటి 80 వత్సరములందును నూటికి సంవత్సరమునకు 171 [illegible] లాభము వచ్చెను. సుప్రసిద్ధుడగు మెకాలే తన ఆంగ్లేయ చరిత్రయందు ఇట్లు వ్రాసియున్నాడు: “ రెండవ చార్లెసు రాజ్యము చేయునాడు చాలకాలమీన వర్తకసంఘము నిరుపమానమైన యభివృద్ధి నొందియుండెను. దీనిని గాంచి రాజధాని(లండను) యందెల్లను నాశ్చర్యచకితులైరి కొందఱీర్ష్యా ద్వేషము మొదలగు భావములకు లోనైరి. అతడుగ్రహించిన ఇరువది మూడు సం॥ ల వఱకు ఆసమృద్ధితో తులతూగు ప్రదేశము (గంగానది జిల్లా) నుండి ప్రతియేటను 8000 పౌనులు మొదలు 3,00,000 పౌనుల వఱకును విలువజేయు పదార్థములు దిగుమతి యగుచుండెను. మఱియు నాసంఘముయొక్క లాభములు అపరిమితముగ నుండెను. 1676 వ సం న ప్రతివాటాదారుడును తన మొదటివాటాకు తుల్యమగు మఱియొక వాటాను బహుమానముక్రింద బొందెను. ఇట్లు రెట్టింపుచేయబడిన మూలధనముపై 5 సంవత్సరముల వఱకును ప్రతియేట నూటికి 20 [illegible] లాభము వచ్చెను.

1677 వ సం॥ న నూరుపౌనుల వాటా ఖరీదు 245 పౌనులును, 1681 వ సం॥ న 300 పౌనులును, పిమ్మట 360 పౌనులును, మఱికొంత కాలమునకు పౌ 500 లు నయ్యెను. దీనినిబట్టి ఆంగ్లేయవర్తక మెట్లు యభివృద్ధి నొందుచుండినదియు గ్రహింపవచ్చును.

రాజ్యసంపాదనము :—ప్రపంచమున కల్గిన మహాద్భుతకార్యములలో నాంగ్లేయుల భారతదేశ విజయము ప్రధానస్థానము బడయగలదు. 6000 మైళ్లదూరమున ననేక సముద్రముల కవ్వల ఖండాంతరమున వసించు నాంగ్లేయులెక్కడ? వర్తకమునకై స్వల్పసంఖ్యాకులు వచ్చుటేమి? సర్వాయుధ సంపన్నుల నాగరకుల ముప్పదికోటి భారతీయుల జయించుటేమి? ఇదియొక మహాద్భుతముగాదా? అయినను గొప్ప కారణములు లేకపోలేదు. పండ్రెండవ శతాబ్దమున మహామ్మదీయులు

భారతవర్షమున కేతెంచి జయించి పాలింప గల్గుటకేవి కారణములయ్యె నో నట్టి భోగపరాయణత్వము దానివలన జనించు బలహీనత బుద్ధిమాంద్యము, బరస్పరద్వేషము, మొదలగు దుర్గుణములే యీకాలమునకూడ స్వదేశరాజుల నావహించి యుండెను. దీని కాంగ్లేయుల చాతుర్యము తోడుపడెను. చతురోపాయములలో మూడవదియగు భేదోపాయమే ఆంగ్లేయులచేతిఖడ్గమై, నిరాటంకముగ, నమాయకులగు దేశీయరాజుల ను భేదించి, జయమును సంపాదించెను. ఇక ఫలితము భారతవర్ష పారతంత్ర్యమని వేరుగ జెప్పనలయునా? 1687వ సంవత్సరముననే ఆంగ్లేయ వర్తకసంఘుచోదకులు (డైరక్టరులు) భారతవర్షమున స్థిరమగు నట్లాంగ్ల సామ్రాజ్యమును స్థాపించుటకై పునాదుల నేర్పఱుప తలపోయ జొచ్చిరి. 18 వశతాబ్దప్రథమభాగమున, ఫరాసులకుప్రధాననాయకుడైయుండి నడూప్లే, భారతవర్షావస్థనుజూచి తాము భారతదేశమును జయింపవచ్చునవియు,దీనికై భారతీయుల సైనికులుగానుపయోగింపవచ్చుననియు తలపోసెను. డూప్లేతలపోసెను. ఆచరణమున బెట్టెనోలేదో! ఆంగ్లేయులు మాత్రము దానినవలంబించి సంపూర్ణ విజయమునుబడసిరి.

ఆంగ్లేయు లక్కడక్కడ సముద్రతీరమున తమవర్తకశాలల నేర్పఱచుకొనిన ట్లిదివఱకే వ్రాసియున్నాము. కాని వర్తకశాల.లట్లే యుండక కాలక్రమమున శత్రుదుర్భేద్యములగు కోటలక్రింద మారెను. మొదట వర్తకమును సంరక్షించుటకై నియమింపబడిన భటులు క్రమముగ సైనికులైరి. సైన్యము లేర్పడెను. సైనికుల సంఖ్య హెచ్చెను. రాజ్యాపేక్ష పూర్వమే యుండుటచే రాజ్యాక్రమణము ప్రారంభమయ్యెను.

తంజావూరు:—పాశ్చాత్యుల చేతులలో జిక్కి దుర్భర పారతంత్ర్యము ననుభవించుటకు దక్షిణహిందూస్థానమే మొదటిది. 1741 వ సం॥న తంజావూరు రాజకుటుంబమున కలహము లుద్భవించెను. అందుపిత్రా

పసింగను నతఁడు గెలుపొంది సింహాసనము నధిష్ఠించెను. ఆంగ్లేయులును అతనినే రాజుగా పరిగణించి, పరాసువారికి పోటీగా ఆతనితో ముందే స్నేహము జేసికొనిరి. కాని కొంతకాలమునకు ప్రతాపసింగు సోదరుడైన సాహూజీ ఆంగ్లేయులను జేరి వారు తన్ను సింహాసనాసీనుని గజేసినచో దేవకోట సంస్థానమును జాగీరుగా నిచ్చెదనని వాగ్దానము చేసెను. రాజ్యసంపాదనమునకై యుబలాటపడుచున్న ఆంగ్లేయులు ప్రతాపసింగుతోడి పూర్వపు మైత్రిని పాటింపక ఆతనిపై నొకసైన్యమును బంపిరి. కాని యాసైన్య మోడింపబడుటచే కొంతదూర మాలోచించి యీపర్యాయము ప్రతాపసింగుపై వెడలక దేవకోటను ముట్టడించి దానినివశపఱచుకొనిరి. వెంటనే ప్రతాపసింగు సంధికిరాగా సాహూజీ పక్షమును పరిత్యజించి యాతనికి మనువర్తి నిప్పించి తమకు దేవకోట సంస్థానము నిచ్చుటకు ప్రతాపసింగుచే వాగ్దానమునుబొంది ఆతనితోసంధి చేసికొనిరి. ఆంగ్లేయుల హస్తగతమగుటకీదేవకోట సంస్థానమే ప్రథమ కబళము.

ఆర్కాటు:—ఆంగ్లేయులు కొంకణమున నిలువనీడలేక యల్లాడు సమయమున కర్ణాటక నవాబువారి నాదరించి తనసంస్థానమున వలయు సమపాయముల నొసఁగి సత్కరించెను. పిదప కర్ణాటక సంస్థానమున బుట్టిన కుటుంబ కలహములలో, నాంగ్లేయులు మహమ్మదాలీ పక్షమును, వారికిబద్ధవైరులగు పరాసులు చందాసాహేబు పక్షమునుబూని, యెవరికి వారు దక్షిణహిందూస్థానమున తమయాధిక్యమును సంపాదించుటకై పోరుసల్పిరి. ఈయుద్ధములో నాంగ్లేయులే గెలుపొందిరి. ఆంగ్లేయుల మిత్రుడగు మహమ్మదాలీ సింహాసన మధిష్ఠించెను. ఇంతటితో సంతృప్తిజెంది ఆంగ్లేయులు తాటస్థ్యమును బూనక, ఆర్కాటు నవాబు సంస్థానమందలి చిన్నచిన్న సామంతరాజులతో జోక్యము కలిగించుకొని, వారినెటులైన లొంగదీయవలెనని ప్రయత్నించిరి. దీనిపై పరాసువారు

మరల తిరుగబడిరి. కానిలాభములేకపోయెను. ఈయుద్ధములతో హిందూదేశమున పరాసుల ప్రాముఖ్యము తగ్గిపోయెను. ఆంగ్లేయులు పరాసులతో జరిపిన యీయుద్ధముల కెల్లభారమును కర్ణాటక నవాబే వహించవలసినవాడయ్యెను. ఈయుద్ధ వ్యయముకొరకై ఋణముక్రింద ప్రతియేటను 28 లక్షల రూప్యముల నాంగ్లేయులకిచ్చునట్లు 1763 వ సం॥న నతడు వారికొక సంధిపత్రము వ్రాసియిచ్చెను. కాని దానిము నుచెల్లించుట కశక్తుడగుటచే కొంతకాలమునకు వారికొక జాగీరు నొసంగి ఋణవిముక్తుడయ్యెను.

కాని కాలక్రమమున జాగీరు దారుడే రాజ్యాధిపతియయ్యెను. ఆంగ్లేయుల ప్రాబల్యము క్రమముగ హెచ్చెను. వారిప్రతిష్ఠ హెచ్చిన కొలదిని నవాబు గౌరవముతగ్గెను. వారిబలము విజృంభించిన కొలదియు, నాతని యధికారము క్షీణించెను. తుదకాతడు వారిచేతనొక కీలుబొమ్మయై వారిచెప్పుచేతలకు లోబడవలసివచ్చెను. వెల్లెస్లీప్రభువు ఆర్కాటునవాబును గురించి "కర్ణాటకము, మనతోడి స్నేహ మనెడి వలయందును, మనరక్షణమనెడి ఉరియందును చిక్కుకొనియున్నద"ని వ్రాసియున్నాడు.

ఆంగ్లేయులతోడ గల్గిన సంబంధమువలన, దక్షిణహిందూస్థానమున నెట్టిఫలితములు కలిగెనో చూడవలసియున్నది. సంధిషరతుల ననుసరించి ఆంగ్లేయులు నవాబుయొక్క ఆంతరంగిక రాజకార్యముల లో జోక్యము కల్గించుకొనగూడదు. కాని వీలగునప్పుడెల్ల వారీతని కార్యములలో జొరబడుచుండిరి. మఱియు నాంగ్లేయులకు నిర్ణయకాలముల కివ్వవలసిన మొత్తముల చెల్లించుటకై, ఆర్కాటునవాబు అమితమగు వడ్డీలకు ధనము నప్పుదెచ్చుచుండెను. ఇంతియకాక, మద్రాసు, ఫోర్టుసెంటు జార్జియందలి సివిలు మిలిటరీ యుద్యోగులును, నితర యూరోపియనులును, శాసనముల చేయగడంగిరి. ఈయనర్థముల కారణము

వలన 1792, వ సం॥ న, దేశమెట్టి దురవస్థను పొల్పడినదియు 'మిల్లు' వ్రాసియున్నాడు: "ఇందు మనదృష్టిని తీవ్రముగ నాకర్షించువిషయ మొక్కటిగలదు. దానికి మనము నిజమగు కారణములరయవలెను. హిందూదేశములోని యత్యుత్తమ రాష్ట్రములగు, అయోధ్య కర్ణాటకములలోని ప్రజలు బ్రిటిషు రాజ్యమునకు లోబడినప్పుడు, దుష్పరిపాలనమువలన, చాలదురవస్థను పొందిరి. అట్టి దౌర్భాగ్యమును, హిందూదేశమునగాని, ప్రపంచమునగాని, మరెచ్చటను జూడజాలము. స్వదేశసంస్థానము లాంగ్లేయులపై నాధారపడినప్పు డిట్టి విషమస్థితి యెట్లుదయించెను?"

ఆంగ్లేయు లెట్లైనను నవాబుయొక్క యధికారమును సున్న చేయవలెనని తలంచుచు తరుణమునకై వేచియుండిరి. టిప్పుసుల్తానుతో ఆంగ్లేయులకు యుద్ధము సంభవించెను. కర్ణాటక నవాబును, అతని కుమారుడును టిప్పుసుల్తానుతో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుచున్నట్లు వినవచ్చెను. ఇదియే తగినసమయమని యెంచి, వెల్లస్లీ ప్రభువు "కర్ణాటకనవాబు సంధి నతిక్రమించినందున కంపెనీవారు తమ యిచ్చవచ్చినట్లు ప్రవర్తించవచ్చును" నని ప్రకటించి, కర్ణాటకనవాబు క్రొత్తసంధి షరతుల కంగీకరింపవలెనని వార్తనంపెను. చెన్నపట్టణమున కీవార్తవచ్చునప్పటికి నవాబుగానుండిన 'ఓమ్దాత్ ఉల్ ఉమ్రా' అస్వస్థుడైయుండి కొంతకాలమునకు మరణించెను. తరువాత నతనికుమారునకు బ్రిటిషువారు, తమయభిప్రాయములను, నూతనసంధి షరతులను దెలియపఱచిరి. కాని యాతడంగీకరింపలేదు. అతడంగీకరింపకపోయిన నేమి? అతని నవ్వలకుద్రోసి, యీనూతన సంధిషరతుల కంగీకరించిన 'అజీముత్ ఉల్ దౌలా' యను రాజబంధువును గద్దెపై నెక్కించిరి. కర్ణాటక రాష్ట్రపు టాదాయమున నైదవభాగము నవాబు శాశ్వతముగ ననుభవించునట్లును, మిగిలిన నాల్గుభాగములు

కంపెనీవారికి చేరునట్లును, కర్ణాటక రాజ్యభారమును వారే నిర్వహించు నట్లును సంధిపత్రమున వ్రాయబడెను. కాని శాశ్వతమన నెంతకాలము? 1853 వ సం॥ న, డాల్హౌసీ ప్రభువు 'అజీమ్‌షాహా' యనెడుకొత్తహక్కుదారుని పదభ్రష్టునిజేసి, యాతనికిచ్చుట కంగీకరింపబడిన నైదవ భాగము ద్రవ్యమునిచ్చుట నాపుచేసి, కర్ణాటకరాజ్యమును బ్రిటిషు రాజ్యములో సంక్రమింపజేసి, కర్ణాటకరాజ్య చరిత్రమందలి పంచమాంకములోని తుదిరంగమును సమాప్తినొందించెను.

మైసూరురాష్ట్రము:—మైసూరురాజ్యమును చాలకాలమునుండి హిందువులు పాలించుచుండిరి. కాని సామాన్య యుద్ధభటుడైన హైదరాలీ, తనసామర్థ్యముచే క్రమముగ సైనికోద్యోగియు, సేనానాయకుడును, చివరకు పూర్వపురాజుల తొలగించి తానే రాజ్యాధిపతియు నయ్యెను. బ్రిటిషువారు ప్రథమమున నాతనితో సంధిచేసికొనిరి. కాని కొలదికాలమునకే దానినుల్లంఘించి బర్మాహాలనెడి మైసూరురాష్ట్రమున నొకభాగమును వశపఱచుకొనిరి. ఆంగ్లేయుల యవినీతినిగాంచి హైదరు కోపముజెంది యొకప్రచండసైన్యముగైకొని వారిపైదండువెడలి, వారిని బర్మాహాలునుండి వెనుకకుదరుముటయేకాక, చెన్నపట్నమునుగూడ వశపఱచుకొనుటకు ప్రయత్నించెను. ఆంగ్లేయులు కాళ్ళబేరమునకు దిగి హైదరువచించిన సంధిషరతులకు నమ్రులై యంగీకరించి, తాత్కాలిక విపత్తు నుండిబయటబడిరి. కాని 1778 వ. సం॥ లో నీసంధిషరతుల మఱియొకపర్యాయ మతిక్రమించి, హైదరువలదనినను వినక, మాహె యనెడు మైసూరురాష్ట్రపు రేవుపట్టణమును పట్టుకొనిరి. హైదరు ఆంగ్లేయపాలితమగు కర్ణాటకముపై మరలదండెత్తి, ఆంగ్లేయులొనర్చిన దుష్కార్యములకు ప్రతీకారము గావించెను. ఆతడేమి ప్రదేశములనెల్ల [illegible] క్రూరత్వము, కొన్నిపటు చర్యలనునట్లు అ [illegible] తమైనభావింపక, తమకు విముక్తి గలుగజేసిన

మహానాయకుడని యభినందింపజొచ్చిరి. మఱియు నత డార్కాటు, వెట్ట్రా, లనువశపఱచికొనినప్పు డక్కడిజనులను "దయతోనేలెను. తనసైనికులు గ్రామస్థులపైబడి దోచుకొనకుండ కట్టుదిట్టముజేసెను. ప్రతివారును పూర్వమువలెనే తమభాగ్యముల ననుభవించుచుండిరి. ఉద్యోగులు యథారీతిని తమపనులను జేయుచుండిరి. ఆంగ్లేయోద్యోగుల కాహారపదార్థములకై వలయుధనమును హైదరొసంగెను." ఇట్టిహైదరు అనాగరకుడనియు, మోటువాడనియు, నాంగ్లేయులు పిలుచుచుందురు. కాని ఆంగ్లేయులు శ్రీరంగపట్టణమును ప్రవేశించినప్పుడు దానిని కొల్లగొని, ప్రజల ధనమును దోచుకొని దుర్నయముల గావించినట్లు చరిత్రకారులువ్రాయుచున్నారు. ఇదియేసరియగు నాగరకతయైయుండ నోపు! ఆహా! నాగరకతకును మోటుతనమునకును గలతారతమ్య మింతయని యెవరు తెలిసికొనగలరు!

ఆంగ్లేయులతో యుద్ధము ముగియకపూర్వము హైదరుచనిపోయెను. తదనంతరము నతని కుమారుడగు టిప్పుతో వారుసంధి గావించుకొనిరి. హైదరు మరణకాలమున కుమారుడగు టిప్పు దగ్గఱలేకుండెను. అట్టిసమయమున టిప్పువచ్చువఱకును, హైదరు మరణవార్తను గప్పిపుచ్చి, అతడేతెంచినవెంటనే కిరీటమునప్పజెప్పిన బ్రాహ్మణమంత్రి వంటి స్వామిభక్తిపరాయణుని, విశ్వాసపాత్రుని, చరిత్రయం దరుదుగ జూడగలము.

1789వ సం॥లో, ఆంగ్లేయులు మైసూరుతో తిరిగి యుద్ధమునకు ప్రారంభించిరి. వారును, హైదరాబాదు నైజామును, మహారాష్ట్రులును కలిసి, ఏకాకియగు టిప్పు సుల్తానుపై దండెత్తి యాతనినోడించిరి. 1792వ సం॥న యుద్ధఖర్చులక్రింద నపారమగుద్రవ్యమును మైసూరురాజ్యమం దర్ధభాగమును ఇచ్చి టిప్పు వారితో సంధిచేసికొనెను. ఇంతటితో మైసూరురాజ్య చరిత్రము ముగియలేదు. కడపటి మైసూరుయుద్ధము

ద్ధమున (1801 వ సం॥లో) శ్రీరంగపట్టణపు ముట్టడియందు టిప్పుసుల్తాను మరణించెను. ఆంగ్లేయులు మైసూరును వశపఱచికొని దానిలోని మఱికొంత భాగము నాంగ్ల రాజ్యమునను జేర్చి, మిగిలిన మైసూరు రాష్ట్రమును పూర్వపుహిందూ రాజుల వంశజునకొకనికి కట్టబెట్టి, మైసూరు నాంగ్లసామ్రాజ్యమున నొకసామంత సంస్థానముగ నొనర్చిరి.

పరరాజులకు చిక్కకపూర్వము మైసూరుదేశ మెట్టిస్థితియందుండెన్నదియు జూడదగును. “హైదరు నిరంతరము యుద్ధములనిమగ్నుడై యున్నప్పటికిని రాజ్యాభివృద్ధియందును, రాజ్యనిర్వాహణమునందును, అతడెక్కుడు శ్రద్ధవహించెను. అతనిరాజ్యమున ప్రతిభాగమునను పరిశ్రమికులును, వర్తకులును అభివృద్ధిజెందిరి. వ్యవసాయము వృద్ధిబొందెను. నూతనపరిశ్రమలు స్థాపింపబడెను. రాజ్య మైశ్వర్యవంతమయ్యెను. సోమరులను, దుర్నీతిపరులను నాతడు కఠినముగ దండించుచుండెను. పన్నులను వసూలుచేయు నుద్యోగులు భయభక్తులతో తమకార్యముల నిర్వర్తింపుచుండిరి. లెక్కలలో దోషములుండిన తీవ్రమగు శిక్షలకు పాత్రులగుచుండిరి. తనరాజ్యములోని మూలమూలలనుండు ప్రదేశములపైనను, యితర సంస్థానాధీశుల చర్యలపైనను, నాతడు కనుగల్గి వర్తించుచుండెను. ప్రతిస్వల్ప విషయమును గూడ నాతనికి తెలియుచుండెను. తనరాజ్యమున దూరముననుండు ప్రజలు తలపెట్టు కార్యములలో నాతనికి తెలియని దొక్కటియు లేదు. పొరుగుననున్న రాజుల యభిప్రాయములన్నియు నాతనికి వినవచ్చుచుండెను. ప్రతిరోజును కార్యదర్శు లాతని రాజ్యసంబాధమగు యుత్తరముల నెల్ల నొకటివెంబడి నొకటి చదివి వినిపించుచుండిరి. అతడువ్రాయుట నేర్వకుండియు, తానివ్వవలసిన ప్రత్యుత్తరముల భావమునెల్ల క్లుప్తముగ కొద్దిమాటలలో వారికి తెలియజేయుచుండెను. వారు వానిని వ్రాసి, యాతనికి వినిపించి, పంపివేయుచుండిరి. అతడు స్వల్పవిషయములనుగూడ గ్రహించుశక్తియేగాక, విశాల

భావమును కార్యదీక్షయు కలిగియుండెను. ఆతడు చనిపోయినప్పుడు రాజ్య ధనాగారము ధనముతో నిండియుండెను.

"ఇంతియకాక తాను సంపాదించిన గొప్ప రాజ్యమును తాను ప్రోగుజేసి తరఫీదునొందించిన జయశీలురగు మూడులక్షల సైనికులను నాతని కుమారుడగు టిప్పుసుల్తానున కప్పగించెను." (ఇండియా రిఫారమ్ సొసైటీ వారి కరపత్రము నుండి)

టిప్పుసుల్తాను పరిపాలనమునగూడ మైసూరు రాష్ట్రము సౌఖ్యమనుభవించెను. వ్యవసాయము బాగుగా కొనసాగుచుండెను. వాణిజ్యము విస్తరించెను. పట్టణముల సంఖ్య హెచ్చెను. నూతనపురములు నిర్మాణమయ్యెను. ప్రతివ్యాపారము నభివృద్ధి జెందుచుండెను. ఆంగ్లేయులు మైసూరు నాక్రమించి నప్పుడైనను వారితో టిప్పుసుల్తాను క్రౌర్యమును గూర్చికాని, ప్రజాపీడనమును గురించికాని, యెవ్వరును మొరపెట్టియుండ లేదనియు, ఆంగ్లేయుల విజయమునకు సంతసింపక, మైసూరు సింహాసనముపై హిందూరాజవంశజుని తిరిగి ప్రతిష్ఠించినపుడు ప్రజలీనూతనపురుషుల నావలకుదోసి, పూర్వపురీతిని సంతోషముతో తమరాజభక్తిని గనుబర్చుచుండిరని "మూర"ను ఆంగ్లేయోద్యోగస్థుడు వ్రాసియున్నాడు.

వంగదేశము:—వంగదేశము చిరకాలమునుండియు "నవాబునకుము" లచే పాలితమగుచుండెను. ఫరుఖ్సియరు మొదలి మొగలు సామ్రాట్టులకు కప్పములజెల్లించినప్పటికి, తమరాష్ట్రమును సర్వస్వతంత్రులై ప్రజలను దయతోడను న్యాయముతోడను దక్షతతోడను పరిపాలించిరి. అందు సురాజదౌలాకు పూర్వము రాజ్యముచేసిన ఆలివర్దీఖానుడు దేశము నెట్లు పాలించినదియును, నిండియా రిఫారము సొసైటీవారు 1853వ సం॥లో ప్రకటించిన కరపత్రమువలన కనుగొనగలము. "ఈతని ప్రవర్తనమునకొన్ని గొప్పదోషము లున్నప్పటికిని నితని పరిపాలనమున దేశము చాలస

భివృద్ధియయ్యెను. గొప్ప యుద్యోగములలో నతడు తనబంధువులను స్నేహితులను నియమించినప్పటికి, వారు తమయోగ్యతతోడను, సామర్థ్యముతోడను మెలగిరి. ప్రమత్తులుగగాని, క్రూరులుగగాని, వారుప్రవర్తించినచో, నతడువారిని తప్పకఉద్యోగములనుండి తొలగించుచుండెను. సత్ప్రవర్తనులైనట్టియు, యోగ్యులైనట్టియు ఉద్యోగులే యాతని అనుగ్రహమునుబడయగల్గిరి. హిందువులైనను, మహమ్మదీయులైనను, నొకభగవంతునిచే సృజింపబడిన మనుష్యులుగ భావించి, వారిని సమదృష్టితో నతడు వీక్షించెను. హైందవులను మంత్రిపదవులందును, సేనానాయకులుగను, పరిపాలనాశాఖలలోని యున్నతోద్యోగములందును, నియమించెను. అందుచే హిందువులెల్లరును అతనిని, అతనికుటుంబమును, విశేషభక్తి విశ్వాసములతో కొలుచుచుండిరి. అతనిపరిపాలనమున, రాష్ట్రాదాయము దూరమునకున్న ఢిల్లీపట్టణమునకు పంపబడక అచ్చటనే వ్యయమగుచుండెను. ఈకారణమువలననే ప్రజలకమిత సౌభాగ్యము చేకూరెను. ఇతని రాజ్యమందెల్లచోట్లను శాంతియును, సమృద్ధియు, సత్పరిపాలనమును ప్రవర్తిల్లెను. దూరమునకున్న అవిధేయుడగు జమీందారుదెవడో, అప్పుడప్పుడు తిరుగబడుట వలనదప్ప, దేశమందలి స్థిరమగు శాంతికి నంతరాయము కల్గుచుండెను.”

వేయేల? మొగలు సార్వభౌముని మకుటమున నిరుపమానశోభతో ప్రకాశించు వజ్రము [1] వంగదేశము. అక్షయమ్మగు ధనమ్మునకాకరమైనది వంగదేశము.[2] తన్నుచేపట్టినవారి నమిత ధనసంపన్నుల జేయునది వంగదేశము.[3] భూలోకమందలి నందనోద్యానవనము వంగదేశము.[4] ఈరాష్ట్రమున ప్రజాభివృద్ధి అతిశయిల్లెను. ఇచ్చటి ధాన్యపురాసులు దూరదేశములను తమసమృద్ధిచే దనిపెను. ఇక్కడి దుకూల

---

**ఈవాక్యములను పలువు రాంగ్లేయులు నుడివియున్నారు. 1. రిఛారము స్మైటీవారు. 2. క్లైవు. 3. క్లైవు. 4. మెకాలే.**

ములను లండను పారిసు నగరములందలి స్త్రీలుసైతము ధరింపుచుం డిరి. ఇట్టి వంగదేశము స్వదేశరాజుల పరిపాలనమున నెంతసౌఖ్యా వహముగనున్నదియు హాల్వెలు (Holwell) వ్రాసియున్నాడు. "సౌఖ్యమనుభవించుచున్న యీప్రజలను బాధించుట కార్యమేయగును ఏలయన, ఈరాష్ట్రమున ప్రాచీన హైందవ ప్రభుత్వానుగుణ్యములగు సౌందర్యమును, పవిత్రతయు, దైవభక్తియు, క్రమమును, న్యాయమును, నిర్దుష్టాచరణమును గనుగొనగలము. ఇచ్చట ప్రజల ధనముగాని స్వా తంత్ర్యముగాని అపహరింప వీలులేదు. ఇచ్చట బహిరంగముగ జరిగెడు దోపిడులను గుఱించికాని, చాటున జరిగెడు దొంగతనములను గుఱించి కాని వినజాలము. ప్రతిబాటసారుని విషయమునను (వర్తకపు సరకులు న్నను లేకపోయినను) ప్రభుత్వమే జాగరూకతవహింపుచు, అతని సంరక్ష ణార్థమై, ఒకగ్రామమునుండి మఱియొక గ్రామమునకు కొంతమంది రక్షక భటుల నతనివెంట బంపును. మఱియు నిట్టికార్యమును నిర్వర్తించినందు కై ప్రభుత్వ మేట్టి ప్రతిఫలమును నతనియొద్దనుండి గ్రహింపదు ... ఈరాష్ట్రమున నెవరైన నొకవస్తువును గోల్పోయినపు డదియొక ధనపేటి కయే యగుగాక, దానిని చూచినవాడద్దానిని దగ్గరనున్న చెట్టునకుగట్టి, సమీప గ్రామాధికారికి తెలియబరుచును. ఆయధికారియు ఈవిషయ మై చాటింపించి ప్రజలెల్లరకు తెలియజేయును." (ఇండియా రిఫారమ్ సొసైటీవారి కరపత్రము)

వంగదేశము నాంగ్లేయులు జయించుట కెట్టికృషి సల్పినదియు, నవాబు కుటుంబమున కెట్టికుట్రలు పుట్టించినదియు, రాజ్యాశచే మీర్జాఫ రు తన బంధువగు నవాబునకే విశ్వాసఘాతుకము జేయుటయు, ఆంగ్ల సేనానాయకుడైన క్లైవు, నొకాధ్యక్షుని పేర బహిరంగా దొంగసంతకము నేయుటయు, ఉమిచందుని మోసపుచ్చుటయు, తుదకు 1757 వ సం॥న ప్లాసీయుద్ధములో వంగదేశమును జయించుటయు మొదలగు సంగతులు

విపులముగ రాజకీయ చరిత్రయందు కానవచ్చును. కాని స్వదేశరాజుల పరిపాలనమున అనన్య సౌభాగ్యమునందిన వంగదేశము, విదేశీయులకు జిక్కిన పదివత్సరములలో నెట్టిదుర్దశ పాలైనదియు మెకాలే వర్ణించి యున్నాడు.

"వంగదేశమునుండి వచ్చిన ప్రతిమోడయు, భయంకరమైన సంగతులను తెలియజేయుచుండెను. దేశమున దుష్పరిపాలన కారణమున ఒక విషమస్థితి యుదయించెను. కంపెనీ యుద్యోగుల పరిపాలనమింత కంటె వేఱుగ పరిణమించునని యెవ్వరు తలంపగలరు? వారు తమదేహమందలి రక్తమాంసములు సైతము భరింపలేనట్టి దురాశచే ప్రేరేపింపబడినవారు. వారిసైన్యబలమా? అనివార్యమైనది. వారినిపాలించెడు ఆంగ్లదేశమందలి కంపెనీవారా? దుర్నీతిపరులు; సంక్షోభము కల్గించెడు స్వభావముకలవారు; మతిభ్రష్టులు. వారికి సరియగు వార్తలు తెలియుచుండవు. దూరమా మిక్కుటము. ఇంతియకాక, వారికిని యిచ్చటి యుద్యోగులకును, ఒకసారి యుత్తర ప్రత్యుత్తరములు జరుపుటకు పదునెనిమిది మాసములు పట్టుచుండెను. ఇట్టి సందర్భముల, క్లైవు హిందూదేశమునుండి వెడలినపిమ్మట 5 సంవత్సరములవఱకును ఆంగ్లేయులొనర్చిన దుష్పరిపాలన మిట్టిదని వర్ణింప నశక్యము. ఇట్టి దుష్పరిపాలనము మానవలక్షణములకు సైతము విరుద్ధముగనుండెను.......... కంపెనీయుద్యోగులు దేశమందలి వ్యాపారమునంతను, కంపెనీ కొఱకుగాక, స్వప్రయోజనార్థమై తమవశము జేసికొనిరి. దేశస్థులు ఎక్కువ ధరలకు కొనునట్లును, చౌకధరల కమ్మునట్లును, నిర్బంధింపుచుండిరి. ఈకంపెనీ యుద్యోగులు దేశమందలి న్యాయాధికారులను, సంరక్షణాధికారులను, ధనాధికారులను తృణీకరించి, వారి నవమానించుచుండిరి. దేశోపద్రవకారకులైనట్టియు, ప్రజలకు భయముకొలుపునట్టియు, దేశీయులను కొంతమంది చేరదీసి పోషించుచుండిరి. ఆంగ్లే

పించెనేకాని, వజీరు, తనరాజ్యమునకు మున్ముందు రానున్న చేటును గ్రహింపలేకపోయెను. ఆంగ్లేయులో, తమసేన లయోధ్యారాష్ట్రమున నెలకొల్పబడినయెడల, నవాబువజీరుయొక్క అధికారముతగ్గి, తమ యధికారము బలపడుననియు, ద్రవ్యలోపముచే కుందుచున్న కంపెనీ బొక్కసమున కీవిధముగ ధనసహాయము చేకూరుననియు, నెంచి, తమసేనలను గ్రహింపవలసినదని నవాబువజీరును ప్రోత్సహించి, మైత్రిని, సంధిపత్రము వ్రాయించి పుచ్చుకొనిరి. ఆంగ్లేయ సైన్యబలప్రయోగమువలన నిర్దోషులైన రోహిలాలు రూపుమాసిరి. రోహిలాదేశ మయోధ్యారాష్ట్రమున నొక భాగమయ్యెను. నవాబువజీరానంద భరితుడయ్యెను. కాని ఎంతకాల మీసంతసము! ఆంగ్లేయ సైన్యపోషణమునకయ్యెడి వ్యయము తనతలకుతగని బరువౌటచే, ఆభారము క్రింద నతడు కుంగి పోవలసివచ్చెను. మొదటి తొమ్మిదిసంవత్సరము లుగూడ, సాలునకు 34 లక్షల రూపాయలచొప్పున నతడు కంపెనీకి చెల్లించెను. ఇంతట దేశమందలి స్థితిమారెను. దేశీయోద్యోగులను తొలగించి క్రమముగ నాంగ్లేయు లుద్యోగములబడసిరి. వజీరుయొక్క బలమును ప్రతిష్ఠయును క్రమముగతగ్గెను. వలదన్నను నేడాంగ్ల సేన లతనిని వదలకుండెను. ప్రతియేడును గొప్పగొప్ప మొత్తముల నాంగ్లేయులకు చెల్లించుటవలన, దేశాభివృద్ధితగ్గెను. రాష్ట్రమున దారిద్ర్యము పొడసూపెను. రాజ్యాదాయము పూర్వపుదానిలో సగమయ్యెను. ఈస్థితినంతయుజూచి గవర్నరుజనరలైన 'వారనుహేస్టింగ్సు' అతనిపై దయబూని సేనలను, కప్పమును కూడ కొంతవఱకు తగ్గించెను. కాని అతని తరువాత గవర్నరుజనరలుగా వచ్చిన 'కారన్వాలీసు ప్రభువు, వజీరునొద్దనున్న ఆంగ్లసైన్యమును మునుపటిరీతిగా పెంపుజేసి, అతడు చెల్లింపవలసిన కప్పమును 25 లక్షలనుండి 70 లక్షలకు హెచ్చించెను. 'షోర్ మహాశయు' ప్రభువీకప్పము నింకనువృద్ధిచేసెను. నవాబువజీరీ

యధికమొత్తములను చెల్లింప నశక్తుడగుటచే, క్రమముగ ఋణగ్రస్తుడయ్యెను. చివరకు 'వెల్లెస్లీప్రభువు' అయోధ్యరాష్ట్రమునంతను గ్రహించెదనని బెదరించి, ప్రతియేటను చెల్లించవలసిన 70 లక్షల రూప్యముల కప్పమునకు బదులుగ, అయోధ్యరాష్ట్రము నందర్ధభాగమును, (సంవత్సరమునకు 130 లక్షల రూప్యము లాదాయము సమకూర్చు దానిని,) ఆంగ్ల సామ్రాజ్యమునకు సంక్రమింపజేసెను. ఇంతటితో అయోధ్యరాష్ట్రపీడన మంత మొందలేదు. 1815, 1825, సం॥ ల మధ్య నవాబు వజీరు యొద్దనుండి, 4 కోట్లరూపాయల నప్పుపుచ్చుకొని ఆంగ్లేయులు దానికి ప్రతిఫలముగ 'రాజ' బిరుదము నొసగి, నిస్సారమైన దేశము కొంత నతని రాష్ట్రమునకు జేర్చిరి. అవసరమైనపుడెల్ల, వజీరునకు తమమైత్రిని ప్రకటింపుచు, వలయునంతధనమునో రాజ్యమునో గ్రహింపుచుండిరి. కాని, ఆంగ్లేయులతోడి స్నేహము, ఆర్కాటునవాబున కెట్లుపరిణమించెనో, అయోధ్య నవాబునకునట్లే యయ్యెను. డాల్హౌసీప్రభువు, 1856. వ. సం॥లో, అయోధ్యపరిపాలనము బాగులేదను నెపమున, నవాబు వజీరును వెడలగొట్టి, ఆరాజ్యము నాంగ్ల పాలితముగ మార్చివేసెను.

ఇతర రాజ్యములు:—18 వ. శతాబ్ద మంత మొందుసరికి భారతదేశమున ఆంగ్లేయుల బలము దృఢమయ్యెను. సైన్యబలమందును, యుద్ధకౌశలమందును, ముఖ్యముగ కుటిలోపాయములతో గూడుకొనిన రాజ్యతంత్రజ్ఞతయందును, వారికి సములెవ్వరును గానరాకుండిరి. ప్లాసీయుద్ధమునాటనుండి, మొదటి యేబదిసంవత్సరములును, చాల జాగరూకతతోడను, మందముగను, జరిగిన రాజ్యాక్రమణమే, తరువాత యేబదిసంవత్సరములలోను, నతిత్వరితగతినొంది, రాజ్యము వెంబడి రాజ్యము గబళింపుచు, భూపతుల కొందఱి తొలగించియు, కొందఱి వశీకృతుల జేసికొనియు, వారిసంస్థానముల నాంగ్లదళములను, రెసిడెంట్లను

నిరూపించియు, నెమ్మదిగ 1857 వ. సంవత్సరమునాటికి, సకలభారతవర్షమును కంపెనీ వశమాయెను. బాహుబలప్రయోగము వలనను, శత్రువులకు ఛిద్రమునకై దానమునకైన నొసర్చబడిన యన్యాక్రమణమును న్యాయమున్నను లేకున్నదాని వేయునోదు క్రమముగ సాసనము లేదు. ఈకడపటి 50 సంవత్సరములును (19 వ. శతాబ్దపు మొదటి 50 సంవత్సరములును) ఆంగ్లేయరాజప్రతినిధులందు మిగుల సత్సాహముతో రాజ్యాక్రమణమునకు ఉద్యమించినవారు మువ్వురు. వెల్లెస్లీ ప్రభువు, హేస్టింగ్సుప్రభువు, డాల్హౌసీప్రభువు.

అందు మొదటివాడగు వెల్లెస్లీ ప్రభువు దేశీయ సంస్థానముల బ్రిటిషుదళముల నెలకొల్పియు, తమవారిని నియమించియు, వానిని ఆంగ్లేయాధికారమునకు లోబడునట్లు చేసెను. దక్షిణహిందూస్థానమున హైదరాబాదునైజామును, మైసూరురాజును, తిరువాన్కూరు రాజును, మిగిలిన చిన్న రాజ్యాధిపతులును ఆంగ్లేయులతో వివాదపడక వారి యనుమతినొప్పుకొని బ్రిటిషుదళములను స్వీకరించి, తమరాజ్యములందు పోషించుటకు సమ్మతించిరి. మధ్యహిందూస్థానమందలి మహారాష్ట్రులాంగ్లేయుల సూచనల కొకపట్టున నొప్పుకొనలేదు. కాని వారిలో వారు పరస్పరము కలహించుచు తమలో సంఘీభావము లేకయుండి విదేశీయులు తమపై దండెత్తివచ్చినప్పుడొండొరులకు సహాయపడక, తుదకు వారిచే నోడింపబడి, వారియధీనులైరి. అందు పీష్వా 1801 వ సం॥లో ఆంగ్లేయదళములను తన సంస్థానమున గైకొనుట కంగీకరించెను. కాని అతడాంగ్లేయులపై కుట్రలుపన్నినాడను కారణమున 1818 వ సం॥న హేస్టింగ్సుప్రభువు, అతనిని రాజ్యమునుండి వెడలగొట్టి దానిని ఆంగ్లరాజ్యములో నొక భాగముగ జేసివేసెను. అదియే నేటి బొంబాయి రాజధానియై యున్నది. 1803 వ సం॥న ఆంగ్లేయులచే నోడింపబడి, సింధియా, తనరాజ్యమున బ్రిటిషుదళ

దేశముల పోషించుట కంగీకరించెను. 1817 వ సం॥లో హోల్కారు-భోంస్లు పరాజితులయ్యెను. నాగపురమునకును; ఇతర మహారాష్ట్ర సంస్థానములకును గూడ నిట్టులే పోషకరక్షణము లేర్పరుపబడెను. ఆరాష్ట్రముల పరిపాలనము బ్రిటిషు రెసిడెంట్ల యాదేశానుసారము కొనసాగుచున్నది.

1842 వ సం॥న నిరపరాధులైన సింధుదేశపు అమీరులను వారి సంస్థానములనుండి తొలగించి, సింధుదేశమును 'ఎల్లెన్‌బరో' ప్రభు వాక్రమించెను. రంజితసింగు పంజాబును పాలించునంతకాలమును వాని దరిజేరని ఆంగ్లేయులాతని మరణానంతరము, పంజాబును 1846 వ సం॥లో కొంతవరకును, చివరకు 1849 వ సం॥లో పూర్తిగను, అక్రమముగ తమవశము గావించుకొని 'దులీప్‌సింగ' నెడి రాజకుమారుని సింహాసనమునుండి తొలగించిరి. ఆసమయమున నాంగ్లరాజప్రతినిధియై వచ్చిన డాల్హౌసీ ప్రభువు, ఇతరదేశీయ సంస్థానముల నాక్రమించుటకొక నూతనమార్గమును కనిపెట్టెను. మగసంతానములేని రాజులు పెంచుకొన గూడదనియు, అట్టివారి రాజ్యములెల్ల ఆంగ్లేయులకే చెందుననియు నతడు శాసించెను. బలహీనులైన రాజులు సర్వశక్తిమంతుడగు సామ్రాజ్యపుచేతిలోని కీలుబొమ్మలు గదా! ఈశాసనము సాకుగాగొని డాల్హౌసీ, సతారా, నాగపురము, ఝాన్సి మొదలగు రాజ్యములను బ్రిటిషు రాజ్యములో కలుపుకొనెను. దీనికేకాక ఆర్కాటు, అయోధ్య రాష్ట్రముల నవాబు ప్రభువు ఎట్లు కలుపుకొనినదియు యిదివరకే వ్రాసియున్నాము. ఇట్లు 1857 వ సం॥నాటికి ప్లాసీయుద్ధము జరిగి, వంగదేశమున [illegible] నెలకొల్పబడిన నూరు వత్సరములలో, యావద్భారతదేశము తనస్వాతంత్ర్యమును కోల్పోయి కంపెనీవారి వశమయ్యెను.

## కంపెనీ పరిపాలనా ఫలితములు.

ఈస్టిండియా కంపెనీ హిందూదేశమున నొకశతాబ్ద మధికార

మును వహించెను. వీరి పరిపాలనా ఫలితముగ దేశమున నెట్టిమార్పు లుగల్గినదియు నిట క్లుప్తముగ బొందుపఱచు చున్నాము.

i. ఇంతకు పూర్వము భరతవర్షమున మిగుల నభివృద్ధిలో నుండిన పరిశ్రమలు క్రమముగ నశించెను. ఇంతవఱకును హిందూ దేశమున నేయబడిన వస్త్రములు, ఆసియా, యూరోపు ఖండములం దెల్ల వ్యాపించియుండెను. కాని కంపెనీవారు రాజ్యాధికారమును బూనిన వెనుక, ఆంగ్లేయ పరిశ్రమల ప్రోత్సహించుటకై, ఈస్టిండియా కంపెనీవారును, బ్రిటిషు పార్లమెంటువారును గూడ తొలుదొల్తనుం డియు హైందవ పరిశ్రమల భగ్నము గావించుటకే యత్నించిరి. రాజ్యాధికారము గల్గినవారగుట వీరిప్రయత్నములు కొనసాగెను. హిందూ దేశపు చేతిపనులు క్షీణించుటయు, హిందూదేశము బ్రిటిషు పరిశ్రమలకు వలయు ముడిసరకులు సమకూర్చు నవస్థయు సంభవించెను. "కంపెనీవారి వర్తకశాలలందు పనిచేయునట్లు దేశీయులగు చేతిపనివాండ్రను నిర్బంధించిరి. కంపెనీకి సంబంధించిన వ్యాపారస్థులు హిందూదేశమందలి గ్రామములపైనను, సాలీలపైనను సంపూర్ణాధికారము కల్గియుండిరి. ఇక్కడి నూలు వస్త్రములును, పట్టు వస్త్రములును ఇంగ్లాండు ప్రవేశింపకుండునట్లు నపరిమితమగు దిగుమతి సుంకములను విధించిరి. ఆంగ్లవస్తువులు దిగుమతి సుంకము లేకుండగనే భరతవర్షమును ప్రవేశించు చుండెను".

"యూరపుదేశమున యంత్రసహాయమున నడుపబడుమగ్గములు నిర్మాణమగుటచే హిందూదేశపు పరిశ్రమలు పూర్తిగా నశించెను" (రమేశ చంద్రదత్తు.)

ii. వాణిజ్యమువలన భారతదేశమునకు తరలి వచ్చుచుండిన ధనప్రవాహనిరోధమగుటయే గాక, యిక్కడనుండి ఇంగ్లాండునకు నపరిమితమగు

ధనముకొనిపోబడెను. ఈవిషయమును గురించి ధనప్రవాహమను ప్రకరణమున విపులముగ వ్రాయబడును.

iii. పరిశ్రమలు క్షీణించుటచే వ్యవసాయమొక్కటియే భారతీయుల గతియయ్యెను. ఆవ్యవసాయమైనను ఆంగ్లేయుల ప్రోత్సాహమును బడయలేదు. మహమ్మదీయుల కాలమునాటికంటె భూమిపన్నులు వృద్ధియగుటచే వ్యవసాయము క్షీణించెను. ఆయారాష్ట్రముల యందు కంపెనీకి పూర్వమునను, పరమునను నున్న భూమిపన్నులను ఉదాహరణముగ పోల్పవచ్చును.

వంగదేశము :—

| | | | |
|---|---|---|---|
| దేశీయపరిపాలనమున 1764-65 సం॥ ములో | | | |
| | భూమిశిస్తు వసూలు. | రూ | 81,75,533 |
| కంపెనీ పరిపాలనమున 1765-66 | ,, | రూ | 1,47,04,875 |

వృద్ధి నూటికి 75

అయోధ్యరాష్ట్రమున నవాబుచే దత్తముచేయబడిన భాగములు :—

| | | | |
|---|---|---|---|
| నవాబువజీరు పాలనమున 1809 వ సం॥ లో | | | |
| | భూమిశిస్తు వసూలు | రూ | 1,35,23,474 |
| ఆంగ్లపాలనమున 1801 | ,, | రూ | 1,56,19,627 |
| ,, 1802 | ,, | ,, | 1,61,62,786 |
| ,, 1803 | ,, | ,, | 1,68,23,068 |

మూడు సం॥ లలో వృద్ధి నూటికి 25

పంజాబు :—

| | | | |
|---|---|---|---|
| దేశీయపాలనమున 1847-48 వ సం॥ లో | | | |
| | వసూలు | రూ | 82,00,000 |
| ఆంగ్లపాలనమున 1850-51 | ... | రూ | 1,06,00,000 |

మూడు సం॥ లలో వృద్ధి నూటికి 25

ఇట్లే యితర రాష్ట్రములను భూమిశిస్తు అధికముచేయబడినది.

బొంబాయి :—

| | | |
|---|---|---|
| 1817-18 వ సం॥ లో పీష్వాసర్కారు పాలనమున భూమిశిస్తు వసూలు | రూ | 86,80,470 |
| 1818-19 బ్రిటిషుపాలనమున ... | రూ | 1,14,30,410 |
| 1819-20 ... ... ... | రూ | 1,07,81,640 |
| 1820-21 ... ... ... | రూ | 1,81,83,140 |

మూడు సం॥ లో వృద్ధి నూటికి 110.

**iv.** పరిశ్రమలు నశించుటచేతను, ధనము విదేశములకు తరలి పోవుటచేతను, వ్యవసాయమునకు తగిన ప్రోత్సాహము లేకుండుటచే తను, దేశమున, ప్రజల ఆదాయమును ధనమును తగ్గిపోయెను. దారిద్ర్యము హెచ్చెను. హిందూదేశము మున్నెన్నడును కనివిని యుం డని ఘోరమగు కాటకములచే సంక్షోభితమయ్యెను.

1858 వ సం॥ న సిపాయి విప్లవమునణచి ఆంగ్లపార్లమెంటు వారు హిందూదేశపరిపాలనమును, కంపెనీహస్తములనుండి తొలగించి తమవశము జేసికొనిరి. స్వలాభపరతులగు కంపెనీవారిపాలన మం తరించినను, స్వాతంత్ర్యమునకు కల్పతల్లియని పేరుగాంచిన ఇంగ్లీషు పార్ల మెంటు తానే హిందూదేశపు రాజ్యభారమును వహించినను, హిందూ దేశముయొక్క అవస్థ యిసుమంతయు బాగుపడలేదు. కంపెనీ పరిపా లన కాలమున సంభవించిన దేశ దారిద్ర్యమును కాటకముల సంఖ్య యు హెచ్చెనుగాని తగ్గలేదు. దీనికి కారణము, కంపెనీ యవలంబించిన పరిపాలనా విధానమునే పార్లమెంటును అనుకరించెను. ఆంగ్లేయుల, శ్రేయస్సును, అందుముఖ్యముగ లంకాషైరు వర్తకుల లాభమును దృ ష్టిపథమునందుంచికొనియే, ప్రభుత్వము నిర్వహింపబడుచున్నది. మఱియు సైనిక వ్యయమునంతకంతకు పెరుగుచుండె వ్యయమున్నన్ని బాగుటయు

పన్నుల భారము హెచ్చగుటయు తటస్థించుచున్నది. భారతదేశము నుండి విదేశమునకుపోవు ధనము పెంపుజూపుచున్నదికాని కొంచెమైనను తగ్గుటలేదు. కానింగు, లారెన్సు, రిప్పనుమొదలగు రాజప్రతినిధులు శాశ్వతభూమిశిస్తు నిర్ణయమునకై చేసిన ప్రయత్నములు విఫలము లగుటచే వ్యవసాయము యొక్కయు, రైతులయొక్కయు స్థితి బాగు పడకున్నది. కంపెనీ పరిపాలన ముందుకంటె ఎక్కువ దుస్సహమగు క్షామములు సంభవించుచున్నవి. హిందూదేశమునుండి ధనమును గ్రహించుటకు నూతనకృత్రిమమార్గములుగూడ కొన్ని యవలంబితములయ్యెను. ఇక వార్థిక పరిణామము మనదారిద్ర్యమేకదా!



## మూడవ ప్రకరణము.



### వ్యవసాయము ; భూమి పన్ను.

వ్యవసాయము భారతీయుల ప్రధానకృషియై యున్నది. మఱి యు నాంగ్లేయులు భారతవర్షపరిశ్రమల నాశ మొందించినప్పటినుండి యు నీకృషియే ప్రజలకు శరణ్యమై యున్నది. నేడు నూటికి డెబ్బదిఇద్దఱు భారతీయులు కేవలము వ్యవసాయముపై నాధారపడిన వారుగ నున్నారు. వీరితో, వ్యవసాయముపై కొంతవఱకు నా ధారపడువారిసంఖ్యను జేర్చినచో, మొత్తమునసీకృషి నూటికి దొం బదిమంది హిందువులను పోషించుచున్నట్లు తెలుచున్నది. ఈకారణ ముమున భారతదేశ సౌభాగ్యము వ్యవసాయాభివృద్ధిపైన నాధారపడి యుండుట స్పష్టము. వ్యవసాయాభివృద్ధి ప్రభువులొనరించెడు సౌకర్య ములమీదను, వారుగ్రహించెడు భూమిశిస్తుపైనను నాధారపడియుండు ను. పూర్వపు హిందూమహమ్మదీయచక్రవర్తులు భూమిపన్ను నెట్లు గ్రహించినదియు నేటి ఆంగ్లపాలకు లెట్లు గ్రహించుచున్నదియు కనుగొ నుట మనవిధియైయున్నది.

హైందవచక్రవర్తులు:—హైందవరాజులు హిందూధర్మశాస్త్ర ముల ననుసరించి పన్నులను విధించువారు. కాబట్టి యీధర్మశాస్త్రము లను గాంచినచో, రాజులు వ్యవసాయదారుల యాదాయమున నెంత భాగము భూమిపన్నుగ గ్రహించుచుండినదియు తేలగలదు.

గౌతముడు: "వ్యవసాయదారులు తమపంటలో పదవవంతుగా ని, యెనిమిదవవంతుగాని, యారవవంతుగాని, రాజునకు పన్నుక్రింద చెల్లింపవలెను" (గౌతమధర్మసూత్రములు: X ; 24.)

వసిష్ఠుడు : "ధర్మశాస్త్రము ననుసరించి పరిపాలనమొనర్చెడు

రాజు (ప్రజల) ధనములో నారవవంతు గ్రహింపవచ్చును." (వసిష్ఠధర్మ సూత్రములు. 1 ; 42.)

మఱియు: "పశువులసంఖ్యలో నేబదియవభాగమును, బంగారము న నేబదియవభాగమును, పంటలో నెనిమిదవ భాగమునుగాని ఆరవ భాగమునుగాని పన్నెండవ భాగమునుగాని, రాజు గ్రహింపవచ్చును." (మనుధర్మశాస్త్రము VI., 130.)

హైందవచక్రవర్తులకాలమున భూమిపన్ను తేలికగనున్నట్లును, ప్రజలుసౌఖ్యము ననుభవించినట్లును మెగాస్తనీసు ఫాహియాను హ్యూయాన్‌త్సాంగు మొదలగు విదేశయాత్రికులు వ్రాసియున్నారు " ప్రజలపై పన్నులు తేలికగనున్నవి. వారు రాజునకొనర్చు సేవ బహుస్వల్పము. ప్రతివాడును తన సొత్తును శాంతముగా జాగ్రత్త పెట్టుకొనును. తన ధనము నెత్తిమై మొల్లగ భూమిని దున్నుదురు. రాజభూములను వ్యవసాయముచేయువారు ఫలసాయమున నారవభాగము కప్పముక్రింద చెల్లించుచుందురు. వర్తకముకొనర్చు వణిజులు తమవ్యాపారనిర్వహణమునకై వచ్చుచు పోవుచుందురు. వారు రేవుస్థలములకడను, రాజమార్గముల ఘాటీలయొద్దను, కొలది సుంకములను చెల్లింపవలెను. ప్రభుత్వనిర్మాణములలో నవసరమువచ్చినప్పు డెల్లరును సహాయముచేయుట విధియైయున్నది. అట్లుచేసినవారు తామొనర్చిన పనికి తగినప్రతిఫల మొందుదురు " (హ్యూయాన్‌త్సాంగు.)

మహమ్మదీయ పరిపాలకులు:—"భూమిపై జాకట్' లేక దశాంశము: ఏటేట నదులుపొంగిగా గట్లు కెగశ్రాకి ప్రవహించెడి నీటివలనగాని, వర్షాధారమునగాని, సేద్యము చేయబడు భూముల ఫలసాయములో పదవవంతు చెల్లింపవలెను. కాని కలప, వెదుళ్లు, పచ్చిగడ్డి, మొదలగు పదార్థములు గలభూములు దశాంశముచెల్లింప నవసరములేదు. కుడపోతవలనగాని, 'పారసీకచక్రము' మొద

లగు యంత్రసహాయమునగాని, నీటికాల్వల వలనగాని, వాడుదల గల్గియున్న భూమికి, దశాంశములో సగమునుమాత్రమే చెల్లింపవలె ను." (హిదయా I, 44 ; రమేశచంద్రదత్తుగారి 'ఇండియాలోనిక్షామ ములు.' పేజి. 235.)

హిందూదేశమును పరిపాలించిన మహమ్మదీయ చక్రవర్తులు, పై సూత్రమును చాలతక్కువగ నవలంబించిరి. వారు దశాంశముకంటె నెక్కువ పన్నును స్వీకరించిరి. మొగలు చక్రవర్తియగు అక్బరు ఫలసాయమున మూడవవంతు రాజునకు చెల్లింపవలెనని నిర్ణయముచేసె ను. కాని యాచరణమున నాతడును నారవవంతుకంటె యెక్కువ భా గమును వసూలుచేయలేదు. ఏలయన, ఆతని రాజ్యమునందంతటనుగూడ భూములు కొలువబడలేదు. కొలిచిన ప్రదేశములలోనైనను, నేటివలె సరియగుకొలతలుగాని, భూమియొక్క ఫలసాయము విషయమై తీవ్ర పరీక్షలుగాని, లేకుండెను. వ్యవసాయదారులును, జమీందారులును, గ్రామాధికారులును నిర్వచించిన మొత్తములనే, సాధారణముగ ప్రభు త్వము అంగీకరింపుచుండెను. మఱియు నిర్ణయములు ఫలసాయమున మూడవవంతున్నప్పటికిని, వసూలు, నిర్ణయముకంటె చాలతక్కువ గనుండెను. పాలకులు నిర్ణయింపబడిన మొత్తమునంతను కాఠిన్యము తో పూర్తిగ వసూలుచేయువారుకారు. ఈకారణములవలన మహమ్మ దీయ పరిపాలమునగూడ భూమిశిస్తు ఫలసాయమున నాఱవభాగము కంటె యెక్కువగ లేదనియే చెప్పవచ్చును.

ఆంగ్లేయపరిపాలనము :—ఆంగ్లేయులు తొలుదొల్త హైందవ చక్రవర్తులును, నవాబులును నిర్ణయించిన మొత్తములను వసూ లుచేయుట కుద్యమించిరి. కాని వారివలెగాక, యీనూతనపురుషు లు దేశీయ సంప్రదాయము నెరుగకపన్నులను తీవ్రముగ వసూలు చేసె, నిర్ణయమొత్తమునంతను గ్రహింప జూచిరి. ఆంగ్లేయపరిపా

లనా ప్రారంభమున భారతవర్షమున నుద్భవించిన మహాసంక్షోభ మునకు, భూమిశిస్తు నసూలునందు వారుచూపిన కాఠిన్యమును, నిర్దాక్షిణ్యమును ప్రధాన కారణము లైయున్నవి. ఆంగ్లేయులును తమతప్పును గ్రహించి భూమిశిస్తు నిర్ణయములను క్రమముగ తగ్గించిరి. కాని, యిట్లుతగ్గించినప్పటికిని, నేడు పాలకులు న్యాయముగ తాము గ్రహింపవలసిన దానికంటె నెక్కువగనే పన్నును గ్రహించుచున్నట్లు తేలగలదు. భూమిపన్ను, వంగదేశమున ఫలసాయమున నూటికి 5 లేక 6 పాళ్లును, ఉత్తరహిందూస్థానమున, నూటికి 8 మొదలు 10 వఱకును, చెన్నరాజధానియందు, నూటికి 12 మొదలు 31 వఱకును, బొంబాయిరాష్ట్రమున నింతకంటె నెక్కువగను నున్నట్లు రమేశచంద్రదత్తుగారువ్రాయుచున్నారు. మఱియు పూర్వముకంటె ఆంగ్లపరిపాలనమున భూమిశిస్తు తేలికగనున్నదని చెప్ప సాహసించువారీక్రింది విషయములను గుర్తింపవలయును.

(క) భారతవర్షమును పరిపాలించిన హైందవ మహమ్మదీయ చక్రవర్తులకాలమున భూమిపన్నొకటియే గణింపదగిన శిస్తుగనుండెను. నాడు నాటకిపన్నుగాని, స్టాంపుపన్నుగాని, న్యాయముకొరకు చెల్లింపవలసిన పన్నుగాని లేదు. కాని నేటియాంగ్ల పరిపాలనమున ప్రభుత్వము విధించుపన్ను లెంతబహుళములై యున్నవో ప్రజలకెల్లరకు తెలిసినయంశమే.

(చ). ఆంగ్ల పరిపాలనమునకు పూర్వము, దేశమున వసూలైన పన్నుల మొత్తమంతయు నిక్కడనే వ్యయమగుచుండెను. ఒకవేళ ప్రజలనుండి గ్రహింపబడెడు ద్రవ్య మధికముగ నున్నను, నాద్రవ్యము తిరిగియిచ్చుటనే వ్యయమగుట వలన, ప్రజల శ్రేయోభివృద్ధులకు కారణమైయుండెను. ప్రజలిచ్చెడు ద్రవ్యము తిరిగిప్రజలకే సంక్రమించుటవలన, తామిచ్చు ద్రవ్యముయొక్క భారమును జనులు పాటింపకుండిరి.

కాని ప్రస్తుతాంగ్ల ప్రభుత్వమున, ప్రజలు చెల్లించు పన్నుల మొత్తములో కొంతభాగము విదేశమునకు పంపబడుటవలన, జనులు, పన్నుల భారమున నేగాక, ధనప్రవాహ కారణమునగూడ, నానాటికికుంగిపోవుచున్నారు.

(ట). మొగలుల ప్రభుత్వమున, భూమి శిస్తుక్రింద ధనముగాక, పంటలో నొకభాగము గ్రహింపబడుటచే, జనులకు ధరల హెచ్చు తగ్గులవలన గాని, క్షామకాలమున పూర్తియగు రొక్కపుశిస్తు చెల్లింపవలసిన యవసరము వలనగాని, బాధ లేకుండెను. మఱియు నాటి ప్రభుత్వము లంతగ కాఠిన్యమును వహింపకపోవుటచే, రైతులునిర్ణయింపబడిన మొత్తములను పూర్తిగ చెల్లింపకుండినను హానిలేకుండెడిది.

(త). పూర్వకాలమున నొకానొక రాజు క్రూరముగ ప్రవర్తించి ప్రజలను పీడించినచో, ప్రజలాతనిపై తిరుగబడి యాతనిరాజ్యమును నిర్మూలమొనర్చువారు. ఈభయముచే నైనను, పూర్వపురాజులు తమ చర్యలందును, పన్నులను వసూలుచేయుటయందును గూడ, కాఠిన్యము వహింపకుండిరి. కాని, సకలబలోపేతులగు నాంగ్లేయులు ప్రజల హక్కుభుక్తములను పాటింపక తమ యిచ్ఛవచ్చిన చొప్పున పన్నులను వసూలుచేసినను వారి రాజ్యమునకు భంగములేదు.

(ప). పూర్వము వ్యవసాయమునకు తోడుగ ననేకవృత్తులు దేశమున వ్యాపించియుండుటచే, ప్రజలు విశేషముగ నాపరిశ్రమముల పైగూడ నాధార పడియుండెడివారు. కాని, నేడుచేతిపనులు చాల భాగము నశించుటచే, వ్యవసాయమే ముప్పాతిక ప్రజలకు జీవనోపాధి యైయున్నది. అట్టియెడ, భూమిపన్ను అమితముగనున్నచో, ప్రజల కష్టములిట్టివియని చెప్పనలవికాదు. నేడుభూమిపన్నుచెల్లించు నిమిత్తమై రైతులు ధనమునప్పుగొని తెచ్చుటయు, క్రమముగ ఋణగ్రస్తులై తమ యాస్తినిగోల్పోవుటయు, మనగ్రామములలో తరుచుగ చూచుచునే యున్నాము.

ఈకారణముల పరికించి పూర్వపుచక్రవర్తుల రాజ్యములకంటె నేటి యాంగ్లపాలనము, జనుల కందుముఖ్యముగ వ్యవసాయదారులకు ఎక్కుడు క్షేమదాయకమని యెవ్వరుచెప్పగలరు? మఱియు భారతవర్షములోని భూమిపన్నును, అన్యదేశములలోని పన్నులతో పోల్చిచూచి నను నీయభిప్రాయమే కలుగును:

| దేశము, | ఆదాయమున భూమిపన్ను నూటి కెంతభాగము గ్రహింపబడును. |
|---|---|
| బ్రిటను దేశము ... ... ... | 8.3. |
| ఫ్రాంసు ... ... ... | 4.8. |
| జర్మనీ. ... ... ... | 3.0. |
| ఆస్ట్రియా. ... ... ... | 4.9. |
| ఇటలీ. ... ... ... | 7.0. |
| బెల్జియము. ... ... ... | 2.8. |
| హాలండు. ... ... ... | 2.8. |

ఈయంకెలలో, భూమిపన్నేగాక, స్టాంపుపన్నును, లోకలు సెస్సులును చేర్చబడియున్నవి. అయినను, నెచ్చోటగాని, నూటికి 10 కంటె మించియుండలేదు. భారతవర్షమున స్టాంపుపన్నుగాని, లోకలు సెస్సులుగాని, కలుపకుండగనే, భూమిపన్ను ఆదాయములో నూటికి సగటున 15. వ॥ నున్నట్లు తేలుచున్నది. స్వాతంత్ర్యము ననుభవించుచు, సర్వైశ్వర్యములతో తులతూగు బ్రిటన్ దేశముకంటె, హిందూదేశమున ఆదాయములో నెక్కువభాగము భూమిపన్నుగ గ్రహింపబడుటనుజూడ, మన పారతంత్ర్యమే, ఇట్టియవస్థకు కారణమని తోచకమానదు.

భూమిశిస్తు అమితముగ నుండుట యొకటి. అయ్యది క్రమక్రమముగ వృద్ధియగుట మఱొకటి. 1859, వ. సం॥ ము. మొదలు 60

సం॥ లలో, (అనగా 1919 వఱకును) భూమిశిస్తు 21 కోట్లరూప్యముల నుండి, 33 కోట్లరూప్యముల వఱకును (అనగా నూటికి 57 వం॥) పెఱిగినది:

| సం॥ ము. | | | భూమిశిస్తు (నీటిపన్నుగాక). |
|---|---|---|---|
| 1859-60 | ... | ... | రూ 21,00,00,000 లు. |
| 1864-65 | ... | ... | 20,44,00,000, |
| 1869-70 | ... | ... | 21,06,00,000, |
| 1874-75 | ... | ... | 21,29,00,000, |
| 1879-80 | ... | ... | 22,46,00,000. |
| 1884-85 | ... | ... | 21,83,00,000, |
| 1889-90 | ... | ... | 23,98,00,000. |
| 1894-95 | ... | ... | 25,040,0,000. |
| 1899-1900. | ... | ... | 25,80,00,000. |
| 1904-1905. | ... | ... | 28,42,00,000. |
| 1909-1910. | ... | ... | 31,99,00,000,. |
| 1914-15 | ... | ... | 31,83,00,000. |
| 1919-20 | ... | ... | 33,08,00,000. |

పాలకుల పరిపాలనా విధానము ఖండనార్హమని యీయంకెలు చెప్పకయే చెప్పుచున్నవి.

భూమిశిస్తు నిర్ణయము; వివిధపద్ధతులు:—ఆంగ్లేయులు భూమిశిస్తును వసూలుచేయుటకు మూడుపద్ధతుల నవలంబించి యున్నారు: 1 జమీందారీ పద్ధతి. 2 మహల్ వారీ పద్ధతి. 3. రైతు వారీపద్ధతి

1 జమీందారీపద్ధతిని, ఎస్టేటులను గల్గియుండెడు భూస్వాములతో (అనగా జమీందారులతో) భూమిశిస్తు నిర్ణయము కావింపబడును. ఈపద్ధతి కొన్ని ప్రదేశముల శాశ్వతముగను, కొన్ని ప్రదేశ

ముల నశాశ్వతముగను నున్నది. వంగదేశపు జమీందారులు చాలమం దియు, ఉత్తరసర్కారులలోని జమీందారులును శాశ్వతనిర్ణయమును (Permanent settlement) కల్గియున్నారు. వంగదేశములోని నితరజమీందారులు కొద్దిమందియు, అయోధ్యరాష్ట్రములోని తాలూక్దారులును, అశాశ్వతపు నిర్ణయమును (Temporary settlement) కల్గియున్నారు. శాశ్వతపునిర్ణయముగల భూములకు భూమిశిస్తు ఎన్నటికిని హెచ్చింపబడదు. ఆశాశ్వతపునిర్ణయములుగల భూములలో భూమిశిస్తు 20సం॥లకు గాని 30 సం॥లకు గాని యొకపర్యాయము వృద్ధియగుచుండును.

2. మహల్వారీపద్ధతిని, ప్రత్యేకపు వ్యక్తులతోగాక నొకసంఘముతో, నాదు ముఖ్యముగ గ్రామసంఘములతో, మొత్తమున నిర్ణయము కావింపబడును. గ్రామములోని జనులెల్లరును తామేర్పరచుకొనువాటాలప్రకారము పన్నుచెల్లింప వలసియుందురు. తాలూక్దారీభూములుకాని అయోధ్యరాష్ట్ర ప్రదేశములును, పంజాబును, మధ్యపరగణాలును నీపద్ధతిని బాదోబస్తు (లేక సెటిల్మెంటు లేక భూమిశిస్తు నిర్ణయము) చేయబడినవి.

3. రైతువారీ పద్ధతియందు ప్రతివ్యవసాయదారునితోడను నిర్ణయముగావింపబడును. ప్రతిరైతుగూడ భూమిశిస్తు చెల్లించువిషయమున గవర్నమెంటునకు బాధ్యుడై యుండును. రైతువారీపద్ధతి నేప్రదేశములుకాని శాశ్వతముగ నిర్ణయింపబడలేదు. చెన్నరాష్ట్రము బొంబాయి బర్మాదేశములు రైతువారీపద్ధతిని 'బాదోబస్తు' కావింపబడియున్నవి.

భూమిశిస్తునిర్ణయముల చరిత్రము

వంగదేశము: 1757 వ సం॥న నాంగ్లేయులు సురాజదౌలానోడించి వంగరాష్ట్రమున నాధిపత్యము సంపాదించిరి. కాని వంగదేశ పరిపాలనము నవాబుపేరనే జరుగుచుండెను. 1764 వ సం॥మున బక్సారు యుద్ధమునందు అయోధ్యపాలకుడగు 'నవాబువజీరు' ఓడిపోయియుద్ధపు

ఖర్చులకిగ్రింద అలహాబాదు కోరాజిల్లాలను నాంగ్లేయులకు సమర్పిం చి వారితో సంధిచేసికొనెను. ఆంగ్లేయులీజిల్లాలను ఢిల్లీసుల్తానగు రెం డవషాలమునకు లంచముగ నర్పించి 1765 వ సం॥న వంగ విహార ఒరి స్సాదేశములకు 'దివాని' బడసిరి. ఆంగ్లేయులీదేశములంలో భూమిశిస్తు లను వసూలుచేసి పరిపాలనముచేయ మొదలిడినది అప్పటినుండియే.

1765 వ సం॥ము మొదలు 1769 వ సం॥ము వఱకును నవా బుయొక్క యుద్యోగులను బెట్టియే ఈస్టిండియాకంపెనీవారు భూమిశిస్తు లను వసూలుచేసిరి. మహారాజానందకుమారును మహమ్మదు రిజా ఖానును నీయుద్యోగులలో ప్రముఖులు. 1769 వ సం॥న నీవసూలుదా రులపై నాంగ్లతనిఖీదారులు నియమింపబడిరి. ఇట్లు దేశీయోద్యోగు లొకవంకను అన్యదేశీయులొకవంకను పన్నులు వసూలుచేయుటకై క్ర మిసల్పుటవలన, ప్రజలు పలు బాధలకు లోనైరి. పన్నులు తీవ్రతతో డను నిర్దాక్షిణ్యముగను వసూలుచేయబడెను. ఇట్టి కాఠిన్యమునకు ఫ లితముగ 1770 వ సం॥న, ఆంగ్లేయులు పరిపాలనము చేయమొదలిడిన 5 సం॥లలోనే, నొక మహాకాటకము సంభవించెను. 9 మే 1770 వ తారీ ఖున వ్రాయబడిన వర్తకసంఘచోదకుల (directors of the company) లేఖయందిట్లున్నది:

"వెనువెంట సంభవించియున్న కాటకమును ప్రాణవినాశమును దుర్భిక్షమును వర్ణింపనలవికాదు. పూర్వము సమృద్ధితో తులతూగుచుం డిన పూర్ణయరాష్ట్రమునందలి జనులు మూడవవంతు మరణించిరి. ఇత ర ప్రదేశములందలి దుస్థితియు నిట్లేయున్నది."

11 వ సెప్టెంబరున వారిట్లు వ్రాయుచున్నారు: "ప్రజల దా ర్భాగ్యమును పూర్ణముగ వర్ణించుట కష్టతరము. ఇట్టి పరిస్థితులలో ప న్నులు వసూలగుట దుర్ఘటముగనుండెననిన నాశ్చర్యములేదు. అయినను మేముమొదట తలచినంతనష్టము రానందులకు సంతసిల్లుచున్నాము."

12 వ ఫిబ్రవరిని వారిట్లువ్రాసియున్నారు: "తీవ్రమగు క్షామము ను దానివలన నపరిమితమగు ప్రాణనష్టమును, కల్గినప్పటికిని నీసంవత్స రపు భూమిశిస్తునిర్ణయములలో కొంత హెచ్చుచేయబడినది."

10 వ జనవరి. 1772. సం॥ న. నిట్లు వ్రాయుచున్నారు: " సం॥ న ప్రతి రాబడి మొత్తమును మేమాశించినట్లు జయప్రదముగ వ సూలుచేయబడెను." ప్రపంచమున మున్నెన్నడును సంభవించియుండని మహావిపత్తున దగుల్కొని ప్రజలు సంక్షోభము నొందుచుండ భూమి శిస్తు లింతకఠినముగను దయావిహీనముగను వసూలుచేయు కొంతయు రాక్షసకృత్యముగదా!

1770 వ సం॥ న రేగిన మహాక్షామమున వంగదేశస్థులు (మూ డవంతు అనగా) రమారమి యొకకోటిమంది మరణించిరని ప్రభుత్వ మువారి లెక్కలవలననే ధృవమగుచున్నది. 1772 వ సం॥ము. నవంబ రు 3 వ తారీఖునవిట్లు వారన్-హేస్టింగ్సు వ్రాసియున్నాడు: "రాష్ట్రము లో మూడవవంతు ప్రజలు నశించినప్పటికిని, వ్యవసాయాదులు క్షీణిం చినప్పటికిని, 1771 వ సం॥న వసూలైన మొత్తము, 1768 వ సం॥లో వసూలైన దానికంటె నెక్కువగ నుండెను. ........... ఇట్టి మహా సంక్షోభమునకు ఫలితముగ ప్రభుత్వాదాయము తగ్గునని సహజము గ భావింతురు. కాని యదియట్లుతగ్గకుండుటకు కారణము, పూర్వపు రీతినిభూమిశిస్తులను తీవ్రముగ వసూలుచేయుటయే."

ఇంతటితో ప్రజలకష్టములు గట్టెక్కలేదు. "ముందున్నది ముసు ళ్లపండుగ" యనునట్లు కాలము గడచినకొలదిని ప్రజలకష్టములు మ రింత హెచ్చెను. పన్నులను వసూలుచేయుటకు దేశీయులను, ఆంగ్లేయు లను గూడ నియమించుటవలన కంపెనీ ప్రభుత్వమునకు నధికవ్యయ మ గుచున్నందున వారన్ హేస్టింగ్సు 5 సం॥ల కాలమునకు బాదోబస్తు నొకదాని నేర్పాటు చేసెను. ఈకాలము గడచినపిమ్మట వంగదేశపు భూ

మిశిస్తునిర్ణయవిషయమున గొంతచర్చ జరిగెను. భూమిశిస్తుశాశ్వతముగ నిర్ణయించుటకు ఫిలిప్ ఫ్రాన్సిస్ సలహా నిచ్చెను. వారను హేస్టింగ్సును బార్వెలును భూములను వేలము వేసి కవులునకియ్యవలెననియు, కవులుదారుల జీవితాంతముల వఱకును నొకేశిస్తు నేర్పాటుచేసి పట్టాలను వ్రాయించిపుచ్చుకొనవలెననియు ప్రతిపాదించిరి. కాని భూమిశిస్తును శాశ్వతముగ నిర్ణయించుటకు గాని, యనేక సంవత్సరముల వఱకు స్థిరపర్చుటకు గాని, ఆంగ్లదేశములోని కంపెనీడైరెక్టరు లిష్టపడకుండిరి. ఈ కారణముచే నయిదేండ్ల కవుళ్లు రద్దుచేయబడి 'ఏకుసాలు'కవుళ్లు ప్రారంభింపబడెను. 1778, 1779, 1780, యీమూడు సం॥లును ఏఁటేట భూములు వేలము వేసి కంపెనీవారు శిస్తులను వసూలుచేసిరి. 1781 వ సం॥న కొన్నిమార్పులు జరిగినను, ప్రతిసంవత్సరమును, వేలములుమానలేదు. ఇట్టివిధాముమున రెండుముఖ్యలోపములు గలవు:—

ఆంగ్లపరిపాలనాత్పూర్వమీభూములు పాలకుల సంపూర్ణస్వాధీనమున లేవు. తరతరములనుండియు భారతీయులాభూముల ననుభవించుచుండిరి. దేశీయరాజులును, భూస్వాముల హక్కులను పరిగణించి వానితో జోక్యము కల్గించుకొనలేదు. కాని యాంగ్లేయులో! దేశీయ సంప్రదాయమును పాటింపక, తాముచ్చిన కొలది సంవత్సరములలోనే, వ్యవసాయదారుల భూములను తమ యధీనముచేసికొని, యధిక ధనసంపాదనమున కై వానిని బహిరంగముగ వేలము వేయ మొదలిడిరి. ఇంతకంటె దౌష్ట్యమెద్దిగలదు? ద్రవ్యాకర్షణమే ప్రధానోద్దేశముగను, సైన్యబలమే ప్రధానబలముగను, నెంచుకొను రాజులు, ప్రజల కష్టసుఖములను, హక్కుభుక్తములను గణింపకుండుట సహజమే కదా!

మఱియు నీ వేలము వేయు పద్ధతివలన దేశమున నార్థికసంక్షోభము గల్గెను. వేలములలో నెక్కువ ధన మొసగినవారే భూములను పొందు నవకాశము గల్గియుండుటవలన, ధనాఢ్యులును, మోసగాం

పన్నును, నెక్కువ ద్రవ్యమునకు "పాడ" జొచ్చిరి. ఈకారణమున భూములన్నియు వ్యవసాయదారులనుండి ధనవంతులయొక్కయు, మోసగాండ్రయొక్కయు, హస్తగతములయ్యెను. కాని పెద్దయును, వ్యవసాయమున కలవాటుపడియుండక పోవుటవలన ననేక భూములు సేద్యములేక పాడుపడెను. వ్యవసాయము క్షీణించెను. దేశమున దారిద్ర్యము హెచ్చెను. కాని కంపెనీ ప్రభుత్వమునకు మాత్రము, ఆదాయము 26 లక్షల రూపాయలు హెచ్చెను. దారిద్ర్యపీడితమగు వంగరాష్ట్రము వ్యవసాయమును కోల్పోయి యధోగతిపాలగుచుండ, కంపెనీవారు ధనాఢ్యులై విరాజిల్లజొచ్చిరి.

వంగదేశమింకను 12 వత్సరము లిట్టికష్టము ననుభవించెను. తుదకు 1793 వ సం॥ న కారన్వాలీసుప్రభువు శాశ్వతపు బందోబస్తు నేర్పాటుచేసెను. జమీందారులు చెల్లించవలసిన భూమిశిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడెను. భూములు శాశ్వతముగ వారనుభవించు నేర్పాటులు జేయబడెను. అయిన నీభూమి శిస్తు, తక్కువగనుండ లేదు. జమీందారులు ప్రభుత్వమునకు చెల్లించు శిస్తు, రైతులు జమీందారులకు చెల్లించు మక్తాయందు నూటికి తొంబదిపాళ్ళుండెను. కాని యీశిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడుటచే, ప్రజలకంత భారముగ నుండక క్రమక్రమముగ వంగదేశమునకు సౌభాగ్యమును చేకూర్చెను.

ఆంగ్లపరిపాలనకు పూర్వము వంగదేశమున చేయబడిన భూమిశిస్తు నిర్ణయములను, భూమిశిస్తు వసూళ్ళను, తరువాత, ఆంగ్లేయులచే చేయబడిన నిర్ణయములతోడను, వసూళ్ళతోడను, పోల్పనగును.

వంగదేశపు నిర్ణయములు.

| | రూపాయలు. |
|---|---|
| 1582 వ సం॥ న రాజాతోడర్ మాల్ బందోబస్తు ప్రకారము | 1,06,93,152 |
| 1658 ,, సుల్తాన్ షూజా | 1,31,15,907 |

| | | |
|---|---|---|
| 1722 వ సం॥ న జాఫర్ ఖాన్ | | రూ 1,42,88,186 |
| 1728 | ,, సుజాఖాన్ | 1,42,45,561 |

కానియదార్థముగ కంపెనీ పరిపాలనకు పూర్వము దేశీయ ప్రభుత్వముచే వసూలుచేయబడిన ద్రవ్యమీ క్రిందివిధముగ గానవచ్చును.

దేశీయప్రభుత్వమున,

| | | |
|---|---|---|
| 1762-63 వ సం॥ లో చేయుబడినవసూలు. | | రూ 64,56,198 |
| 1763-64 | ,, | 76,18,407 |
| 1764-65 | ,, | 81,75,533 |
| ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వమున | | |
| 1765-66 లో | ,, | 1,47,04,875 |

ఈకడపటి సంవత్సరమున భూమిశిస్తు నిర్ణయమునందు మార్పు లేనప్పటికిని, ఆంగ్లేయులు వసూలు చేయుటను ప్రారంభించినంతమాత్రమున, గత సంవత్సరముకంటె భూమిశిస్తు రమారమి రెండింతలైనట్లు కనుపించుచున్నది. ఇట్లధికమగుటకి నూతనపురుషుల కాఠిన్యమేకదా కారణము. పూర్వపు హిందూరాజులు భూమిశిస్తును మితముగ విధించెడు వారు. మఱియు విధించినదంతయు వసూలుచేసెడివారుకారు. కాని ఆంగ్లేయులు నికరాదాయమున చాలభాగమును భూమిశిస్తుగ విధింతురు. విధించినదంతయు వసూలు చేయుచున్నారు.

ఆంగ్లేయులు వంగరాష్ట్ర పరిపాలనమును ప్రారంభించినప్పటి నుండియు భూమిశిస్తువలన ప్రభుత్వాదాయము వృద్ధియయ్యెను. 1790-91 వ సం॥ లో నీయాదాయము రూ 2,68,00,989 లుండెను. ఈయాదాయము 18. వ శతాబ్దప్రారంభమున జాఫర్ ఖాన్ సుజాఖానులచే నిర్ణయింపబడిన మొత్తములకు రెట్టింపును, 1764-65 వ సం॥ న నవాబు నజీముపక్షమున మహారాజా నందకుమారునిచే వసూలుచేయబడిన దానికంటె మూడు రెట్లును, 1765-66 వ సం॥ ము ఆంగ్లేయులచే

తొలిసారి వసూలు చేయబడిన దానికంటె రెండింతలుగను నున్నది. 1793 వ సం॥ పు శాశ్వతపుభూమిశిస్తు నిర్ణయమున పన్నులు తేలికగ నున్నవనిగాని, ప్రజల భారము తగ్గినదనిగాని, భావించుట గొప్ప పొరబాటని పైసంగతులు తెల్పుచున్నవి. కాని అయ్యది శాశ్వతముగ నిర్ణయింపబడుటచే, భూస్వాములు క్షేత్రాభివృద్ధికి పాల్పడి వ్యవసాయమును పెంపొందించిరి. వ్యవసాయాభివృద్ధియే వంగదేశాభ్యుదయమునకు కారణము.

చెన్నరాజధాని:- చెన్నరాష్ట్రపు భూమిశిస్తునిర్ణయమునకును వంగదేశపు నిర్ణయమునకును చరిత్రయందును విధానమందునుగూడ, చాల భేదముగలదు. వంగదేశమును సంపాదించుటకు పూర్వమే ఆంగ్లేయులు దక్షిణహిందూస్థానమున కొంతయధికారమును సంపాదించిరి. కర్ణాటకసంస్థానాధిపతియైన మహమ్మదాలీ, వారికి మిత్రుడును స్వాధీనుడునై యుండెను. కాని ఆంగ్లేయోద్యోగులు, తమ పలుకుబడిని వర్తకసంఘాభివృద్ధికై వినియోగించి సక్రమ పరిపాలనకు బూనుకొనుటకు మారుగ, స్వోపయోగములకై పాల్పడ జొచ్చిరి. ఇట్టిస్వార్థపరాయణత్వము వంగదేశమునకూడ కొన్నిదినములు విజృంభించెను గాని త్వరలోనణగిపోయెను. కాని కర్ణాటకమునందలి ఆంగ్లేయుల దురాశలకు మేరలేకుండెను. కర్ణాటక నవాబు దుర్నీతియు వీరి దుష్ప్రయత్నముల కనుకూలించెను. నవాబునకు గొప్పగొప్ప మొత్తముల నప్పునిచ్చి వానిపై నపరిమితము లగువడ్డీలగట్టి, దారుణమొత్తముల ప్రతిఫలముగ రాబట్టుచు తమధనాశ నుసఫలపఱుచుకొన జొచ్చిరి. ఎందుకు కొఱగాని ఆంగ్లేయులు హిందూదేశమున నడుగుపెట్టిన పిమ్మట నచిరకాలములో ధనాఢ్యులై తమ మాతృదేశమున నెస్టేటులను, గౌరవపదములను, బిరుదములను, సంపాదించుచుండిరి. ఋణగ్రస్తుడైన ఆర్కాటునవాబు గత్యంతరములేక తృష్ణాపీడితులగు కంపెనీ యుద్యోగులకు తన రాష్ట్రాదాయము నప్ప

గించెను. తమ ఋణములఁ దీర్చుకొను నిమిత్తము ఆంగ్లేయులే, నవాబు పేరిటపన్నుల వసూలుజేయ మొదలిడిరి. 1800 వ సం॥ము వఱకునుగూడ భూమిశిస్తు వసూలునందొక నిర్ణయముగాని, పద్ధతిగాని లేకుండెను. తమ యిచ్చవచ్చినట్లు ప్రవర్తించి ఆంగ్లేయులు పన్నులను వసూలు జేయునప్పుడు కర్ణాటక ప్రజాపీడనము వేఱుగ వర్ణింపవలెనా?

ఉత్తసర్కారులు 1761 వ. సం॥న ఆంగ్లేయులచే జయింపబడినవి. ఈప్రదేశములలో భూమిశిస్తు నిర్ణయముల జేయుటకు 1775 వ. సం॥న నొక 'రహస్యవిచారణ సంఘమే'ర్పడెను. కాని అయ్యది 1778 వ. సం॥ లో రద్దుచేయబడెను. ఈసం॥ ననే ఉత్తరసర్కారు లందలి జమీందారులతో కంపెనీవారు 5 సం॥ల వఱకును భూమిశిస్తు నిర్ణయముల నేర్పాటుజేసికొనిరి. ఈయేర్పాటులలో జమీందారులు చెల్లించవలసిన శిస్తు వారికి వచ్చెడు ఆదాయమున (సగము, అనగా) నూటికి 50 చొప్పున నుండెను. అటుపిమ్మట మూడుసంవత్సరములు ప్రతియేటను నిర్ణయములు గావింపబడెను. 1786 వ. సం॥ న, భూమిశిస్తు నింకను పెంపుచేసి మూడుసంవత్సరములకు మఱియొక బందోబస్తుగావించిరి. తమపరి మూడుసంవత్సరముల కొకటియు, అటుపైని 5 సంవత్సరములకు మఱొకటియు, సెటిల్మెంట్లు చేయబడెను. ఈసెటిల్మెంట్లలో, జమీందారుడు ప్రభుత్వమునకు చెల్లించు మొత్తము, వానికివచ్చు ఆదాయములో మూడింట రెండుపాళ్ళుండునట్లు నిర్ణయింపబడెను. తుదకీ జమీందారీ భూములు 1802-05 సంవత్సరములమధ్య శాశ్వతముగ 'బందోబస్తు' చేయబడెను.

జమీందారీ భూములుగాక, ఉత్తరసర్కారులలో, పట్టణముల ననుసరించి 'హవేలీభూములు' కొన్నిగలవు. వీనిపై వచ్చురాబడిని పూర్వపురాజులు తమసైన్యములకొఱకును, పరిపాలనము కొఱకును, వినియోగించుచుండిరి. ఈకాలముననే (1802-05 మధ్య) హవేలీ

భూములుగూడ 'ముఠాల' క్రింద విభజింపబడి, శాశ్వతపు జమీందారీ భూములుగ వేలము వేయబడెను. ప్రతిముఠాయును సం॥మునకు 1,000 మొదలు 5000 వరహాలువఱకును శిస్తు నొసగవలసియుండెను. చెన్నపట్టణమునకు సమీపముననున్న జాగీరు భూములుగూడ నిట్టిశాశ్వతపు నిర్ణయముల గాంచెను. తదితర ప్రదేశములలో రైతు వారీ పద్ధతి యేర్పాటు చేయబడెను.

'రైతు వారీపద్ధతి:—దక్షిణ హిందూస్థానము ఆంగ్లేయుల వశముకాక మునుపు, గ్రామసంఘములు గ్రామ పరిపాలనమును చక్కగ నిర్వహించుచుండెను. గ్రామసంఘమున 'పటేలు' ముఖ్యాధికారియై, ప్రజలలోని వివాదముల పరిష్కరించుచు, గ్రామమును సంరక్షించుచు, గ్రామవాసు లివ్వవలసినపన్నులను వసూలుచేసి, రాచబొక్కసమున కప్పగించుచుండువాడు. గ్రామ'కరణము' ప్రజలివ్వవలసిన పన్నులను లెక్కవేయువాడు. 'తలియారు' పైయిద్దఱకును సహాయముచేయుచుండెను. పూజారియు, బడిపంతులును, పంచాంగము చెప్పుబ్రాహ్మణుడును, కమ్మరియు, కుమ్మరియు, వడ్రంగియు, చాకలియు, మంగలియు, పసులకాపరియు, వైద్యుడును, వేశ్యాకాంతయు, మొదలుగాగల వారెల్లరును తమధర్మముల నాచరించుచు, గ్రామమునకు సేవయొనర్చెడివారు. గ్రామప్రజ లైకమత్యమునుగల్గి ప్రజాస్వామ్యము ననుభవించువారివలె గన్పట్టుచుండిరి. రాజునకు శిస్తుచెల్లించుబాధ్యత గ్రామసంఘముపైనను గ్రామాధికారిపైనను, నుండెనేగాని, ప్రతిరైతునకును ప్రభుత్వముతోడను, ప్రభుత్వోద్యోగులతోడను సంబంధము లేకుండెను. నేడది తారుమారైనది. ప్రతిరైతును స్వయముగా ప్రభుత్వమునకు శిస్తునుచెల్లించు బాధ్యతనుకల్గియున్నాడు. మధ్యవర్తులుగాని లేక, రైతుస్వయముగా ప్రభుత్వముతో సంబంధము గల్గియుండి, శిస్తు చెల్లించుపద్ధతినే 'రైతువారీ' పద్ధతియందురు. గ్రామసంఘము

యొక్కయు, గ్రామైకమత్యముయొక్కయు వినాశమునకీ పద్ధతియే ముఖ్యకారణమైయున్నది.

'థామసుమన్రో,' యీరైతువారీపద్ధతికి ఆదికారణుడని చెప్పవగును. చెన్నరాష్ట్రమందలి కొలది జమీందార్‌భూములుదక్క, యితరప్రదేశమంతయు నీతని రైతువారీపద్ధతినే బాదోబస్తుగావింపబడినది. 1798 వ. సం॥న, 'బర్మాహాలు'లో భూమిశిస్తునిర్ణయముగావించునప్పు డీతడీ పద్ధతిని తొలుదొల్త నమలులో బెట్టెను. తననిర్ణయములు మితముగానున్నవని, యీతడు ది. 7-10-1800 వ. సం॥న. నొకయుత్తరములో నిట్లువ్రాసియుండెను: "ప్రభుత్వమునకు చెల్లించవలసిన భాగమెప్పుడును రాబడిలో మూడవ వంతునకు మించకుండెను. చాలవఱకైదవవంతుకంటెగాని, నాల్గవవంతుకంటెగాని, యధికముగాకుండెను. కొన్నిప్రదేశములలో, పదవవంతుకంటె కూడతక్కువగనుండెను." భూమిశిస్తులిట్లు మితముగనున్నప్పటికిని, 7 సంవత్సరములలో ప్రభుత్వాదాయము నూటికి 50 చొప్పున 'పౌ. 402,637 లు రూ 40,26,370 లనుండి (పౌ 606,909 లు) రూ. 60,69,090 లకు వృద్ధియయ్యెను. కంపెనీ డైరెక్టరులు, మితనిర్ణయముల కభ్యంతరపెట్టుదురనెడి భయములేకుండినచో, మన్రో యేర్పాటులింకను తేలికగ నుండును. మన్రో పనిచేయుకాలమున కాతని స్నేహితుడొకడు మితనిర్ణయముల చేసినందులకై, యుద్యోగమునుండి తొలగింపబడనుండెను. మఱియు సెటిల్మెంటుయుద్యోగు లెంత యధికముగ భూమిశిస్తులను నిర్ణయించిన, నంతయధికముగ యధికారులమెప్పును బడయుచుండిరి. ఈకారణములవలన సాధారణముగ భూమిశిస్తు లధికముగ నిర్ణయింపబడుచుండుట సహజమేకదా!

వ్యవసాయదారులపై సంపూర్ణాధికారమును, భూమిశిస్తును వృద్ధి చేయుటకు సంపూర్ణావకాశమును నొసగు 'రైతువారీ

పద్ధతియెడల నభిమానముగాని కంపెనీవారు ఇతరజిల్లాలకును దానినే ననువర్తింపజేసిరి. బరమాహాలులో పనిముగిసిన పిమ్మట, థామస్ మన్రో, కన్న డమందును, దత్తమండలములందునుగూడ నీపద్ధతినే నిర్ణయముల గావించెను. 1792 వ సం॥న, నాంగ్లస్వాధీనములైన మలబారుజిల్లాలయందుగూడ, నీపద్ధతియే అవలంబితమయ్యెను. పూర్వ మీజిల్లాలలో కొందఱునాయకులు మధ్యవర్తులుగనుండి, ప్రభుత్వమునకు శిస్తుచెల్లించెడువారు. కాని కంపెనీ యుద్యోగస్థులు, వీరి నొకరొకరినే తొలగించి, రైతులతో ప్రత్యేకపు టేర్పాటులుగావించుకొనిరి. 1799. వ. సం॥న ఆంగ్లేయులవశమైన తంజావూరు రాజ్యమునందలి 'పట్టాదారు' లకును నిట్టిదుర్గతియే ప్రాప్తించెను. స్వదేశ రాజులకాలమున నీ పట్టాదారులు రాజులకును రైతులకును మధ్యవర్తులుగనుండి, రైతులిచ్చుపన్నులను వసూలుజేసి రాచబొక్కసమున కప్పగించెడువారు. కాని ఆంగ్లేయులు వీరినితొలగించి 1804. వ సం॥న రైతువారీపద్ధతి ప్రకారము భూమిశిస్తు నిర్ణయమును గావించిరి.

కర్ణాటకమందలి పాలిగార్లుగూడ నిట్టిగతికే పాల్పడిరి. వీరి నెట్టులైన వెడలగొట్టవలెనను నుద్దేశముతో, ఆంగ్లేయులు మొదటి నిర్ణయముననే, శిస్తును 100 కి 117 చొప్పున హెచ్చుచేసిరి. దీనిపై కొందఱు పాలిగార్లాంగ్లేయులపై తిరుగబడిరిగాని లాభము లేకపోయెను. పరాజితులైన పాలిగార్లకు మరణదండనము విధింపబడెను. వారిభూములను కంపెనీవారు స్వాధీనము చేసికొని రైతువారీ పద్ధతిని బందోబస్తు గావించిరి. దక్షిణ జిల్లాలలోని పదునల్గురు పాలిగార్లతో 1803 వ సం॥న శాశ్వతపు నిర్ణయములు జరిగెను. ఈపాలిగార్లు చెల్లింపవలసిన శిస్తు, వారికివచ్చు ఆదాయమున నూటికి 41 మొదలు 51 వఱకును నుండెను. శివగంగ, రామనాథముజిల్లాలలోగూడ నిట్టియేర్పాటులేగావింపబడెను. పశ్చిమమందలి పాలిగార్లుగూడ 1802 వ సం॥న శాశ్వతపు 'బందో

బస్తునుపొందిరి. కానిచిత్తూరుజిల్లాలోనిపాలిగార్లు ఆంగ్లేయాధికారమును ధిక్కరించినందులకై భూములనుండి తఱుమబడిరి. వారి భూములును రైతువారీ పద్ధతిని బందోబస్తు చేయబడెను.

రైతువారీ పద్ధతియొక్క స్థాపనాచార్యుడగు థామసుమన్రో 1807వ సం॥న యూరపునకేగుచు తనపద్ధతిని పరిపక్వమొందించుటకు రెండుసూచనలను గావించెను. "భూమిశిస్తు నిర్ణయములు శాశ్వతముగ నుండవలెను. 2. తానేర్పఱచిన భూమిశిస్తు ఆదాయమున 100 కి 45 చొ॥ నున్నందున దానిని నాల్గవవంతు తగ్గింపవలెను." కాని మన్రో సూచన లెవరును నవలంబింపలేదు. 1807 వ సం॥ ము మొదలుకొని చెన్నరాజధాని భూమిశిస్తు నిర్ణయవిషయమున ననేకచర్చలు జరిగెను. అప్పుడు గవర్నరుగానున్న విలియంబెంటింగు థామసుమన్రోయొక్క పద్ధతిని సూచనలను నంగీకరించి వానిని బలపఱచెను. చెన్నపురియందలి రెవిన్యూబోర్డువారు గ్రామప్రజాసంఘములతో శాశ్వతపుటేర్పాటులు గావింపవలెనని తీవ్రవాదమునుసల్పి యీపద్ధతియందుగల లాభముల నుద్ఘోషించిరి. కాని వీరిసూచనలామోదమును బడయలేదు. 1820 వ సం॥ న థామసుమన్రో చెన్నపురికి గవర్నరుగా వచ్చినపిమ్మట రాజధానియంతయు రైతువారీ పద్ధతినే బందోబస్తు చేయబడెను. సాధ్యమైనంతవఱకు జమీందారీ భూములనుగూడ వశపఱచుకొని రైతువారీ పద్ధతిని నెలకొల్పి ప్రభుత్వమువారు ఫలసాయమున పన్ను నూటికి 45 మొదలు 50వఱకునునుండునట్లునిర్ణయములగావించిరి. మఱియు 1862వ. సం॥ వఱకునుగూడ నెప్పటికప్పుడు, భూమిశిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడినదనియు, నిక హెచ్చుచేయబడదనియు, ప్రకటింపుచు వచ్చిరి. "ఎంతకాలము రైతు తనకు విధింపబడిన శిస్తుచు చెల్లించునో, అంతకాలమును ప్రభుత్వము, రైతునువానిభూమినుండి వెడలగొట్టజాలదు. అతడు తన భూమిపై పూర్ణమగు హక్కునుగల్గి, శాశ్వతపుటమరక

మువలని సదుపాయములను గల్గియున్నాడ"ని 1855-56 సం॥న ప్రకటింపబడెను. తిరిగి 1857 వ సం॥న "చెన్నరాష్ట్రపు రైతు భూమిశిస్తు హెచ్చకుండ తనభూమిని శాశ్వతముగ ననుభవింపవచ్చున"ని రెవిన్యూ బోర్డువారు చెప్పియున్నారు. 1862 వ సం॥న "రైతువారీపద్ధతికి ప్రధానసూత్రము ప్రభుత్వనిర్ణయము శాశ్వతముగ నేర్పాటు గావింపబడియుండుటయే" యని చెన్నరాష్ట్రప్రభుత్వము ఇండియా ప్రభుత్వమునకు వ్రాసెను. కాని 'శాశ్వతమను'నది వ్రాతలలోనే యంతరించినది. ఇతర వాగ్దానము లెట్లుచెల్లించిరో అట్లే దీనియెడలను ఆంగ్లేయులు ప్రవర్తించిరి. 1858 వ సం॥ మునుండియు భూమిశిస్తు వృద్ధియగుచునేయున్నది. ప్రతి ముప్పదియేండ్లకును బందోబస్తు చేయబడుచున్నది. ప్రతి బందోబస్తునందును భూమిశిస్తు అధికమగుచున్నది. ఇండియా గవర్నమెంటును, పార్లమెంటు స్వాధీనముచేసికొనినప్పుడు 1858 వ సం॥న 'హాలిఫాక్సు' ప్రభువు భూమిశిస్తు, మక్తాయందు సగముండవలెనని తీర్మానించెనుగాని, యాచరణమున మక్తానంతను భూమిశిస్తు మ్రింగుచున్నదని దత్తుమొదలగు సుప్రసిద్ధ హైందవులేగాక 'మేలటు' అను ఇండియా సహాయ కార్యదర్శిగూడ 1875 వ సం॥న నుడివియున్నాడు.

ఉత్తర హిందూస్థానము; అయోధ్య ఆగ్రాసంయుక్త రాష్ట్రములు:-

వంగదేశమువలెనొకసారిగాక, ఉత్తరహిందూస్థానము చెన్నరాజధానివలెనే క్రమక్రమముగ ఆంగ్లేయుల స్వాధీనమయ్యెను. వారణాసి సంస్థానమును 1775వ. సం॥న వారన్ హేస్టింగ్సు ఆక్రమించెను. 1801 వ సం॥న ఆంగ్లేయుల నిర్బంధమువలన నయోధ్య నవాబు తనరాష్ట్రములో సగముభాగమును వారికి దత్తమొనర్చెను. 1802 వ సం॥న ఆగ్రాయును గంగాయమునానదులు ప్రవహించు ప్రదేశములును, మహారాష్ట్రులతోడియుద్ధమున 'లేకుప్రభువు'చే జయింపబడెను. విగతబలుడై తనభాగ్యనిర్ణయమున కాంగ్లేయులను నమ్ముకొనియున్న అయోధ్య నవాబును

డాల్హౌసీప్రభువు వెడలగొట్టి 1856 వ సం॥న నాతని రాజ్యము నాంగ్లే
పాలితముగ జేసెను. ఈప్రదేశములన్నియు క్రమక్రమముగ నాంగ్లేయు
లచే బందోబస్తు గావింపబడెను.

1795 వ సం॥ న కంపెనీవారు వారణాసి సంస్థానమును వంగ
దేశపు జమీందారీపద్ధతి ననుసరించి శాశ్వతముగ భూమిశిస్తు నిర్ణయ
ముగావించిరి.

1801 వ సం॥న నవాబుచే దత్తముచేయబడిన ప్రదేశములను
హెన్రీవెల్లెస్లీ 3 సం॥ లకు బందోబస్తుచేసెను. ఈనిర్ణయములోని
భూమిశిస్తు, పూర్వముదానికంటె రమారమి నాల్గవవంతు వృద్ధియైనట్లు
కనబడుచున్నది.

| | |
|---|---|
| అయోధ్య నవాబుక్రింద నున్నప్పుడు ప్రభుత్వ నిర్ణయము: రూ. | 1,35,23,474 |
| ఆంగ్లేయ పరిపాలనమున మొదటి సం॥ము | 1,56,19,627 |
| ,, రెండవ ,, | 1,61,62,786 |
| ,, మూడవ ,, | 1,68,23,063 |

తాను రచించిన 'పేపర్సు రిలేటింగుటు ఈస్టిండియా అఫేర్సు'
అను గ్రంధములో తనయాజమాన్యమున నిర్ణయింపబడిన భూమిశిస్తులు
సరియగు లెక్కలపై నాధారపడి యుండలేదనియును, వ్యవసాయ
దారులు వీనిని చెల్లించుట కష్టతరమనియును, అయినను ప్రభుత్వాధి
కారమును నిలబెట్టుటకై కలక్టరులు గావించిన యేర్పాటులకు తానా
భ్యంతరము గల్పింపలేదనియును హెన్రీవెల్లెస్లీ వ్రాసియున్నాడు.
ఈతని వాక్యములు యదార్థమును వెల్లడించుచున్నవి. ఈవిదేశప్రభుత్వ
మునకు లాభముచేకూర్చుటకై ప్రభుత్వోద్యోగియెట్టి దుర్నయము
గావించినను నతడు సంరక్షింపబడుచున్నాడు. కాని ప్రజల మేలుకొరకై
ప్రయత్నించినచో నతనిమాటలు చెల్లకుండును. తక్కువ భూమిశిస్తు

నిర్ణయించి ప్రజాభివృద్ధికి తోడ్పడనెంచిన థామసుమన్రో మితుడొక యుద్యోగమునుండి తొలగింపబడ నున్నట్లు చదివియుంటిమిగదా !

1803 వ. సు॥న నొకక్రొత్తచట్టము గావింపబడెను. (1803 వ. సం॥మున, 35. వ చట్టము.) మూడుసంవత్సరములకు గావింపబడిన ప్రథమ నిర్ణయమంత మొందినపిమ్మట, 3 సం॥లకు మఱియొక నిర్ణయమును, నటుపై 4. వత్సరములకు మఱొక నిర్ణయమును, తరువాత శాశ్వతపు బందోబస్తును గావింపవలెనని, యీచట్టమున తీర్మానింపబడెను. 1802,3 సం॥లలో 'లేకుప్రభువు'చే జయింపబడిన రాష్ట్రములందును నీరీతినే భూమిశిస్తులు నిర్ణయింపబడెను. అచ్చోటగూడ, 10 సంవత్సరములలో శాశ్వతపు నిర్ణయము గావించెదమనియే ప్రభుత్వము వాగ్దానమొసగెను. 1805 వ సం॥లో నీవాగ్దానముచు మరల బలపఱచిరి. ఈస్టిండియాకంపెనీ డైరెక్టరుల యనుమతిని బొంది, శాశ్వతభూమిశిస్తునిర్ణయము గావించెదమని, గవర్నమెంటు 1807 వ సం॥లో తిరిగి ప్రకటించెను.

కాని, వాగ్దానములలో నుదహరింపబడిన పదివత్సరములును నంతరించులోపల శాశ్వతనిర్ణయము విషయమై చర్చ ప్రారంభమయ్యెను. భూమిశిస్తునుగూర్చి విచారణసల్పుటకు నియమింపబడిన, 'కాక్సు' (Cox) 'టకరు'(Tucker) అనుయిద్దరు కమీషనర్లును, శాశ్వత నిర్ణయమునకు వ్యతిరేకాభిప్రాయమును ప్రకటించిరి కోల్బ్రూకు (Colebrooke) అనునతడు శాశ్వత భూమిశిస్తు నిర్ణయము జరుగవలెనని పట్టుదలతో వాదింపుచు నీక్రింది కారణముల సూచించెను.

(1) 4. వ. జూలై 1802, 11 వ. జూలై 1805, జూను 1807, తారీఖులను కంపెనీవారు శాశ్వతపు నిర్ణయముగావించెదమని వాగ్దానము చేసియున్నారు. అట్టివాగ్దానమునకు భిన్నముగ ప్రవర్తించి

నచో, కంపెనీ ప్రజలవిశ్వాసమును తప్పక గోల్పోవును.

(2). ప్రభుత్వము భూస్వామిగావున, భూముల ఫలసాయము వృద్ధియైనచో నావృద్ధియందొక పాలును ప్రభుత్వముగూడ పరిగ్రహింపవలెననియు, అందుచే శాశ్వతపు నిర్ణయముజేయ రాదనియు, 'కాక్సు' 'టకరు'గార్లు వాదించుచున్నారు. వారివాదము సరియైనది కాదు. ఏలయన, వంగరాష్ట్రముయొక్క ధనాఢ్యతయు, సుభిక్షమును, అభివృద్ధిని, గాంచిన వారాయభివృద్ధికి కారణము శాశ్వతపు 'బాదోబస్తు'ని గ్రహించి, దానినే ఇతరరాష్ట్రములకు గూడ వర్తింపజేయుటకు ప్రయత్నింపక మానరు. మఱియు నిట్లు శాశ్వతనిర్ణయముల నొనర్చుటవలన ప్రభుత్వమున కెట్టినష్టమును రాజాలదు. శాశ్వతనిర్ణయముగావింపబడినచో, క్రొత్తగ బంజరుభూములను సేద్యము చేయుట వలనగాని,యితరమార్గములగాని,వ్యవసాయము వృద్ధిబొంది, జమీందారులు లాభముపొందినయెడల, నాలాభములో ప్రభుత్వము పాల్గొన వీలుండదని విచారింపబనిలేదు. వ్యవసాయాభివృద్ధివలన జమీందారులు లాభముగాంచినచో, దుర్భిక్షసమయముల ప్రభుత్వమువారి సహాయముగాని, రెవిన్యూను గాని లెక్కరలేకయే, నాపు తమ్ము రక్షించుకొనగల్గుదురు. ఈకారణమువలనగూడ, శాశ్వతనిర్ణయమే వాంఛనీయమైనది,

(3). ఆంగ్ల ప్రభుత్వము భారతీయులకు సాధారణముగ రుచించుట లేదని యనుకొనుచుండుటగలదు. ఇదియే నిక్కమైనచో, వారికి క్షేమకరమగు నీ శాశ్వతపు నిర్ణయము గావింపకుండిన యెడల, హిందూదేశపు ప్రజలు ఆంగ్ల ప్రభుత్వమునుండి మిగుల విముఖులు కాగలరు.

(4). ప్రభుత్వము స్థిరత్వమును, మితమును, న్యాయమును గల్గియుండవలెనని, 'కాక్సు' 'టకరులు' కోరుచున్నారు. కాని,తామిచ్చిన వాగ్దానముల భంగపుచ్చుటవలన ఆంగ్లేయ ప్రభువులు తమ స్థైర్య

మునుచూపజాలరు. ప్రజలను బాధించి యెక్కుడుశిస్తు గ్రహించుట వలన ప్రభుత్వము తన మితభావమును చూపజాలదు. వంశానుక్రమముగ భారతీయు లనుభవించు హక్కులను కూలద్రోయుటవలన, తన న్యాయమును ప్రకటింపబోదు. (కోల్బ్రూకు)

గవర్నరుజనరలుగనుండిన మింటోప్రభువుగూడ శాశ్వతపు నిర్ణయమున కంగీకరించెను. కాని ఆంగ్లదేశమందలి డైరెక్టరులు, ఇదివరలో కంపెనీచేసిన వాగ్దానములను, కోల్బ్రూకు పంపిన సలహాలను, మింటోప్రభువుసూచనలను, వీనినన్నిటిని త్రోసిపుచ్చి శాశ్వత నిర్ణయపు ఏర్పాటులను రద్దుచేసిరి. మింటో మరియొకసారి తన అభిప్రాయమును గాఢముగవ్రాసి పంపెను గాని, లాభము లేకపోయెను. ధనాకర్షణోద్యుక్తులైన డైరెక్టర్లు ప్రజలకు క్షేమకరమగు శాశ్వత నిర్ణయమున కంగీకరింపరైరి. గడువు కాలము గడచిపోయెను. 1813 వ సం॥ము గూడగడచెను. వాగ్దానము లట్లేయుండెను. కాని శాశ్వతపు నిర్ణయము లెన్నటను జరుగలేదు.

1819 వ సం॥ లో డైరెక్టరుల కార్యదర్శియగు హోల్టుమేకంజి (H lt Mack nzi) గ్రామసంఘములతోనిర్ణయము గావింపవచ్చునని సలహానిచ్చెను. ఈనిర్ణయము శాశ్వతముగాదని వేఱుగ జెప్పననవసరము. భూమిపన్ను మితముగ నుండవలెననియు, జమీందారులున్నచోట వారితోడను, లేనిచోట్ల గ్రామసంఘములతోడను నిర్ణయములు గావింపవలెననియు, 1822 వ సం॥ములో ప్రభుత్వమువారు తీర్మానించిరి. 1822 వసం॥పు 7 వ చట్టమున, నిర్ణయము లెట్లు జరుగవలసినది వ్రాయబడియుండెను. ఎస్టేటు తరువాత యెస్టేటును గ్రామము తరువాత గ్రామమును, బందోబస్తు చేయవలెను. జమీందారులు తమకువచ్చునాదాయమున "నూటింట నైనుపాళ్ళు ప్రభుత్వమునకు చెల్లింపవలెను. గ్రామసంఘములకు చెందిన రైతులు మక్తాలో నూటికి 95 పాళ్ళు చెల్లింప

వలెను" ఆచరణమున నిదినూటికి 83 వ౹౹ న నుండెను. కొన్ని సందర్భము.
ల భూమిపన్ను మక్తానంతనుకూడ మిగ్రింగివేసెను. కట్లు చాలకఠినముగ
నుండుటవలన నీవిధానము తనంతటతానే విచ్ఛిన్నమయ్యెను. పన్నులను
పూర్తిగ వసూలు చేయుటకై వసూలుదారులు ప్రజల ననేక కష్టముల
పాలుగావించిరి. కాని నిష్ఫలులైరి. అందుచే 1833 వ సం౹౹ములో మఱి
యొకచట్టముగావించిరి. మక్తాలో నూటికి 83 నుండి 66 వఱకు భూమి
పన్ను తగ్గింపవలెననియు, 30 సం౹౹ల కొక పర్యాయము బందోబస్తు
గావింపవలెననియు తీర్మానించిరి. ఈతీర్మానము ననుసరించి ఉత్తర
హిందూస్థానమున రాబర్టుబర్డు (Robert Bird) అను నతడు 1833-42
సం౹౹ల మధ్య బందోబస్తు గావించెను. నిర్ణయములు కొంతవఱకు తగ్గిం
పబడినను ప్రజలివ్వవలసిన పన్నులింకను నపరిమితముగనే యుండెను.
దుర్భరమగు నీపన్నును చెల్లింపజాలక ఉత్తరహిందూస్థానవాసులు కొం
దఱు తమస్వగ్రామములవీడి, అన్యదేశములకు బోయిరి. విశాల ప్రదే
శములు సేద్యములేక సస్యశూన్యములై పడియుండెను. 185 వ సం౹౹న
జరిగిన బందోబస్తులో భూమిపన్నును మక్తాలో నర్థభాగమునకు
విధిలేక తగ్గించిరి. నేటివఱకును ఉత్తరహిందూస్థానమున నిర్ణయము
లీపద్ధతినే జరుగుచున్నవి.

బొంబాయిరాష్ట్రము: 1817 వ సం౹౹న మహారాష్ట్ర నాయకు
డగు పీష్వాను వెడలనడచి, ఆంగ్లేయులు మహారాష్ట్రదేశము నాక్రమిం
చుకొనిరి. ఈదేశమునకే బొంబాయిరాష్ట్రమను పేరునిచ్చి, మౌంటు
స్టూఅర్టు ఎలిఫిన్స్టను (Mount Stuart Eliphinstone) అనునతని గవ
ర్నరుగా నియమించిరి. 1819 వసం౹౹లో ఎలిఫిన్స్టను గవర్నరుజెనర
లుకువ్రాసిపంపిన "జయింపబడిన పీష్వాలదేశముయొక్క రిపోర్టు"నందు,
(Report on the Territories Conquered from the Peshwas.)
స్వదేశ పరిపాలనమున దేశమెట్లుస క్రమముగ పాలింపబడుచుండినది.

యు వివరముగ తెల్పియుండెను.

పీష్వాలపరిపాలనమున, గ్రామసంఘముల కెక్కుడు ప్రాముఖ్య మివ్వబడి యుండెను. ఈ సంఘములకు నాయకులగు 'పటేలు'లు గ్రామములనుండి భూమిశిస్తును వసూలుచేయుచు ప్రభుత్వమున కప్ప గించుచుండిరి. వీరికి ప్రభుత్వమే వేతనముల నిచ్చుచుండెను. ఆకాల మున దేశమున స్థాపింపబడియున్న 'మిరాశీ' పద్ధతి ననుసరించి, రైతులు ప్రభుత్వమునకు భూమిపన్నును చెల్లించి తమ భూములకు సర్వాధిపులై మనుచుండిరి. ఆంగ్లేయులు మహారాష్ట్రమున తమ ధ్వజ మును నెలకొల్పినపిదప, దేశపరిస్థితులు మార్పునొందెను. మొదటి గవర్నరగు మౌంటు స్టూఆర్టు ఎలిఫిన్‌స్టను, కలెక్టరులకును మామ్లతు దారులకును తన యభిప్రాయమును లేఖలమూలమున దెల్పియుండెను. మధ్యవర్తులకు భూముల నమర్పరాదనియు నితరవిషయములలో దేశీ యవిధానముల ననుకరింపవలెననియు, వ్యవసాయమునుబట్టి భూమి పన్ను నిర్ణయింపవలెననియు, పన్నులు తేలికగ నుండవలెననియు, క్రొత్తపన్నుల విధింపరాదనియు, అక్రమముగాని పాతపన్నులను తీసి వేయకూడదనియు, ముఖ్యముగ, మార్పులు గల్గింపకూడదనియు, నతడు సలహా నిచ్చెను. మఱియు, గ్రామపంచాయతీలు జనులకు చాల సౌక ర్యముగ నుండెననియు, వానిని కొనసాగింపవలెగాని ప్రభుత్వము వానిని నిర్మూలించుటకు యత్నింపరాదనియు, నతడు వ్రాసెను. కాని అతని వ్రాత లెంతవఱకు ఫలించెనో, మున్ముందు 'బిషపుహీబరు' (Bishop Heber) వ్రాతలను బట్టి చదువరులు గ్రహింప గలరు. ఆంగ్లపాలనమున గ్రామపంచాయతీయులకు స్థానము లేదుకదా!

ఎలిఫిన్‌స్టను ఉత్తరములను వ్రాసినపిమ్మట, జిల్లాయధికారు లెల్లరును వారి యనుభవములబట్టి భూమిశిస్తునిర్ణయ విషయమున తమ యభిప్రాయముల నాతనికి దెల్పిరి. దక్కను కమీషనరగు 'ఛా

ప్లీను' (Chaplain) భూమియొక్క ఫలసాయములో మూడవభాగము భూమిశిస్తుగా గ్రహింపవలెనని సూచించెను. కంపెనీడైరెక్టరుల యనుమతిప్రకారము 1824-28 సం॥ లమధ్య 'ప్రింగిల'ను నాతడు ఛాప్లీను యొక్క సూచనప్రకారము బొంబాయిరాష్ట్రమును 'బందోబస్తు' చేసెను. 1824-26 సం॥ లమధ్య భారతదేశమును జూడవచ్చిన బిషపుహీబరు వ్రాతలవలన నాటి భారతదేశావస్థ యెట్టిదో గ్రహింపగలము.

"ఇప్పుడమలులోనున్న భూమిపన్నులవలన దేశీయ వ్యవసాయదారుడుగాని, యూరోపియను వ్యవసాయదారుడుగాని యభివృద్ధి పొందనేరడు. భూమియొక్క ఫలసాయములో సగము ప్రభుత్వము స్వీకరించుచున్నది. శాశ్వత నిర్ణయములేని ప్రతిచోటను నీప్రకారమే భూమిశిస్తు గ్రహింపబడుటచే, భారతీయు లెంతమితస్వభావులైనను, భూములనెంత స్వల్పవ్యయముతో సేద్యము చేసినను, వారికి తత్కాలమున కైన నేమియు మిగులుటలేదు. పురోభివృద్ధికీభూమిశిస్తుఅసలే యాటంకముగదా! సుభిక్షములగు సంవత్సరములగూడ, ప్రజలు దుస్సహమగు కష్టములపాలగుచున్నారు. పంటలు కొద్దిగ పాడైనయెడల, రెవెన్యూలనిలిపి వేయుటకును, ఇతర సహాయార్థమును, ప్రభుత్వము అమిత ధనమును వెచ్చింపవలసి యుండును. కాని ధనమును వెచ్చించినప్పటికిని, పురుషులును, స్త్రీలును, పసిపిల్లలునుగూడ వీథులలో మరణించుచున్నారు. బాటలపై శవములు కుప్పలుకుప్పలుగ పడియుండును. ఫలవంతమైనట్టియు, శాశ్వత నిర్ణయము గల్గినట్టియు, వంగదేశము క్షామము నెఱుగనే యెఱుగదు. ఉత్తర హిందూస్థానమున నున్ననో, కంపెనీచే పాలితమగు రాష్ట్రమందలి వ్యవసాయదారులు, స్వదేశరాజులచేపాలితములగు రాష్ట్రములందలి కృషీవలులకంటె, మొత్తముమీద, కడుబీదవారుగను, నిస్తేజస్కులుగను నున్నారని ప్రభుత్వోద్యోగులే యనుకొనుచుండగా వింటిని. కొన్ని నిదర్శనములబట్టి, నేనును వారితో

నేకీభవించుచున్నాను. ఇట, నిస్సారమగు చెన్నరాష్ట్రమున నీభేదము మఱింత స్పష్టముగ గాననగును. యదార్థమేమన, ఏసంస్థానాధిపతి గాని, మనము గైకొనునంత పన్నును గ్రహించుటలేదు. మన ప్రభుత్వ మెంత క్రమముగ నడుపబడుచున్నప్పటికిని, ప్రజలపై నమితమగు పన్ను లు విధింపబడినట్లును, నానాటికి దేశము నిఱుపేద యగుచున్నట్లును రహస్యముగ నాతో చాలమంది చెప్పియున్నారు. కలెక్టరులు దీని కం గీకరించుట కిష్టపడరు. నిపుణుడగు కలెక్టరెవడైన నప్పుడప్పుడు, ప్రజల పన్ను భారమును తగ్గించి, వ్యవసాయాభివృద్ధివలన తన ప్రభుత్వమున కాదాయము వృద్ధిచేయవచ్చును. కాని సీమయందలి కంపెనీ డైరక్ట రులు ధనమునకు సల్పు దండనమును చెన్నపట్టణము కలకత్తాయాదలి ప్రభుత్వ కార్యదర్శులు వీరి కెప్పటికప్పుడు నివేదించుచుండ, ప్రజల దురవస్థనుగూర్చిన సంగతులదెల్పినచో, తమ కపకీర్తి ఘటించుటయే గాక, కార్యదర్శులు తమ్ము నిందింతురనికూడ భయపడి యీకలెక్టరులు విషాదకరమగు సంగతులను దెల్పుట మానివేయుదురు.

"సామ్రాజ్యమును సుస్థిరముగను, సౌఖ్యావహముగను జేయ వలెనన్నచో, కృషీవలులనుండి తక్కువ ధనమును గ్రహింపవలెననియు నీదేశమున గ్రహించిన ధనము నిక్కడనే వ్యయపఱుపవలెననియు, భారతదేశమున తయారైనవస్తువులను యూరపు దేశమునకు పంపవలె ననియు, దేశ పరిపాలనమున భారతీయుల కెక్కువ పాలొసగవలెనని యు, నేను విశ్వసించుచున్నాను."(బిషపుహీబరు యుత్తరము; రమేశ చంద్రదత్తు)

ఈకాలమున దేశస్థితి నవలోకించిన పలువు రితరులుగూడ ప్రభుత్వ విధానమును తీవ్రముగ ఖండించి యున్నారు. పూర్వము భారతదేశ సౌభాగ్యము దశదిశలమారు మ్రోగెననియు, నాటియైశ్వర్యము యూ రపునగూడ గానరాకుండెననియు, నేడది తారుమారైనదనియు, పూర్వ

రాజుల కాఠిన్యముకంటెగూడ నేటి ప్రభుత్వము కఠినముగ ప్రవర్తించు చున్నదనియు, దేశాభ్యుదయమునకు భంగకరమగు నిట్టివిధానము హిందూమహమ్మదీయ రాజుల కాలమున లేకుండెననియు రైతులు, పాలేర్లకు సమానులుగ జేయబడిరనియు నేడు వ్యవసాయపులాభమునంతను ప్రభుత్వమే గ్రహించుచున్నదనియు, మక్తానంతను గ్రహించు నిట్టి ప్రభుత్వము ఆసియాలోగాని యూరోపునగాని, యెన్నడును ఎచ్చటను లేకుండెననియు, కర్నలుబ్రిగ్సు, తన "భారతదేశమందలి ప్రస్తుత భూమి పన్ను" అను గ్రంథమున వ్రాసెను.

ఇట్టి విధానమువలన గల్గిన ఫలితములను, 1872-73 వ సం॥పు బొంబాయిరాష్ట్ర పరిపాలనముయొక్క రిపోర్టునందు వ్రాసియున్నారు:

"మొదటినుండియు భూమిపన్నును పూర్తిగ వసూలుచేయుట అసాధ్యమయ్యెను. కొన్నిజిల్లాలలో నిర్ణయింపబడిన భూమిశిస్తునం దర్థభాగమైనను వసూలుగాకుండెను. దేశము క్రమక్రమముగ దిగనారజొచ్చెను. ప్రతి సంవత్సరమును పన్ను బాకీలు హెచ్చెను. అందుచే రెమిషను లిచ్చుటకును నిర్ణయములను మార్పుచేయుటకును నెక్కువ యవసరమయ్యెను. సక్రమమా, అక్రమమా, యని యాలోచింపక నిస్సహాయులగు వ్యవసాయదారులనుండి ధనమును రాబట్టుటకు చేయవలసిన ప్రయత్నములన్నియు జేసిరి. వారియాజ్ఞ ననుసరించి పన్నును చెల్లింపజాలనిరైతులను వర్ణనాతీతములైనట్టియు, క్రూరమైనట్టియు, దుస్సహామైనట్టియు, పీడనములకు పాల్పడజేసిరి. పెక్కుమంది తమ గృహములవీడి స్వదేశ సంస్థానములకు పారిపోయిరి. విశాల ప్రదేశములు సేద్యము లేక పాడుపడెను. కొన్నిజిల్లాలలో మూడవభాగము మాత్రము వ్యవసాయము గల్గియుండెను."

ఇట్టి పరిణామములవలన 1835 వ సం॥న తిరిగి నిర్ణయముచేయుటకు ప్రారంభించిరి. "గోల్డుస్మిత్తు" "విన్గేటు" అనువారలు 12సం॥లు

సర్వే చేసి, నిర్ణయములుగావించి, 1847 వ సం॥ ములో ముగించిరి. ఈబందోబస్తు గ్రామసంఘములతో గాక ప్రత్యేకముగ రైతులతో రైతువారీపద్ధతిప్రకారము నేర్పాటులు గావింపబడెను. 30 సంవత్సరములకొకపర్యాయము నూతన నిర్ణయములు జరుగుచుండును. భూమియొక్క ఫలసాయములో నొకభాగముక్రిందగాక భూమియొక్క విలువ ననుసరించి పన్ను విధింపబడును.

పంజాబు దేశము:—

రంజితసింగు పంజాబు దేశమును పరిపాలించుచున్నంతకాలమును నాంగ్లేయులు దానిదరికి జేరకుండిరి. అతని యనంతరము అయుక్తవయస్కుడగు దులీప్‌సింగు గద్దెనెక్కగా, 1846 వ సం॥ న హారింజి ప్రభువుకొంతభాగము నాక్రమించెను. తదనంతరము 1849 వ సం॥న డాల్హౌసీ ప్రభువు దులీప్‌సింగును సింహాసనమునుండి వెడలగొట్టి పంజాబును తన స్వాధీనము చేసికొనెను.

సిక్కుప్రభువులు పంజాబును పాలించునంత కాలమును, వారు ప్రజలకు భూమిపైగల హక్కులను మన్నించియుండిరి. పన్నులభారమెప్పుడైన నెక్కువగ నున్నప్పటికిని, ప్రభువులొకహస్తముతో గైకొన్న దానిని రెండవ హస్తముతో తిరిగి యిచ్చుటవలన ప్రజలు సౌఖ్యము ననుభవించిరి. రంజితసింగు కాలమున భూమిశిస్తు ఫలసాయమున నర్ధభాగముగ నుండునట్లు నిర్ణయింపబడెను. కాని, ఆచరణమునం దయ్యది యైనంట రెండుపాళ్ళకు మించకుండెను. మూడవవంతునకు తగ్గలేదు. భూమిపన్నుక్రింద నాణెములుగాక, ఫలసాయమున నొకభాగము గ్రహింపబడుటచే, సుభిక్షమునను, దుర్భిక్షమునను ప్రజలకు సౌకర్యము గలుగజేసెను.

పంజాబు దేశమునకు మొదటి నూంగ్ల కమీషనరగు, సర్‌జాన్‌లారెన్సు (Sir John Lawrence.) భూమిపన్ను విషయమై

నికల్సన్, (Nicholson) అనునాతనికిట్లువ్రాసెను: "పన్నులను తక్కువగ నిర్ణయింపుము. భూస్వాములకు సరియగు భాగమును నుదారభావముతో వదలివేయుము. వారుతమ వ్యవసాయమును వృద్ధిచేసి, కాటకకాలముతో నిమిత్తములేకుండ సర్వదా భూమిపన్నును చెల్లింతురు." కాని నిర్ణయములు మితముగలేవు. పంజాబుదేశము బ్రిటిషు యధీనమగుటవలన గల్గిన మొదటిఫలితము, అమిత భూమిశిస్తు నిర్ణయమని థార్బర్న్ (Thorburn) అనునొక కమీషనరు నుడివియున్నాడు. (Digby's Prosperous British India; footnote P. 91) ఆంగ్లపరిపాలనమునకు పూర్వాపరముల భూమిశిస్తెంత వసూలైనదో గుర్తించిన యెడల నాంగ్లపరిపాలనాకాఠిన్యము గోచరింపకమానదు.

| | | | |
|---|---|---|---|
| సిక్కుప్రభువుల పాలనమున: | 1847. వ. సం॥న భూమిశిస్తు వసూలు: | | రూ 82,00,000, లు |
| ఆంగ్లేయులు యాక్రమించిన మూడుసం॥లలో | 1850-51 | ,, | రూ 1,06,00,000, |
| | 1856-57 | ,, | రూ 1,45.20,000. |
| | 1857-58 | ,, | రూ 1,45,20,000, |

1852 వ సం॥లో వ్యవసాయదారులు భూమిశిస్తును, పంటరూపమున చెల్లించుట కనుజ్ఞవేడిరిగాని, లాభములేకపోయెను. 1860 వ సం॥న ప్రారంభమైన 'బందోబస్తు'లో ఫలసాయమున నారవవంతు భూమిశిస్తుగ నిర్ణయింపబడెను. పిమ్మట 1871 వ సం॥ పు లాండురెవిన్యూఆక్టు (Land Revenue act)ను బట్టి, మక్తాలో నర్ధభాగమును శిస్తుగ చెల్లించునట్లు తీర్మానింపబడెను. మఱియు 20 వత్సరముల కొకపర్యాయము నిర్ణయములు మారుచుండును. పంజాబుదేశమున నమలులోనున్న నిర్ణయపద్ధతి 'రైతువార్' గాని 'జమీందారీ'గాని కాక 'గ్రామపద్ధతి' యైయున్నది. గ్రామ మొత్తముపై పన్నువిధింపబడి, కొంతమంది భూస్వాముల కదియమర్పబడును. వీరుగ్రామము చెల్లించవలసినపన్నుకు బాధ్యులైయుందురు.—

మధ్యపరగణాలు:

ఈరాష్ట్రమందలి భూమిశిస్తు నిర్ణయ చరిత్ర మితర రాష్ట్రముల చరిత్రను బోలియున్నది. ఈదేశము నాంగ్లేయులు వశముచేసకొనిన వెనువెంటనే భూమిశిస్తుల నపరిమితముగ హెచ్చించిరి. హూషింగా బాదు, దియోని, జల్లాలందు, మహారాష్ట్ర ప్రభుత్వమున మొత్తము భూమిశిస్తు రూ 22,770 లుండెను. కాని 1821 వ సం॥న మేజరు మేక్ఫరుసన్ చేసిన నిర్ణయము ననుసరించి, భూమిశిస్తు రూ 1,03,590 లయ్యెను. 1825 వ సం॥ నాటికి రూ 1,38,770 లయ్యెను. కొద్ది సం॥లలో భూమిశిస్తు 6 రెట్లుహెచ్చెను. ఈనిర్ణయ మపరిమితముగ నుండుటచే, నిర్ణయింపబడిన మొత్తములు పూర్తిగ వసూలుగాకుండెను. ప్రభుత్వము రెమిషనుల నిచ్చెరుగాని, యవిబహుస్వల్పము. "నయము నగాని, భయమునగాని, భూమిశిస్తును పూర్తిగ వసూలుచేయుటకు తీవ్ర ప్రయత్నములనొనర్చిరి. నాడు వసూలుదారులొనరించిన క్రౌర్య ములను దౌష్ట్యములను జమీందారులు చాలకాలమువఱకు మరచ లేదు." చివరకు 1836 వ సం॥న భూమిశిస్తురు రూ 61,920లకు తగ్గించిరి. 20 సం॥ల కొకసారి నూతననిర్ణయముల జరుగునట్లు నిశ్చయింపబడెను.

1861 వ సం॥లో, సాగరుమండలమున, భూమిశిస్తు నిర్ణయము గావించు సందర్భమున, 'మేక్లియర్' అనునతడిట్లు వ్రాసెను: "గవర్న మెంటు" నిర్ణయము లపరిమితముగనుండుటచే ప్రజలను కడువేధించు చున్నవి. వారి యుత్సాహ మంతరించినది. పురోభివృద్ధికై యెట్టిప్రయ త్నములును జరుగుటలేదు. చాల గ్రామములలో, సంపూర్ణముగను మక్తాకంటెగూడ నెక్కువ మొత్తములను గవర్నమెంటు గ్రహించు చున్నదను విషయమై నేను పరీక్షించెనునర్చి, రూఢి పరచుకొనియుంటిని

"ప్రజలు తమ హృదయబలమును గోల్పోయిరి. తరతరములనుండి యనుభవించుచు వచ్చిన జమీందారీ భూములను, నేడు వారే షరతులపైననుగూడ గ్రహించి, సేద్యమొనర్చుకొనుట కిష్టపడకున్నారు.

"ఈప్రదేశములను పరిశోధించుటవలన నాకుగల్గిన యభిప్రాయమేమన: ప్రజలు విశేషముగ మరణించిరి. దేశము నిర్మానుష్యమైనట్లగపడును. జంతువుల జాడలుగాని, మనుష్యనివాస చిహ్నములుగాని కన్పడవు."

ఈదుస్థితిని ప్రభుత్వము చివరకు గ్రహించెను. 1863-67 సం॥లమధ్య క్రొత్తనిర్ణయము కావింపబడెను. మక్తాలో అర్ధభాగము భూమిశిస్తుగానుండునట్లు నిర్ణయింపబడెను. కాని యాచరణ మందంతకంటె యెక్కుడుభాగమునే ప్రభుత్వము స్వీకరింపుచున్నది.

శాశ్వతనిర్ణయము:—భూమిశిస్తును శాశ్వతముగ నిర్ణయించుటవలన వ్యవసాయదారులకు గల్గెడు మేలింతయని చెప్పజాలము. భూమిశిస్తునకొక 'హద్దు' యేర్పడినచో, వ్యవసాయదారులు తమ యభివృద్ధికై వ్యవసాయమును విస్తారముగ వృద్ధిచేయుదురు. శాశ్వత నిర్ణయము కావింపబడినప్పటినుండియు వంగదేశము తీవ్రములగుకాటకములనుగాని, వానివలని ప్రజానష్టముగాని, యెరుగదని రమేశచంద్రదత్తుగారు వ్రాసియున్నారు. ఇట్టి యభిప్రాయమునే పలువు రాంగ్లేయులుగూడ దెల్పియున్నారు. హిందూదేశములో 40 సంవత్సరములు పనిచేసి, వంగదేశమును శాశ్వత నిర్ణయమునకు పూర్వమును, పరమునసుగూడ నెఱిగియుండిన కోల్బ్రూకు, వంగదేశాభ్యుదయమునకు కారణముశాశ్వతనిర్ణయమని 1808 వ సం॥ న తెల్పియున్నాడు. అధికసారవంతమైనదియు, శాశ్వత నిర్ణయమును కల్గినట్టిదియునగు వంగదేశమున క్షామములేదుండెనని బిషపుహీబరు వ్రాసియున్నాడు. దేశాభివృద్ధికి శాశ్వత నిర్ణయము

చాలతోడ్పడునని యెంచిరే, సర్ థామస్‌మన్రో విలియంబెంటింగులు, ఇతర రాష్ట్రములగూడ శాశ్వత నిర్ణయముల గావించుటకే యత్నించిరి. ఉత్తరహిందూస్థానమున శాశ్వత నిర్ణయము కావింపబడునని వెల్లిస్లీ ప్రభువు 1803 వ సం॥ములోను, 1805 వ సం॥ములోను ప్రకటించెను. 1813 వ సం॥ లో మింటోప్రభువును, అతని వెనుక వచ్చిన హేస్టింగ్సు ప్రభువునుగూడ శాశ్వతనిర్ణయమునకే సలహానిచ్చిరి. కాని స్వప్రయోజనమే ప్రధానముగా నెంచుకొనుటచే కంపెనీప్రభుత్వము శాశ్వతనిర్ణయమున కొల్లకుండెను

ప్రభుత్వము పార్లమెంటు స్వాధీనమైనపిమ్మటగూడ, శాశ్వత నిర్ణయమునకై ప్రయత్నములు జరుగకపోలేదు. 1860 వ సం॥ లో కానింగు ప్రభువును, నాడు ఇండియా కార్యదర్శిగా నుండిన సర్ ఛార్లస్ వుడ్‌ను, హిందూదేశమందంతటను శాశ్వతపునిర్ణయముస్థాపించుటకుయత్నించిరి. పిమ్మట సర్ జానులారెన్సును ప్రభుత్వ కార్యదర్శియగు నార్త్ కోటును భూమిశిస్తును శాశ్వతముగ నేర్పరచుటవలన గల్గులాభములను గుర్తించిరి. రిప్పను ప్రభువుగూడ ఫలసాయముయొక్క ధరలు హెచ్చు వృద్ధియగుటనుబట్టిగాని, యితరములగు నేకారణములవలనను భూమిశిస్తు హెచ్చింపరాదని సూచించెను. 1900 వ సం॥ లో రమేశచంద్రదత్తు శాశ్వతనిర్ణయముకొరకై తీవ్రవాదము సల్పుచు, కర్జను ప్రభువున కుత్తరములవ్రాసెను. కాని ప్రభుత్వము పార్లమెంటు వశమైనను ప్రభుత్వముయొక్క దృష్టి ఆంగ్లదేశ లాభమునుండి భారతదేశముయొక్క శ్రేయస్సుపై మరలకుండుటచే, నీసూచనలును ముఖ్యప్రయత్నములును గూడ వ్యర్థమయ్యెను. తుదకు 1902 వ సం॥న (కర్జను) ప్రభుత్వము గావించిన తీర్మానమునుబట్టి శాశ్వతనిర్ణయపు టేర్పాటులు తొలగద్రోయబడెను.

నేడు హిందూదేశమొత్తమున సేద్యమగుచున్న భూమిలో, రమారమి, మూడవభాగము శాశ్వతపునిర్ణయము కలిగియున్నది. ఇతర ప్రదేశములన్నియు 20 సం॥ములకుగాని, 30 సం॥లకుగాని యొక పర్యాయము తిరిగి సర్వేచేయబడి నూతన నిర్ణయములను గాంచును. ఈప్రదేశములయందు మక్తాలో భూమిశిస్తు నూటికి 50 చొప్పున నుండు నట్లు నిర్ణయింపబడునని చెప్పుదురుగాని, యథార్థమున నింతకంటె యధికముగనే ప్రభుత్వము స్వీకరించుచున్నట్లు పలువురు తెల్పియున్నారు. మఱియు గత 60 సంవత్సరములలోను భూమిశిస్తు యెట్లు నూటికి 57 వం॥ 21 కోట్లనుండి 33 కోట్ల రూప్యములవఱకు వృద్ధియైనదియు యిదివఱకే వ్రాసియున్నాము. ఇట్టి భూమిశిస్తు విధానమున కృషీవలు లెట్టిబీదస్థితిననుభవించుచున్నారో యీఘోరక్షామములలో జూడగలము.

---

# 4 వ ప్రకరణము.



## వస్త్రపరిశ్రమ.

### I

పరిశ్రమయొక్క ప్రాచీనత:—ప్రపంచమునందు ప్రతి మానవు నకు తినుటకు తిండియు, ధరించుటకు వస్త్రములును ముఖ్యావసర ములు. ఈరెంటికి సంబంధించిన పరిశ్రమలు వ్యవసాయమును వస్త్ర నిర్మాణమునై యున్నవి. మానవసృష్ట్యనంతరము చిరకాలములోనే, యీరెండు పరిశ్రమలు జనించి యుండవలెను. వ్యవసాయము మిగుల ప్రాచీనమై యుండెనని చెప్పవచ్చును. తరువాత నూలువడుకుట, బట్ట లునేయుట, యను నీకళలు ప్రాపంచిక చరిత్రయందు మొదట గను గొనబడినవై యభివృద్ధి గాంచెను.

ఈ పరిశ్రమలకు హిందూదేశమే పుట్టినిల్లు. క్రీస్తు జన్మించుట కనేక శతాబ్దములు పూర్వము, ఐరోపా యమెరికాఖండములందు మను ష్యులు జంతువులవలె సంచరించుకాలమున, వస్త్రపరిశ్రమ భారతవర్ష మున నుచ్ఛదశయందుండెను. భారతీయులు క్రీస్తు శకారంభమున నర బ్బులు, యవనులు, (గ్రీకులు,) రోమనులు మొదలగువారితో వస్త్ర వ్యాపారము సలుపుచుండిరి. కొంతకాలమునకు వారుకూడ నీపరిశ్రమ నభ్యసించి ప్రవీణులైరి. కాలక్రమమున నీకళలు పాశ్చాత్యదేశములను గూడ వ్యాపించెను. పదియవ శతాబ్దమున "మూరు"లీ, పరిశ్రమను 'స్పెయిన్' దేశమున నెలకొల్పిరి. 14 వ శతాబ్దమునకిది యిటలీ లోనికి వ్యాపించెను. ఇంతకు పూర్వమే, మహమ్మదీయు లాఫ్రికాఖం డమున నీపరిశ్రమను స్థాపించిరి. 13 వ శతాబ్దములో నిట్టు తూర్పు దిక్కున చీనా, జపానుదేశములకు గూడ వ్యాపించెను.

భరతవర్షమున జననమొంది పూర్వ పశ్చిమదిశలకు వ్యాపించిన

ఈవస్త్రపరిశ్రమ ఈదేశమున నెట్లుఅభివృద్ధి పొందినది మనశ్రుతిస్మృతి పురాణేతిహాసాదులేగాక, పాశ్చాత్య గ్రంథములు సహితము విశద పఱచుచున్నవి.

మిక్కిలి సనాతనములగు వేదములం దనేకస్థలముల ప్రత్తిని గూర్చియు, నూలునుగూర్చియు, వస్త్రముల గూర్చియు చెప్పబడియు న్నది. ఒకతావున యజ్ఞము నూలుదారముతో పోల్చబడినది.

"తన్తుం తనుష్వ పూర్వ్యమ్। ఋ ౧-౧౪౨-౧

తన్తుం విస్తృతం యజ్ఞం తనుష్వ విస్తారయ। సాయణః"

యజ్ఞకర్మ నాచరించుట అవిచ్ఛిన్నమగు దారమువలె ఋషి పారంపర్యమైనది. ("దీర్ఘతన్తుః" ఋ ౧౦-౬౯-౭) అథర్వవేదము నందు ఋగ్వేదఋక్కులు 'పడుగు'గను, యజ్ఞసూత్రములు 'పేక'గను వర్ణింపబడి యున్నవి.

"'నాహం తన్తుం నవిజానామ్యోతుమ్ ।

నయం వయన్తి సమరేతమానాః॥ ఋ ౬-౯-౨.

తన్తవః పటస్య ప్రాగాయతాని సూత్రాణి । ఓతవస్తిరశ్చీనాని సూత్రాణి । ఉభయసాధ్యః పటో యజ్ఞలక్షణో యం దేవయజనే ఋత్విజో వయన్తి తన్తూనో తూశ్చ సంతన్వన్తి। సాయణః।"

ఆకాలమున నేత పరిశ్రమయందు స్త్రీలు ప్రత్యేకముగ నైపు ణ్యము గల్గియున్నట్లు కన్పించుచున్నది. వరుడు, వివాహమైన మొదటి దివసమున, వధువుచే తయారుచేయబడిన వస్త్రముధరించు నాచార ముండినట్లు అథర్వవేదమున వర్ణింపబడినది. ఇతర స్మృతులయందుగూడ, వస్త్రపరిశ్రమకు సంబంధించిన ఉదాహరణములు కలవు. మనుస్మృతి యందీవిషయమై రెండు నిబంధనలున్నవి. నేతవాండ్రు నూలును సరి చేయునపుడు గంజిపెట్టుచుండుగాన, 10 పలముల దారమునకు, 11 పల ముల బట్ట నప్పజెప్పవలెననియు, నట్లియ్యనిచో, 10 పణములు

ఖండముగ విధింపబడుననియు ఒక నిబంధన చెప్పుచున్నది. ప్రత్తిని దొంగిలించినందుకు, ప్రాయశ్చిత్తముగ పాలుమాత్రము పుచ్చుకొనుచు, 3 రోజులుపవాసము చేయవలెనని మఱియొకచోట గలదు. (From young India)

బౌద్ధగ్రంథములందు వ్రాయబడిన యీక్రిందికథను చదివినచో, బౌద్ధయుగమున వస్త్రపరిశ్రమ ఎంతగౌరవమగు వృత్తిగ పరిగణింపబడుచుండెనో స్పష్టమగును. బుద్ధుడు భర్గదేశమునందలి 'శిశుమారగిరి 'యందు నివసించుచున్నపుడు, ఆగ్రామమున 'నకులపిత'యను నాతడువ్యాధిగ్రస్తుడై మరణశయ్యయందుండి, తన భావికుటుంబస్థితినిగూర్చి విచారించుచుండగా, అతని భార్యయగు 'నకులమాత' యిట్లుచెప్పెను. " ఈప్రాపంచిక విషయములయెడ కాంక్షగల్గి మరణించుటవలన ముక్తి గలుగనేరదు. నకులమాత బిడ్డలనెట్లు పోషించుకొనగలదు, కుటుంబము నెట్లుభరించునని మీరు విచారము నొందకుడు. నూలు వడుకుటయు, ఉన్ని దారముతీయుటయు, నాకు తెలియును. వీనివలన ధనమార్జించి బిడ్డలను పోషింపగలను." (From Young India) వస్త్రపరిశ్రమ కడు నుచ్ఛదశయందుండెనని తెల్పుటకింకను ననేకతార్కాణములు ప్రాచీన వాఙ్మయమునుండి చూపవచ్చును.

ఇక పాశ్చాత్య చరిత్రకారులెట్టి యభిప్రాయమొసంగిరో చూతము. పశ్చిమ హిందూదేశమునుండి గోధుమలు, బియ్యము, చక్కెర, నూలుబట్టలు, పీతాంబరములు, నీలిమందువిదేశముల కెగుమతి చేయబడుచుండెనని క్రీస్తుశకము 1 వ శతాబ్దమున "పెరిప్లస్ ఆఫ్ ఎరిత్రియన్ సీ" (Periplus of Erithrian Sea.) అనుగ్రంథమున వ్రాయబడియున్నది. ఒక రకము మస్లినులను గ్రీసుదేశమున "సిందన్"అని పిలుచుచుండిరి. వానికాపేరు సింధునదినుండి వచ్చియుండవలెను. బాబిలోనియాదేశమున ప్రాచీనమగు నొకబట్టలజాబితా యందు హిందూ

దేశపు మస్లినులు "సింధు"అను నామముతో కన్పించుచున్నవి. డక్కా మస్లినులను గ్రీకులు 'గ్యాంజిటికా'యని పిలుచుచుండిరి. గంగానదీ తీరమున తయారు చేయబడుటచే దానికాపేరు వచ్చియుండును. రోమను సామ్రాజ్యమునగూడ హైందవ వస్త్రములధికముగా వాడుచుండిరి. అచ్చటి స్త్రీలు మస్లినులను, పట్టుబట్టలను, నమితానందముతో ధరించుచుండిరి. పీతాంబరము లెత్తునకెత్తు బంగార మిచ్చికొనుచుండిరి. "మృదుతరములగు డక్కామస్లినులును, సుందరములగు కాశ్మీరశాలువలును, ఢిల్లీనగరపు పట్టుబట్టలును, రోమను చక్రవర్తుల (సీజరుల) దర్బారుల నలంకరించియుండెను." వస్త్రములేగాక, ప్రత్తియు, పాశ్చాత్యులకు చాల నపురూపముగనుండెను. ప్రత్తి, యున్ననుబోలు నొక విధమగు వస్తువనియు, గొఱ్ఱెబొచ్చుకంటె నందముగనుండుననియు, హిందూదేశమున నమితముగ పండుననియు, హెరొడోటస్ (Herodotus) అను చరిత్రకారుడు వ్రాసియున్నాడు.

మెగాస్తనీసు మొదలగు గ్రీసుదేశస్థులును ఫాహియాన్, హ్యూన్‌త్సాంగు మొదలగు చీనాదేశపు బౌద్ధయాత్రికులును, హిందూదేశపుటార్థికౌన్నత్యమును గూర్చియు, పరిశ్రమల బాహుళ్యమును గూర్చియు వ్రాసియున్నారు. హిందూదేశమున మిక్కిలి సుందరములగు వస్త్రములు నేయబడుననియు, నొక యుంగరములోనుండి దూర్చుటకు వీలగునంత సన్నవస్త్రములను నేయగల నేర్పరులుగూడ నిచ్చట గలరనియు, 9 వ శతాబ్దమునందీ దేశమును జూడవచ్చిన అరేబియాబాటసారులు వ్రాసియున్నారు. నేతనేయుటయే, భారతదేశపు ముఖ్యపరిశ్రమయనియు, కోరమాండలు తీరమున నందుముఖ్యముగ మచిలీపట్టణమున ప్రపంచమున నెచ్చటను గానరాని సన్నవస్త్రములు తయారగుచుండెననియు 'మార్కొపోలో'యను మార్గగామి, 13 వ శతాబ్దమున ప్రశంసించియుండెను. "వార్తిమ" (Varthema) "రాల్ఫ్‌ఫిచ్"

(Ralph Fitch) యను నాంగ్లవర్తకులు 16 వ శతాబ్దమున బంగాళా దేశమును దర్శించి, వస్త్రపరిశ్రమయందా దేశ మగ్రస్థానము వహించె నని వ్రాసియున్నారు.

మొగలాయి చక్రవర్తుల కాలమున నీపరిశ్రమాభివృద్ధి మిన్ను ముట్టెనని చెప్పవచ్చును. కర్ణాటక తీరమునను, వంగదేశమునను, నేగ్రా మమున జూచినను నేతపరిశ్రమయందు శ్రద్ధలేని స్త్రీపురుషులు లేకుండిరి. పల్నాటిసీమయందీ పరిశ్రమయెంత బహుళముగ వ్యాపించి యుండెనో శ్రీనాథరచితమగు నీక్రింది పద్యభాగమువలన స్పష్ట మగును.

"రసికుడు పోవడు పల్నా
డెసగంగారంభయైన యేకులవడకున్"

చాలపరగణాలయందీపరిశ్రమయే ముఖ్యవృత్తిగ నుండెను. ఇంతయేల! హిందూస్థానమందు సగముమంది కీపరిశ్రమ జీవనోపాధి గనుండెను. ఆహారపదార్థములనువలె ప్రత్తిని ప్రతిచోటను పండించు చుండిరి. వంగదేశము మస్లినులకు ప్రసిద్ధిగాంచెను. తూర్పు సముద్ర తీరము క్యాలికో గుడ్డలకు పేరుపొందెను. అందు మచిలీపట్టణము సొగ సైన జేబురుమాళ్ళకును చెన్నపట్టణము రవికెలగుడ్డలకును ప్రఖ్యాతి వడసెను. సూరతు ముతకవస్త్రములకును, బాటలీపుత్రము నాణెము లగుదుప్పటీలకును బ్రసిద్ధిజెందెను.

కళానైపుణ్యము:—నూలువడకుట, బట్టలునేయుట యనువా నినొక వృత్తిగమాత్రమే పరిగణింపక, భారతీయులు వానినొక కళగ భావించి, తమహస్తనైపుణ్యమును బ్రదర్శించిరి. వస్త్రములలోనెల్ల డక్కామస్లినులు మిగులనాణెముగలవై, యెక్కువసన్నముగను నాజూ కుగను నుండెను. 20 గజములపొడవును, 1 గజమువెడల్పును గల వస్త్రము వ్రేలియుంగరములోనుండి దూర్పబడునంత సన్నముగనుండెను.

200 సం॥లకు పూర్వము, 15 గజములుపొడవును, 1 గజమువెడల్పును గల్గిన మస్లినుగుడ్డయొక్క తూనిక నాలుగుతులములు మాత్రమేయుం డెడిది. హైందవవస్త్ర పారిశ్రామికుల నేర్పరితన మెట్టిదియో, ఈక్రింది యుదాహరణములనుబట్టి యూహింపవచ్చును.

కొన్నివస్త్రములు మిగుల సన్నముగనుండుటచే, వానిని ధరించి నప్పుడు శరీరము కన్పించుచుండినందున, గౌతమ బుద్ధుడట్టి సన్నివస్త్ర ముల ధరింపగూడదని బోధించెను.

ఔరంగజేబు కూతురు, మస్లినుచీరను ఏడుపొరలు ధరించినప్ప టికిని, వస్త్రవిహీనముగనున్నట్లు గన్పట్టినందులకై, ఆమెను తండ్రిమం దలించెనని వ్రాయబడియున్నది. (Quoted in "Hindu Superiority")

హిందూదేశమున రాయబారిగనుండిన "మహమ్మద్ ఆలీ బేగ్" పారసీకదేశమునకు మరలివెళ్ళునపుడు, రాజగు 'ఛాసఫ్'నకు నిక్కడ నుండి ముత్యములమర్పబడిన నారికేళము నొకదానిని కానుకగాతీసి కొనివెళ్ళెను. దానిని తెరచినప్పుడు 60 మూరలుపొడవుగల తలపాగ గుడ్డ యొకటి అందమర్పబడియుండెను. దానిని చేతితో బట్టుకొనినపుడది చేతియందున్నదా, లేదా, యనుశంకను గలుగజేయునంత సన్నముగ నుండెను. ఏలయనగా, వారువడికినదారము కనులకుకనబడనంత సన్నము గనుండును. ఒకవేళకన్పించినను సాలెగూడువలెనుండును."('టావర్నీరు')

ఒకసాలెవాడు 40 తులములు దూదితో వడికిననూలుయొక్క పొ డుగతనయెమటకొలవగా, 250 మైళ్ళుండెనని, 1851 వ సం॥మున జేమ్సు "టేలర్' (James Taylor) వ్రాసియున్నాడు. నూలుసన్నముగ వడు కుటయందెగాక, నేతయందునైతము పనివాండ్రు తమ కల్పనాశక్తిని చూపుచుండిరి. లతలు, బొమ్మలు, శ్లోకములు మొదలగు విచిత్రము లతో వస్త్రములను నేయుచుండిరి. 'మదారభక్షు' అనువాడు మిగుల సుందరమగు రచనలతో టోపీలను, చేతిరుమాళ్లను మగ్గములమీద నే

నేసి అనేకబహుమతులు బడసినట్లు, 1898 వ సం॥మున (C. A. Silberad I. C. S.) సి. ఎ. సిల్బిరాడ్ వ్రాసియున్నాడు, 'మదారబక్షు' నిపూర్వికుడగు 'భిక్కా, యనువాడు, చొక్కాయును, పాగాయును దానిపై, అయోధ్యనవాబును స్తుతించుచు, కొన్నిపద్యములు కలిపినేసి నేసి, యతనికి కానుకగా, నొసంగి గొప్పజాగీరును బడసెను.

విదేశములతో వస్త్రవ్యాపారము:— హిందూదేశము ప్రాచీనకాలమున ఫొనీషియా, పాలస్టైను, అస్సీరియాదేశములతో వస్త్రవ్యాపారము చేయుచుండెను. ఇవిగాక గ్రీసు,రోము, ఈజిప్టు దేశములకు బట్టలనెగుమతిచేసి అమితధనమును, కీర్తిని గడించెనని ఇదివరకే తెల్పియుంటిమి. నవీనకాలమున టర్కీ, వెనిస్, పోర్చుగల్, హాలండు, ఇంగ్లాండు మొదలగు దేశములతో వర్తకము చేయసాగెను. డచ్చివారును, ఆంగ్లేయులును, 17 వ శతాబ్దమున హిందూదేశవస్త్రములను విశేషముగ తమదేశములకు దిగుమతి చేయుచుండిరి. పీతాంబరములను, మస్లినులను, ఇంగ్లండులో నెక్కువగ నుపయోగించు చుండిరి. ఇచటజంబుఖానాలుగ నుపయోగించెడు ముతకఅద్దకపు క్యాలికోగుడ్డలను, అచ్చటి నారీమణులు మిక్కిలిఅపురూపముగ ధరింపనారంభించిరి. నేలమీద పగుచుకొనుట కుపయోగపడు తివాసీలు, ఆంగ్లేయులదేహముల నలంకరించుచుండెను. ఆంగ్లదేశపు రాణియగు 'అన్' (Anne) గూడ చీనా పట్టుబట్టలను, భరతవర్షపు క్యాలికోగుడ్డలను కట్టుకొని మురియుచుండెను. శయ్యాగృహమునందును, నగంబుయింటియందును, తెరలకును, తలగడాలకును, కుర్చీలకును, పరుపులకును నాంగ్లేయులు క్యాలికోగుడ్డలే ఉపయోగించు చుండిరి. ఇట్లు హిందూదేశవస్త్రములు మిగులవ్యాప్తి నగుటగాంచి, ఆంగ్లేయులు తమవస్త్రపరిశ్రమ నశించునని భీతిల్లి దీనిని నిరోధించుటకై, 1700 వ సం॥న కొన్నిశాసనముల గావించిరి.

(మూడవ విలియముకాలపు, 11, 12 చట్టములు) ఈవస్త్రములు ధరించినవారికిని, విక్రయించినవారికిని 200 పౌనులు (రూ3000లు) దండుగనా విధించిరి. అయినను వానివాడకమిసుమంతయు తగ్గదయ్యెను. ఈవిధముననే యీరపు ఖండమందు ప్రతిదేశమువారును, వారిపరిశ్రమలునశించునని భయపడి, హిందూదేశపు సరకులురాకుండ నాటంకపరచుట కనేకప్రయత్నములజేసిరి. ఈయంశములనుబట్టి భారతీయవస్త్రవ్యాపారమెట్టిమహోన్నతి గాంచెనో పాఠకులే యూహింపగలరు

పరిశ్రమయొక్క క్షీణదశ: అనేకశతాబ్దములనుండి క్రమక్రమాభివృద్ధినొంది, మహోన్నతిగాంచిన ఈవస్త్రపరిశ్రమ, స్వల్పకాలములో నశించుట కడువిషాదకరము. ఈవినాశమునకు ముఖ్యముగ నాలుగు కారణము లుకలవు

(1) ఈస్టిండియాకంపెనీవారి దురాగతములు:

(2) ఆవిరియంత్రములు.

(3) నిషేధపు శాసనములు.

(4) అవరోధపు పన్నులు.

1 ఈస్టిండియాకంపెనీవారి దురాగతములు:—

ప్రథమముననాంగ్లేయులు మనపరిశ్రమల నశింపజేయు నుద్దేశ్యముతో నిటకురాలేదు. ఇచ్చటివస్త్రములను, సుగంధద్రవ్యములను, తమదేశమునకు కొనిపోయి, లాభమున కమ్ముచుండిరి. కొంతకాలమునకు భారతదేశ పరిశ్రమములను నశింపజేసి తమకళల నభివృద్ధిచేసికొనవలెనను దురుద్దేశ్యము వారికుదయించెను. 'ప్లాసీ' యుద్ధానంతరమున, రాజకీయాధికారము చేకూరుటచే, వారియుద్దేశ్యములు త్వరలోనే సాఫల్యము గాంచగల్గెను. స్వలాభాపేక్షితులయిన కంపెనీ గుమాస్తాలు, దేశీయులవర్తకమును ధ్వంసముచేయుట కెంతమాత్రము

వెనుదీయలేదు. కంపెనీసరకులనుమాత్రమే పన్నులు చెల్లించకుండ నొకచోటనుండి యొకచోటకు తీసికొనిపోవుటకు వంగదేశపు నవాబను మతినిచ్చెను. కాని స్వార్థపరులగు కంపెనీగుమస్తాలు, కంపెనీ సంబంధములేకయే స్వంతముగ, వర్తకము చేయనారంభించి, తమసరకులు గూడ కంపెనిసరకులని చెప్పుచు, సుంకములు చెల్లింపకుండ తీసికొని పోజొచ్చిరి. నవాబుసేవకులాటంక పరచినచో, వారిని తీవ్రముగ దండించుచుండిరి. కాని దేశీయవర్తకులు పన్నులుచెల్లింప వలసియుం డెను. అందుచే వారివ్యాపారము నష్టదాయకమయ్యెను. ఇతియగాక ఆకంపుసీ గుమస్తాలు దేశీయవర్తకులను భయపెట్టి వారివద్దనుండి సర కులు తమయిష్టానుసారము తక్కువ ధరలకు కొనుచుండిరి. ఇష్టతమ సరకులనెక్కువ ధరలకువారికి బలవంతముగ నంటగట్టుచుండిరి. ఈ గుమస్తాలు చెప్పినట్లు క్రియవిక్రయములు చేయనివారిని మంచిచెడ్డలు పాటింపక, కొరడాలతోగొట్టి కారాగృహములందుంచు చుండిరి. వారి జ్యమున నష్టమువచ్చుటచేతను, గుమాస్తాలుపెట్టుచున్న హింసలు సహింపలేకయు, దేశీయవర్తకులు పట్టణముల విడిపోయిదేశీయుల వర్తకము క్షీణించెను.

ఈకంపెనీ గుమస్తాలు దేశీయవర్తకమును తాఱుమారు చేయు టకెట్టి దుండగములగావించిరో, అట్టిదురాగతములనే పరిశ్రమలను వశపరచుకొనుటకును జేయసాగిరి. వారొనరించిన క్రౌర్యములను కన్నులారగాంచిన విలియమ్ బోల్ట్సు (William Bolts) అను ఆంగ్ల వర్తకు డిట్లువ్రాసెను. "ప్రస్తుత మములులోనున్న పద్ధతులను గాంచి నచో, దేశమునందలి వర్తకమేగాక, యూరపుతోచేయు వ్యాపారము గూడ హింసాపూరితమై యుండెనని చెప్పవచ్చును. దేశమున తయారు చేయు ప్రతివస్తువును కంపెని వశపరచుకొనుటచే (Monopoly) ప్రతి నేతపనివాడును, పరిశ్రమికుడును, మిక్కుటముగుహానిపొందుచుండెను.

ఈవ్యాపారమునందు ప్రతిపనివాడును ఎన్నిసరకులను ఏధరకొప్పున నప్పగింపవలయునో, సంగతిసందర్భములనాలోచింపకయే ఆంగ్లేయులును, వారి (హైందవ) గుమాస్తాలును నిర్ణయింపుచుండిరి.........సరకులు తయారయ్యెడి పట్టణమునకు గుమాస్తావచ్చి యొకచోటబసచేసి యచ్చటనే తనకచ్చేరి యారంభించును. బటొత్రులను పంపి, దళారులు పైకారులు అని పిలువబడెడు ఖాయిదావర్తకులను, నేతపనివాండ్రను, నాస్థలమునకు పిలిపించును. తనయజమానులు పంపినద్రవ్యమందినపిమ్మట, వారుతమ సరకులను నిర్ణయింపబడిన ఖరీదునకు, నిర్దేశమయినకాలములో తన కొప్పగించవలెనని ఒకపత్రమును వ్రాయించి పుచ్చుకొని వారికి కొంతసొమ్ము బజానాక్రింద నిచ్చును. ఇందుకై ఆపేదనేతగాండ్ర సమ్మతి యగత్యమని యోచనం. కంపెనీ గుమాస్తాలు ఈసాలివాండ్రచేత తమయిచ్చవచ్చిన ఒడంబడికలు వ్రాయించి సంతకముచేయించి పుచ్చుకొందురు. నేతపనివాండ్రు వారిచ్చినధనమును గ్రహింపనియెడల, ఆధనమును వారి నొసలకుగట్టి, కొరడాలతో కొట్టి బంపివేయువారను విషయమెల్లరకు నెఱుకయే!.........మరియు కంపెనీగుమాస్తాలు కొంతమంది నేతపనివాండ్రను తమపుస్తకములలో రిజస్టరు చేయుచుండిరి. ఇట్లు రిజస్టరుచేయబడిన సాలివాండ్రు ఇతరుల వద్ద పనిచేయకూడదు. ఇంతియగాక, ఒక గుమాస్తా వెడలిపోయిన యెడల నతడీసాలెవాండ్రను బానిసలవలె మరియొకనికప్పచెప్పుచుండెను. ఇట్లుపరంపరగవచ్చు గుమాస్తాల నిరంకుశత్వమునకును, మోసమునకును, నిస్సహాయులగు నీబీదపనివాండ్రు లోబడవలసివచ్చెను. .........ఈశాఖయందుండు గుమాస్తాలు చేయుమోసముల నూహింపనలవిగాదు. కాని ఇవన్నియు పేదనేతగాండ్రను మోసపుచ్చుటకే ఉపయోగింపబడుచుండెను. కంపెనీ గుమాస్తాలును, వారితో లాలోచీపడిననాణెగాండ్రును. సరకులధరలను అసలు ధరలకంటె నూటికి 15

మొదలు 40 వరకును తక్కువగ నిర్ణయించుచుండిరి. కంపెనీ యేజంట్లు వ్రాయించిపుచ్చుకొనిన ఒడంబడికల ప్రకారము సాలీలుసర లుకు తయారుచేసి యొప్పగింపని యెడల, వారి సరకులను వశపరచుకొని వేలమువేసి లోటుసొమ్మును రాబట్టుచుండిరి. పట్టువడికెడి 'నగోడాలు' అను పనివాండ్రనుగూడ అన్యాయముగ హింసించుచుండిరి. బలవంత ముగ పట్టుదారమును వడికించుటకై, వారు పెట్టుబాధలను సహింప జాలక ఆపట్టుసాలీలు తమబొటనవ్రేళ్ళను కోసివేసికొనినట్లు దృష్టాంత ములుగలవు."

ఇట్టికార్యముల కొడిగట్టుచున్న కంపెనీఉద్యోగులను మందలిం చుటకుమారుగ, ఇంగ్లాండునందలి డైరెక్టర్లుకూడ నీయధర్మమును ప్రోత్సహించుచుండిరి. 1769 వ సం॥ము మార్చి 17 వ తేదీని వంగ దేశమునకు వారంపినజాబులో, హిందూదేశీయులగు పనివాండ్రను పట్టుదారమును తయారుచేయునట్లు మాత్రమే ప్రోద్బలము చేయవల యుననియు, పట్టువస్త్రములను నేయుట కభ్యంతరముల గల్పింపవలెనని యువ్రాసిరి. పట్టునేతపనివాండ్రు ఆంగ్లేయవర్తక స్థానములందు మాత్రమే పనిచేయవలెను స్వతంత్రముగ స్వగృహములందు వస్త్రములనునేయ రాదు. ఈయాజ్ఞల నుల్లంఘించిన వారు దండింపబడుచుండిరి.

కంపెనీవారి చర్యలలో మరియొకదురాగతముకలదు. వారికి చేజిక్కిన రాష్ట్రములందు పన్నులమూలముగ వసూలుచేసిన హైందవ ద్రవ్యమును, ప్రజోపయోగార్థము వినియోగించుటకు మారుగ తమ స్వంతధనమువలె దానిని పెట్టుబడిగ నుపయోగించి, వస్త్రములను సుగంధద్రవ్యములనుకొని, విదేశముల కెగుమతిచేసి లాభముపొందు చుండిరి. ఈవిధముగ దుర్వినియోగము చేయబడిన ద్రవ్యము 1793-4 సం॥మునుండి 1811-12 సం॥ము వరకును సగటున సంవత్సరమునకు 1,32,28,770 లుండెను. ఈపద్ధతిని కామన్సు సభవారు ఆమోదిం

చుటయేగాక హిందూదేశమున వచ్చునాదాయమును వాణిజ్యము నిమిత్తమే వినియోగింపవలెనను తీర్మానమును గావించిరి. ఈ వ్యాపారమునందుకూడ దేశీయకార్మికుల నెట్టిబాధలు పెట్టినదియు నీక్రిందిశాసనములవలన స్పష్టమగును. (1) కంపెనీవారితో నొడంబడికలు చేసికొని బజానాపుచ్చుకొనిన నేతపనివాడు ఇతరులకెట్టిసందర్భమునన్నైనను పనిచేసినగాని వస్త్రములనిచ్చినగాని నేరస్థుడుగా నెంచబడును. (2) ఒడంబడికల ప్రకారము నియమితకాలమునకు వస్త్రముల నప్పగింపనియెడల కొందరచేయుటకై నేతవానియొద్ద సేవకులను పహరాయుంచుటకు వర్తకోద్యోగులు అధికారము కలిగియుండిరి. (3) ఆవస్త్రముల నితరుల కమ్మినయెడల వాడు, దివానీ అదాలత్‌లో ఫిర్యాదీగా నెంచబడును. (4) చాలమగ్గములుగలిగి అనేకులచే పనిచేయించుమేస్త్రీ వస్త్రముల నొడంబడికప్రకార మియ్యనియెడల, అతనిపైని నూటికి, 35 చొ॥న దండుగ నియ్యవలసియుండును. దేశీయపరిశ్రమల దుర్మరణమునకు కంపెనీవారే కారకులనుటకు ఈశాసనములేతార్కాణములు.

## 2. ఆవిరి యంత్రములు.

భారతవస్త్రపరిశ్రమ వినాశమునకు నింగ్లాండు నందలి యావిరి యంత్రములు రెండవకారణము. ఆవిరి సహాయ్యమున యంత్రములు నడుపుట 1768 వ సం॥ ములో 'వాట్టను' నాతడు కనిపెట్టెను. కాని ఆవిరి యంత్రాలయ స్థాపనమునకిండియానుండి కొంపోబడిన ద్రవ్యముచాల తోడ్పడెను. ఆవిరియంత్రమేబదిసంవత్సరములకు పూర్వము కనిపెట్టబడినయెడల, ద్రవ్యహీనతచే నవి యంతరించియుండును. ఏలయన, ఫ్యాక్టరీలను నిర్మించుట కమితధనమవసరము. ఇండియానుండి వెడలిన ధనప్రవాహము వారికి సకాలములో సహాయకారియై, సస్యములకు జలమువలె, వారి వస్త్రపరిశ్రమాభివృద్ధికి ముఖ్యాధారమయ్యెను. ఆవిరి సహాయమున యంత్రములు నడుపబడుటవలన, వస్త్ర

ములు విస్తారముగను చౌకగను తయారగుచుండెను. ఇట్టి వస్త్రముల నిండియాను దిగుమతిచేసి ఆంగ్లేయులు దేశీయవర్తకులకంటె చౌకగ నమ్ముచుండుటచే మనపరిశ్రమ క్రమముగ క్షీణించెను.

3. నిషేధపు శాసనములు:—హిందూదేశపుబట్టలను నింగ్లాండులో వాడకూడదని నిషేధపు శాసనముల నేర్పఱచి యుండని యెడల, 'లంకషైరు' వస్త్రపరిశ్రమ యావిరియంత్రసహాయము చేతనైనను వృద్ధిపొందకుండెడిది. మనదేశపు 'కళ్ళికోట' గుడ్డలు, రంగుబట్టలు, అద్దకపువస్త్రములు, ఆంగ్లేయుల నాకర్షించుటచే, తమ పరిశ్రమలు నశించునని యాంగ్ల పరిశ్రామికులు భయపడిరి. ఆంగ్లప్రభుత్వమువారి రంగుబట్టలను, యద్దకపుగుడ్డలను నెవ్వరువాడరాదని శాసనములు నిర్మించి, యాశాసనముల దాటినవారిని శిక్షించుచుండిరి. ఇట్టి దట్టములు 18వ శతాబ్దమున నమలులోనున్నట్లు చరిత్రవలన తెలియుచున్నది. అట్టి శాసనమొకటి 1721 వ సం॥న చేయబడెను. 'లెకీ'యను నాంగ్లమహాని యుడీవిషయముగూర్చి యిట్లు వ్రాసియున్నాడు. "17 వ శతాబ్దాంతకాలమున, సుందరములగు కళ్ళికోట వస్త్రములును, మస్లినులును, చీటి గుడ్డలును, సరసమగు ధరలకు, నింగ్లండులోనికి విశేషముగా దిగుమతి యగుచుండెను. వానిపై ప్రజలకుగల్గిన మోహమునుగాంచి యున్ని, పట్టు నేయు పనివాండ్రు మిక్కిలి భీతిల్లిరి. అంతట కొలది మినహాయింపులతో, కళ్ళికోట యద్దకపు గుడ్డలుగాని, రంగుగుడ్డలుగాని, యింగ్లాండులో దుస్తులుగగాని, గృహములందుగాని, వాడరాదనియు, నేమాత్రము దూదికలిసినను, అద్దకపుబట్టలను రంగువస్త్రములను త్యజింపవలెననియు, 1700, 1761 సం॥లలో పార్లమెంటువారు చట్టముల నేర్పఱచిరి. హిందూదేశపు కళ్ళికోట గుడ్డలతోచేసిన దుస్తులనేస్త్రీయైన ధరించుట, శిక్షార్హమైననేరముగా నెంచబడెను. 1706 వ సం॥న నొకస్త్రీ ఫ్రెంచికేంబ్రేకుట్టో చేయుబడిన చేతిరుమాలు నుపయోగిం

చెనని గిల్డుహాలు న్యాయస్థానమున రుజువగుటచేత, 200 నవరసులు జరిమానా వేయబడెను."

అవరోధపుపన్నులు:-హిందూ దేశవస్త్రములవాడకము మాన్పుటకు శాసనముల నిర్మించుటయేకాక, యవరోధపు (Prohibition) పన్నులనుగూడ విధించుచుండిరి. మనదేశముండి యింగ్లాండునకు దిగుమతిచేయబడు వస్త్రములపై నిషేధపుపన్ను లేయుద్దేశముతో నెంతెంతవిధింపబడెనో 1813 వ సం॥ న కామన్సుసభవారు నియోగించిన కమిటీయెదుట జాన్ ర్యాంకింగను (John Ranking) నాంగ్లవర్తకు డిచ్చిన సాక్ష్యమును చదివినచో విశదమగును.

"ఈస్టిండియా పతాసులో నమ్మబడుచున్న వస్త్రములపై వానివిలువ ననుసరించి నూటికియెంతపన్ను విధింపబడుచున్నదో చెప్పగలవా ?

"కాలికోగుడ్డలు దిగుమతిచేసినందుకు నూటికి పౌ. 3-6-8 పెం చొప్పునను నవి దేశములో వాడబడినయెడల పౌ. 68-6-8 చొ॥ పన్నులు విధింపబడుచున్నవి.

"మస్లినను మఱియొకరకము వస్త్రము దిగుమతి చేసినందుకు నూటికి పౌ. 10-0-0 పె. చొ॥ నను దేశములో వాడినయెడల నూటికి పౌ. 27-6-8 పె. చొ॥నను పన్నులు విధింపబడుచున్నవి.

"రంగుబట్టలను మూడవరకము వస్త్రములమీద దిగుమతిపన్ను నూటికి పౌ. 3-6-8 పె. చొ॥ విధింపబడుచున్నది. ఈదేశములో వాని యుపయోగము నిషేధింపబడినది. కావున నవి విదేశముల కెగుమతిచేయుటకుమాత్రమే యుద్దేశింపబడినవి.

"పూర్వ మేర్పఱుపబడిన మొత్తపు పన్నులు పార్లమెంటు యొక్క యీతీర్మానము ప్రకారము నూటికి 20 చొ॥ హెచ్చింపబడినవి. అందుచేత దేశములో వాడబడుట కుద్దేశింపబడిన క్యాలికో గుడ్డ

లమీద నూటికి పౌ 78-6-8 లును, మస్లినులమీద నూటికి పౌ. 31-6-8 లును అగునట్లు నిషేధపు పన్నులు మార్చబడినవి." సీమలో వాడబడు మనదేశపు వస్తువులపై అమితమగు నిషేధపుపన్నులు విధించుటలో, సీమ ప్రభుత్వమువారి యుద్దేశ్యముగూడ ర్యాంకింగుగారే నుడివియున్నారు. "మనదేశపు పరిశ్రమలను రక్షించుటకే ఆపన్నులు విధింపబడుచున్నవని నాయభిప్రాయము."

హిందూదేశ వస్త్రపరిశ్రమ నశింపజేసి వారి పరిశ్రమను వృద్ధి చేసికొనుటకు ఇంగ్లండులో 1813 సం॥న హిందూదేశపు వస్త్రములపై విధించిన దిగుమతిపన్ను లీవిధముగ నుండెను.

| | ఛార్జీలు. పౌ. షి. పె. |
|---|---|
| క్యాలికోగుడ్డలు (100 పౌ. విలువగలదానిపై విధించినపన్ను) | 81- 2-11 |
| ప్రత్తి (100 పౌనుల బరువుగలదానిపై పన్ను) | 0-16-11 |
| వస్త్రములు (నూరుపౌనుల విలువగల దానిపై) | 81- 2-11 |
| ఉన్ని, శాలుబట్టలు (100 పౌ. విలువగలవానిపై) | 84 -6 -3 |
| లతలుగల్గి, నగిషీగల్గిన తెల్లక్యాలికో మస్లినులు (100 పౌ. విలువగలవానిపై) | 32- 9- 2 |

ఒకవైపున నాంగ్లదేశము హైందవ వస్త్రములపై నధికమగు సుంకములను విధించి వానివ్యాపకము తగ్గించుచుండ, హిందూదేశమున దిగుమతియైన యాంగ్ల వస్త్రములపయి ఆంగ్లేయ కంపెనీవారు చాల తక్కువపన్ను విధించి ఆవస్తువుల వ్యాపకము విస్తరింపజేసిరి. హిందూదేశపు వస్త్రములపై ఇంగ్లాండు నూటికి 81 చా॥ పన్నువిధించుచుండ, ఇంగ్లాండునుండి మనదేశమునకు వచ్చిన సరకులపై నూటికి $2\frac{1}{2}$ మాత్రమే పన్ను వేసిరి. ఇట్టి యక్రమమగు విధాన మాంగ్లేయు

లవలంభించుటవలన నాంగ్లపరిశ్రమ లెట్లు వృద్ధిపొందినదియు, భారత పరిశ్రమ లెట్లడుగంటినదియు, నాంగ్లేయ చరిత్రకారుడొకడిట్లు వ్రాసి యున్నాడు.

"హిందూదేశ విషయమై మనదేశమున (ఇంగ్లాండు) అవలంబించిన వాణిజ్యపద్ధతియేమి? ఆదేశమునందు (ఇండియా) చేయబడిన పట్టువస్త్రములను, దూదితో మిశ్రితములగు పట్టువస్త్రములను కూడ మన యంగళ్ళనుండి పూర్తిగా తొలగించితిమి. నూటికి 67 -చొ॥ సిటీ వల పన్ను విధించుటవలనను, యంత్ర సాహాయ్యమునను, హిందూదేశముయొక్క వ్యాపారమునకు ముఖ్యసాధనములైన వస్త్రములను మన దేశమునుండి బహిష్కరించుటయే గాక, ఆసియాఖండమున మన వశీకరణమందున్న రాష్ట్రములకు (అనగా వంగదేశమునకు) మనవస్త్రములను కొంతవరకు ఎగుమతికూడ చేయుచున్నాము. నూలువస్త్రములను ఇతరసామగ్రులను తయారు చేయుచుండిన భరతఖండము నీవిధముగ వ్యవసాయము మాత్రమే చేసికొను స్థితిలోనికి తీసికొని వచ్చితిమి."

హిందూదేశ చరిత్రకారుడయిన "హొరేసు హేమనువిల్సను" భారతవస్త్ర పరిశ్రమ వినాశహేతువులను విశదముగ నిరూపించియున్నాడు. "ఇంగ్లాండు బజారులలో తయారు చేయబడు పట్టువస్త్రముల కంటెను, నూలువస్త్రముల కంటెను, హిందూదేశపు వస్త్రములు నూటికి 50 నుండి 60 వరకు తక్కువగ నుండిన ధరలకు నమ్మబడినవని 1813 సం॥పు వ్రాతమూలములందు కనబడుచున్నది. ఇట్టి పరిస్థితులలో, ఇంగ్లండులోని వస్త్ర వ్యాపారమును, విదేశవస్తువులనుబహిష్కరించుటచేతను, వానిపై నూటికి 70 లేక 80 వంతున పన్నులు విధించుటచేతను, సంరక్షించుకొనిరి. దిగుమతులమీద నిట్టినిషేధపుపన్నులువేసి రక్షింపకపోయినయెడల మ్యాంచెస్టరు, పేస్లి (Paisly) పట్ట

కాములలోని మిల్లులు ఆరంభములోనే అడుగంటి పోవుటయేగాక, అవి రియంత్రి సహాయ్యము చేతనయినను, పునరుద్ధరింపబడలేని స్థితికి వచ్చి యుండును. భరతఖండపుచేతి పనులను రూపుమాపి, దీనిని పోషించుట యయినది. హిందూదేశమునకు స్వాతంత్ర్యమే యున్నయెడల దీనికి ప్రతీకారము సల్పి, ఇంగ్లీషువస్తువులపై నిషేధపు పన్నులను విధించి తన చేతిపనులు దుర్మరణమొందకుండ నిలుపుకొని యుండెడిది. అన్యదేశీయుల దయాధర్మములకు లోనైయుండుటచే ఇట్టిస్వసంరక్షణ మాదేశమునకు వీలైనది కాదు. ఇంగ్లాండునుండి వచ్చు వస్త్రములపై పన్ను లేకుండుటచేత హిందూదేశము నందవి యపరిమితముగ వ్యాపించినవి. అన్యదేశ వస్తుకారకుడు భరతఖండపు పనివాండ్రతో సమానముగ పనిచేయలేక పోయెను. అందుచే నధర్మశాసనము లుపయోగించి వారిని పూర్తిగ అణగద్రొక్క గలిగెను.

పరిశ్రమ క్షీణించుటకు కారణములను తెలిసికొంటిమి. మన వస్త్రపరిశ్రమ సంపూర్ణముగ నడుగంటుటకు సుమారు 75 సంవత్సరములు (17.. 1849) పట్టెను. వ్యవసాయము, పరిశ్రమలతో శోభిల్లుచుండిన భారతదేశము వ్యవసాయము మాత్రమేచేసె కొనుస్థితికి తీసికొని [illegible]. హిందూదేశము ఇంగ్లాండునకు ప్రత్తి, ధాన్యము మొదలగు [illegible]ర్థములను సమకూర్పవలసిన యవస్థపట్టెను. 1813, 1840 సం॥లలో వస్త్రపరిశ్రమనుగూర్చి విచారించుటకు సంఘములేర్పరుపబడెను. ఆంగ్ల పారిశ్రామికుల యభివృద్ధి మార్గముల నారయుటయు, హైందవపరిశ్రమలు పునరుద్దరింప బడకుండ చేయుటయును, ఈసంఘముల ముఖ్యోద్దేశమని చెప్పవచ్చును. 1840 సం॥న కామన్సు సభవారి సెలెక్టుకమిటీయెదుట నాంగ్లేయు లిచ్చినసాక్ష్యము లీవిషయమును స్పష్టీకరించును. అప్పుడు 'మార్టిను'దొర యిచ్చినసాక్ష్యమును,

తదనంతరమాతనికిని బ్రాక్లె హార్ట్సునకు జరిగిన సంభాషణము గమనింపదగినది.

'మార్టిన్' యొక్క సాక్ష్యము:—"ఇరువదియైదు సంవత్సరములు హిందూదేశమందలి సంస్థానములెల్ల మనవస్త్రములు కొనునట్లుబలవంతపెట్టితిమి. హిందూదేశములో మన యున్నివస్త్రములపై నొక్కసుంకములు లేకుండెను. నూలువస్త్రములపై నూటికి $2\frac{1}{2}$ చొ॥ మాత్రముండెను. ఇతరవస్త్రములపై కూడ నిట్టినామమాత్రములయిన సుంకములే విధింపబడెను. కాని మనదేశమునకు వచ్చుహైందవ వస్త్రములపై నూటికి 10 మొదలు 20,30,50,100,500, చివరకు 1000 వరకును కూడ నిషేధపుపన్నులు విధించుచుంటిమి. మనము హిందూదేశముతో స్వేచ్ఛావ్యాపారము సల్పుచున్నామని యుద్ఘోషింపుదుము. కాని యథార్థముగ హిందూదేశమున దిగుమతియయ్యెడు మన సరకులపట్లనే యీపద్ధతి యనువర్తించుచున్నది. కాని యిచట దిగుమతియయ్యెడు హైందవవస్త్రముల విషయమున లేదు..............ఎచ్చోట దేశీయపరిశ్రమలు కనుచ్చదన్నో యుండెనో నట్టిసూరతు, ఢక్కా, మూర్షిదాబాద్ మొదలగు పట్టణముల యొక్క నాశనమును వర్ణించుట మిక్కిలి విచారకరము. మన మవలంబించిన నీతి సవ్యమగు వ్యాపారపద్ధతికి భిన్నముగనున్నది. ఇందు శక్తివంతులగువారు తమబలమును బలహీనులపై నుపయోగించిరని నేను భావించుచున్నాను."

ఈసాక్ష్యమునిచ్చిన తర్వాత 'మార్టిన్' దొరకును ఆంగ్లేయవర్తకుల ప్రతినిధియగు బ్రాకిల్ హర్ట్సునకును ఈక్రింది సంవాదము జరిగెను. బ్రాకిల్ హర్ట్సు:—హైందవ పరిశ్రామికులయినను, ఆంగ్ల కార్మికులైనను నష్టముపొందవలెను. హైందవ పరిశ్రముల నాశనమిదివరకే సమకూడినది. ఇప్పుడు మన దేశమునకు నష్టమొనర్చి వానిని పునరుద్ధరింప గోరుదువా?

మార్టిన్:—వానిని పునరుద్ధరించుట కిష్టపడకున్నను ఇంకను నాశన మొనర్చుటకు సమ్మతింపను. హిందువులకు మన దేశీయులతో పోటీగా పనిచేయుటకు స్వేచ్ఛయొసంగినచో, ఆంగ్లేయులగు పని వాండ్రు నాశనమొందుదురని తలంపకూడదు. ఏలయనగా మాంచె స్టరు, గ్లాస్గొపనివాండ్రకుగల ఆవిరిమగ్గములు, తెలివితేటలు, మూలధ నము మొదలగు సౌకర్యములు హైందవులకులేవు.

బ్రౌకల్ హర్స్టు:—నేనిపుడు ఆవిరిమగ్గములపై నేయజాలని సన్నవస్త్రముల విషయమై ప్రశ్నించుచున్నాను. మనము సన్నవస్త్ర ములనేత మానివేయవలెనా ? లేక పెంపొందింపవలెనా ?

మార్టిన్:—హిందూదేశమునకన్యాయ మొనర్చియే, దీనిని పెం పొందింప దలచినయెడల, నేనుసమ్మతింపను. ఫలితమేమైనను ఆంగ్లదే శము న్యాయముగ వర్తించవలెను. స్వలాభముకొరకుగాని, ప్రత్యే కముగ కొంద రాంగ్లేయుల యభివృద్ధికొరకుగాని తాను జయించిన దేశముయొక్క ప్రజలను నాశనముచేయుటకు, ఇంగ్లాండున కెట్టియధి కారమును లేదు.

బ్రౌకల్ హర్స్టు:—హిందూదేశము 1833 సం॥ తూర్పు ఇండి యాసంఘమునుండి ఆంగ్ల ప్రభుత్వమునకు మార్పబడినపుడే భారత వస్త్రపరిశ్రమనాశనము పూర్తిఅయినది. కనుక ప్రస్తుత సమస్య భారత వస్త్రపరిశ్రమ నశింపచేయుటకాదు. అది యిదివరకే జరిగిపో యినది. హిందూదేశము వ్యవసాయమే ప్రధానకృషి గాగల దేశము గాని, పారిశ్రామిక దేశముగాదని చెప్పుటకు మనకు నిదర్శనములు కలవు. మరియు పూర్వము చేతిపనులచే జీవించెడి జనులిప్పుడు వ్యవ సాయ మవలంబించిరి. మనదేశములో పరిశ్రమలులేనిచో, హైందవు లవలె మనవారు వ్యవసాయమునకు గడంగుటకు వీలున్నదని నీవు తలం చెదవా ?

మార్టిన్:—హిందూదేశము వ్యవసాయమే ప్రధానముగాగల దేశమను విషయము నేనంగీకరించను. ఆదేశమున వ్యవసాయమున కట్టిస్థానముకలదో పరిశ్రమలకునట్టి ముఖ్యస్థానమెకలదు. ఆదేశమును కేవలము వ్యవసాయముపై నాధారపడియుండునట్లు చేయుటకు యత్నించువాడు, ఆదేశపు సభ్యతను క్షీణింపజేయుచున్నాడు. ఆంగ్ల దేశము నిమిత్తమై పంటలుమాత్రమే పండించుభూమిగ హిందూదేశ ముండజాలదని నేను భావింతును. ఆదేశము పరిశ్రమలతో విలసిల్లు చుండెను. అనేకములగు పరిశ్రమలచ్చట తరతరములనుండియు వర్థిల్లు చున్నవి. అన్యదేశములెవ్వియు, న్యాయమార్గ మవలంబించి వాని తోడిపోటీకి నిలువజాలకపోయెను. అక్కడి డక్కా మస్లినులగూర్చియు, కాశ్మీర శాలువలనుగూర్చియు నేనిప్పుడు ప్రసంగించుటలేదు. ప్రపం చమునెల్ల నతిక్రమించు నైపుణ్యముతో నాదేశము తయారుచేసిన వివిధవస్తువులగూర్చి నేనిప్పుడు చెప్పుచున్నాను. అట్టిదేశమును కేవ లము వ్యవసాయముపై నాధారపడి యుండునట్లుచేయుట మిగులయ క్రమము."

కంపెనీ గుమాస్తా లొనరించిన క్రౌర్యములవలననేమి, ఆంగ్లదే శమందలి ఆవిరి యంత్రములవలననేమి, ఆంగ్లేయుల బహిష్కార విధా నమువలననేమి, వారు విధించిన నిషేధపు పన్నులవలననేమి చిరకాల మునుండి హిందూదేశమున మహోన్నతస్థితిని గాంచియుండిన నేత పరి శ్రమ యెట్టకేల కడుగంటినది. రాట్నములపై నూలువడికెడి యసంఖ్యాకులగు స్త్రీలతోడను, సుందరములగు వస్త్రములనేసెడి సాలీల తోడను, బట్టల కద్దకమువేసెడి పనివాండ్రతోడను, వస్త్రవ్యాపారము చేసెడి దేశీయ విదేశీయవర్తకులతోడను నెప్పుడు కలకలలాడుచుండిన పట్టణములు నేడు తమప్రాముఖ్యతమును గోలుపోయి కళావిహీనములై యున్నవి. తనదుకూలములకును, అద్దకములకును పాశ్చాత్యదేశములందు

సైతము పేరొందిన మచిలీబందరు నేడెట్టిస్థితియందున్నదో మనకు తెలియును. డక్కానగరమునుండి 1787 సం॥ నింగ్లాండునకు పౌ. 3,00,000 నులు విలువగల మస్లినుగుడ్డ లెగుమతియగుచుండెను. 1817 సం॥ ఎగుమతులు పూర్తిగనంతరించెను. మూర్షిదాబాదు, సూరత్ మొదలగు నగరములకుకూడ నిట్టిగతియే పట్టెను.

## II

## దిగుమతి పన్నుల చరిత్ర.

ఇక పరిశ్రమయొక్క ప్రస్తుతస్థితి ఎట్లున్నదో తెలిసికొనవలెను. చేతిమగ్గములు, రాటములు అంతరించినతర్వాత భారతీయులు మిల్లుల స్థాపింపనారంభించిరి. ఇవి యభివృద్ధిగాంచకుండను, లంకషైరువర్తకము నిరాతంకముగకొనసాగుటకును, ప్రభుత్వమువారవలంబించిన విధానము, వారువిధించిన దిగుమతిపన్నులయొక్కయు, ఉత్పత్తిపన్నులయొక్కయు చరిత్రవలన విశదమగును.

1833 మొదలు 1853 వరకు ఇండియా ప్రభుత్వము పన్నులను విధించుచు అనేక శాసనములు గావించెను. అవియంత ముఖ్యమయినవి గావు. ఆంగ్లేయ వస్త్రపరిశ్రమకు ప్రత్తి యవసరమగుటచే 1836-44 వరకు ఇండియానుండి ఎగుమతిచేయబడిన ప్రత్తిపై ఏవిధమయిన సుంకములు విధింపలేదు. 1853 సం॥ మున దేశమునకు దిగుమతియగు వస్తువులమీద నూటికి $3\frac{1}{2}$ నుండి రూ 5 ల వరకు దిగుమతి పన్నులు వేయబడెను. ఇంగ్లాండునుండితప్ప మిగిలిన దేశములనుండి వచ్చుసరకులపై రెట్టింపుపన్ను వసూలుచేయబడెను. ప్రభుత్వమునకు ద్రవ్యమవసరమగుటచే నీపన్నులు విధింపబడెనుగాని, మనపరిశ్రమలు రక్షించుటకు గాదు. మనవస్త్రపరిశ్రమ యిదివరకే నశించియుండుటచే రక్షించుట యనవసరముగదా ?

1858 సం॥ న విక్టోరియూరాణి భారతభూమికి చక్రవర్తిని అయినపుడు పూర్వమువలెనే దిగుమతిఅయిన నూలుమీద నూటికి $3\frac{1}{2}$ చొ॥ నను యితరవస్తువులమీద నూటికి 5 చొ॥ నను సుంకములు విధింపబడుచుండెను. సిపాయిల తిరుగుబాటు అనంతరము ధన మత్యావసరమగుటచే, దిగుమతిచేయబడిన భోగానుకూలములగు వస్తువులమీద నూటికి 20 వరకును, వస్త్రములపై నూటికి 10 వరకును నూలుమీద నూటికి 5 వరకును దిగుమతిపన్నులు హెచ్చింపబడెను.

1860 సం॥న దిగుమతియగు వస్తువులన్నిటిమీదను భేదములేకుండ నూటికి 10 రూ చొ॥ పన్నులువిధించిరి. కాని 1861 లో, నూలు వస్త్రములమీద దిగుమతిపన్ను రూ 5 లకు తగ్గింపబడెను. 1862 లో $3\frac{1}{2}$ చేయబడెను. వస్త్రములమీద సుంకములుకూడ నూటికి 5 రూ. చేయబడెను. 1870 సం॥ ఒక క్రొత్త * టారిఫ్ శాసనము (Tariff Act) గావింపబడెను. దానిప్రకారము తయారయిన వస్తువులన్నింటిమీదను సాధారణముగ నూటికి $7\frac{1}{2}$ చొ॥ పన్ను విధింపబడెను. వస్త్రములమీద నూటికి 5 చొ॥ నూలుమీద నూటికి $3\frac{1}{2}$ చొ॥ ఇనుముమీద నూటికి 1 చొ॥ పొగాకుమీద నూటికి 10 చొ॥ పన్నులువిధింపనారంభించిరి. లంకషైరు వస్త్రముల నిండియాలో వ్యాపింపచేయుటకు ఆంగ్లేయులు దిగుమతి పన్నులను తొలగించవలెనని ప్రయత్నించుచుండిరి. కామన్సు సభచే నియమింపబడిన సంఘమునెదుట (1871-74) ఇండియానుండి ఎగుమతియగు ధాన్యము ప్రత్తిమీదను, ఇండియాలోనికి దిగుమతియగు వస్త్రములమీదను పన్నులు వేయరాదని కొందరాంగ్లేయులు సాక్ష్యమిచ్చిరి. ఆకాలమునకలకత్తాలో ఒకటి రెండుమిల్లులు మాత్రమె స్థాపింపబడినవి.

---

* ఎగుమతి దిగుమతులపై వేయబడు పన్నులనుగూర్చి చేయబడు శాసనములు టారిఫ్ శాసనములనబడును.

ఈదిగుమతి పన్నులవిషయములో వైసురాయిగారుకూడ స్వతంత్రముగ ఇండియా కార్యదర్శి యనుమతిలేకుండ సంచరించుటకు వీలులేదు. లారెన్సుప్రభువుగారు జనపనార మొదలగు పదార్థములమీద ఎగుమతిపన్నుల నెక్కువచేసి ప్రభుత్వాదాయమును వృద్ధిచేయుటకు యత్నించిరి. కాని యవి ఆంగ్లవర్తకులకు నష్టదాయకములగుటచే ఇండియాకార్యదర్శి సమ్మతింపలేదు. తొలినుండియు ఆంగ్లేయవర్తకుల లాభము పురస్కరించుకొని వారికనుకూలించునట్లే భారతదేశ పరిపాలనము నడుపబడుచున్నదని పాఠకులు మఱువకూడదు.

1874 సం॥ లాంకషైరువర్తకులందరు కలిసి హిందూదేశ కార్యదర్శికొక విన్నపమునంపిరి. దిగుమతియగు వస్త్రములమీదను, నూలుమీదను క్రమముగా నూటికి 5, $3\frac{1}{2}$ చొ॥ విధింపబడు దిగుమతిపన్నులు భారతవస్త్ర పరిశ్రమాభ్యుదయమున కనుకూలముగనున్నవనియు, తమకు నష్టదాయకముగనున్నవనియు ఆందోళన చేయసాగిరి. కాని ఇండియాకార్యదర్శి సరియగు ప్రత్యుత్తర మీనకుండుటచే, తమభావమును స్పష్టీకరింపుచు, హిందూదేశములో బట్టల యంత్రములు స్థాపింపబడుట తమకెంతమాత్రము నిష్టములేదని తెలియజేసిరి. ఈవిషయమును విచారించుటకు ఇండియా ప్రభుత్వమువారొక సంఘము నియమించిరి. అందలిసభ్యులందరు నాంగ్లవర్తకులును ఉద్యోగస్థులును అయియుండిరి. వీరుకూడ "దిగుమతి పన్నులను తీసివేయవలెను" అను లాంకషైరు వర్తకుల కోరికను ఏకగ్రీవముగ నిరాకరించిరి.

కావున, గవర్నరుజనరలుగనున్న నార్తుబ్రూకుప్రభువు దిగుమతిపన్నులు తీసివేసి ప్రభుత్వాదాయమును గోలుపోవుట కెంతమాత్రమంగీకరింపకుండెను. వస్త్రములమీదను నూలుమీదను దిగుమతిపన్నులుపూర్వమువలెనే యుండవలెనని శాసనము గావించెను. కాని ఇండియన్ మిల్లులందు సన్నవస్త్రములు తయారుచేయకుండ దిగుమతియగు

ప్రశస్తమయిన ప్రత్తిమీద నూటికి 5 చొ॥ పన్నువిధించెను. ఎగుమతి పన్నులన్నియు తొలగించి దిగుమతి పన్నులునూటికి 5 చొ॥ విధించెను. ఇంతలో ఇండియా కార్యదర్శి పదవి నలంకరించిన "స్యాలిస్‌బరి" ప్రభువు ఈశాసనమును రద్దుచేయమని యానతిచ్చెను. నార్తుబ్రూకు అందుకిష్టపడక తనపదవికి రాజీనామా యిచ్చెను.

నార్తుబ్రూకు స్థానమున లిట్టనుప్రభువు వైసురాయిగా నియమింపబడెను. స్యాలిస్‌బరీప్రభువు నభీష్టము నెరవేరుటకు వీలుకలిగెను. దిగుమతి పన్నులను తీసివేయుమని లిట్టనుప్రభువున కాజ్ఞనొసంగెను. స్యాలిస్‌బరీప్రభువుయొక్క ఆజ్ఞానుసారము నడుచుకొనుటకు లిట్టను పంసిద్ధముగనున్నను ఆర్థిక పరిస్థితులు మిక్కిలి ప్రతికూలముగా నుండెను. మదరాసు రాష్ట్రమున వచ్చిన భీకరమగు కరవువలన ప్రభుత్వాదాయము తగ్గిపోయెను. కనుక దిగుమతి పన్నులను రెండుసంవత్సరముల వరకు విధించుచునే యుండవలసి వచ్చెను.

లంకషైరువర్తకుల తొందర ఎక్కువయ్యెను. కామన్సుసభలో నీవిషయమునుచర్చించిరి. హిందూదేశమున విధింపబడుచున్న దిగుమతి పన్నులు వాణిజ్యనీతికి భిన్నముగ నుండుటచే సాధ్యమయినంత త్వరలో రద్దుచేయవలెనని తీర్మానించిరి. స్యాలిస్‌బరీ ప్రభువీతీర్మానమును ఇండియాప్రభుత్వమునకు పంపించెను. ఇండియాలో మరమైనుమిల్లులు పనిమొదలు పెట్టుటకు సిద్ధముగనున్నవి. 1877 సం॥ నాటికి 1,231,284 కదుళ్ళు పనిచేయుచుండునని అంచనా వేయబడినది." అనికూడ వ్రాసెను. మనవస్త్రపరిశ్రమ తిరిగితలయెత్తకుండ ప్రభుత్వము వారెంత జాగ్రత్తగ మెలంగుచుండిరో స్యాలిస్‌బరీగారి వాక్యముల వలననే స్పష్టమగుచున్నది.

అయినను లిట్టను ప్రభువు 30 నెంబరుకంటె ఎక్కువ సన్నదారముతో నేయబడిన వస్త్రములమీద మాత్రము దిగుమతిపన్ను తొల

గించెను. ఈపన్ను ప్రభుత్వ వైసురాయిగానున్న కాలమునగూడ దిగుమతిపన్నులు మార్పుచెందెను. 1882 సం॥రము దిగుమతియగు వస్త్రములమీదను, నూలుమీదను కూడ పన్నులు తీసివేసిరి. పిమ్మట పండ్రెండు సంవత్సరముల వరకును ఏవిధమయిన మార్పును జరుగలేదు.

1894 సం॥ ఇండియా ప్రభుత్వమునకు నష్టమువచ్చుటచే దిగుమతి పన్నులు మరల విధింపవలెనను చర్చవచ్చెను. హెర్షల్ ప్రభువు అధ్యక్షతక్రింద నియమింపబడిన సంఘమువారు వస్త్రములు మినహాయించి, తక్కిన దిగుమతులమీద పన్నులు విధింపవలెనని శిఫార్సుచేసిరి. ఇట్లుచేయుట కొరకు బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టబడెను. దిగుమతులలో సగము భాగము వస్త్రములే యగుటచే, వానిపై పన్నులువిధింపక, మిగిలిన వస్తువులపై విధించుట అన్యాయమనియు, లాభములేదనియు పెక్కుమంది సభ్యులు వ్యతిరేకాభిప్రాయ మిచ్చిరి. కాని ఇండియా కార్యదర్శి యాజ్ఞానుసారము ఆబిల్లు ఆమోదింపబడెను.

ఇంతలో ప్రభుత్వాదాయమును గోలుపోకుండను, లంకషైరువర్తకులకు నష్టమురాకుండను, ఇండియాకార్యదర్శి మరియొక మార్గము కనిపెట్టెను. 1895 సం॥లో ఒకచట్టము నిర్మించి, దిగుమతియగు నూలుపయి సుంకములు తీసివేసిరికాని దిగుమతియగు వస్త్రములమీదను మనదేశమున తయారగు వస్త్రములమీదనుకూడ నూటికి 3½ చొ॥ పన్నువిధించిరి. అనగా దిగుమతియగు వస్త్రములమీద నూటికి చొ॥ దిగుమతి పన్నులు, దేశములో నేయబడిన వస్త్రములమీద, నూటికి 3½ చొ॥ ఉత్పత్తిపన్నును విధింపబడెను. దేశాభివృద్ధినిగోరు యేప్రభుత్వమును ఎన్నడును స్వదేశమున యుత్పత్తియగు వస్త్రములపై పన్నువిధించి, ఆపరిశ్రమలకు హాని కలుగజేయదు. ఈయుత్పత్తి

పన్నులవలన దేశీయ పరిశ్రమలకు నష్టమును, లంకషైరువర్తకులకు లాభమును చేకూరుటచే, వానిని తీసివేయుమని ప్రజలు ఆందోళనము చేసిరి. కాని ప్రయోజనము లేకుండెను.

1895 సం॥ నుండి సుమారు 20 సం॥వరకు నీదిగుమతి పన్నులును, ఉత్పత్తిపన్నులును అమలులో నుండెను. 1916-17 సం॥ ఇండియా గవర్నమెంటుకు మిక్కుటమగు ధనలోపము వచ్చుటచే దిగుమతియగు వస్తువులపై పన్నును నూటికి 7½ చేసిరి. కాని వస్త్రములపై పన్ను హెచ్చింపలేదు. ఉత్పత్తిపన్నును నూటికి 3½మాత్రమే యుంచి, దిగుమతిపన్నును నూటికి 5 వరకు హెచ్చించుటకు ఇండియా ప్రభుత్వముయత్నించినను పార్లమెంటు వారందుకుసమ్మతింపక యుద్ధానంతరము చూచుకొందమని సెలవిచ్చిరి. కాని మరుసటిసంవత్సరము ధనలోపమెక్కువగుటచే, వస్త్రములపై దిగుమతిపన్నును నూటికి 7½ వరకు హెచ్చించిరి. ఉత్పత్తిపన్నుమాత్రము హెచ్చుచేయులేదు.

హైందవ వస్త్రపరిశ్రమమీద ప్రభుత్వము అవలంబించుచున్న వాణిజ్య విధానము ఎట్లు ప్రతికూలముగను, హానికరముగనున్నదో, పైనుదహరించిన పన్నులచరిత్రమువలన స్పష్టమయినది. ఈవిషయమునే, ఇండియాలో వైసురాయిగానుండిన కర్జనుప్రభువుకూడ విశదముగ చెప్పియున్నాడు. 1917 సం॥ లో వెస్టుమినిస్టరు గేజటులో ప్రకటించినలేఖలో వారిట్లు వ్రాసిరి. "ఇండియాలో దిగుమతియగు వస్త్రములమీద విధించు దిగుమతిపన్నుల విషయములోను, ముఖ్యముగ నిండియాలో తయారగుచున్న వస్త్రములమీదనేయు ఉత్పత్తిపన్నుల విషయములోను, లంకషైరు యొక్కవైఖరి కేవలము అన్యాయముగను, అక్రమముగను నున్నదని నేనెప్పుడును తలంచుచుంటిని........ నేను ఇండియాలో వైసురాయిగానున్నపుడీ యభిప్రాయమునే చాలాసార్లు వెలిబుచ్చితిని. నేనింగ్లండునకు తిరిగివచ్చినతర్వాత మే 21 వ తేదీ

1908 వ సం॥ ము ప్రభువుల సభలో నొక ఉపన్యాస మిచ్చియుంటిని. అందులో, గతముప్పది నలుబది సంవత్సరములనుండియు హిందూదేశ పుఆర్థిక విధానమంతయు కలకత్తాలో కంటె విశేషముగ మ్యాంచెస్టరు లోనే నిర్ణయింప బడుచున్నదని నేనుచెప్పియుంటిని. (అనగాహిందూదే శాభివృద్ధి పాటింపక లంకషైరు వర్తకులలాభమే గమనింపబడుచు న్నది) 1910 సం॥ మ్యాంచెస్టరులో నేనిచ్చిన ఉపన్యాసములో, నేనా సంగతులనే, అనగా, హిందూదేశపు ఆర్థిక విధానము, లంకషైరు వర్త కుల పలుకుబడికి మిక్కిలి లోబడియుండు కామన్సు సభకును, ఇండి యాకార్యదర్శికిని లోబడియున్నదని నేను సూచించియుంటిని."

లంకషైరు వర్తకుల యాందోళనమువలన ఇండియా ప్రభుత్వ వాణిజ్యనీతి, వస్త్రపరిశ్రమాభివృద్ధికి ప్రతికూలముగనున్నను, బంగా ళావిభజన, బహిష్కారోద్యమములవలన మిల్లులపరిశ్రమ కొంతవరకు వృద్ధిగాంచినది. కాని తరువాత ఆఉద్యమప్రాబల్యము తగ్గిపోవుటచే, మిల్లుపరిశ్రమాభివృద్ధి యంతగా సంతృప్తికరముగ లేదు. ఈపరిశ్రమ యొక్కస్థితిని సూచించుటకై ఆయా సంవత్సరములందు ఎన్నిమిల్లులుం డినదియు, ఎన్నికదుళ్ళు పనిచేయుచుండినదియు, ఎన్నియావిరి మగ్గము లుండినదియు నిటపొందు పరచుచున్నాము.

| సంవత్సరము. | మిల్లులసంఖ్య. | కదుళ్ళసంఖ్య. | ఆవిరిమగ్గములసంఖ్య |
|---|---|---|---|
| 1904 | 191 | 51,18,121 | 45,337 |
| 1907 | 224 | 53,33,275 | 58,436 |
| 1910 | 263 | 63,57,460 | 85,352 |
| 1913 | 272 | 65,96,862 | 94,136 |
| 19,6 | 266 | 68,39,877 | 1,10,268 |
| 1919 | 258 | 66,89,680 | 1,18,221 |

పైయంకెలు పరిశీలించినచో మిల్లులసంఖ్య యీమధ్య తగ్గు చున్నను, కదుళ్ళయొక్కయు, మగ్గములయొక్కయుసంఖ్య వృద్ధియగు

చున్నట్లు తెలియును. యీమిల్లులందు ఎంతనూలును, వస్త్రములును తయారగు చున్నవో ఒకటి రెండుసంవత్సరములు తీసికొని చూతము.

| సంవత్సరము | నూలు (పౌనులు) | వస్త్రములు (గజములు) |
|---|---|---|
| 1918—19 | 615,040,464 | 1450,726,180 |
| 1919—20 | 635,760,245 | 1639,779.227 |

ఇట్లు తయారయిన వానిలో యీదిగువ వివరించినట్లు విదేశముల కెగుమతి యగుచున్నవి.

| సంవత్సరము | నూలు (పౌనులు) | వస్త్రములు (గజములు) |
|---|---|---|
| 1918—19 | 66,000,000 | 645,000,000 |
| 1919—20 | 155,000,000 | 873,000,000 |

విదేశములనుండి ముఖ్యముగ ఆంగ్లదేశమునుండి మనదేశమునకు దిగుమతి యగుచున్న నూలును, వస్త్రములును యీవిధముగ నున్నవి.

| సంవత్సరము | నూలు (పౌనులు) | వస్త్రములు (గజములు) | నూలు,వస్త్రములు, మొత్తపువిలువ(రూపాయలు) |
|---|---|---|---|
| 1918—19 | 38,095,000 | 1097,300,000 | 60,55,00,000 |
| 1919—20 | 15,097,000 | 1063,600,000 | 59,08,00,000 |

ఇట్లుమనము ప్రతిసంవత్సరమును ఇంచుమించుగ 60 కోట్ల రూ. విలువగలనూలును, వస్త్రములును విదేశములనుండి దిగుమతి చేసికొనుచున్నాము. మనకు సరిపోవునంత ప్రత్తిపండుచున్నను, వస్త్రములు తయారుచేయుటకు కార్మికులున్నను, అమితధనమును వస్త్రములకొరకు విదేశములకంపు చుండుటచే, దేశము దారిద్ర్యమున కుంగి పోవుచున్నది.

వస్త్రపరిశ్రమను పునరుద్ధరించుటకు గాంధిమహాత్ముడు చేయుచున్న మహోపకారమును ప్రశంసింపకయే ఈప్రకరణము ముగింప

జాలము. ఆమహాత్ముడు ఆసేతు హిమాచలపర్యంతము పర్యటనము చేసి రాట్నపు సందేశమును భారతీయులకుపదేశించియున్నాడు. ఆమహాత్ముని ప్రయత్నములవలన దేశమున వస్త్రపరిశ్రమ తిరిగి తలయెత్తుచున్నది. విదేశ వస్త్రములపై వ్యామోహము క్షీణించి, ఖద్దరు వస్త్రవ్యాపకము ఎక్కువగుచున్నది. 1921 వ సం॥ స్వదేశీ ఉద్యమ ప్రభావము ఈక్రిందిలెక్కలవలన స్పష్టమగును.

వస్త్రములు.

| | గజములు |
|---|---|
| 30-9-1920 నాటికి | దిగుమతి 3,540,677,100 |
| 30-9-1921 | 1,866,341,100 |

నూలు

| | ఎత్తు |
|---|---|
| 30-9-20 | 118,447,700 పౌనులు |
| 30-9-21 | 90,592,600 పౌనులు |

స్వరాజ్యమును సంపాదించుటకు రాట్నమెట్టి ముఖ్యసాధనమైనదియు, రాట్నము నుపయోగించుటవలన హైందవుల కెట్టిమహోపకారము కలుగునదియు, గాంధిమహాత్ముడు 'స్వరాజ్యమర్మ'మను వ్యాసమున యంగుఇండియా పత్రికలో నిట్లువ్రాసియున్నాడు.

"కాంగ్రెసు తీర్మానము స్వదేశవ్రతప్రాముఖ్యమును, వ్యక్తుల త్యాగావశ్యకతను దృఢముగ వ్యక్తపరిచెను. దేశమునందు గనుపించెడి ఆర్థికప్రభావమును ప్రోత్సాహపరచిగాని దానిని సహించి యూరకుండునంతవరకు హిందూదేశము స్వేచ్ఛను పొందజాలదు. విదేశవస్తు బహిష్కారమనిన విదేశవస్త్ర బహిష్కారమనియే ఎంచవచ్చును. మనము వస్త్రములనిమిత్తము 60 కోట్ల ధనము వెలుపలికి పంపుచున్నాము. ఈప్రవాహము నాపుచేయుటకు హిందూదేశము

ప్రబలప్రయత్నములను కావించినచో స్వరాజ్యము ఈయొక్కకార్యము మూలముననే చేకూరకలదు. హిందూదేశవర్తకుం అత్యాశను సంతృప్తిపరచుటకు పరాధీనత అనుభవించుచున్నది. ఈస్టిండియా కంపెనీ వచ్చినప్పుడు మనకుకావలసిన వస్త్రమంతను మనము తయారు చేసికొనుటయేకాక, విదేశములకుగూడ వస్త్రములను పంపుచుండెడి వారము. అటిస్థితియంతయుమారి, హిందూదేశము తనబట్టలకు ఇతర దేశములపై నాధారపడవలసి వచ్చుచున్నది. హిందూదేశపుత్రులు కష్టపడుచో తమకు కావలసిన బట్టలు తయారుచేసికొనగలరు. ఇప్పటికిని నేతగాండ్రు చాలినంతమందిగలరు. మిల్లులు మనకుకావలసిన వస్త్రమంతను తయారుచేయజాలవు. నేటికిని మిల్లులకన్న నేతగాండ్రెక్కుడు వస్త్రములను తయారు చేయుచున్నారు విదేశవస్త్ర బహిష్కారమునకు నూలును విశేషముగ తయారుజేయుట ముఖ్యావశ్యకము. ఇందుకు రాట్నములతో నూలువడుకుట యవసరము. మన వర్తకులు విదేశవస్త్రములను తెప్పించుట పూర్తిగ మానివేయవలెను. కావలసిన దూదినంతను, ఈదేశముననే నిలువయుంచి విదేశపు నూలును కొనుట చాలింపవలెను.

"గృహస్థులు తమ 'వేషను'గురించిన అభిప్రాయములను మార్చుకొని ముతకవస్త్రమునందుగల పనితనమును, సౌందర్యమును, గ్రహించుట కలవాటుపడవలెను. నేతగాండ్రకు నూలుసప్లయి చేయుటకు ప్రతివారును, తమతీరికకాలము నుపయోగించవలెను. మనమిపుడు ఆధ్యాత్మిక సంరంభములో మునిగియున్నాము. అసామాన్యపరిస్థితులలో సామాన్యవ్యవహారములను కట్టిపెట్టుట యావశ్యకము. సంవత్సరకాలములో స్వరాజ్యమును సంపాదింపదలచిన, దానిపైననే మన దృష్టి నిగుడింపవలయును. అందుచే విద్యార్థులందరును, తమ చదువుల నొకసంవత్సరముపాటు కట్టిపెట్టి నూలుతయారుచేయుటకు పాటుపడ

వలెను. దేశమునకు వారు చేయదగిన యుత్కృష్టసేవ అదియే. ప్రతి జాతీయ కళాశాలకు, పాఠశాలకు, నూలుకండెలను తయారుచేయు కర్మాగారము గావలయును. ఇందుచే విద్యార్థుల కిహపరలాభము గలుగును. హిందూదేశమున బట్టలకరవును తొలగించుటకు తోడ్పడుట యుత్కృష్టకర్మయనుటకు సందియము లేదు. బీదవారందరును, ఈ పని చేయునటుల వారికెందుకు డబ్బీయకూడదని అడుగవచ్చును. నూలు వడుకుట నేతవలెగాని, వడ్రింగమువలెగాని ఒకవృత్తిగ నెంచబడలేదు. పూర్వకాలమున స్త్రీలు తమతీరిక సమయములందు నూలు వడుకుచు, దానిని గౌరవకార్యముగ నెంచుచుండెడివారు. మన యెదుటనున్న ఈస్వల్పకాలములో స్త్రీలచే నీయభ్యాసము పునరుద్ధరింపజేయుట కష్టము. కాని విద్యార్థులిందుకు సులభముగ పూనగలరు. ఈపని తమ గౌరవమునకు హానికరమని ఎవరును నిర్లక్ష్యముచేయజనదు. నూలు వడుకుట యందు స్త్రీలశీలము కాపాడుటకును, కరవును తొలగించుటకును, వస్త్రములధరలు తగ్గుచుండుటచే, తగిన ప్రతిక్రియగలదు. స్వరాజ్యమర్మము దాసియుండేకలదు. విదేశవస్త్రమును ప్రేరణకులోబడిన మనపూర్వుల లోపమునకు నూలువడుకుటను పునరుద్ధరించుటచేతనే మనము ప్రాయశ్చిత్తము సలుపగలము. 'ఖద్దరు' వస్త్రము నెల్లరు ప్రేమించునటుల విద్యార్థులే చేయగలరు. తనపుత్రులు వడికిన నూలుతో తయారైయ్యేడి వస్త్రమును, ఏతల్లిగాని, ఏతండ్రిగాని, ధరించుట కంగీకరింపకుండునా?

ప్రతిపరిదేశమందును, జాతీయపాఠశాలలందు కొత్తసంగతులను ప్రవేశపెట్టెదవని నన్ను విద్యార్థులడిగియుండిరి. నూలువడుకుపని ప్రవేశపెట్టెదనని, నేనందరికి చెప్పియుంటిని. అభివృద్ధిమార్గమును, నేను నిరోధింపనెంచితినా? మిల్లులు నూడబెరికి నూలువడకుటను, మగ్గము లతో నేయుటను ప్రవేశపెట్టదలచితివివా? రైల్వేయుతిక్కిన్నెంచి రెండు

యెద్దులబండిని ప్రవేశ పెట్టదలచితివా ? యంత్రములనన్నిటిని ధ్వంసము గావింపనెంచితివా ? ఈప్రశ్నల నన్న నేకులడిగిరి. యంత్రములు తొలగిపోయినను నేనువగవను కాని యంత్రముల నాశనము చేయ నేను బూనుకొనలేదు. మిల్లులద్వారా తయారయ్యెడి నూలునకును, వస్త్రములకును ఇతరమార్గముల తయారయ్యెడి నూలును వస్త్రములనుచేర్చి మనదేశమునుండి బయటకుబోయెడి కోట్లకొలది ధనప్రవాహమును ఆపివైచుటకై సంకల్పించితిని. ఈపని నెరవేరుటకు ఎల్లరును తమతీరిక సమయమును నూలువడకుట కుపయోగించుట ఆవశ్యకము. అందుచే నూలువడకుట ఒకవృత్తియని భావించుటకన్న తమ విధ్యుక్తధర్మమని ప్రజలు భావించునటుల జేయుటకు నేనుకొన్ని మార్గములను సూచించితిని" (ఆంధ్రపత్రికనుండి.)

గాంధిమహాత్ముని ఆదేశమును పాలించి, భారతీయులు తమ పరాధీనతనుండి త్వరకాలములో విముక్తులయ్యెదరుగాక !



# 5 వ ప్రకరణము.



## I

### నౌకావ్యాపారము. (ఓడల వర్తకము.) †

అనేక శతాబ్దములనుండి వేదము లుత్పన్నమైనది మొదలు మొన్నటి వఱకును, భారతవర్షమున నౌకావ్యాపారమును, విదేశవాణిజ్యమును మిక్కిలి ఉచ్చదశయందుండెను. పశ్చిమమున బాబిలోనియా అస్సీరియా, ఈజిప్టు, అరేబియా ఫొనీషియా రోము గ్రీసు మొదలగు దేశములతోడను, తూర్పున బర్మా, చీనా, జపాను దేశములతోడను, సుమిత్రా, జావా, కంబోడియా మున్నగు ద్వీపములతోడను వర్తకము చేయుచు, సముద్రమార్గముల ఖండాంతరముల దర్శించుచు కొన్ని పరదేశములకు వలసబోవుచు, భారతవర్షము నాగరిక దేశములలోనెల్ల మిన్నయై ప్రాక్సముద్రరాజ్ఞి (తూర్పుసముద్రిల రాణి) యని ప్రఖ్యాతి వహించెను. మనదేశమందలి వేదములు స్మృతులు పురాణములు, కావ్యములు మొదలగు గ్రంథములేగాక విదేశ యాత్రికులును, వారి గ్రంథములును గూడ భారతీయ నౌకావ్యాపార ముత్కృష్టస్థితియందుండినట్లు సాక్ష్యము నొసగగలవు.

ఓడలను గూర్చియు, ధనార్జమునకై విదేశముల కేగెడి వర్తకుల గూర్చియు, సముద్ర యానమున సంభవించెడి ఉపద్రవములనుగూర్చియు, నతిప్రాచీనమగు ఋగ్వేదమున కొన్ని తావులందు జెప్పబడియున్నది. నౌకలు ప్రయాణముచేయు సముద్రమార్గములు వరుణదేవునకు తెలియునని యొకచోటను (1 ; 25 ; 7) ఆశాపూరితులైన వర్తకులు అన్యదేశముల కోడల నంపెదరని మఱియొకచోటను (II ; 48 ; 3) లాభము నపేక్షించి వర్తకులు సముద్రమున నేభాగమునకైనను పోవుచుందురని

† శ్రీ రాధాకుముదముఖర్జీగారి History of Indian Shipping. అను పుస్తకమూననుసరించి వ్రాయబడినది.

యొకచోటను (I ; 56 ; 2) నౌకాయానమునుగూర్చి చెప్పబడియున్నది. వసిష్ఠ, వరుణులిద్దఱును నోడనెక్కి సముద్రతరంగములపై నుయ్యాల లూగుచు ప్రయాణము చేసినట్లును మఱియొకచోట "తుగ్రు" డనెడి రాజర్షి తనశత్రువుల జంపుటకై కుమారుడగు భుజ్యుని దూరద్వీపములకంపినట్లును మార్గమధ్యమున భయంకరమైన తుపానువలన నతని యోడ మునిగిపోయినట్లును, అశ్వినీదేవతులు తమనౌకపైవచ్చి యాతని రక్షించినట్లును వర్ణింపబడియున్నది. సముద్రమున కవ్వలదీవులలో వసించెడు మ్లేచ్ఛులను సహదేవుడు జయించినట్లు మహాభారత సభాపర్వమున గలదు. సముద్రమధ్యమున మునిగిపోయిన ఓడలోని వణిజులకు పడవల నొసగి రక్షించురీతిని ద్రుపదేయులు పరాజితులైన తమ మేనమామలకు మూడురథములనిచ్చి కాపాడిరని కర్ణపర్వమున నున్నది. బోధాయన సూత్రములును, గౌతమసూత్రములును ఓడవాండ్రు రాజునకు చెల్లించవలసిన సుంకములను నిర్ణయముచేయుచున్నవి. వాణిజ్యమునందేగాక యుద్ధములందు నైతము నౌకాదళముల సిద్ధపఱచి, శత్రువుల నెదుర్కొనినట్లు కొన్నికావ్యముల వ్రాయబడియున్నది. రఘుమహారాజు జైత్రయాత్రకు వెడలినపుడు వంగదేశాధీశులు నౌకలతో నతని నెదుర్కొనగా, వారినోడించి యచ్చోట జయస్తంభముల నెలకొల్పినట్లు కాళిదాసు 'రఘువంశము'న వర్ణించియున్నాడు. (IV 36) ఇట్లె సంస్కృత వాఙ్మయమున ప్రాచీన భారత నౌకావ్యాపారమునుగూర్చి తెలిపెడి నిదర్శనము లనేకములుగలవు.

క్రీస్తునకు 3000 సం॥లు పూర్వము హిందూదేశము బాబిలన్‌తో వర్తకము చేయుండెను. 'ఉర్' (Ur) పట్టణముయొక్క శిధిలములలో కన్పించిన టేకుకలపనుబట్టి యీసంగతి తెలియుచున్నది. క్రీస్తునకు 7 శతాబ్దములు పూర్వము నిర్మింపబడిన 'నెబుకడ్ నెజార్' యొక్క రాజభవనమునను, చంద్రుని దేవాలయమందును హిందూదేశపు టేకు

కలప యుపయోగింపబడినట్లు గ్రహించి దానినిబట్టి హిందూదేశమున కును బాబిలోనియాకును సముద్రవ్యాపారము జరుగుచుండవలెనని రస్సాము (Rassam) నిర్ణయించినాడు. బియ్యము, మంచిగంధము, నెమళ్ళు, గ్రీసుదేశమున హైందవనామములతో వాడబడుచుండెను. ఈకాలమున (క్రీ. పూ. 6, 7 శతాబ్దములలో) హిందూదేశమునకును, బాబిలోనియాకును వ్యాపారము విరివిగ జరుగుచుండినట్లును, ఆర్యులకంటె ద్రావిడు లీవ్యాపారమున నెక్కుడు ప్రముఖత వహించినట్లును, హైందవు లరేబియా యందును ఆఫ్రికాఖండపు తూర్పుతీరమందును చీనాదేశమందును వలెనే, బాబిలోనియాయందును నివాసముల నేర్పఱచికొనినట్లు 'కెన్నడి' (Kennedy) ధ్రువపఱచియున్నాడు. హిందూదేశము బాగారము, రత్నములు, దంతములు, నీలిమందు మొదలగు వస్తువులను విదేశముల కెగుమతి చేయుచుండెను. ఈజిప్టులోని పురాతనపు గోరీల నిర్మించుటలో మనదేశపు నీలిమందును, చింతచెక్కను నుపయోగించినట్లును, ఈజిప్టువారు తమవస్త్రములకు నీలిమందుతోరంగు వేసికొనినట్లును, శవములపై హిందూదేశపు మస్లినుల కప్పినట్లును చరిత్రకారులు వ్రాయుచున్నారు. బైబిలులోకూడ హిందూదేశపు విదేశవ్యాపారమునుసూచించు నిదర్శనములు గలవు. 'హెరొడోటస్' అను గ్రీకు చరిత్రకారుడు ఉన్నికంటె ప్రశస్తమయినవస్త్రు హిందూదేశమున చెట్లనుండి దొరకుననియు, దానితో హిందువులు దుస్తులను తయారుచేసు కొందురనియు వ్రాసెను. ఆనాటి ఖనిజోత్పత్తినిగూర్చికూడ మనకు తెలియవచ్చుచున్నది. 'డెరయస్' అనుపారసీకచక్రవర్తికి లోబడియుండిన సింధునదీప్రాంతములు అతనికి సాలునకు 1,93,00,000 రూపాయలు విలువగల బంగారమును కప్పముగా చెల్లించుచుండెను. భూమిలోనుండి, బంగారపు రజమును త్రవ్వెడు 'చీమల' విషయమై ఇతరప్రాశ్చాత్యగ్రంథకర్తలవలెనే ఇతడును ననేకకథలను వర్ణించియున్నాడు. ఈ

విషయములెల్ల ప్రాచీనహైందవాభ్యుదయమును విదేశవాణిజ్యమును,
నౌకావ్యాపారమును స్పష్టీకరించుచున్నవి.

## మౌర్యయుగము.

ఇకమౌర్య చక్రవర్తుల కాలమున నౌకావ్యాపారమెట్లుండెనో విచారింతము. ఈకాలమున భారతదేశమును దర్శించిన యవనయాత్రికులమూలమున, నౌకానిర్మాణమును నౌకావ్యాపారమును మిగుల నుచ్చదశయందుండి అనేకమందికి జీవనోపాధిగ నుండెనని తెలియుచున్నది. అలగ్జాండరు సింధునదిని దాటుటకు హైందవులచే నిర్మింపబడిన నావల నుపయోగించెను. మఱియు నతనిసైన్యములు స్వదేశమున కేగునపుడు అతనిసేనాధిపతియగు 'నియార్కస్' (Vearchus) సింధునదిలోని నౌకలను రమారమి రెండువేలు చేర్చి వానిసహాయమున సింధునది నతిక్రమించి అరేబియా సముద్రమునుప్రవేశించి 'పర్షియన్‌గల్ఫ్' వఱకును సముద్రముమీదనే ప్రయాణము చేసెను. ఈనౌకాదళము సుమారు 8000 సైనికులను, వేలకొలది గుఱ్ఱములను, అపరిమితమగు యుద్ధసామగ్రిని వహించెను. ఈమహాదళము హైందవ కార్మికులతో హిందూదేశపు కలపతో నిర్మింపబడెను. ఇట్టిమహాదళముల నైతము నిర్మింపగల ప్రత్యేక నిర్మాణస్థలములాకాలమున చాలయుండెను.

ఈయంశములనుబట్టి, మౌర్యచక్రవర్తుల కాలమున నౌకానిర్మాణము ప్రధాన పరిశ్రమములలో నొకటిగనుండెనని గ్రహింపగలము. ఈపరిశ్రమకు రాజులే సర్వాధిపులై సకలవిధముల సహాయము చేయుచుండిరి. నౌకానిర్మాతలెల్లరు ప్రభుత్వ నౌకాశాఖయందే పనిచేయవలసియుండెను. స్వోపయోగమునకై నౌకలునిర్మింపవీలులేకుండెను. అయినను వర్తకులును, సముద్రయానమొనర్ప నిచ్ఛగించు నితరులును రాజుయొక్క ఓడల నద్దెకుతీసికొని వానినే నుపయోగించుచుండిరి.

ఇట్లీపరిశ్రమ ప్రభుత్వపోషణమున నభివృద్ధి గాంచుచుండుట

చేతనే, చంద్రగుప్తమౌర్యుని రాజ్యాంగమున నౌకాశాఖను ప్రత్యేకముగ నేర్పాటు చేయుట కవసరముకలిగెను. సైన్యపరిపాలనమునకు నియమింపబడిన అయిదు పంచాయతీలలో నొకపంచాయతీ నౌకాదళములపై నధికారము కల్గియుండెను. తన అర్థశాస్త్రమునందు కౌటిల్యుడు నౌకాశాఖనుగూర్చి విపులముగ వ్రాసియున్నాడు. రాజ్యాంగ నిర్మాణమున నద్వితీయ ప్రతిభాశాలియగు చంద్రగుప్తుడు నౌకాశాఖ విషయమై శ్రద్ధవహించి దానిని మంచి స్థితియందుంచెను.

నౌకాశాఖపై సర్వాధికారముగల ఉద్యోగస్థునకు 'నావధ్యక్షుడ'ని పేరు. సముద్రపుటోడలును, నదులందును సరస్సులందును ప్రయాణమొనర్చెడు పడవలునుగూడ, నితని యధికారమునకు లోబడియుండెను. ఈనావధ్యక్షుడు నిర్వర్తించవలసిన విధుల నేకము లుండెను. (1) రేవుస్థలములలో ప్రభుత్వమునకు రావలసిన పన్నులను వసూలుచేయుట అతని ప్రథమకర్తవ్యము. సముద్ర నదీతటాక ప్రాంతవాసులు ప్రభుత్వమునకు సుంకముల చెల్లింపవలసియుండెను. చేపలు పట్టువాండ్రు తమకు లభించిన దానిలో నారవవంతు పన్నుగాచెల్లించుచుండిరి. వర్తకులెగుమతి దిగుమతి సుంకములు చెల్లింపవలసియుండెను. రాజుయొక్క నౌకలపై ప్రయాణము చేయువారు భాడిగ చెల్లింపవలెను. ముత్యముల నేరుటను, శంఖముల ప్రోగుచేయుటనుగూడ రాజుయొక్క నావలే అద్దెకివ్వబడుచుండెను. ఇట్టి యద్దెల నేకాక, రేవు పన్నులనుగూడ వసూలు చేయుచుండిరి. (2) తుపానునందు వాతాహతములై భంగపాటునొందిన ఓడలు రేవుచేరినపుడు, వానిని నావధ్యక్షుడు తండ్రివలె సంరక్షింపవలసియుండెను. ఓడలోని సరకులు నీటిచే తడిసి పాడైనయెడల, సుంకముల సగము వసూలుచేసియో, అసలే వసూలుచేయకయో, తగినకాలమునతిరిగి యానౌకలు ప్రయాణము చేయుట కతడనుజ్ఞ యొసగుచుండెను. వర్తకుల సరకులను గొం

పోవు రాజనౌక లేకారణముచేనైనను మునిగిపోయినయెడల, వర్తకు లకువచ్చిన నష్టమును, రాజధనాగారమునుండి నావధ్యక్షు డిచ్చుచుండెను. (3) రేవునందలి యోడలకెట్టి అపాయమును వాటిల్లకుండ జాగ్రత్తపెట్టుట యాతని మూడవవిధి. ఆషాఢమాసము మొదలు కార్త్తికమాసమువఱకును (అనగా వర్షాకాలమున) ప్రయాణికులు ప్రభుత్వ నావలపైననే రేవులు దాటవలెను. హేమంత గ్రీష్మ ఋతువులలో, గొప్పనదులందు పెద్దపడవలుమాత్రమే ప్రయాణమొనగ్చును. ప్రయాణికులకు నిబ్బంది కలుగకుండ, రేవులనుదాటు స్థలములును, సమయములునుగూడ నిర్ణయింపబడియుండెను. రేవుదాటు ప్రతిమనిషియు, అక్కడ నియమింపబడు నుద్యోగస్థుని యనుజ్ఞ పొందవలెను. ఈయాజ్ఞల నుల్లంఘించినవారు రాజదండనకు పాత్రులగుచుండిరి. అత్యావసరములగు పనులుగల కొందరు అనుమతిలేకయే రేవులు దాటవచ్చును. (4) రేవుస్థానపు నిబంధనముల నతిక్రమించువారిని నావధ్యక్షుడు శిక్షించుచుండెను. సముద్రపు దొంగలనావలను, శత్రుదేశములకేగు నౌకలను, పన్నులుచెల్లింపని ఓడలను, అతడు తీవ్రముగ దండించుచుండెను. నేరములుచేసి దేశాంతరములకు పారిపోవువారిని, ప్రభుత్వపు టుత్తరువు లేకుండ దూరదేశమునుండి ప్రయాణముచేయుచు వచ్చినవారిని, గూఢచారులను, ఆయుధములను విషమును వెంటతీసికొనుపోవువారిని నతడు బంధించుచుండెను. మరియు అక్రమముగ దాటింపబడిన సామగ్రుల నతడు వశపరచుకొనుచుండెను.

విదేశీయులు భారతదేశమునకు తరుచుగా వచ్చుచుండుట చేతను, వాణిజ్యము వృద్ధిపొంది యుండుటచేతను, నావికావర్తకము చంద్రగుప్తునికాలమున నిట్లు విజృంభించి, ప్రభుత్వమున ముఖ్యమగు శాఖగానుండెను.

అశోకునికాలమునకూడ హిందువులు సముద్రవ్యాపారముచేసి,

సిరియా, ఈజిప్టు మేసిడోనియా, ఎపిరస్, మొదలగు విదేశములతో సంబంధము కల్గియుండిరి. వాణిజ్యముకొరకేగాక, మతప్రచారము కొరకుకూడ భారతీయులు విదేశములకు పోవుచుండిరి. అంతర్జాతీయ వర్తకము సలుపుచు, సర్వజనసౌభ్రాతృత్వ సిద్ధాంతము నందరకు బోధించుచు, భారతవర్షము, వాణిజ్యాధ్యాత్మిక విషయముల ప్రపంచ మునందగ్రస్థానము వహించెను. కావున, నౌకావ్యాపారము అశోకుని కాలమునకూడ మంచిస్థితియం దుండెననుటకు సందేహములేదు.

ఆంధ్ర-కుషాణయుగము:-(క్రీ.పూ. 200 మొదలు క్రీ.శ. 300 వఱకు.)

క్రీ. పూ, 200 సం॥ మొదలు క్రీ. శ. 250 వరకునువ్యాపించిన ఆంధ్రసామ్రాజ్యమునందలి వాణిజ్యమునుగూర్చి ఆర్. సి. వెల్. R. C. Well ఇట్లువ్రాసియున్నాడు. "ఆంధ్రులపరిపాలనము ప్రజలకైశ్వర్యదాయకమయినట్లగపడును. పడమటి ఆశియాతోడను, గ్రీసుతోడను, రోము తోడను, ఈజిప్టుతోడను, చీనాతోడను, నితరపూర్వదేశములతోడను భూమార్గమునను, సముద్రమార్గముననుకూడ (భారతదేశము) వర్తకము చేయుచుండెను. సిరియాదేశమునందలి యుద్ధములలో హైందవ మత్తేభము లుపయోగింపబడుచుండెను. రోముదేశమునుండి హిందూదేశమునకు ప్రతియేడును అమితముగ బంగారు నాణెములంపబడుచుండెనని ప్లైని వ్రాయుచున్నాడు. ఈవిషయమునే "పెరిప్లస్" గ్రంథకారుడు ధ్రువపఱచుచున్నాడు. దక్షిణహిందూస్థానమున అందుముఖ్యముగ దక్షిణము ననేక రోమకనాణెములు కనుగొనబడినవి. రోమనులు పెట్టెడు హింసకు తాళలేక కొంతమంది యూధులు స్నేహపాత్రులగు పశ్చిమభారత తీరవాసుల శరణుపొంది మలబారున స్థిరముగనుండి పోయిరి (క్రీ. శ. 68 వ సం॥ము)"

కుషను చక్రవర్తుల కాలమున హిందూదేశమునకును, రోమునకునుగల వ్యాపారమభివృద్ధిగాంచెను. రోమునకు హిందూదేశమునుండి

పట్టువస్త్రములును, రత్నములును, సుగంధద్రవ్యములును ఎగుమతి యగుచుండెను. వీనికిప్రతిఫలముగ రోమునుండివిశేషద్రవ్య మీదేశము నకు దిగుమతియగుచుండెను. రోమనుల ద్రవ్యముతో రోమనుల కళలు ను, భావములునుగూడ మనదేశమును ప్రవేశించెను. గాంధారమని పిలువబడెడు శిల్పము రోమకసంబంధమైయున్నది. మరియు రెండవ "కాడ్ఫైసిస్"అను కుషను చక్రవర్తి "ఆరీ" రోమకనాణెములననుసరించి వానికి తుల్యమగు బంగారునాణెముల నీదేశమున ముద్రింప దొడగెను. దక్షిణ హిందూస్థానమున రోమకనాణెములు విశేషముగ కన్పించు చున్నవి. ఇంతియగాక ఆంధ్రనాణెములపై రెండు తెరచాపకొయ్యలు గల నౌకయొక్క ప్రతిమ ముద్రింపబడుట జూచ నాడాంధ్రదేశము నౌకావ్యాపారమున నెంతయో యభివృద్ధిగాంచినట్లు తెలియుచున్నది.

అగస్టసు చక్రవర్తి రోమనుసామ్రాజ్యమును పాలించుకాలమున ఆదేశమునకును ఇండియాకునుగల వ్యాపారము మహోన్నతిగాంచెను. ఈకాలమునకు పూర్వము హిందూదేశము ఈజిప్టుతో విరివిగవర్తకము చేయుచుండెను. ఈజిప్టుదేశపు రేవుపట్టణమగు "మెయాస్‌హార్మాస్ నుండి హిందూదేశమునకు 120 ఓడలు ప్రయాణముచేయుచుండగా తానుచూచియుంటినని స్ట్రాబో వ్రాసియున్నాడు. హైందవ సామగ్రి లను తీసికొనిపోవు ఓడలు పశ్చిమతీరమున బయలుదేరి ఈజిప్టు తీరము ననున్న బెరీనిక (Berenica) మెయాస్‌హార్మాస్ (Myoshormos) రేవు పట్టణములను చేరుచుండెను. అచ్చటనుండి యీసరకులు నైలున దీ ముఖద్వారముననున్న అలెగ్జాండ్రియాపట్టణమునకును అటనుండి రోముదేశమునకును గొంపోబడుచుండెను. ఈజిప్టువాసులయిన యవ నులు హిందూదేశపు సరకులతో నిట్లు వర్తకము చేయుచుండిరి.

రోమనుదేశముతో నీవిధముగ సముద్రవ్యాపారము సాగుచుం డుటచే కొందరు రోమనులు ఇండియాలో నివాసమేర్పరచుకొనిరి. అ

ప్పటిపాండ్యదేశరాజులును తమిళదేశాధీశులును రోమనులనుతమసైన్య ములోఁచేర్చుకొనుచుండిరి. "ఆర్యప్పడైకడంతానడుండి చేలియన్‌జి" అను రాజుకాలమున మధురకోట సంరక్షణార్థము రోమనులునియమింపబడిరి. కావేరీ ముఖద్వారమందు కావేరీపట్టినమను పట్టణమున యవనులు నివసించుచుండిరి. యవనసారాయములు వారి విపరీతమగు పాత్రలు మున్నగు వానిని గురించిన తమిళపద్యములును, నీలగిరికొండలందు కనుగొనబడిన యవనుల కంచుపాత్రలును, పెరిప్లస్ గ్రంధమును, యవనులతో సంబంధముండినట్లు స్థిరపరుచుచున్నవి.

పెరిప్లస్‌అను గ్రంధమున నాకాలపు (క్రీ. శ. 100) వర్తక స్థానములును రేవుపట్టణములును పేర్కొనబడినవి. మూరిస్‌రేవు స్థానముననెల్లపుడును భారతనౌకలుండెడివని తెలియుచున్నది. ఈగ్రంధముననే అప్పటి నౌకలపరిమాణమును, అరేబియా ఈజిప్టులనుండి హిందూదేశమువఱకునుగల సముద్రమార్గ వివరములును వ్రాయబడియున్నవి. మరియు అరేబియానుండి యోడలు జూలైమాసమున బయలుదేరి ఆకాలమున పశ్చిమముగ వీచుచుండు గాలిసహాయమున, హిందూదేశ పశ్చిమతీరమును చేరుచుండెను. 'టాలమీ' యొక్క భూగోళశాస్త్రమందు సింధునదీ ముఖద్వారము మొదలు గంగానదీ సాగరసంగమము వఱకునుగల రేవుపట్టణములు పేర్కొనబడెను. సౌరాష్ట్రము (సూరతు) గుజరాతులోని 'మొనొగ్లోసాల్' (మంగ్రోలు) ఏరియాకి, సొపర, మూజిరిస్, బకరీ, మెసాలియా (మచిలీపట్నము) కొనగర మొదలగు పట్టణములాకాలమున వ్యాపారమునకు ప్రసిద్ధిగాంచెను.

ఈకాలమున రోమునకును, హిందూదేశమునకును వర్తకసంబంధమేగాక రాజకీయసంబంధముకూడ నుండెను. క్రీ పూ. 20 సం॥న (పాండియన్) అను పాండ్యరాజునుండి అగస్టసు యాస్థానమునకు రాయబారిపంపబడెను. ఈవిధముగనే క్రీ పూ. 30 సం॥ము మొదలు క్రీ శ.

550 వ సం॥ము వరకును రోమను చక్రవర్తులకును కుషనురాజులకును గూడ రాజకీయ సంబంధము లేర్పడియుండెను.

గుప్తయుగము, హర్షునికాలము.

భారతీయుల సముద్రవ్యాపారము ఈపు గ్రీసు, రోము, సిరియా మొదలగు పశ్చిమ దేశములకేగాక, బర్మా, చీనా మొదలగు ప్రాగ్దేశములకుగూడ వ్యాపించెను. క్రీ॥ పూ. 6 వ శతాబ్దమునుండి క్రీ. శ. 1000 సం॥ము వరకు (అనగా బౌద్ధయుగమున) బంగాళాఖాతమందును, హిందూమహాసముద్రమందును నౌకావ్యాపారము విరివిగా సాగుచుండెను. ఈవర్తకమున తూర్పు తీరవాసులే ముందంజవేయుచుండిరి. చోళుల నౌకాదళము గంగా, ఐరావతీనదుల ముఖద్వారములకును, మలేదీవులకును నిర్భయముగ పోవుచుండెను. తెలుగుదేశస్థులుకొందరు తూర్పు సముద్రముదాటి బర్మాయందలి పెగూదేశమును వశపరచుకొనిరి. ఈకారణముచేతనే చాలకాలమువరకు పెగూవారు 'తెలంగ' యని పిలువబడుచుండిరి. పూర్వసముద్రములందలి వ్యాపారమున కళింగదేశస్థులు మార్గదర్శకులై నాయకత్వమువహించిరి. కళింగదేశస్థులు తీరమువెంబడినే సిలన్ మొదలగు దేశములకును, పూర్వాత సముద్రమునుదాటి బర్మాదేశమునకును ప్రయాణముచేయజొచ్చిరి. మలక్కా దేశముతోకూడ వారికి సంబంధముండెను. ఇప్పటికిని 'సింగపూర్' పట్టణమున క్లింగులనిపిలువబడు కాళింగులసంతతివారు కొందరుకలరు. ఓడలవర్తకము నౌకా నిర్మాణము మొదలగు విద్యలందు కళింగ రాజపుత్రులు శిక్షణము పొందుచుండిరని కొన్నిశిలాశాసనములందు కలవు. చిలుకసరస్సుకాలమున నౌకల వసతి స్థానమై ప్రసిద్ధిగాంచెను.

క్రీ. శ. 75 సం॥మున కళింగ దేశవాసులైన హిందువులు కొందరు తూర్పుసముద్రముదాటి జావాద్వీపము ప్రవేశించి, అచట తమ నివాసమేర్పరచుకొనిరి. జావాప్రజలను నాగరికులుగజేసి, యచ్చోట

వారు హైందవ సభ్యతను వ్యాపింపజేసిరి. హిందువులచే నిర్మింపబడి నట్టి వైభవోపేతములగు పురాతనకట్టడముల శిథిలములు నేటికిని జావాద్వీపమునగలవు. అచట శిలాశాసనములమీద లిఖింపబడిన భాషకును, సంస్కృతమునకును చాలసంబంధముకలదు. హిందూదేశ మునుండి సింహళముమీదుగా సముద్రమార్గమున చీనాదేశమునకు ప్రయాణముచేయుచు, మార్గమధ్యమునయున్న జావాద్వీపమున హిందు వులను విశేషముగ చూచితిననియు, తానెక్కినయోడను నడిపినది బ్రాహ్మణమతస్థులగు హిందువులేయనియు, ఫాహియాన్ వ్రాసియు న్నాడు. ఏడవశతాబ్దారంభమునుండి పశ్చిమ తీరవాసులుకూడ జావా ద్వీపమునకు వలసపోవుచుండిరి. బ్రాహ్మణమత విజృంభణకారణ మున హిందూదేశమున నుండనెల్లని బౌద్ధులును, శ్రీహర్షుని దండ యాత్రభయమువలన ఘూర్జరులును, అరబ్బులదాడివలన పశ్చిమోత్త రవాసులును, యిటనుండజాలక, సుఖముగ బ్రతుకవచ్చునను నాశతో జావాద్వీపమునకు వెడలుచుండిరి.

వంగదేశీయులుగూడ నౌకావ్యాపారమునందు వన్నెగాంచిరి. బంగాళదేశమునుండి కొందఱు మతప్రచారకులు చీనా, కొరియా, జపానుదేశములకుపోయి బౌద్ధమతమును వ్యాపింపజేసిరి. జపానులో నొక మతగ్రంథము 11 వ. శతాబ్దపు వంగలిపియందు వ్రాయబడియుం డెను. విజయుడను వంగరాజపుత్రుడు క్రీ. పూ. 550 సం॥లో 700 మంది అనుచరులతో సింహళద్వీపమునుజయించి, దానికానామమొసం గెనని 'మహావంశ' మను నొక బౌద్ధగ్రంథమునన్నది. సముద్రప్ర యాణమునందలి సాహసకృత్యములను వర్ణించుకథలు వంగవాఙ్మయ మునందనేకములున్నవి. ఒకకథయందు "ధనపతి" యనువాడు సింహళ దేశమునకు నేడు ఓడలప్రయాణము చేసినట్లు వర్ణింపబడియున్నది. వానిలో ముఖ్యనౌకయగు "మధుకర" యందు సువర్ణనిర్మితములగు గదులుండెను.

ఆకాలమున బంగాళమున సాటగాను (ఫరిత్పోర) చాంప (భగల్పూరు) తామ్రలిప్తి మొదలగునవి ప్రసిద్ధిగాంచిన రేవుస్థానములుగనుండెను. చాంప (భగల్పూరు) నుండి వర్తకులు సముద్రమార్గమున సువర్ణభూమికి (బర్మా) పోవుచుండిరి. తామ్రలిప్తినుండి సుందరములగు వస్త్రములు ఎగుమతి చేయబడుచుండెను. ఫాహియాన్ ఇచ్చటనుండియే సింహళమునకు ఓడనెక్కి బయలుదేరెను. హుయ్యాన్‌త్సాంగు కూడ తామ్రలిప్తిని గొప్ప రేవుస్థానముగను, వాణిజ్య పట్టణముగను వర్ణించియున్నాడు.

ఈకాలమున భారతీయులు చీనా, జపానుదేశములతో వర్తకముచేయుచుండిరి. చీనాతోడి వ్యాపారము క్రీస్తుశకము మొదటి శతాబ్దమున ప్రారంభమయ్యెను. "రుద్రదామను" అనుక్షత్రపుడు చీనా చక్రవర్తులకు రాయబారుల ద్వారాబహుమానములను పంపించెను. మరియు బౌద్ధమతము సర్వత్ర వ్యాపించియుండుటచే, హిందూదేశము సింహళము, చీనాదేశములమధ్య నౌకలువిశేషముగ తిరుగుచుండెను. సింహళమునుండి చీనాకు సముద్రమార్గమున వెడలినవారిలో ఫాహియాను మొదటివాడు. అతనివెనుక ననేకమంది యాత్రికులు చీనానుండి దక్షిణహిందూస్థానమునకును, అటనుండి చీనాకును, పోవుచుండిరి. చీనాదేశమున, 'లోయాంగు" అనునొకరాష్ట్రమున, 3000 హైందవ సన్యాసులును, 1000 హైందవ కుటుంబములును కలిసి బౌద్ధమత ప్రచారము చేయుచుండిరి.

ఏడవశతాబ్దమునుండి మహమ్మదీయుల రాకవరకును నౌకా వ్యాపార మిట్లేవృద్ధిపొందుచుండెను. చీనా, జపానుదేశములతో వ్యాపారముహెచ్చెను. క్రీ. శ. 673 సం॥న అరువదిమంది చీనాయాత్రికులు భారతవర్షమును దర్శించిరని 'ఇట్సింగు' వ్రాసియున్నాడు.

బర్మా మొదలు చీనావరకును గల తీరములందలి రేవు పట్టణములను హైందవనౌకలు పోవుచుండెను. ఇక్కాలమున కొన్ని తావులందు భారతీయులు వలసస్థానములగూడ నేర్పరచిరి. సుమిత్రాయందు శ్రీభోజనామముతోడను, జావాయందు కళింగ నామముతోడను, బోర్నియోయందు మహాశైలనామముతోడను హైందవుల వలసరాజ్యములుండెను. ఈప్రదేశములలో హైందవాచారములుకూడ ప్రబలియుండెను. చీనాదేశమునకుబోవు నౌకలీప్రదేశములనాగి వలయు పదార్థముల గొని పోవుచుండెను. జపానుదేశమున భారతీయులు బౌద్ధమతమునేగాక హైందవ పరిశ్రమలకూడ నెలకొల్పిరి. 11 వ. శతాబ్దమునకు పూర్వమే ఆదేశమున ప్రత్తిపంట నిద్దరు భారతీయులు ప్రవేశపెట్టిరి.

పది, పదకొండు శతాబ్దముల దక్షిణహిందూస్థానమున చోళ చక్రవర్తులు నౌకాదళమును విరివిగనిర్మించిరి. రాజరాజ చోళుడు "చేర" నౌకాదళమును నాశనమొనర్చి, సింహళమును జయించి, దక్షిణ హిందూస్థానమున నౌకాబలసమన్వితమగు సామ్రాజ్యమును స్థాపించెను. అతని కుమారుడగు రాజేంద్రచోళదేవుడు ఈనౌకాబలముతో ఓఢ్రవంగవిహారఘూర్జర దేశములజయించెను. గంగాతీరమును స్వాధీనము చేసికొనుటచే, 'గంగయకొండ-చోళ' యని బిరుదు గాంచెను. మరియు నితడు మహోదధిని కలయదిరిగి, 12,000 దీవులను తనవశము చేసికొనెను. ఇంతియగాక, కాదరము (పెగూ) దేశాధీశ్వరుడగు "సంగ్రామవిజయోత్తుంగవర్మను" సముద్రరంగమున నోడించెను.

ఇట్లు హిందూమహాయుగమున భారతదేశము ప్రాక్పశ్చిమదేశములతో వ్యాపారమొనర్చియు, నచ్చటచ్చట వలసరాజ్యముల నెలకొల్పియు, మతప్రచారము గావించియు, అన్యదేశాధీశ్వరుల నౌకాబలముతో నోడించియు, నౌకానిర్మాణమందును, విదేశవాణిజ్యమందును, అనన్యలభ్యమైన సభ్యతను, ప్రముఖతనుబడసియుండెను.

## మహమ్మదీయ పరిపాలనము.

అరబ్బులు సింధు దేశమును 8 వ. శతాబ్దమున నాక్రమించిరి. పశ్చిమతీరమందలి సముద్రపుదొంగలు సింహళమునుండి 'ఖలీఫా'కు పంపబడిన కానుకలను కొల్లగొట్టినందున, దానికి ప్రతీకారమొనర్చుటకై యరబ్బులు సింధుదేశముపై దాడివెడలిరి. ఈసముద్రపు దొంగలు చిరకాలమునుండి పశ్చిమ సముద్రమునందు ప్రయాణముచేయుటకు భయముకలిగించుచుండిరి. అరబ్బులు సింధుదేశమును స్వాధీనముచేసికొనినపిమ్మట నాలుగైదు శతాబ్దములవరకును పశ్చిమదేశములతోడి వర్తకము వారి చేతులలోనే యుండెను. 11 వ శతాబ్దమునగూడ నోడదొంగలు పశ్చిమతీరము నాశ్రయించుకొనియున్నట్లు 'అల్బరూని' వ్రాసియున్నాడు. గుజరాతు తీరమున వర్తకము అధికముగనుండెను. మలబారుతీరమునుండి రత్నములును సుగంధద్రవ్యములును ముత్యములును, ఇరాకు, ఖురాసన్, సిరియా, రమ్, యూరపు దేశములకెగుమతి యగుచుండెను. 12 వ. శతాబ్దమునగూడ పశ్చిమతీరము నందు విశేషముగ, 'డెనిూట్' 'బ్రోచి' పట్టణములు వాణిజ్యమొనర్చుచుండెను తూర్పుతీరమునుండి (కోరమాండలు) నూలుబట్టలును, మలబారునుండి మిరియాలు, ఏలకులును, (సింధుదేశములోని) మకసూరానుండి నిమ్మపండ్లును, విదేశముల కెగుమతియగుచుండెను.

13 వ. శతాబ్దాంతమున హిందూదేశమును దర్శించిన "మార్కొ-పోలో"యను విదేశయాత్రికుడు, భారతనావికా వాణిజ్యవిషయమై పెక్కు సంగతులువ్రాసెను. తూర్పుతీరము ముత్యములనేరుటకును, పశ్చిమతీరము ఓడలదొంగలకును పేరుగాంచెను. ఈకాలమున పశ్చిమదేశములనుండివచ్చిన ఓడలు, తిరునల్వేలిజిల్లాలోని 'కెయిల్' (కాయల్) రేవుపట్టణమున గుఱ్ఱములను దిగుమతిచేయుచుండెను.

[illegible] (ప్ర[illegible]) [illegible], [illegible], [illegible];

"టానా" (థానా) నుండి సాంబ్రాణియు, తోళ్ళును, వస్త్రములును, "క్యాంబేలు" (కాంబే) నుండి నీలిమందును, వస్త్రములును, విదేశముల కెగుమతియగుచుండెను. హైందవనౌకలు 'ఏడెన్' పట్టణమునకును, ఆఫ్రికాతీరముననున్న 'జాంజిబార్' ద్వీపమునకును గూడ పోవు చుండెను.

ఈయోడలు మిగులపెద్దవిగ నుండెను. ఒక్కొక్క యోడను 150 మొదలు 300 వఱకును పనివాండ్రు నడుపుచుండిరి. ఒకయోడ యందు రమారమి 6 వేల మిరియముల బస్తాలు వేయుచుండిరి. పెద్ద యోడలతో రెండు మూడు చిన్ననావలుగూడ పయనమై పోవుచుం డెను. నేటి స్టీమరులందువలెనే ప్రతియోడ ప్రక్కను నవసరసమ యముల నుపయోగించుటకై 10 చిన్నపడవలను వ్రేలాడదీయు చుం డిరి. పెద్దనౌకయందు, వర్తకుల ఉపయోగార్థము 60 గదులవఱకును నిర్మింపబడియుండును. ఓడయొక్క లోపలిభాగము 13 భాగములక్రింద విభజింపబడి, ఒక 'కానా'నుండి మఱియొక కానాలోనికి నీరు చొరకుండునట్లు దట్టమగు చెక్కలతో నమర్పబడి యుండును. ఇట్టి 'కానా' లుండుటవలన, ఓడయడుగున నేభాగమునకైన దెబ్బ తగిలినప్పుడు ఆ భాగమొక్కటియె హానినొందునుగాని ఓడకంతకును నపాయము వాటి ల్లదు. ఇట్టి విశేషముల ననేకములను 'మార్కోపోలో' తన గ్రంథ మున వ్రాసియున్నాడు.

14. వ. శతాబ్దమున హిందూదేశమునుండి మహమ్మదు తుగ్లకు యొక్క రాయబారిగ చీనాదేశమునకు వెడలిన "ఇబిన్ బాటుటా" (Ibin Batuta) అనునతడు పశ్చిమతీరవాసుల నౌకాప్రశమనుగూర్చి మార్కోపోలో వలెనే వర్ణించి యున్నాడు. ఈశతాబ్దమున అరబ్బీ పారసీక దేశములనుండి ప్రతియేటను రమారమి 10,000 గుఱ్ఱములు దిగుమతి యగుచుండెను. ఎన్నాళ్ళనుండి కొన్ని సరకులను ఎగుమతిచేసి

ఈపశ్చిమ తీరవాసులు తిరిగి పశ్చిమదేశముల కెగుమతి చేయుచుండిరి.

15. వ. శతాబ్దమునగూడ చీనాదేశముతో వ్యాపారము విరివిగ జరిగెను. హిందూదేశమునుండి చీనాదేశమునకు రాయబారము లేగుచుండెను. 1415 వ. సం॥న వంగదేశాధీశ్వరు నొద్దకు చీనారాయబారి యొకడు బహుమానములు తీసికొని వచ్చెను. మఱియు నీకాలమున కళ్లికోట ముఖ్యమగు రేవుపట్టణముగ నుండెను. 'నికోలి. డి. కోంటీ' యను బాటసారి తనదేశపు నౌకలకంటె హైందవ నౌకలు గొప్పవనియు, దక్షిణహిందూస్థానమందలి వణిజులు, ఒకడు మొక్కంటికి 15000 వేలు బంగారు నాణెములు చొ॥ విలువచేసెను, 40 ఓడలతో వర్తకము చేయుచు, మిగుల భాగ్యవంతులై యుండిరనియు వ్రాసుకొచ్చెను.

16. వ. శతాబ్ద ప్రారంభమున (పోర్చుగీసువారు రాకపూర్వము) అహమ్మదాబాదునవాబులు సముద్రముపై నధికారము వహించియుండిరి. జావా వర్తకులు ప్రభుత్వముయొక్క సౌకార్యము నొసంగెడి రక్షణమునకు ప్రతిఫలముగ నవాబులకు కప్పముల చెల్లించుచుండిరి. హిందూ దేశమునకు సముద్రమార్గ మన్వేషించుచు వచ్చిన వాస్కోడిగామా (1498. వ. సం॥న) తూర్పు ఆఫ్రికాతీరమున హైందవ నౌకలను గాంచెను. భారతీయు లీకాలమున నక్షత్రముల సహాయమునను, కొన్ని సూక్ష్మయంత్రములనుబట్టియు నోడల నడుపుచుండిరట! జావా, మలక్కాలలో హిందువులను విశేషముగ చూచితిరనియును, సుమిత్రాద్వీపమున పరమేశ్వరుడను హైందవరాజు పాలించుచుండెననియు 'అల్బుకర్కు' (1510. వ. సం॥న) వ్రాసెను. కళ్లికోట, చౌల్, డాభోల్, బెస్సీన్ మొదలగునవి పశ్చిమతీరమందలి ముఖ్యములగు రేవుపట్టణములైయుండెను. ఈపట్టణములనుండి పారసీక దేశమునకును, ఎర్రసముద్రమార్గమున (Red sea) అరేబియాకును, రాకపోకలు విస్తా

రముగ జరుగుచుండెను. నాటి భారతీయ నౌకలు 153 అడుగుల పొడవును, 42 అడుగుల వెడల్పును, 31 అడుగులు యెత్తును గల్గి, 1200 టన్నుల బరువును మోయగల్గియుండెను. వీనికి సమకాలీయములగు నాంగ్లేయనౌకలు 300గాని, 350గాని టన్నుల బరువును మోయుచుండెడివి.

వర్తకవ్యాపారమునకేగాక, యుద్ధములందుగూడ మహమ్మదీయ పరిపాలకులు నౌకాదళముల నుపయోగించుచుండిరి. "గ్యాసుద్దీన్ బల్బన్" (క్రీ. శ. 1266-81.) వంగదేశపు నవాబగు 'టుగ్రిల్ ఖాన్'పై దాడివెడలినపుడు అనేక నావలను నిర్మించి, రెండులక్షల సైన్యముతో సరయూనదిపై ప్రయాణముచేసి, శత్రువుల జయించెను. 'ఫిరోజషాతుగ్లకు' నౌకాదళము గైకొనియే లక్నోపట్టణముపై దాడి వెడలెను. అతడు 5000 నావలను నిర్మించి, 9000 గుఱ్ఱములను, 480 ఏనుగులనుగైకొని వానిపై సింధు నదియందు ప్రయాణ మొనర్చి (1370. వ. సం॥న) తట్టాను వశపఱచుకొనెను. తైమూరులంగు దండయాత్ర (1388) ను గూడ, నదులు దాటుటకును, శత్రువుల జయించుటకును హిందువులచే నిర్మింపబడిన నౌకలే యుపయోగింపబడెను.

## అక్బరు చక్రవర్తి.

ఇట్లు దినదినాభివృద్ధి గాంచుచుండిన నౌకావ్యాపారమునకు, అక్బరుచేయూతనొసగి, మంచిస్థితియందుంచెను. చంద్రగుప్తమౌర్యుని పరిపాలనమందువలెనే, ఈతని ప్రభుత్వమందునుకూడ, నౌకాశాఖ ప్రత్యేకింపబడి 'సామ్రాజ్యనౌకాశాఖ' యనుపేర బరగుచుండెను. ఈశాఖ చతుర్విధములగు ధర్మముల నిర్వర్తింపుచుండెను.

(1) నౌకానిర్మాణము—అనేకవిధములగు నోడలను పడవలను నీ శాఖవారు నిర్మించుచుండిరి. ఇందు కొన్ని ఏనుగులను మోసికొని

పోవుటకును, కొన్ని యుద్ధములందుపయోగించుటకును, కొన్ని వర్తకపు సరకులను గొంపోవుటకును, నేర్పాటులు చేయబడెను. రాజవిలాసార్థమై నిర్మింపబడిన కొన్ని నౌకలు ఉద్యానవనములతోడను, పణ్యవీధులతోడను, రాజమందిరముల తోడను, నొప్పారుచుండెను. వంగదేశము, కాశ్మీరము, తట్టా మున్నగునవి ముఖ్యనౌకానిర్మాణస్థలములై యుండెను. అలహాబాదు లాహోరు పట్టణములందు కూడ సముద్రప్రయాణ మొనర్చుటకు దగిన ఓడలు నిర్మింప బడు చుండెను. ఈప్రయాణములేకాక, పూర్వపశ్చిమ దక్షిణతీరములందు గూడ ఓడలను కట్టుచుండిరి.

(2) ఓడలనడుపు నుద్యోగుల నియమించుట:—ఓడలను సురక్షితముగ నడుపుటయందు నేర్పరులైన మనుష్యులను, ఓడలనడుపు నుద్యోగస్థులుగ నియమించుచుండిరి. ఓడలయందు 12 విధములగు నుద్యోగులు పనిచేయుచుండిరి.

1. నకోధ: నౌకాధికారి

2. మాలికుడు: సముద్రపులోతును, నక్షత్రములను గుర్తెరుంగుచు ఓడను నడుపువాడు.

3. తండేలు: కళాసులలో ముఖ్యుడు.

4. నకోధకేషేబ్ (Nakodhakheshab): ఎగుమతి దిగుమతులందు సహాయ మొనర్చువాడు.

5. సరంగు: ఓడకు కావలసిన మరమ్మతులుచేయించి, ప్రయాణార్హముగ నుంచువాడు.

6. భండారీ: ఓడలోని సామగ్రిని జాగ్రత్తపెట్టువాడు.

7. కిరాణీ: జమాఖర్చుల వ్రాసియు, ప్రయాణీకులకు ఉదకము నొసగియు, పనిచేయు గుమాస్తా.

8. సుకంగీరు: చుక్కాని పట్టువాడు.

9. పంజేరి: ఓడకొయ్యపై కెక్కి పరిసరముల పరికించువాడు.

10. గూంతీ; ఓడలోని నీరును వెలుపలకు తోడివేయువాడు.

11. ఆయుధ పాణులు.

12. కేరువాలు: సాధారణపు కళాసులు.

(3) నదులమీద నౌకావ్యాపారమును పరిశీలించుటకు ఒక సమర్థుడగు నుద్యోగస్థుడు నియమింపబడుచుండెను. చంద్రగుప్తుని కాలపు 'నావధ్యక్షు'నివలె, ఇతడును రేవులుదాటుట, సరకుల నెగుమతి దిగుమతులుచేయుట మున్నగు విషయములపై నధికారము గల్గియుండెను. రాత్రిసమయమున నితని యనుజ్ఞలేనిదే పడవలు నడుపగూడదు. అక్బరుకాలమున బీదలుచితముగ రేవుదాటింపబడుచుండిరి.

(4) సుంకములు వసూలుచేయుట: ఎగుమతులపైనను, దిగుమతులపైనను సుంకముల విధించి వసూలుచేయుట ఈముఖ్యోద్యోగుని పని. వస్తువులపై సుంకములు, నూటికి $2\frac{1}{2}$ కంటె నధికముగ లేకుండెను. ఈసంగతినిబట్టి అక్బరు 'స్వేచ్ఛావ్యాపారపద్ధతి' (Free Trade) ననుసరించెనని చెప్పవచ్చును.

అక్బరుకాలమున వంగదేశము ముఖ్యమగు నౌకాస్థానమై యుండెను. సామ్రాజ్య నౌకాదళమునకగు వ్యయమునిమిత్తమై, కొన్ని పరగణాలనుండి వచ్చు ఆదాయము నతడు ప్రత్యేకముగ నుంచెను. అతని నౌకాదళమున మొదట 3000 యోడలుండెనుగాని, యవి క్రమముగ 768 వఱకును తగ్గింపబడెను. ఈయోడలుగాక, కొందఱు జాగీరుదారులుకప్పముగ చెల్లించిన ఓడలుగూడ కొన్నియుండెను. నౌకాదళమునందుపోర్చుగీసువారుగూడ ఉద్యోగముల బడయుచుండిరి. 923 పోర్చుగీసు ఉద్యోగస్థులకిచ్చు వేతనములతోగూడ, నౌకాదళమునకు, మాసమునకు రూ. 29,282 లు వ్యయమగుచుండెను. క్రొత్త ఓడలను నిర్మించుటకును, ప్రాతయోడలను మరమ్మతు చేయించుటకును, నగు మొత్తము

లనుగూడ కలిపినచో నెలకు మొత్తమున రూ. 8,43,452 లు వ్యయమగుచుండెను. వంగదేశమందలి రేవుస్థానములలో ముఖ్యమైనదగు ఢక్కానగరమున, నీ నౌకాదళము నిలవయుండి, సముద్రతీరమును కాపాడుచుండెను. అరాకనువాసులగు పోర్చుగీసు దొంగలు, సముద్రపు దొంగతనముచేయుచు, తీరవాసులగు హిందూమహమ్మదీయుల నెత్తుకొనిపోయి, దక్షిణమున బానిసలుగ నమ్ముచుండిరి. ఈదోపిడి గాండ్రి యోడలు మిగుల బలిష్ఠములై ఫిరంగిగుండ్లచే సైతము భేదింపరానివై యుండుటచే, వానిని నిర్మూలించుటకై అక్బరు యుద్ధనౌకల నిర్మించుటకు అమితముగ ధనము వెచ్చింపవలసియుండెను. ఇందులకై పరగణాలనుండి వచ్చునాదాయము సరిపోకపోవుటచే నతడు నిర్మింపబడిన ప్రతియోడకును రూ 0-8-0 లు మొదలు రూ 1-4-0 వఱకును పన్నును విధించెను.

వంగదేశమే కాక, సింధుదేశముకూడ నౌకానిర్మాణమునకు ప్రసిద్ధిగాంచెను. 'తట్టా'యందు ప్రభుత్వముచే నద్దెకివ్వబడు యోడలు నలుబదివేలునట్లు 'ఆయీనాక్బరీ'యందు తెలుపబడినది. 'లాహోరీ బందరు' (లాహోరు రేవు పట్టణము) పశ్చిమదేశమునకు ముఖ్య నౌకాస్థానమై యుండెను.

అక్బరు సామ్రాజ్యముననున్న సామంతరాజులుకూడ నౌకానిర్మాణము విషయమై కడుశ్రద్ధ వహించిరి. వంగదేశమున సర్దారుగనుండిన 'రాజామాన్‌సింగు' (1589—1604) నౌకాదళమును మంచిస్థితియందుంచెను. శ్రీపురము, బక్లా, చాండికాన్ (సాగరద్వీపము) పట్టణములు ప్రధాన నౌకాస్థానములుగ ప్రసిద్ధివడసెను. శ్రీపురాధీశుడగు 'కేదారురాయి' నౌకాయుద్ధములందు మిగుల నిపుణుడై యుండెను. రాజామానసింగొక నౌకాదళమునుబంపి, యితని నోడించి ఖైదీగా తీసికొనిపోయెను. "జెస్సూరు"రాజగు ప్రతాపాదిత్యునకు

గూడ సాగరద్వీపమున గొప్ప నౌకాబల ముండెడిది.

యుద్ధనౌకల నిర్మాణమందును, వర్తకపు టోడల నిర్మాణమందునుగూడ వంగదేశము ఖ్యాతిగాంచెను. టాడా, బక్లా, శ్రీపురము, సోనార్‌గయర్, సన్‌ద్వీపము, మొదలగునవి బంగాళాదేశములోని ముఖ్యములగు రేవుస్థలములు. ఈ పట్టణములు, పెగూ, మలక్కా, సుమిత్రా, సింహళము, మున్నగు దేశములతో సముద్రవ్యాపారము చేయుచుండెడివి. గంగానదీతీరముననున్న గౌరుపట్టణ మీకాలమున విదేశవాణిజ్యము నమితముగ సంప్రచుండెను. ఈపట్టణమున (16 వ శతాబ్దములో) 12,00,000 కుటుంబము లుండినట్లు తెలియుచున్నది. 'షెయిక్ భిక్'అను బట్టలవర్తకు డీపట్టణమునుండి బయలుదేరి, మూడు నౌకలనిండ పట్టుబట్టలను వేసికొని, రష్యాదేశమునకు గొంపోవుచుండగా, పెర్షియన్‌గల్ఫ్ సమీపమున తుపానురాగా రెండోడలు మునిగి పోయెనని, ఈపట్టణమునకు సంబంధించిన కథ, నొకదానిని హంటరు దొర తనగ్రంథమున (Statistical Account of Bengal) వ్రాసి యున్నాడు.

అక్బరు మొదలు ఔరంగజేబువఱకు.

అక్బరుననంతరముగూడ, మొగలు చక్రవర్తులు నాగదేశమున, నౌకాదళమును పెంపొందించుచుండిరి. షాజహాను, ఔరంగజేబులు పాలించుకాలమున సామ్రాజ్య నౌకాదళమునకును, అస్సాము దేశస్థులకును, ననేక నౌకాయుద్ధములు జరుగుచుండెను. తూర్పు తీరముననున్న 'అరకన్' వాసులగు 'ఫరంగీ' (Ferengi) దొంగలుకూడ ఓడలపైవచ్చి తీరముల నల్లరిచేయుచుండిరి. వంగదేశపు రాజప్రతినిధులు (మహమ్మదీయులైనను హిందువులైనను) యోడలను విశేషముగ నిర్మించుచు సముద్రతీరమును కాపాడుచుండిరి.

దక్షిణ హిందూస్థానమున కోరమాండలు తీరమున, మచిలీపట్ట

ణాము మిగుల ప్రసిద్ధిగాంచిన రేవు పట్టణము. ఇచ్చటి వణిజులు తమ యోడలపైనను, ఆంగ్లేయయోడలపైనను, చాలసరుకు లెగుమతి చేయు చుండిరి. మచిలీపట్టణపుటోడలు, అరకౝ (బర్మాదేశములోని భాగము) పెగూ, టానస్సెరీ, (Tanassery) క్వేడా (Queda) మలక్కా, 'మక్కా', పెర్షియా, మలదీవులు (Maladives) మొదలగు ప్రదేశ ములకు పోవుచుండెను. గోల్కొండ నవాబునకుగూడ నొక నౌకాదళ ముండెను. బర్మాదేశమునుండి ఓడలమీద ఏనుగుల నతడు (ఈమచిలీ పట్టణమున) దిగుమతి చేయుచుండెను. ఒకయోడపై 14 మొదలు 25 వఱకును నేనుగుల నెక్కించుచుండిరి. గోల్కొండ నవాబుఓడలు ఎఱ్ఱసముద్రతీరమునందలి 'మక్కా'తోగూడ వ్యాపారము చేయు చుండెను.

కృష్ణాజిల్లాలోని నర్సాపురము 200 సం॥ములు, నౌకానిర్మాణ మునకు ప్రసిద్ధిగాంచి యుండెను. ఓడలను కట్టుటకు కావలసిన టేకు కలప ఈపట్టణమునకు సమీపమున దొరకుచుండెను. 'మాధవపాలము' (మాధవాయిపాలెము) అనురేవు పట్టణమునొద్ద ఆంగ్లేయులు అనేకము లగు నోడలు కట్టించినట్లును, నౌకానిర్మాణమున కవసరమగు కలపయే గాక, మేకులు, లంగరులు, మున్నగు నినుపసామానులుగూడ నిచ్చట లభించుచుండినట్లును, నిపుణులగు నౌకానిర్మాతలుండినట్లును, థామస్ బౌరీ (Thomas Bowry—1669-75) వ్రాసియున్నాడు.

పశ్చిమతీరమునగూడ ఔరంగజేబుకాలమున చాల రేవుస్థలము లుండెను. మహమ్మదీయ యాత్రికులను మక్కాకుచితముగ తీసికొని పోవుటకు, ఔరంగజేబు సూరతు రేవుపట్టణమున నాలుగు గొప్ప యోడలనుంచెను. ఈతనికాలమున నీరేవుస్థలమున కొన్ని యుద్ధనౌకలు గూడ నుండెను. పశ్చిమతీరమంతయు, సముద్రపు దొంగలచే పరి వేష్టింపబడి యుండుటచే, హైందవవ్యాపారమునకును, నాంగ్లేయవ్యా

పారమునకుగూడ నాటంకములు గలుగుచుండెను.

మహారాష్ట్ర సామ్రాజ్యస్థాపకుడగు శివాజీచక్రవర్తి, నౌకానిర్మాణమును, సముద్రవ్యాపారమును మిగుల ప్రోత్సహించెను నౌకాదళనిర్మాణమువలన మహారాష్ట్రబలము పెంపు వహించెను. విజయదుర్గము, కొలాబ, సింధువర్గ, రత్నగిరి, అంజన్వేళ మొదలగు రేవుస్థలములందు యుద్ధనౌకలు నిర్మాణమగుచుండెను. 1698 వ సం॥న కోనాజీ ఆంగ్రియా (Conajee angria) అనునతడు మహారాష్ట్రనౌకాదళాధిపతియై, అనేక సాహసకృత్యముల నొనర్చెను. ఆంగ్రియా వంశజులు ఆంగ్లేయయోడలను స్వాధీనము చేసకొనుచుండిరి. కోనాజీతరువాత శంభాజీయును, అతనివెనుక తులాజీయును, ఆధిపత్యమును వహించిరి. కచ్ఛి మొదలు కొచ్చిన్ వఱకును తులాజీయోడలు నిరంతర సంచారమొనర్చుచు, యుద్ధమున వచ్చినవారిని, ఇంగ్లీషువారిని నోడించుచుండెను. కాని ఆంగ్లేయులు పీష్వాసహాయమున సువర్ణదుర్గమును స్వాధీనముచేసకొని, ఘిరియా (Ghereiah) లోని ఆంగ్రియాయొక్క నౌకాదళమును నిర్మూలముచేసిరి. దీనితో మహారాష్ట్రుల నౌకాబల మంతరించెను.

## ఆంగ్లరాజ్యారంభము.

ఆంగ్లేయులు భారతదేశమునకు వచ్చినతర్వాతకూడ ఓడలవర్తకమభివృద్ధిగాంచుచుండెను. ఏవిధముగ మొగలాయి చక్రవర్తులు సామ్రాజ్యమును వృద్ధిచేసి సర్వవిధములనోప్పుడిరో ఆవిధముగనే ఆంగ్లేయులుకూడ పెంపొందించిరి. వారువచ్చినతర్వాత సుమారు రెండుశతాబ్దముల వరకు ఈపరిశ్రమ దినదినాభివృద్ధి యగుచుండెను. అద్భుతముగు కీర్తిగాంచెను. "బొంబాయి రేవుస్థానమందలి ఓడలెన్నియును సమానప్రతిపక్షుల నొంలజూచి అపజయసూచకంబగు నిజధ్వజోప సంహారమును గావించియుండెననుటకు నిదర్శనములు ఏమియు గానరావు." 1735 సం॥

వరకును సూరత్ పట్టణమును తదనంతరము, బొంబాయియు, ఇంగ్లీషు వారికి ముఖ్యములగు రేవుస్థానములుగ నుండెను. ఓడలుగూడ నచ్చటనే నిర్మింపబడుచుండెను. నావికానిర్మాణమందు పారసీవారు ప్రసిద్ధిగాంచిరి. ఈకళయందద్వితీయుడగు లోజి (Lowjee) యను పారసీ మేస్త్రీగానుండెను. అతనియనంతరము అతని మనుమలు విశేషప్రజ్ఞావంతులగు, ప్రాంజిమన్సెకజి (Framjee Manseckjee)యును, జమ్సెట్ జబొామంజి (Jamsetjee Bomanjee) యనుమేస్త్రీలుగా పనిచేసిరి. వీరి వంశస్థులు ఏడు శరములవరకు (1736-1837) ముఖ్యనావికానిర్మాతలుగ పనిచేయుచుండిరి. వీరి కళానైపుణ్యమును జూచి యచ్చెరువొంది, ఆంగ్లేయరాజులుకూడ వీరిచే నోడల కట్టించి తీసికొనిపోవుచుండిరి. దీనిని బట్టియే భారతీయులు ఓడలనిర్మాణమందు ఎంతప్రజ్ఞావంతులో తెల్లమగుచున్నది.

బొంబాయినగరము ప్రసిద్ధమగు ఓడలకును, నావికానిర్మాతలకును నిలయమై యుండెను. మలబారు, గుజరాతు అరణ్యములనుండి యిక్కడికి టేకుకలప వచ్చుచుండుటచే, దీనికిసహజమగు రేవుస్థానమునకుండవలసిన సౌకర్యములన్నియునుండెను. ఇంగ్లాండులో చేయబడిన ఓడలకంటె టేకుకర్రతో నిర్మింపబడిన బొంబాయి ఓడలెంతయు ప్రశస్తముగనుండెను. "ఆంగ్లేయ నావికాదళమునందలి ప్రతియోడయు పండ్రెండు వత్సరములకొకసారి మరమ్మతుకోరుచుండును. టేకుకర్రతో చేయబడిన ఓడలు సుమారేబది వత్సరముల వరకు ఉపయోగించుననువిషయము జగద్విదితము. బొంబాయిలో నిర్మింపబడిన ఓడలు పదునాలుగు పదునేను సంవత్సరములు వాడుకొనిన పిమ్మట ఆంగ్లేయ నావికాదళములోనికి తీసికొని రాబడినను, నవీనములట్లు గన్పట్టెను. సర్ ఎడ్వర్డుహ్యూసు (Sir Edward Hughes) అనుపేరుగలఓడ మననౌకాదళములోనికి రాకపూర్వము 8 పర్యాయములు ప్రయాణమొనరించి

యుండునని నేనునమ్మెదను. ఐరోపాలో నిర్మింపబడిన ఏయోడయు ఇండియాకు ఆరుపర్యాయములకంటె నెక్కువసార్లు క్షేమముగా ప్రయాణముచేయజాలదు" అని లెప్టినెంటుకర్నలు వాకరుగారు (Lient-Col-Walker) 1811 సం॥ న వ్రాసిరి. అన్యదేశీయులకంటె మన్నికయందు శ్రేష్ఠమగుటయేగాక నిర్మాణ సామగ్రిసౌలభ్యముచే బొంబాయిఓడలు ఆగ్లయోడలకంటె నాలుగువంతులు తక్కువధరలకు దొరకుచుండెను.

ఈస్టిండియాకంపెనివారు బంగాళాప్రాంతమున కూడ నౌకానిర్మాణమును అభివృద్ధిచేసిరి. 1780వ సంవత్సరమున హైదరాలీ దండయాత్రవలన కర్నాటకదేశమున క్షామము బయలుదేరినపుడు అచ్చటి ఆంగ్లేయులకు ఆహారపదార్థములను గొంపోవుటకు నౌకానిర్మాణమవసరమయ్యెను. అప్పటినుండియు కలకత్తా గొప్పరేవుస్థానముగ ప్రఖ్యాతిగాంచెను. 1781 నుండి 1800 వరకు 35 ఓడలునిర్మింపబడెను. 1801 లో 19 ఓడలును, 1813 లో 21 ఓడలును కట్టబడెను. పైనపేర్కొనబడిన ఓడలుగాక కూడ 1801 నుండి 1821 వరకు 237 ఓడలు (10593 టన్నుల) నిర్మింపబడెను. టన్నుకు 200 రూపాయల చొ॥ నవి వానివెల సుమారు 2,00,00,000 రూపాయలగును. ఈమొత్తములో చాలభాగము హైందవులగు పనివాండ్రకే పోవుచుండెను. బొంబాయివలెనే కార్లీఘట్టముకూడ నౌకానిర్మాణమున కవసరమగు సౌకర్యములు కలిగియుండెను. బీరారు అయోధ్యాప్రాంతములనుండియు, పెగూప్రాంతమునుండియు టేకుకలప దిగుమతియగుచుండెను. నౌకావసతిస్థానముగ వృద్ధిపొందుటకు కలకత్తాకు గల సౌకర్యములనుగూర్చి లార్డువెలస్‌లే 1800 సం॥లో ఇట్లువ్రాసెను. "ఇంగ్లాండునకు సరకులు గొంపోవుట కనుకూలముగ హిందూదేశమున నిర్మింపబడిన 10,000 టన్నుల భారముగల ఓడలుకలకత్తా రేవునందున్నవి. రేవునందు సిద్ధముగానున్న యితర ఓడలను

బట్టియు, నిదివరకే పరమోన్నతిని గాంచిన నౌకానిర్మాణ కళాకౌశల్యా మునుబట్టియు, బంగాళాదేశమందలి బ్రిటిషువర్తకులు లండనురేవుతో వర్తకము సాగించుటకు వలసినన్ని యోడలను యీరేవు సమకూర్పగలదనుట నిశ్చయము”

ఈవిధముగా ఈస్టిండియాకంపెనీవారిచే వృద్ధిచేయబడిన భారత నౌకాదళము ప్రథమ ద్వితీయ బర్మాయుద్ధంబులందును చీనాయుద్ధమందును వారికిచాల నుపయోగించెను. హిందూమహాసముద్రమున నేగాక పర్షియన్‌గల్ఫ్, ఎర్రసముద్రము, తూర్పుఆఫ్రికా తీరములందుకూడ గొప్పసేవనొనర్చెను. ఈపరిశ్రమయొక్క క్షీణదశనుగూర్చి వ్రాయుటకుపూర్వము భారతీయులకు నౌకానిర్మాణకళయందుగల ప్రజ్ఞావిశేషములనుగూర్చి యఫ్. బాల్టజమ్ సోల్విన్సు (F. Baltazam Solvyns) అనుఫ్రెంచి మహనీయుడు తనగ్రంథములో ఏమివ్రాసెనో గమనింతము. “నౌకానిర్మాణమందు ప్రాచీన భారతీయులు సర్వోన్నత స్థానము నలంకరించిరి. ఈకళయందిప్పటికికూడ భారతీయులు ఐరోపాదేశమున కాదర్శప్రాయులై యుండగలరు. నౌకానిర్మాణకళయందు అభినివేశముగల ఆంగ్లేయులు హైందవులవలన పెక్కువిషయములు నేర్చుకొని ఉత్తీర్ణులైయుండిరి.........భారతయోడలుబహువిధోపయోగములై సుందరమై మన్నికయందును పనివానితనమందును గూడ ఆదర్శప్రాయముగనున్నవి”

క్షీణదశ

నేకాలమునాటినుండి మొగలాయీల పరిపాలనంతమువరకును నవనవాభివృద్ధిగాంచి, పేరెన్నికగన్న హైందవ నౌకావాణిజ్యము, నౌకానిర్మాణము, ఆంగ్లపరిపాలనలో నానాటికి క్షీణించిన [illegible] పెక్కు [illegible] విరాళములాయెను. [illegible]

పారతంత్రీణదశ 1840 వ సంవత్సర యనంతర మారంభమాయెను. అప్పటినుండియు పెద్దపెద్ద ఓడలేమియు నిర్మింపబడలేదు. హైందవ పరిపాలన మాంగ్లేయ సార్వభౌముని హస్తగతంబయిన కొలదికాలము లోనే 1863 వ సంవత్సరము ఏప్రిల్ నెలలో తుట్టతుదకు నిశ్శేషముగ నిర్మూలింపబడెను"

భారతవస్త్ర పరిశ్రమను నాశనముచేయుటకెట్లు ప్రయత్నించిరో అట్లేనౌకాపరిశ్రమ నంతరింపజేయుటకుకూడ ఆంగ్లేయవర్తకులుబద్ధకంకణులైరి. వర్తకసరకులను గైకొనివచ్చిన హైందవ యోడలును లండనురేవులోగాంచినపుడు వారికి మిక్కిలి కష్టముగనుండెను. తమనౌకావ్యాపారమునకు నష్టమువాటిల్లునని ఆందోళనము సేయసాగిరి. ఈ విషయమును టేలర్ యను ఆంగ్లేయ ఇతిహాసికుడే చక్కగ వర్ణించియున్నాడు. 'హైందవ సరకులను తీసికొని భారతనావలు లండన్ రేవుస్థానము చేరినపుడు వర్తకులలో గొప్పయాందోళన ముద్భవించెను. శత్రుపక్షనౌకాదళము థేమ్సునదిలో గన్పించినను అట్టిభావముకలుగదు. ఈఆందోళనములో లండనురేవుపట్టణపు నౌకానిర్మాతలు నాయకత్వమువహించిరి. తమవ్యాపారము నాశనమగుటకు సిద్ధముగనున్నదనియు నావికానిర్మాతల కుటుంబములు తిండిలేక మలమలమాడిపోవు స్థితికి వచ్చుట నిశ్చయమనియు వారు వెల్లడిచేసిరి."

ఆంగ్లవర్తకుల కట్టిభావమెప్పుడుకలిగెనో అప్పుడేభారత నౌకాపరిశ్రమ వినాశనము ఆసన్నమైనదని చెప్పవచ్చును. భారతనౌకలలో వర్తకపుసరకులను పంపకూడదని ఈస్టిండియా కంపెనీవారు నిశ్చయించుకొనిరి. ఇంతేయగాక హైందవులకు ఓడలమీద ఉన్నతోద్యోగములు గూడ నివ్వబడకుండెను. అప్పటినుండియు భారతీయ నౌకావ్యాపారము నకు [illegible]

| | 1857 ఓడలు. | టన్నులు |
|---|---|---|
| భారతదేశపునౌకలు (వచ్చినవి, వెళ్ళినవి,) | 34,286 | 1,219,958 |
| బ్రిటిషు బ్రిటిషుఇండియన్ నౌకలు ...... | 59,441 | 2,475,472 |
| 1898 99 | | |
| భారతనావలు (వచ్చినవి. వెళ్ళినవి.) | 2,302 | 133,033 |
| బ్రిటిషు బ్రిటిషుఇండియన్ ఓడలు. | 6,219 | 7,685,009 |
| అన్యదేశీయములు | 1,165 | 1,297,604 |

నలుబది సంవత్సరములలో భారతీయ నావికాపరిశ్రమమెంత క్షీణించెనో, పైయంకెలే వెల్లడిచేయుచున్నవి.

"పశ్చిమదేశ సముద్రాధిదేవత, ప్రాక్సముద్రాధిదేవతను నిర్మూలించిన విధముకంటె హృదయవిదారుణమగు విషయము మఱొకటిలేదు." (డిగ్బి.)

నావికానిర్మాణపరిశ్రమయొక్క ప్రస్తుత స్థితినిగూర్చి (క్రీ. శ. 1912 సం॥ము) రాధా కుముద ముఖర్జీగారు 'ఉపసంహారమున' నియంకెలనిచ్చి యున్నారు. హిందూదేశముయొక్క వాణిజ్యమున, మొత్తము 1,18,00,000 టన్నులు బరువుగలపదార్థములు సముద్రపుటోడలు మోసయుండెను. ఇందు, 95,000 టన్నుల సరకులను మాత్రమే హైందవనావలు భరించినవి. అనగా మొత్తము వ్యాపారములో పన్నెండవవంతు మాత్రమే హైందవనావలు పాల్గొనెను. మిగిలిన వ్యాపారమంతయు విదేశనావలపైననే జరిగెను, 'కోస్తా' వర్తకములోగూడ (Inter Portal trade) హిందూదేశపుయోడలు తొమ్మిదవ వంతు మాత్రమే భారమునువహించెను. ప్రస్తుతము మనదేశమున సముద్రవ్యాపార మొనర్చు నోడలు (80 టన్నులకు హెచ్చునవి) 130 మాత్రమున్నవి. కోస్తావర్తకమున (20 టన్నులవి) 7,280 ఓడలు పనిచేయుచున్నవి. నావికానిర్మాణము చాలక్షీణించిపోవుటచే, నాకృషివలన నేడు 14,321 మందికిమాత్రమే జీవనోపాధి కల్గుచున్నది. సం॥నకు 125 యోడలుమాత్రము నిర్మింపబడుచున్నవి.

శ్రీ ...

## 6 వ ప్రకరణము.

### ఇతర పరిశ్రమలు.

అయఃపరిశ్రమ :- అయఃపరిశ్రమకూడ భారతదేశమున మిక్కిలి ప్రాచీనకాలముననే జనన మొంది క్రమముగ వృద్ధిగాంచెను. "ఇనుము పోతపోయుట ఇంగ్లాండు దేశమునకొలదిసంవత్సరములనుండియే అభ్యసింపబడుచున్నది. ఇనుమును కరగించి శుభ్రపరచుట, కాచి సుత్తెవేయుట, ఉక్కును చేయుట, మున్నగు కౌశలము భారతీయులనాదినుండి యుకలిగియున్నారని ప్రొఫెసర్ విల్సన్ వ్రాసియున్నాడు. "మొన్న మొన్నటివరకును ఉక్కును కాచి చల్లార్చుటయందు హైందవులుమిక్కిలి నిపుణులనిప్రసిద్ధి గాంచియుండిరి. ఇప్పటికిని 'డమాస్కసు' కత్తులు మిక్కిలి ప్రశంసింపబడుచుండెను. కాని పారశీకులును, వారిద్వారా అరబ్బులును, ఈవిద్య యందలి మర్మమును గ్రహించినది హిందూదేశమునుండియే. ఇప్పటికి 1500 సంవత్సరములక్రిందట నిర్మింపబడినట్టియు, 10 టన్నులభారము కలిగినట్టియు, కుతుబ్ మినారు దగ్గరనున్న అయఃస్తంభమును, పూరీజగన్నాథములోని ఇనుప బాహుదూలములును, రమ్యమగు చెక్కడపుపనిగల సోమనాథ దేవాలయద్వారములును, నూర్ వారు (Nurvar) లోనున్న 24 అడుగులు పొడవుగల ఇనుపఫిరంగులును, గతించిన లోహపరిశ్రమ యొక్క జ్ఞాపక చిహ్నములై యొప్పారుచు, హైందవుల యత్యున్నతమగులోహశోధన విద్యానైపుణ్యమునకు తార్కాణములుగనున్నవి." (Quoted in Hindu Superiority) కాపున ఇనుపపనియందును భారతదేశము ప్రథమస్థానము నహించియుండెనని చెప్పుటలో నతిశయోక్తి ఇసుమంతయు లేదు.

ఈపరిశ్రమయందు భారతీయులు గడించిన నిరుపమాన ... కౌశల్యమునుగూర్చి కొంచెము తెలిసికొందము. పూర్వము భారత వర్షమున తయారుచేయబడినఉక్కు నాణ్యమునందును, మన్నిక

యందును, నేడమెరికా, ఐరోపాఖండములలో తయారగుచున్న పరిశుద్ధమయిన ఉక్కునకెంతమాత్రము తీసిపోదు. 1913-14 సంవత్సరమున భండార్కరు (Superintendent of Archacology) భిల్సాదగ్గర (గ్వాలియర్ సంస్థానములో) ఒకప్రాచీన స్తంభముక్రింద రెండుఉక్కుతునుకలను కనుగొనెను. వానిని ఈవిద్యయందు నిపుణులగు సర్ రాబర్టుహ్యాడు ఫీల్డునకు (Sir Robert Had field) శోధనార్థము పంపెను. పరిశోధించిన పిమ్మట 'హ్యాడుఫీల్డు' ఆ యినుపముక్కల నాణ్యమునుగూర్చి ఇట్లు ప్రశంసించెను. "ముఖ్యమయిన విషయమేమన నేనీమధ్య కొలది సంవత్సరములనుండి అనేక విధములగు పూర్వకాలపు ఇనుమును పరీక్షించియుంటిని. కాని యందేదియు నిక్కాలపు ఉక్కువలె, తగినంత బొగ్గును (కార్బను) కలిగియుండలేదు. కాల్చిచల్లార్చుట వలన గట్టిచేయబడినట్టి పూర్వకాలపు కార్బనుస్టీలు (బొగ్గుగలఉక్కు) ప్రస్తుతకాలమున ప్రదర్శింపబడుట కిదియే మొదటి పర్యాయము" ఈఉక్కుముక్కలు తయారుచేయబడినకాలము క్రీస్తునకు 140 సంవత్సరములు పూర్వమయియుండుననికూడ నతడు నిరూపించియున్నాడు. ఇప్పటిపాశ్చాత్య అయఃకర్మాగారములందు తయారగు ఉక్కునకు తుల్యమగు ఉక్కును, భారతీయులంత ప్రాచీనకాలమున చేయగలిగియుండుటయు సంస్తవనీయముగదా!

ఢిల్లీనగరమునకు సమీపమునందున్న అయఃస్తంభము "ప్రాచీన భరతశిల్పాచార్య సత్కళా విజయధ్వజమువోలె" వెలయుచు, నేడు నిర్మించినట్లున్నది. దానినిర్మాణకాలమును చరిత్రకారులు నిరూపింపజాలకున్నారు అదినిర్మింపబడి కనీసము 1500 సం॥ లైన నయియుండవలెనని ఫెర్గూసన్ (Ferguson) అభిప్రాయపడుచున్నాడు. కొలది సంవత్సరములక్రితమువరకును ప్రపంచమందలిగొప్ప కర్మాగారములకు కూడ నిట్టి అయఃస్తంభమును నిర్మించుట దుస్సాధ్యముగ నుండెననియు,

నేటికిని ఇంతపాడవగు లోహపు కడ్డీని తయారుచేయగల కర్మాగారములు మిగులస్వల్పముగ నున్నివనియు 'బాల్' యను నాంగ్లేయ శాస్త్రజ్ఞుడు వ్రాసియున్నాడు. ఈ స్తంభము వందలకొలది సంవత్సరములనుండియు నెండ కెండుచు వానకుతడియుచున్నను, తుప్పుపట్టకుండుటయు, దానిమీదనున్న శాసన మిప్పుడువ్రాయబడినదా యన్నట్లు స్పష్టముగనుండుటయు, జూడ అయఃపరిశ్రమయందలి నిపుణులకే ఆశ్చర్యము గలుగుచున్నది.

పూర్వకాలముననీ పరిశ్రమ విశేషవ్యాప్తికలిగి యుండెను. పలురకములగువస్తువులు చేయబడుచుండెను. భారతీయులు తమకవసరమగు ఇనుపసామగ్రిని సమకూర్చుకొనుటయేగాక విదేశములకు సహితమెగుమతి చేయుచుండిరి. వారుతయారుచేసిన సామానులు గుణమునందును, మన్నికయందును, లోకవిఖ్యాతిగాంచెను. అస్సాముందు గొప్ప పరిమాణముగల ఫిరంగులు చేయబడుచుండెను. జగత్ప్రసిద్ధిగాంచిన డమాస్కసు కత్తులనుచేయుట కుపయుక్తమగుఉక్కును భారతదేశమే సమకూర్చుచుండెను. ఆకాలమున పారసీకవర్తకులీదేశమునకువచ్చి ఉక్కుసామగ్రినికొని ఆసియాఖండమందలి ఇతర దేశముల కెగుమతిచేసి లాభమును బడయుచుండిరి. ఒకానొక సమయమున నింగ్లాండునందును, కత్తులు మొదలయినవి చేయుట కిండియాదేశపు ఉక్కుఎక్కువగ వాడబడుచుండెను.

ఇంతప్రాచీనమగు ఇనుప పరిశ్రమను పెంపొందింప జేయుటకు దొరతనమువారు తగుశ్రద్ధవహింపకుండుట కడుశోచనీయము. అయఃపరిశ్రమవిషయమై మనదేశమున "ప్రకృతియొక్క సమృద్ధియు పురుషునియొక్క దారిద్ర్యమును కన్పించుచున్నవని" కెప్టెన్ జాన్ పెండు నుడివియున్నాడు. మనదేశమందు ప్రశస్తమయిన ఇనుపగనులు విస్తారముగనున్నవి. ఈగనులనుండి పరిశుభ్రమయినలోహమును సులభముగ

తీయవచ్చును. అయినను వాణిజ్యదృష్టితో వీక్షించినయెడల మనదేశమున అయఃపరిశ్రమలేదనియే చెప్పవచ్చునని 1893 సం॥ మున నర్థశాస్త్రపారంగతుఁడగు మహాదేవగోవింద రనడే వ్రాసియున్నాఁడు.

మనదేశమున అయోమార్గనిర్మాణమున కుద్యమించినపుడే, అయఃపరిశ్రమాభివృద్ధికికూడ దొరతనమువారు పూనుకొనకుండుట వారిసంకుచితదృష్టినే తెలుపుచున్నది. హిందూదేశమునఆంగ్లవర్తకము పెంపొందించుటయే వారియుద్దేశముగనుండెను. అందుకనుగుణ్యముగ అయోమార్గములనిర్మించిరి. ఇనుప పరిశ్రమనుకూడ వృద్ధిచేసినచో రైల్వేలకు మిక్కిలిచౌకగ ఇనుపసామగ్రి దొరకియుండెడిది. ఇట్టివిధాన మవలంబించమని దొరతనము వారికి రనడే మొదలగు అర్థశాస్త్రజ్ఞులు చాలకాలముక్రిందటనే సలహానిచ్చియుండిరి. "హిందూదేశపు ఆర్థిక భూగర్భశాస్త్రమను గ్రంథమున 'బాల్' (Ball) అనునొక ఆంగ్ల శాస్త్రజ్ఞుడు అయోమార్గముల నిర్మించినపుడే, దొరతనమువారు అయః పరిశ్రమనుకూడ బాగుగా పెంపొందించి యుండినయెడల భారతదేశమునకు చాలలాభము కలిగియుండెడిదని నుడివియున్నాఁడు.......... ఇనుపసామగ్రిని తయారుచేయుటకు కర్మాగారములు దేశమంతటను స్థాపించియుండినయెడల 'బాల్' గారియభిప్రాయానుసారము దేశమునందెక్కున ధనమును వ్యాప్తియందుంచుటకు దొరతనమువారికి వీలుండెడిది. ఇంతియగాక ఇప్పుడు జీవనోపాధికొరకు వ్యవసాయముపై మాత్రమే యాధారపడియుండవలసి వచ్చిన జనసమూహమునకు పనికల్పింపబడియుండెడిది. అట్టి యమూల్యమయిన యవకాశము జారవిడువబడినది. అందుచే, నూటయేబదివత్సరముల బ్రిటిషు పరిపాలనానంతరము కూడ మనదేశమున అయఃపరిశ్రమాధారములు వృద్ధికాకుండుటయు, ఇచ్చటనుండి ఇనుపసామగ్రికొరకు ప్రతివర్షమును 10 కోట్లరూప్యములు (ఇప్పుడు 20 కోట్లవరకును హెచ్చినది) ఇతరదేశములకు పోవుచుం

డుటయు, ఇనుము కఱఁగించి సామగ్రి తయారుచేయు ప్రాచీన కార్మికు లావృత్తిని, గోలుపోవుటయునను విపరీతస్థితు లేర్పడినవి."

మన దేశమందలి ఇనుపగనులను వినియోగించి, పరిశ్రమను వృద్ధిచేసినచో, నమితలాభము కలిగియుండెడిదనుటకు తాతాకంపెనీవారి అయఃకర్మాగారమే ప్రబలతార్కాణము. ఈకర్మాగారముల ప్రశస్తమయిన ఉక్కును, ఇనుమును తయారగుచున్నది. అయోమార్గముల కుపయోగించు సామగ్రికూడ కొంతవరకు చేయఁబడుచున్నది. ఫిరంగుల కుపయుక్తమగు ఉక్కును, రయిలుబద్దెలును, మెసపొటోమియా, ఈజిప్టులలోనున్న బ్రిటిషుసైన్యములకు సమకూర్చి ఈకర్మాగారము సామ్రాజ్యమున కమూల్యమగు సేవజేసియున్నది. వంగదేశమునందలి బెంగాల్ ఐరన్ అండు స్టీలుకంపెనీ (Bengal Iron and Steel Co, యందుకూడ, ప్రశస్తమయినఉక్కును, కడ్డీయినుమును (Pig Iron,) తయారుచేయబడుచున్నవి. కావున అయోమార్గముల నిర్మించిన నాటినుండియు, అయఃకర్మాగారములను స్థాపించి పనిచేసియుండినచో, దేశమున కమితలాభము కలిగియుండెడి దనుట నిర్వివాదాంశము. కాని హైందవపరిశ్రమల నభివృద్ధిచేయుట ప్రభుత్వము యొక్క విధానము కాకపోవుటచే అట్లు జరిగియుండలేదు.

దేశమునందు ప్రశస్తమగు ఇనుపగనులు విస్తారమున్నను,లోహమును శోధించి, శుభ్రపరచు విధమును నేర్పుటకు మంచిపాఠశాల యొక్కటయినను లేకుండుట ప్రభుత్వమునకు దేశీయపరిశ్రమలయెడల గల విముఖత్వమునే సూచించుచున్నది. ఇంజనీరింగు కళాశాలయందీవిద్యగఱపుటకు కొంతయవకాశ మేర్పరుపబడినను,అదియంతప్రోత్సాహకరముగ లేదు. 1905 సం॥మున స్థాపింపబడిన మైనింగు అండుజియాలాజికల్ ఇన్స్టిట్యూట్' నందు 1913-14 సంవత్సరమునకు 308 సభ్యులు మాత్రమే యుండిరి. తాతా అయిరన్ అండు స్టీలువర్క్సు కంపెని,

దేశీయ సంస్థయై, అయఃపరిశ్రమను పునరుద్ధరించుటకు ప్రయత్నించుచున్నది. పండిత మదనమోహనమాలవ్యాగారి యాజమాన్యముననున్న కాశీ హిందూవిశ్వవిద్యాలయమునందు లోహశోధనవిద్యగఅపుట కేర్పాట్లుగావించుట ఎంతయు శుభసూచకము. అయినను నీవిషయమై చాల కృషిసలిపి, మన యినుపపరిశ్రమ తిరిగి ప్రాచీనౌన్నత్యమును గాంచునటు చేయవలసియున్నది.

మన దేశమందు 1921వ సంవత్సరమున 21 కోట్ల రూప్యముల విలువగల 9,42,084 టన్నుల యినుముత్పత్తియయ్యెను. తాతా కంపెనియందు 2,81,541 టన్నులును, బెంగాలి అయిరన్ కంపెనియందు 86,445 టన్నులున్ను, కడ్డీయినుము (Pig Iron) తయారుచేయబడినది. మఱియు తాతాకంపెని 1,25,336 టన్నుల ఉక్కును (రైలు బద్దెలతోసహా) 3,076 టన్నుల (ఇనుము-మాంగనీసు) మిశ్రలోహమును, బెంగాలు ఐరన్ కంపెనీ 27,219 టన్నులపోతయినుమును, తయారు చేసెను.(Indian year Book 1923 P. P. 3/0)

మేంగనీసు (Manganese)

లోహములలో మ్యాంగనీసు చాల ముఖ్యమైనది. ఈలోహమును సుమారు 30 సంవత్సరములనుండి గనులలోనుండి త్రవ్వుటయారంభమైనది. ఈపరిశ్రమ అచిరకాలములో వృద్ధిగాంచుటచే ప్రస్తుతము మేంగనీసు ఉత్పత్తిచేయు దేశములందు భారతవర్షము ప్రథమస్థానమాక్రమించియున్నది. (Indian year Book 1915) ప్రథమమున 1892 వ సంవత్సరములో విశాఖపట్టణము జిల్లాయందలి గనులను త్రవ్వ నారంభించినపుడు, 674 టన్నులు లోహము తయారయ్యెను. విశాఖపట్టణముజిల్లా గనులకంటెను విలువగల మధ్యపరగణాలయందలి గనులలో పని యారంభించిన తరువాత 1909 వ సం॥ నాటికిమేంగనీసుయొక్క ఉత్పత్తి 92,008 టన్నులవరకు వృద్ధియయ్యెను. ఈలోహము

మధ్యపరగణాలు, చెన్నరాజధాని, మధ్యహిందూస్థానము, మైసూరు రాష్ట్రములందు విస్తారముగ దొరకును. మధ్యపరగణాలయందు విశేషముగ నుత్పత్తియగుటయేగాక, యిచ్చటదొరకు ముడిలోహము మిక్కిలి ప్రశస్తమయినదయి, నూటికి 50 పాళ్ళు శుద్ధమగు మేంగనీసును కలిగియున్నది. మనదేశమున గనులనుండి ఎత్తబడుచున్న మేంగనీసు, కరగించి సుభ్రపరచి, అయఃపరిశ్రమయం దుపయోగించుటకు ఇంగ్లాండు, అమెరికా, జర్మనీమున్నగు విదేశముల కంపబడుచున్నది. ఇట్టి సహజసంపద యుండిననేమి? పరిశ్రమాభివృద్ధికై ప్రభుత్వము పూనుకొనక పోవుటచే హైందవ భాగ్యము పరదేశములకు తరలిపోవుచున్నది. 1921 సంవత్సరమున మనదేశమందు 1,537,068 పౌనులు విలువగల 679,286 టన్నుల మేంగనీసు లోహముత్పత్తియైనది.

రాతిబొగ్గు.

పరిశ్రమల యభివృద్ధికి మిక్కిలి యుపయుక్తమగు రాతిబొగ్గుకూడ మనదేశమున విస్తారము దొరకును. హిందూదేశమున ఉత్పన్నమగు బొగ్గులో చాలభాగము వంగదేశపు గనులనుండి త్రవ్వబడుచున్నది. బంగాళా జమీందార్లు తమకున్న యవకాశమును జారవిడువక సద్వినియోగముచేయుచున్నారు. కావున లాభములోకొంతభాగమయినను, హిందువులనుభవించు ఖనిజపరిశ్రమ ఇదియొక్కటియేయని చెప్పవచ్చును. బంగాళమునందలి గోండ్వానాగనులు మనదేశమునందలి బొగ్గుగనులలోకెల్ల ముఖ్యమయినవి. సింగరేణీ, ఝరియా, రాణిగంజగనులు ద్వితీయస్థాన మాక్రమించుచున్నవి. 1921 వ సంవత్సరమున భారత వర్షమున 1,83,58,934 టన్నుల రాతిబొగ్గు త్రవ్వబడినది. 14,89,282 టన్నులు విదేశములనుండి (ఇందులోసగము ఇంగ్లాండునుండి) దిగుమతియైనది. ఇక్కడనుండి 18,88,228 టన్నులు విదేశముల కెగుమతి చేయబడెను.

బంగారము.

భారత వర్షమున ఉత్పత్తియగుచున్న బంగారములో చాల భాగము మైసూరునందలి కోలారుగనులనుండి వచ్చుచున్నది. 1905 వ సంవత్సరమున ఈగనులయందలి సువర్ణోత్పత్తి మహోన్నతి గాంచెను. 1905 వ సం॥రమున 616,758 ఔన్సులబంగారముత్పన్నమయ్యెను. 1906,7 సంవత్సరములలో ఈగనులయందలి బంగారముయొక్క ఉత్పత్తి కొంచము తగ్గెను. తరువాత సంవత్సరములయం కెలు కొలది యభివృద్ధిని సూచించుచున్నవి. ఈకోలారు బంగారుగనుల నొక బ్రిటిషువర్తకసంఘమువారు పనిచేయుచున్నారు. కోలారు గనుల తరువాత నైజాంరాష్ట్రమందలి 'హట్టి' గనులు ముఖ్యమయినవి. కాని వీనియం దుత్పన్నమగుచున్న బంగారము మిక్కిలి స్వల్పము.

హిందూదేశమందుత్పన్నమగుచున్న బంగారము.

| | ఔన్సులు | విలువ |
|---|---|---|
| 1921 వ సం॥ము | 43,27,22,593 | రూ 3,07,58,627 లు. |

రాగి.

మనదేశమందు రాగి గనులుకూడ విశేషముగ నున్నవి. ఉత్తర హిందూస్థానమం దీగనులు విస్తారముగనున్నవి. కాని ఎచ్చటను లాభకరముగ పనిజరుగుటలేదు. విదేశములనుండి 2,000,000 పౌనుల విలువగలరాగి దిగుమతి యగుచున్నది.

ఇతరఖనిజములు.

1919 వ సంవత్సరమున హిందూదేశము దుత్పత్తియైన యితర ఖనిజముల మొత్తములు సహజసంపదయను ప్రకరణమున (పేజి 7) ఇయ్యబడినవి. వీనిలో ఉప్పునుగూర్చి మఱియొకచోట వ్రాసియున్నాము. అది ప్రభుత్వమువారి గుత్త, కిరసనాయిలు, అభ్రకము, సీసము మున్నగునవి విశేషముగ నైరోపీయనుల చేతుల యందున్నవి.

## నీలిమందు.

భారతదేశము ప్రాచీనకాలమునుండియు రంగువస్త్రములకును, అద్దకపుపనులకును ప్రసిద్ధిగాంచియున్నది. వస్త్రపరిశ్రమతో పాటు రంగులువేయుట, అద్దకమువేయుట మొదలగు చేతిపనులుకూడ వృద్ధిగాంచుచుండెను. దేశమునందు నేయబడిన వస్త్రములు, రంగువేయబడుటచే, విలువయందును, వ్యాప్తియందును అతిశయిల్లుచుండెను. కాబట్టి రంగుపనులయొక్క వృద్ధిక్షయములు కొంతవఱకును వస్త్రపరిశ్రమపై నాధారపడియుండెనని చెప్పవచ్చును.

మనదేశమున రంగుపదార్థములు విశేషముగ పలువిధములగు మొక్కలనుండియు, మూలికలనుండియు తయారుచేయబడుచుండెను. ఈవిధముగ రంగులనుచేయుట కనిపెట్టుటకు భారతీయులే ప్రప్రథములు. రంగువస్తువులలో నీలిమందు ముఖ్యమయినది. ఇండియాయందుత్పత్తియగుటచేత, నీలిమందునకు ఇంగ్లీషునందు 'ఇండిగో' యను పేరు వచ్చినది. ఇది దేశమందనేక స్థలములందు విస్తారము పైరగుచు, దేశీయ పరిశ్రమలందుపయోగింపబడుటయేగాక విదేశముల కెగుమతిచేయబడుచుండెను. పశ్చిమతీరమున విశేషముగ పైరగుచుండిన నీలిమందును, ఐరోపావర్తకులుకొని, సూరతురేవు పట్టణముద్వారా ఎగుమతిచేయుచుండిరి. పోర్చుగీసు వర్తకులు దీనిని 'లిస్బను' పట్టణమునకు గొంపోయి, డచ్చివారికి విక్రయించుచుండిరి. నీలిమందును విశేషముగ గ్రహించవలెనను కోరికడచ్చివారికి జనించుటచేతనే, డచ్చి ఈస్టిండియా కంపెనీ స్థాపింపబడుటయు, తన్మూలమున పూర్వదిశయందు పోర్చుగీసువారి ప్రభతగ్గుటయు సంభవించెను.

బ్రిటిషుపరిపాలనయొక్క ఆరంభదినములలో నీలిమందువర్తకమున ఐరోపియనులు గుత్తకలిగియుండిరి. వంగ, బిహారరాష్ట్రములందు నీలిమందువర్తకము చేసిన ఐరోపియనులు, దేశీయకార్మికులను

పెట్టినబాధలును, గావించిన క్రౌర్యములును వర్ణనాతీతములు. ఐరోపియను వర్తకులొనరించిన దురాగతములను డాక్టరు బుక్నన్‌గారు వివరముగావ్రాసియున్నారు. ఐరోపియన్ వర్తకుడు నీలిపంట పండించు కర్షకులను, తన బానిసలుగ చూచుచుండెను. దయాదాక్షిణ్యములు లేక కొట్టుచుండెను. వారిప్రవర్తన తనకుసంతృప్తికరముగ లేనపుడు, వారిని కారాగృహముల కంపుచుండెను. భూములవివాదములలోను, సరకుకొనునపుడును వ్యవసాయదార్లను మోసముచేయుచుండెను. ఐరోపియను వర్తకులొనరించు అక్రమములు హద్దుమీరియుండుటచే, నేరస్థులను శిక్షింపమని, దొరతనమువారుకూడ స్థానికదండనాధి కారులకుత్తరువుల జారీచేయవలసివచ్చెను.

ప్రస్తుతము నీలిమందు తయారుచేయుట మనదేశమునందలి పరిశ్రమలలో ముఖ్యమయినదికాదు. జర్మనులు కృత్రిమముగ నీలిమందును తయారుచేయుట కనిపెట్టినందున, 1897 వ సంవత్సరమునుండియు, మనదేశమున ప్రకృతిసిద్ధముగ నీలిమందును తయారుచేయుట క్షీణించినది. ఈపరిశ్రమెంత వేగముగ క్షీణించినదియు నీక్రిందియంకెలవలన స్పష్టమగును.

| | నీలిపంటయొక్క విస్తీర్ణము. | ఎగుమతులవిలువ. |
|---|---|---|
| 1901-2 ... ... | 791,000 ఎకరములు, ... | పౌ 1,234,837 |
| 1911-12 ... ... | 271,000 ... | ... పౌ 250,535 |

## జనపనార.

ఈపరిశ్రమ, మనదేశమున ఈమధ్య కొలదిసంవత్సరముల పూర్వమే ఆరంభింపబడినది. అరువది సంవత్సరముల పూర్వము జనపనారనుగూర్చి భారతదేశమందంతగా తెలియదని 'కాటన్'గారు తమ గ్రంథమున వ్రాసియున్నారు. ప్రపంచమందలి ఇతరదేశములలో జనపనార పంటవిస్తారము లేకపోవుటచేతను, ఉపయోగమునందు దీనికి

తుల్యమగునార మతియొకటిలేకుండుటచేతను, ఇతరదేశములన్నియు ఈనారకొరకు మనదేశముపైననే ఆధారపడియున్నవి. కావున ఇది ముఖ్యమగు పరిశ్రమయని వేరుగ చెప్పనవసరములేదు. విదేశముల కెగుమతిచేయబడుచున్ననారపై పన్నులువిధించి, ఈపరిశ్రమను రక్షించినచో, ప్రభుత్వమునకు వచ్చుఆదాయముకూడ వృద్ధిగాంచును. నార నెగుమతిచేయుటకంటె గోనెపట్టాలను తయారుచేసి ఎగుమతిచేయుటయే మంచిది.

జనపనార వంగదేశమునందు విస్తారము పైరగుచున్నది. ఈనార సేవ్యమగుచున్న భూమి 1922 వ సంవత్సరములో 1,445,806 ఎకరములుండెను. 42,36,828 బస్తాల నారఉత్పత్తిఅయినది. మన దేశమున పండుచున్ననారలో ఇంచుమించు సగముభాగము విదేశముల కెగుమతి చేయబడుచున్నది. మిగిలినభాగము కలకత్తాసమీపమందున్న మిల్లులలో నుపయోగింపబడుచున్నది. ఈజనప నారమిల్లుల పరిశ్రమ నిరాతంకముగవృద్ధిగాంచుచున్నది. అది ఎంత త్వరితముగవృద్ధి పొందుచున్నదియు నీక్రిందిపట్టికవలన స్పష్టమగును.

| సంవత్సరము. | మిల్లులు | మగ్గములు | కదుళ్ళు |
|---|---|---|---|
| 1879-80 | 21 | 5,500 | 88,000 |
| 1913-14 | 60 | 33,500 | 691,800 |
| 1920-21 | 77 | 41,600 | 869,900 |

నలుబది సంవత్సరములక్రితము విదేశముల కెగుమతియైన జనప నారవస్తువులకంటె నేడు రమారమి 40 రెట్లు అధికవిలువగల సరకు ఎగుమతి చేయబడుచున్నది. కాని ఇంచుమించుగ నీమిల్లులన్నియు ఆంగ్లేయుల యధీనమునందుండుటచే, లాభములన్నియు విదేశీయుల హస్తగతములగుచున్నవి. హైందవులకెట్టి లాభమును కలుగుటలేదు.

తేయాకు.

తేయాకు తోటలధికముగ ఐరోపియను వర్తకులచేతులందున్నవి. ఐరోపియనుల మూలధన ముపయోగించి, ఐరోపియనులయాజమాన్యమున పైరగుచున్న పంటలలో తేయాకే ముఖ్యమయినదని చెప్ప వచ్చును. ఐరోపియను వర్తకులయభివృద్ధిని పురస్కరించుకొని అస్సాముసందలి తేయాకు తోటలలో పనిచేయుటకు 'బాండు కూలీలను సమకూర్చుటకై దొరతనమువారు ప్రత్యేకశాసనములనిర్మించి, వారికెంతయు తోడ్పడుచున్నారు. ఈ తేయాకు తోటలందు కొందరుకార్మికులు బాండుకూలీలుగ పనిచేయుచు ఐరోపియనులవలన నెట్టికౄరబాధలకు లోనగుచుండినదియు ఎల్లరకు విదితమే.

మనదేశమున తేయాకు విశేషముగ పైరగుచున్నది. అస్సాము, వంగరాష్ట్రములందును, దక్షిణహిందూస్థానమందలి కొన్ని ప్రదేశములందును, తేయాకు విస్తారముగదొరకును. వివిధప్రాంతములందును తేయాకు ఎంతెంత పైరగుచున్నదియు క్రింద తెలుపబడినది.

| | | |
|---|---|---|
| అస్సాము | తూనికపౌనులు. | 234,314,061 |
| వంగదేశము | ... ... | 71,693,567 |
| బీహారు, ఒరిస్సా | ... ... | 384,514 |
| అయోధ్యపరగణాలు | ... ... | 1,491 887 |
| పంజాబు | ... ... | 1,663,547 |
| చెన్నరాజధాని | ... ... | 12,255,755 |
| తిరువాన్కూరు, కొచ్చిన్ | ... ... | 23,399,123 |
| బర్మా | ... ... | 134,122 |
| | మొత్తము. | 345,339,576 |

మనదేశమునుండి విదేశముల కెగుమతియగు ముఖ్యమైన పదార్థములలో తేయాకుకూడ ఒకటి. ఇట్లెగుమతియగు తేయాకునందు

మూడింట రెండుపాళ్ళు ఇంగ్లాండుదేశమే కొనుచున్నది. తేయాకు తోటలన్నియు ఐరోపియనుల యధీనమందుండుటచే, లాభములన్నియు విదేశీయుల హస్తగతములగుచున్నవని వేఱుగ చెప్పనక్కరలేదు. ఈ తోటలలో పనిచేయుచున్న దేశీయపనివాండ్ర వేతనములు మిక్కిలి స్వల్పముగనుండును.

## కాఫీ.

కాఫీపంట మనదేశమున నెట్లు నెలకొల్పబడినదియు మనకంతగా తెలియదు. సుమారు రెండుశతాబ్దములకు పూర్వము బాబాబూదన్ (Baba Budan) అను మహమ్మదీయ యాత్రికుడు మెక్కానుండి తిరిగి మైసూరుకువచ్చుచు; ఏడుకాఫీవిత్తులనుదెచ్చి మైసూరునందీపంట నెలకొల్పెనని చాలమంది గ్రంథకర్తలభిప్రాయపడుచున్నారు. ఇది నిజమే అయియుండవచ్చును. దక్షిణహిందూస్థానమున మైసూరు కొడగు తిరువాన్కూరు నీలగిరిమొదలగు ప్రదేశములందు కాఫీవిస్తారము పైరగుచున్నది. ఐరోపాదేశములందు బ్రెజిలియన్ కాఫీ మిక్కిలి చౌకధరల కమ్ముబడుచుండుటచే; మనదేశమునుండి విదేశములకు కాఫీవిత్తుల యెగుమతియంతగా అభివృద్ధిగాంచుటలేదు. 1921-22 సం॥మున మన దేశమున 2964 కాఫీతోటలుండెను. కాఫీపంటయందున్న మొత్తపు భూమి 216,746 ఎకరములు. ఆసంవత్సరమున 235,000 హండ్రెడు వెయిటుల కాఫీగింజలు విదేశముల కెగుమతిచేయబడినవి.



## 7 వ ప్రకరణము.

### పరిశ్రమలు క్షీణించుటచే గల్గినయార్థిక ఫలితములు:
### ఎగుమతి దిగుమతుల వ్యాపారము.

I

పరిశ్రమలు క్షీణించిననాటినుండియు భారతవర్షార్థిక చరిత్రయందు విషాదకరమగు నూతనశకము ప్రారంభమయ్యెను. అనాదినుండియు సించుమించుగ 18వశతాబ్దాంతమువరకునువివిధములగు పరిశ్రమలతోను, కళలతోను, వ్యవసాయముతోను శోభిల్లుచుండిన భారతదేశమునకు, చేతిపనులు క్షీణించుటచే జీవనోపాధికి కేవలము వ్యవసాయముమీదనే యాధారపడవలసిన స్థితి సంభవించెను. అసంఖ్యాకులగు భారతీయులకు జీవనోపాధిగ నుండిన పరిశ్రమలన్నియు నశించిపోయినవి. పూర్వము నూలువడుకుట, బట్టలు నేయుటయును పరిశ్రమలు స్త్రీలకును, పురుషులకును, బాలురకును, వృద్ధులకును పనిగల్పించుచుండెను. రైతులు తీరికసమయములం దీవృత్తులు చేసి, తమయాదాయములకు కొంత ద్రవ్యమును జేర్చుకొనుచుండిరి. ఇట్లే నౌకావ్యాపారమువలనకూడ అనేకులు జీవించుచుండిరి. ఈ పరిశ్రమలు క్షీణించుటచే, వారందరికిని వ్యవసాయమే గతియయ్యెను. నూతనముగ స్థాపింపబడుచున్న మిల్లులు ఈ నిర్వ్యాపారత్వమును తొలగింపజాలకున్నవి. ఏలయన మనమెన్ని నీటిసౌకర్యముల నేర్పఱచినను, వర్షములేని కొఱతను దీర్పగలమా? అదేవిధముగ గృహపరిశ్రమలు నశించుటవలన గల్గిన నిర్వ్యాపారత్వమును తొలగించుట కష్టము.

భారతదేశము జీవనోపాధికొరకు కేవలము వ్యవసాయముమీదనే యాధారపడియుండు స్థితికివచ్చుటకు మఱియొకకారణము కూడ కలదు. ప్రభుత్వము, ముడిసరుకులను (Raw Materials),

పరదేశముల కెగుమతి చేయునట్లు ప్రోత్సహించుటవలనగూడ నీఫలితమే గల్గుచున్నది. ప్రస్తుతము హిందూదేశము, ఇంగ్లాండు మొదలగు విదేశములకు పరిశ్రమల కుపయుక్తములగు ముడిసరకులను విస్తారమెగుమతి చేయుచున్నది. 18 వ శతాబ్దమున అధినివేశ రాజ్యములిట్టి స్థితియందే యుండెను. ఆంగ్లదేశమునకు ముడిసరకుల నెగుమతి చేయుటకును, అక్కడ తయారయిన వస్తువులను తిరిగి గ్రహించుటకును నుపయుక్తమగు జాగీరులవలె, ఇంగ్లాండు తన వలసరాజ్యములను చూచుచుండెను. కాని "అమెరికా స్వాతంత్ర్య యుద్ధా"నంతరము, తమ కనుకూలమగు రీతిని దేశాభివృద్ధిని చేసికొనుటకు, వీలు కలుగుటచే, తమ పరిశ్రమలను బ్రిటిషువర్తకుల పోటీవలన నశింపకుండ రక్షించుకొని, వలసరాష్ట్రములు బాగుపడెను. అప్పటినుండియు, ఇంగ్లాండునకు లోబడియున్న హిందూదేశము వలసరాష్ట్రముల స్థానమాక్రమించినది. ఆంగ్ల పరిశ్రమల కవసరమగు ముడిసరకులను పండించుచు, తయారయిన వస్తువుల తిరిగికొనుచు, నుండవలసినస్థితి మనకిప్పుడు సంప్రాప్తమైనది. ప్రత్తిపంటను గూర్చి యాలోచించినచో నీ విషయము స్పష్టమగును. ఇంగ్లాండుయొక్క వస్త్రపరిశ్రమకు ప్రత్తి యవసరమగుటచే 1788 వ సం॥ నుండియు, ఈస్టిండియా కంపెనీ డైరక్టర్లు హిందూదేశములో ప్రశస్తమగు ప్రత్తిని పండించుటకు కడు శ్రద్ధ వహించుచుండిరి. 1858 వ సం॥నుండి, హిందూదేశ ప్రభుత్వము గూడ, ఆంగ్ల పారిశ్రామికుల యభివృద్ధిని పురస్కరించుకొని, మనదేశమున పైరగుప్రత్తిని వృద్ధిచేయుటకు ప్రయత్నించుచున్నది. 1916 వ స॥మున నియమింపబడిన కాటన్ కమిటీ (ప్రత్తి యుత్పత్తివిషయమై ఆలోచించు సంఘము) యే దీనికి తార్కాణము.

పై నుదహరించిన రెండుకారణములచేతను దేశముయొక్క ఆర్థికస్థితి విషాదకరమగు మార్పును చెందినది. పరిశ్రమలు క్షీణించి

వ్యవసాయముమాత్రమే అధిక సంఖ్యాకులగు భారతీయులకు జీవనోపాధియగుచున్న హేతువుచే, నిత్యకృత్యముల కవసరమగు వస్తువులకు మనము విదేశములపై నాధారపడవలసి వచ్చినది. మఱియు ప్రభుత్వ విధానము, ముడిసరకుల యెగుమతిని ప్రోత్సహించుచుండుటచే, ప్రాణాధారములగు నాహారపదార్థములును, పరిశ్రమాధారములగు ముడిసరకులును అన్యదేశముల పాలగుచున్నవి. ఎగుమతి, దిగుమతుల వ్యాపారమును పరిశీలించినచో నీవిషయము మఱింత స్పష్టమగును.

## II

### ఎగుమతి దిగుమతుల వ్యాపారము.

హిందూదేశముయొక్క ఎగుమతి దిగుమతుల వ్యాపారము ఒక సంవత్సరముకంటె మఱియొక సంవత్సరము వృద్ధి పొందుచున్నది. దేశము భాగ్యవంత మగుచున్నదనుటకు ఈవాణిజ్యాభివృద్ధిని కొందఱు నిదర్శనముగ చూపుచుందురు. కాని ఈవ్యాపారముయొక్క నిజస్వభావమించుక పరిశీలించినచో నది సత్యదూరమని గోచరించక మానదు. దిగుమతులకంటె నెగుమతులు అధికముగానుండుట మనదేశపు వాణిజ్యముయొక్క సామాన్యలక్షణము. అనగా హిందూదేశమునుండి విదేశములకు పోయెడు వస్తువులవిలువ, విదేశములనుండి హిందూదేశమునకు వచ్చు వస్తువుల విలువకంటె, చాల నధికముగ నుండును. 1920-21,1921-22 సం॥ములలో మాత్రమిందుకు భిన్నముగ నుండినను, 1922-23 వ సంవత్సరమున, యథాప్రకారముగ మరల ఎగుమతులే ఎక్కువగనున్నవి. కావున హిందూదేశమునుండి ప్రతివత్సరమును కొంతద్రవ్యము వస్తురూపమునగాని, ధనరూపమునగాని ప్రతిఫలములేకయే, విదేశములకు తరలిపోవుచున్నదనుట నిస్సంశయము. ఇట్లు ప్రతిఫలరహితముగ తరలిపోయెడు 'ధనప్రవాహము'లో నధికభాగము

సీమఖర్చులరూపమున పోవుచుండును
ప్రకరణమున విపులముగ వ్రాయఁ

హిందూదేశమునుండి కొం
శూన్యముగ పోవుచుండుటయేగాక,
గమనింపదగిన యంశములుకలవు. అవసి
నున్న పదార్థముల నెగుమతి చేసినచో డె
జీవనమున కత్యావసరములగు నాహారపదార్థ
లగు ముడిసరకులును ఎగుమతి చేయబడినయెడ
జాలదు. కాని ఈక్రింద పొందుపఱచిన, మనదేశపు
చూచినచో ఆహారపదార్థములును, ముడిసరకులును
చున్నట్లు కనబడుచున్నవి.

ఎగుమతులు.

| | ఐరోపాయుద్ధమునకుపూర్వ మైదు సం॥లలో సగటున సం॥ 1కి | 1921-౨. |
|---|---|---|
| | లక్షల రూపాయలు: | లక్షల రూపాయలు: |
| 1. ఆహారపదార్థములు, పానయోగ్యములు, పొగాకు. | 62,95 ... | 53,51 ... |
| 2. పరిశ్రమల కనుకూలించు ముడిసరకులు. | 102,53 ... | 111,59 ... |
| 3. తయారైన వస్తువులు. | 51,88 ... | 61,67 ... |
| 4. ఇతర వస్తువులు. | 2,12 ... | 4,64 ... |
| మొత్తము | 219,50 ... | 231,38 ... |

1921-22 వ సంవత్సరమున ఎగుమతుల మొత్తములో నూటికి 23 వా॥న ఆహారపదార్థములును, 48 వా॥న పరిశ్రమల కుపయో

...తయారైన వస్త్రములును, ఎగుమతి
...గుమతి చేయబడినవానిలో ముఖ్య.

| | ...22 సం॥లో ఎగుమతి. | | మొత్తపు ఎగుమతిలో నూటికెన్ని పాళ్ళు. |
|---|---|---|---|
| | రూ 53,96 | లక్షలు | } 28 |
| ...లు) | 15,65 | ,, | |
| | 14,04 | ,, | } 17.7 |
| ...దది) | 29,99 | ,, | |
| ...లు, పప్పుదినుసులు; | 29,99 | ,, | 12 |
| ... | 1[illegible].22 | ,, | 7.3 |
| ...నూనవిత్తులు | 20,25 | ,, | 8.1 |
| | 7,92 | ,, | 3.2 |
| ...తోళ్ళు) | 10,02 | ,, | 4 |
| ఉన్ని (తయారైన వస్త్రములతోకూడ) | 3,26 | ,, | 1.4 |
| నల్లమందు | 2,05 | ,, | 1.1 |
| లోహములు | 3.55 | ,, | 1.4 |

ఈ ఎగుమతులలో, ఆహారపదార్థములును, పరిశ్రమాధారములగు ముడిసరకులును కలిసి నూటికి 71 పా॥న విదేశముల కెగుమతి యగుచున్నట్లు తేలుచున్నది. హిందూదేశము తన కనావశ్యకములగు సరుకులనుగాక ప్రాణాధారములైన ఆహారపదార్థములను ఎగుమతి చేయుచున్నది. మన కవసరమగుదాని నుపయోగించుకొని, మిగిలినభాగ మెగుమతిచేయు టుచితముకాని కోట్లకొలది భారతీయులు [illegible]చుండ, ధాన్యాదులు విదేశముల కంపబడుటకేమి శోచనీయము. ఎంతకాలమువరకు ప్రాణాధారములగు నాహారపదార్థ

ములు విదేశముల కెగుమతి చేయబడుచుండునో, అంతకాలమువరకును భారతదేశమున దుర్భిక్ష మంత మొందజాలదు. భారతీయులందరును రోజుకు రెండుపూటలు సంతృప్తికరముగ భుజించవలెనన్న, విదేశముల కాహారపదార్థముల నెగుమతిచేయుటనాపుచేయవలెనని సర్ విలియమ్ హాంటరు నుడివియున్నాడు. దేశమునం దవసరమైనచో, విదేశముల కీధాన్యానులేల పంపబడుచున్నవని ప్రశ్నింపవచ్చును. దుర్భరములగు పన్నులను చెల్లించుటకై, వ్యవసాయదారులు ధాన్యము లమ్మవలసిన వారగుచారు. విదేశవర్తకులీ ధాన్యమును కొని రైళ్ళసహాయమున రేవుస్థానములకు గొంపోయి, తమదేశముల కెగుమతి చేయుచుందురు. గొప్ప రేవుపట్టణములందున్న పెద్దధాన్యపుకొట్లను వీక్షించినచో ఆహారపదార్థముల ఎగుమతివ్యాపారమెంత విరివిగ సాగుచున్నదో గోచరించును. ఏడుకోట్ల భారతీయు లర్థాకలితో బాధపడుచుండ, దేశము నిరంతర క్షామమున కాస్పదమైయుండ ఆహారపదార్థములతో నిండిన యోడలు హైందవ రేవుస్థానములను విడిచి, విదేశములకు పోవుటకంటె విషాదకరమగు విషయము మఱియొకటి లేదు.

ఆహారపదార్థములేగాక దూది, జనపనార మొదలగు పరిశ్రమా ధారములగు సరకు లెగుమతి చేయుటవలనకూడ దేశమునకుచాలనష్టము సంభవించుచున్నది. హిందూదేశము పూర్వమొకప్పుడును పరిశ్ర మల కుపయోగించు సరకుల నెగుమతిచేసియుండలేదు. అవసరమగు వానికంటె నెక్కువగనున్న "తయారయిన వస్తువులనే" ఎగుమతిచేసి లాభము పొందుచుండెను. ఇప్పుడన్ననో, పరిశ్రమాధారములగు ముడి సరకు లెగుమతి యగుచుండుటచే, దేశమునందలి చేతిపనులు వృద్ధిపొం దుటకు వీలులేకున్నది. వస్త్రపరిశ్రమ కవసరమగు ప్రత్తియే, దేశీయు లకు లభ్యముగాకుండ విదేశముల కెగుమతి చేయబడినపుడు, వస్త్ర పరిశ్రమ యెట్లు వృద్ధిగాంచును? ప్రత్తి, జనపనార, పట్టు, ఉన్ని,

లోహములు ఎగుమతి యగుచుండుటచే, ఆయూపరిశ్రమలు వృద్ధిగాంచకుండుటయు, మనసరకులు విదేశములనుండి వచ్చుసరకుల పోటీకి నిలువజాలకపోవుటయు తటస్థించినది. ఇక దిగుమతు లెట్లున్నవో చూతము.

| దిగుమతులు. | యుద్ధమునకుపూర్వ 5 సం॥ లలో సగటున సం"మునకు | 1921_22 |
|---|---|---|
| 1. ఆహారపదార్థములు, పానయోగ్యములు, పొగాకు. | రూ 21,84 లక్షలు | 50,63 లక్షలు |
| 2. పరిశ్రమాధారములగు ముడిసరకులు. | 10,03 ,, | 22,01 ,, |
| 3. తయారైన వస్తువులు. | 111,80 ,, | 189,38 ,, |
| 4. ఇతర సరకులు. | 2,17 ,, | 4,32 ,, |
| మొత్తము. | 145,85 ,, | 266,35 ,, |

1921_22వ సంవత్సరములో దిగుమతియైన మొత్తములో నూటికి 19 చొ॥న ఆహారపదార్థములును, 8. 2 చొ॥న ముడిసరకులును, 71 చొ॥ న తయారైన వస్తువులును ఉండెను. ఇందు ముఖ్యమగు దిగుమతులిట్లుండెను.

| | | |
|---|---|---|
| నూలు, నూలువస్త్రములు. | రూ 60,38 | లక్షలు |
| యంత్రములు | 34,25 | ... |
| పంచదార | 27,50 | ... |
| ఇనుము, ఉక్కు_సామగ్రి | 21,13 | ... |
| ఇతరలోహములు | 5,06 | ... |
| పట్టు | 4,34 | ... |

| | | |
|---|---|---|
| రైల్వేసామగ్రి | రూ 18,91 | లక్షలు |
| ధాన్యము | 9,36 | ... |
| నూనెలు | 7,56 | ... |
| లోహసామగ్రి (Hardware) | 5,92 | ... |
| రాక్షసిబొగ్గు | 5,85 | ... |
| పనిముట్లు | 5,15 | ... |
| మోటారుబండ్లు | 2,71 | ... |
| కాగితములు, అట్టలు | 2,3[illegible] | ... |
| గాజుసామానులు | 2,27 | ... |
| అగ్గిపెట్టెలు | 2,03 | ... |

ముడిసరకుల నిచ్చటనే ఉపయోగపరచి, వస్తువులుగ తయారుచేయక, పరదేశముల కెగుమతిచేయుచుండుటచే, భారతదేశము నాగరకజీవనమున కవసరమగు వస్తువులన్నిటికిని, విదేశములపై నాధారపడియున్నది. మనకు నిత్యకృత్యములందుపయుక్తమగు వస్తుసంచయమంతయు పరదేశములనుండియే వచ్చుచున్నది. మనదేశములోనికి దిగుమతియగు వస్తువులలో నూటికి 80 పాళ్ళు పారిశ్రామిక వస్తువులే యుండును. వానిలో చాలభాగము వస్త్రములు, యంత్రములు, ఇనుపసామగ్రి, పనిముట్లు, గాజుసామానులు, మోటారుబండ్లు, కాగితములు, అగ్గిపెట్టెలు మొదలగు వస్తువులే యున్నవి. పరిశ్రమాధారములగు సరకులను గల్గియుండియు, భారతదేశము సకలవస్తువులకు నన్యదేశములపై యాధారపడియుండుట మిక్కిలి విచారకరము. వస్త్రపరిశ్రమ కవసరమగు ప్రత్తి పండుచున్నను, కార్మికులున్నను, మనము వస్త్రములకై విదేశములకు 60 కోట్లరూప్యములంపుచున్నాము. ఇనుపగనులు దేశమున విస్తారమున్నను, ఇనుపసామగ్రి, యంత్రములు, పనిముట్లు

ఇంగ్లాండు మొదలగు దేశమునుండి వచ్చుచున్నవి. నిప్పువేసికొనుట కగ్గిపెట్టెలు సహితము విదేశములనుండి వచ్చినగాని గతిలేకున్నది. కాగితములును, కలములునుకూడ ఇంగ్లాండునుండి తెప్పించుచున్నాము. వ్యవసాయము ప్రధానముగాగల దేశమైయుండి చెఱకుపండినట్టి భారత దేశమునకు అన్యదేశములనుండి 27 కోట్లు రూ. విలువగల పంచదార దిగుమతియగుస్థితి సంభవించెను. అనాదినుండియు సహజసంపదయును, చేతిపనులును గల్గియుండి మహదైశ్వర్యమననుభవించిన భారతవర్షమునకు నార్థికముగ పరాధీనత సంభవించెను. ఇట్టి యార్థికపరాధీనతకు మూలకారణము పరిశ్రమల వినాశనమేకదా !

దుర్భరమగు నీయార్థికపరాధీనతను తొలగించుటకు సంరక్షణ పద్ధతి నవలంబించి పరిశ్రమలను వృద్ధిచేసికొనుటయే మార్గము. మన దేశమునుండి ఎగుమతియగు ఆహారపదార్థముల మీదను, ముడిసరకులమీదను దేశములోనికి దిగుమతియగు పారిశ్రామికవస్తువులమీదను అవరోధపు పన్నుల నెక్కువగ విధించి దేశీయపరిశ్రమలను పెంపొందింపవలసియున్నది. ఆంగ్లదేశపరిశ్రమాభివృద్ధియు వాణిజ్యాభివృద్ధియు ప్రధాన కర్తవ్యములుగ నెంచు ప్రస్తుత ప్రభుత్వము ఇట్లుచేయుట కంగీకరింపదు. వర్తకముకొరకు వచ్చి, వర్తక విజృంభణోద్దేశముతోడ దేశమును జయించి, తమవర్తకపు లాభమునకై మనలను పరిపాలనము జేయుచున్న ఆంగ్లేయులు, దేశీయ పరిశ్రమాభివృద్ధియెడ విముఖత్వమును ప్రజల కష్టసుఖములయెడ నిర్లక్ష్యమును జూపుటలో నాశ్చర్యముండజాలదు. హిందూదేశ వాణిజ్య స్వభావమును పరిశీలించినచో ఇంగ్లాండున కవసరమగు ఆహారపదార్థములను, ముడిసరకులను సమకూర్చుటయు, తయారైన వస్తువులను తిరిగి వెలకు గ్రహించుటయు, యనురెండుపనులను చేయుటకై మనదేశము వినియోగింపబడుచున్నదని స్పష్టమగును. ఇక్కడనుండి ఎగుమతియగు వస్తువులలో నధికభాగము

ఇంగ్లాండు దేశమే గ్రహించుచున్నది. ఎగుమతియగుచున్న గోధుమలలో విశేషభాగము ఒక్కొక్కప్పు డంతయును, సీమ కంపబడుచున్నది. క్షామములు దేశమును పీడించు సమయములందైనను గోధుముల ఎగుమతి తగ్గుటలేదు. తగ్గినను బహుస్వల్పము. బార్లేగింజలు బియ్యము, తేయాకుకూడ విశేషముగ ఇంగ్లాండునకే పంపబడుచున్నవి. మనదేశమునుండి ఎగుమతియగుచున్న జనపనారలో చాలభాగమును, ఉన్నెయంతయును ఇంగ్లాండుదేశమే కొనుచున్నది. ఈవిధముగ ఇంగ్లాండు తన కవసరమగు పదార్థములను సమకూర్చు పెరటితోటవలె, భారతవర్షము నుపయోగించుచున్నదనుటలో నసత్యముండజాలదు.

ఇదియగాక, ఇంగ్లాండునందు తయారగు వస్తువుల సమ్ముల కుపయోగించు విక్రయస్థలముకూడ మనదేశమే. మనదేశములోనికి దిగుమతియగు వస్తువులలో నూటికి 60 పాళ్ళు ఇంగ్లాండునుండియే వచ్చుచున్నవి. ముఖ్యమగు దిగుమతులలో ఇంగ్లాండు పంపు భాగమెంతయుండునో, ఈక్రిందిపట్టికయందు తెలుపబడినది.

దిగుమతియగుచున్న ఈక్రిందివస్తువులలో
ఇంగ్లాండుపంపుచున్న భాగము.

| | 1913-14 | 1920-21 |
|---|---|---|
| | నూటికి | నూటికి |
| వస్త్రములు ... ... | 90 1 | 79.4 |
| పనిముట్లు ... ... | 75.3 | 67.6 |
| ఉక్కు, ఇనుము ... ... | 69.9 | 71.1 |
| లోహసామగ్రి (Hardware) | 57.2 | 57.9 |
| యంత్రములు ... ... | 89.8 | 78.3 |
| మోటారుకార్లు ... ... | 71.3 | 31.3 |
| రైల్వేసామగ్రి ... ... | 93.0 | 95.4 |
| సారాయి ... ... | 62 9 | 66.9 |
| కాగితములు ... ... | 56.0 | 43.9 |

కావున భారతదేశము ఆంగ్లేయుల కవసరమగు పదార్థములను సమకూర్చుటకేగాక, వారుతయారుచేసిన వస్తువులను తిరిగి వెలకు స్వీకరించుటకుకూడ నుపయోగింబడుచున్నదని తేలుచున్నది. తమవర్తకమును పెంపొందించుకొనుటకే అంగ్లేయులు మనదేశమును పాలించుచున్నారనుట కిదియే ప్రబల నిదర్శనము.

మనదేశముయొక్క వాణిజ్యము విషయమై మఱియొక సంగతి గమనింపవలసి యున్నది. భారతదేశముయొక్క ఆర్థికపరాధీనత ఇంగ్లండు పైననేగాక జపాను మొదలగు దేశములపైకూడ నెక్కువగుచున్నది. ఏబది యరువదిసంవత్సరముల క్రితము మనదేశముకంటెను వెనుకబడియుండిన జపానుదేశము పరిశ్రమలను వృద్ధిచేసికొని అత్యద్భుతమగు ఆర్థికౌన్నత్యమును గాంచుచున్నది. ఇక్కడనుండి ఎగుమతియగు ప్రత్తిలో చాలభాగము (నూటికి 60 పాళ్ళు) జపానుకొనుచున్నది. ఒకసంవత్సరముకంటె మఱియొక సంవత్సర మధికముగ వస్త్రముల మనదేశమునకంపుచున్నది. 1913_14 సం॥మున దిగుమతియైన వస్త్రములలో జపానుయొక్క భాగము నూటికి 1.8 మాత్రమే యుండ 1920_21 సం॥లో 14.6 వరకును హెచ్చినది. మనదేశపు దిగుమతులు ఏయేదేశమునుండి ఎంతభాగము వచ్చుచున్నవో దిగువపట్టికయందు తెలుపబడినవి.

దిగుమతులు.

| | 1913_14 | 1920_21 |
|---|---|---|
| | నూటికి | నూటికి |
| ఇంగ్లాండు (United Kingdom) | 64.1 | 60.9 |
| జర్మనీ | 6.9 | 1.4 |
| జావా | 5.8 | 4.6 |
| జపాను | 2.6 | 7.9 |
| అమెరికా (U. S. A.) | 2.6 | 10.5 |
| బెల్జియమ్ | 2.3 | 1.6 |
| ఇతరదేశములు | 15.7 | 13.1 |

1913-14 వ సం॥ మున మనదేశమునకు దిగుమతియైన వస్తువు లలో నూటికి 2.6 చొ॥ న అమెరికాయును (U. S. A.) పంపుచుం డెను. 1920-21 సం॥నకు జపానుసరకులు నూటికి 7.9 వరకును అమెరికాసరకులు 10 5 వరకును వృద్ధియైనవి. ఇట్లు ఇంగ్లాండు వస్తువులేగాక జపాను, అమెరికాదేశముల వస్తువులుకూడ మనదేశములో విరివిగా వ్యాపించుచున్నవి. భారతవర్షముయొక్క పరాధీనతయు హెచ్చుచున్నది. విదేశవస్తు బహిష్కారమును స్వదేశపరిశ్రమాభి వృద్ధియు గావించి భారతీయులచిరకాలములో మాతృదేశముయొక్క ఆర్థికపరాధీనతను తొలగించెదరుగాక !



# 8. వ ప్రకరణము.

## ధనప్రవాహము.

ధనప్రవాహమనగేమి? హిందూదేశమునుండి యింగ్లాండునకు ప్రతివర్షమును ప్రతిఫలము లేకయే వస్తురూపమునఁ గాని ధనరూపమునఁగాని పోవుచున్న ద్రవ్యమును ధనప్రవాహమందురు. ఈపదమునీ యర్థమునందు మార్టిన్ మొదలగు నాంగ్లేయప్రముఖులు వాడియున్నారు. ఇంతకంటె దుఃఖసూచకమైనను సత్యమును నిరూపించు "నెత్తురుతీయుట" యను పదము నొకప్పుడిండియా కార్యదర్శిగానున్న స్యాలిస్‌బరీ ప్రభువు వాడియున్నాడు. విలియమ్‌డిగ్బీగారీవిషయమున, "ఇదియంతయు బలిష్ఠమగు నొకదేశము బలహీనమగు మరియొక దేశముయొక్క రక్తమును బీల్చుట" యని వ్రాసెను. హిన్డ్మన్‌గారుకూడ తన "హిందూదేశపు దివాలా" (బ్యాంక్రప్ట్సీ ఆఫ్ యిండియా) యను గ్రంథమున "మనగొప్పవలసరాజ్యము యొక్క జీవాధారమగు రక్తమును దీసివేయుచున్న విదళితరక్తనాళము" అని వ్యవహరించియున్నాడు. కావున "నెత్తురు తీయుట" యను పదమే సరియగుభావమును వ్యక్తపరచుచున్నది. అయిన నీవ్యాసమునందు "ధనప్రవాహము" అను పదమునే వాడియున్నాము.

మంచి యార్థికస్థితి కలిగియుండిన దేశములందిట్టి ధనప్రవాహముండఁజాలదు. అట్టిదేశములనుండి విదేశముల కెగుమతిచేయబడిన సరకులకు ప్రతిఫలమేగాక కొంతలాభముకూడ వచ్చుచుండును. కావున నెగుమతులకంటె దిగుమతులెక్కువగ నుండును. ఒకవర్తకుడు విదేశములకు రూ. 100 విలువగల వస్తువులెగుమతిచేసె ననుకొనుడు. అతఁడు ఈనూరురూపాయిలేగాక దానిమీద కొంత లాభము గూడ నపేక్షించును. అతనికి నూరురూపాయలు లాభము రావల

యును. కావున దిగుమతులవిలువ యెక్కువ యుండవలెను. ఈవిషయము సామాన్య జ్ఞానముగల ప్రతిమనుజునికిని తెలియును. ఇంగ్లాండు మొదలగు దేశముల యార్థికస్థితి పరికించినచో నీవిషయము మఱింత స్పష్టమగును.

పదిసంవత్సరములు (1883-92)

| దేశములు. | దిగుమతులు (వెండిబంగారములుసహా) | ఎగుమతులు (వెండిబంగారములుసహా) | ఎగుమతులకంటె దిగుమతుల ఎక్కువ | నూటికి వాణిజ్య లాభము |
|---|---|---|---|---|
| | పౌ | పౌ | పౌ | |
| ఇంగ్లాండు | 4,247,954,247 | 3,203,603,246 | 1,044,351,001 | 32 |
| ఆస్ట్రేలియా | 643,462 379 | 582,264,839 | 61,197,540 | 10.5 |
| కనడా. | 254,963,473 | 205,063,294 | 49,900,179 | 24.4 |
| స్ట్రెయిట్సు సెటిల్మెంట్సు | 204,613,643 | 181,781,667 | 22,831,976, | 12.5 |

ఈ పదిసంవత్సరములలోనే హిందూదేశముయొక్క యెగుమతి దిగుమతులను జూచినచో, వర్తకలాభము లేకపోవుటయే గాక దిగుమతు లెగుమతులకంటెను తక్కువగ నున్నట్లు గోచరింపగలదు.

రూ. 9 442,793,180:—హిందూదేశముయొక్క ఎగుమతులు (ద్రవ్యములో సహా)

రూ. 1,888,558,630:—ఇతరదేశములవలెనే నూటికి 20 చొ॥ ఎగుమతులపైని రావలసిన వర్తకలాభము కలుపుకొనగా

రూ. 1.1,33,135,1810:—ఉండవలసిన దిగుమతులమొత్తము. కాని

రూ. 7,740,995,700:—యదార్థముగ నున్న దిగుమతులు.

రూ. 3,590,356,110:—ఇది హిందూదేశమునకు వచ్చినసష్టము. ఈ మొత్తమునకు బ్రతిఫలముగ హిందూదేశ

మునకు వస్తురూపమునగాని ధనరూపమున గాని యొక్క పైసయయినను వచ్చియుండ లేదు.

అందుచే నీమొత్తమంతయు గూడ హిందూదేశమున కాపది సంవత్సరములలోను గలిగిన నష్టమును (లేక హిందూదేశమునుంచి తరలిపోయిన ధనప్రవాహమును) సూచించుచున్నది.

(దాదాభాయి నౌరోజి పావర్టీ అండు అన్‌బ్రిటిషు రూలు 333,34 పేజీలు)

ఇట్లే ప్రతిసంవత్సరము కూడ దిగుమతులకంటె నెగుమతులె క్కువగనుండుటచే నపరిమితముగ మనదేశమునకు ధననష్టము కలుగు చున్నది. ఇదిపారతంత్ర్యముయొక్క ఫలితమని వేఱుగ జెప్పనక్కర లేదు. బ్రిటిషుపరిపాలనమున వాణిజ్యము యొక్క ఫలితము లిట్లుండ, హిందూ మహమ్మదీయ రాజులకాలమున "ధనప్రవాహము" లేకపో వుటయేగాక, యితర దేశములనుండి యపారముగ ధనము హిందూదేశ మునకు వచ్చి చేరుచుండెను.

హిందూమహమ్మదీయ యుగములలోని యార్థికస్థితి:—భారత దేశమునుండి రోముదేశమున కగుమతియగు సరకులకు ప్రతిఫలముగ 10 కోట్ల సెస్టరీలు (రోమనునాణెములు) ప్రతివర్షమున నిండియాకు బోవుచుండెనని క్రీ. శ. 70 సంవత్సరమున యును రోమనుచరిత్రకారుడు చింతిల్లెను. ఇట్లె హైందవరాజుల పాలనమున హిందూదేశము అన్య దేశములతో వర్తకముచేసి చాల లాభమును పొందుచుండెను. కాని యొకప్పుడును నష్టము ననుభవించలేదు. ఈవర్తకలాభమే ప్రాచీన హైందవ సౌభాగ్యమునకు ముఖ్యకారణముగనుండెను. హైందవ రాజులు స్వదేశీయులగుటచే వారికాలమున విదేశములకుధనము తరలి పోకుండుటసహజమే. మహమ్మదీయులు పరదేశీయులయినను, నీదేశమునే మాతృదేశముగ భావించి, యిచ్చటధనము నిచ్చటనే వెచ్చించిరి. గాని విదేశములకు గొంపోలేదు. ఆంగ్లమహమ్మదీయ పరిపాలనములకు

గల యార్థిక తారతమ్యమును గూర్చి రమేశచంద్రదత్తుగారిట్లు వ్రాయు చున్నాడు "మొగలాయీల రాబడియంతయు నీదేశములోనే వెచ్చింపబడి వ్యవసాయమునకును, వర్తకమునకు ననేక విధముల తోడ్పడు చుండెనని మనము మరచియున్నాము. ఇది సేనల విషయమై ఖర్చుపెట్ట బడి యనేకమందికి జీవనాధారమై యుండుచుండెను. దివ్యభవనములు నిర్మించుటయందును, భోగములనిమిత్తమును వెచ్చింపఁబడి కళలకును జేతిపనులకును జేయూతనొసంగుచుండెను. చాటలకొఱకును గాల్వల కొఱకును వెచ్చింపబడి వ్యవసాయమును వృద్ధిపొందించుచుండెను. కనుక మనయొద్దనుండి పన్నులరూపమున గ్రహింపఁబడు సొమ్ము, పరదేశమునకో బోయి యక్కడి వర్తకమునకును బరిశ్రమలకును దోడ్పడక, మనకే తిరిగి చేరుచుండిన మొదల నీపద్ధతి భారతవర్ష మిప్పటికంటె నెక్కుడుసుఖప్రదముగా వహించుచుండెను. ...నాంగ్ల పరిపాలనారంభమువరకును దేశమునుండి ధనమెన్నడును పరదేశములకు బ్రతిఫల శూన్యముగ పోలేదు. అన్యదేశములతో నతి...వర్తకముండుటవలన నైశ్వర్యమును, నన్యదేశములకు ధనము ప్రతిఫలములేకయే పోవుటవలన దారిద్ర్యమును, సంభవించుట స్వతస్సిద్ధమే కదా!

ఈస్టిండియాకంపెనీ; "ధనప్రవాహము":—1606 సం॥ మునుండి 1757 సం॥వరకు నాంగ్లేయు లిండియాలో వర్తకముచేయుచుండినను, హిందూదేశమునుండి యెగుమతియగు వస్తువులకు సరియగు ప్రతిఫలము వచ్చుచుండుటచే దేశమునకెట్టి నష్టమును సంభవింపలేదు. 1747 మొదలు 1757 వఱకును బ్రతిసంవత్సరము నింగ్లాండు సగటున 5,62,423 నవరసులు హిందూదేశమునకు బాపుచుండెననియు 1757 సం॥ తరువాత నిది యాగిపోయెననియు "బ్రూసు"అను చరిత్రకారుడు వ్రాసియున్నాడు. 1757 సం॥తరువాతగూడ హిందూదేశమునుండి

యింగ్లాండునకు వస్తుప్రతిగుమతి యగుచుండెను. కాని (1757) ప్లాసీ యుద్ధమున వంగదేశమును జయించుటచే నాంగ్లేయులకు గలిగిన రాజకీయాధికారమువలన నీయెగుమతులకు బ్రతిఫలము మాత్రముముట్టలేదు.

ఈస్టిండియా కంపెనీవారు పాలించుసమయమున నాంగ్లేయులేయేవిధముల నెంతెంతధనముగొంపోయిరో చెప్పుటకష్టము. అందు ముప్పదిసంవత్సరములు (1757-87) వంగదేశమును గొల్లగొట్టిరనియే చెప్పవచ్చును. పెద్దయుద్యోగస్థులు రాజకార్యములందు లంచములు గ్రహించియు, మోసముచేసియు, పీడించియు, స్వదేశ సంస్థానాధిపతులకు హెచ్చువడ్డీకి ఋణములిచ్చియు, నపరిమితముగ ధనమార్జించి యాంగ్లదేశమునం దమయైశ్వర్యమును బ్రదర్శించుచు, జాలభూములను సంపాదించి, పార్లమెంటు సభ్యత్వమును గూడ బొందుచుండిరి. కంపెనీగుమాస్తాలు స్వంతముగ వర్తకముచేసియు, దేశీయవర్తకులను గూరరబాధలుపెట్టియు విశేషముగ ద్రవ్యము లాగుచుండిరి. మీర్జాఫరును దొలిసారి గద్దెపై నెక్కించినపుడు పతిపద్దనుండి, 12,80,000 పౌనులు క్లైవు, డ్రేకు మొదలగువారు బహుమానముగనో, లంచముగనో తీసికొనిరి. ఇందు క్లైవు 4,40,000 పౌనులును, డ్రేకు 2,80,000 పౌనులును, నితరులు మిగిలినదానిని బాచుకొనిరి. తరువాత కొలందికాలమునకే మీర్జాఫరును దొలగించి, మీర్ఖాసీమును సింహాసనారూఢునిగ జేసినపుడు, 2,00,000, పౌ॥లు కంపెనీ యుద్యోగులు తమస్వంతధనముగ గ్రహించిరి. తిరిగి మీర్జాఫరును సుబేదారుగ జేసినపుడును నతనియనంతరమతని కుమారుడు రాజ్యమునకు వచ్చినపుడును గూడ నిట్లే యపరిమితముగు బహుమానములను బడసిరి. 1757 మొదలు 1765 వఱకు నెనిమిది సంవత్సరములందును వారు మొత్తము 21,69,665 పౌనులను బహుమానములక్రిందఁ బడయుటయేగాక, 37,70,833 పౌనులను యుద్ధవ్యయమునిమిత్తము తీసికొనిరి. ఈవిధముగ క్లైవుమొద

లగువారు ఇండియాలో సంపాదించిన ధనమునకుమితిలేదు. అతని యనంతరము సహితము, క్రూరులయినట్టియు, బాధ్యతలేనట్టియు కంపెనీ యుద్యోగస్థులు దేశమును కొల్లగొట్టుచుండిరని బ్రూక్సు ఆడమ్సు వ్రాసియున్నాడు. 1765 నుండి 1771 వఱకు బెంగాలుపాలనవ్యయము పోగా, 4 కోట్లరూపాయ లింగ్లాండునకు బంపిరి. వారన్ హేస్టింగ్సు ధనమును సంపాదించుటకెట్టి ప్రయత్నములు చేసినదియు చరిత్రకారులు తెలుపఁగలరు. రోహిలాలను రూపుమాపుటకో నయోధ్యనవాబునను దోచ్పడి, యతనివద్ద 20,000 పౌనులు బహుమానముఁ బడసెను. ఇంతియకాక ప్రతిసంవత్సరమును 4 లక్షల పౌనులాదాయమును గంపెనీకి సమకూర్చెను. అయోధ్యబేగములను బీడించి 12,00,000 పౌనులను దీసికొనెను. ఇటులే కంపెనీ యుద్యోగులు తాము యుద్ధములందు గెలుపొందినపుడును, తమకు మిత్రులయిన రాజులను సింహాసనారూఢులుగఁజేసినపుడును, వారియొద్దనుండి కంపెనీవారికి గప్పమును, తమనిమిత్తము బహుమానములను గ్రహించుచుండిరి. 1849 సం॥ రాజ తసింగు కుమారుడయిన దులీప్‌సింగును సింహాసనమునుండి నెడలఁగొట్టి పంజాబుదేశము నాక్రమించుకొనుటయేగాక, పంజాబురాజుల మకుటమునందుండెడు నమూల్యమగు కోహినూరువజ్రమును నింగ్లండు మహారాణియగు విక్టోరియా నిమిత్తమై గైకొనిరి. మఱియు డల్‌హౌసీ ప్రభువు నాగపూరుసంస్థానమును గెలుపుకొనినపుడు, రాజాంతఃపురమునందలి కోటిరూపాయలు విలువగల యాభరణములు, వజ్రములు మొదలగువానిని, వశపఱచుకొని, వానిని గలకత్తాలో బ్రదర్శించి, వార్తాపత్రికయందు బ్రకటించి, బహిరంగముగ వేలము వేయించెను. ఇట్లమ్మకము నిమిత్తమై ప్రదర్శింపఁబడిన వస్తువులలో వివిధములగు మణులును, వజ్రములు, రత్నఖచితములగు దాడకెడీయములు, [illegible], నుంగరములు, మణిపీఠికములు [illegible] సువర్ణపచ్చ [illegible], [illegible]

లహారములు, రత్నములతోడను ముత్తెములతోడను బ్రకాశించు కర్ణభూషణములు, శిరోభూషణములు, వజ్రములతో నమర్పబడిన గుఱ్ఱపుజీనులు, కొరడాలు, నంకుశములు, నత్తరుదానులు, పాన్దానులు, పన్నీరుబుడ్లు, కలందానులు కూజాలు, హుక్కాగొట్టములు, ఖడ్గములు డాలులు, కత్తులు, విల్లులు, నమ్ములు, నమ్ములపొదులు, పటకాలు, వెండిబంగారములతోఁ జేయఁబడిన సుగంధద్రవ్యములుంచు పెట్టెలు, నడ్డాణములు, కంఠమాలలు, మురుగులు, మొలనూలులు, చంద్రహారములు, కడియములు, మట్టెలు, నుక్కుతోఁజేయబడిన ఆయుధసామగ్రి, భోజనపాత్రలు మొదలగు వస్తువులుగలవనియు, వీని నెల్లరు చూచి, వెలకుఁదీసికొనవచ్చునని యు, ప్రభుత్వమువారి యాజ్ఞానుసారము హామిల్టన్ కంపెనీవారు వీనినమ్మెదరనియు గలకత్తా మార్నింగు క్రానికల్ పత్రికలో 12-10-1855 సం॥ న బ్రకటించిరి. ఆహా! ధనకాంక్షవలన మానవుఁడెట్టి యమానుష కృత్యములనయినను, జేయుటకు వెనుదీయఁడుగదా! నిస్సహాయులగు నంతఃపురకాంతల మేనులనలంకరించెడి యాభరణముల నపహరించుటయేగాక, వానిని బహిరంగముగ బజారులో వేలమువేసి ధనముసంపాదింప జూచెనుగదా!

స్వదేశరాజులసంబంధమువలన నిట్లు ధనమార్జించుచుండియు, తాముపాలించుదేశమున వసూలుచేయు పన్నులలో కొంత భాగమును పెట్టుబడిక్రింద వినియోగించి, వస్తువులను గొని, ఇంగ్లాండున కెగుమతి జేయుచుండిరి. ఈవిషయమునుగూర్చి పార్లమెంటుచే నియమింపబడిన కమిటీవారు 1783 సం॥ 9 వ రిపోర్టునందిట్లు వ్రాసిరి.........ఈవిధముగ కంపెనీయుద్యోగస్థులు పంపు ధనసంచయమే వారిశక్తిసామర్థ్యములను తెలియజేయునని (ఆంగ్లేయులు) తలంచుచుందురు. హిందూదేశదారిద్ర్యమునకు కారణ భూతమయిన దీనినిబట్టియే, ఆదేశము ధనవంతమైనదనియు, ఐశ్వర్య మనుభవించుచున్నదనియు ఇక్కడ భావిం

తురు. హిందూదేశపు సరకులతో నిండిన పెద్దయోడల సమూహములు పరంపరముగ బ్రతియేట నింగ్లండుదేశము చేరుచుండెను. విదేశములకట్టి సరకులను నిరంతరముగ నెగుమతిచేయగల, ఆహిందూదేశమెంత సౌఖ్యప్రదముగనుండవలెనో, ఎట్టియభివృద్ధి గాంచుచుండవలెనోయని (ఆంగ్లేయులు) మనవారు అభిప్రాయ పడుచుండిరి. హిందూదేశమును డి వచ్చెడు ఈసరకులకు ప్రతిఫల మూదేశమును జేరి, యచ్చటి వస్తువుల యుత్పత్తికి తోడ్పడుచున్నట్లుకూడ నగుపడును. కాని ప్రతిఫలమునిచ్చు వర్తకవ్యాపారముగాక, హిందూదేశము చెల్లించు కప్పమేయట్టి మిథ్యాస్వరూపము గలిగియుండెను.” 1813 సం॥ వరకు నీవిధముగ బ్రతిసంవత్సరమును 1,25,00,000 రూప్యములు విలువగల సరకులింగ్లాండున కెగుమతి చేయఁబడుచుండెను 1813 సం॥ గావింపబడిన చార్టరు ఆక్టువలన కంపెనీయొక్క వర్తకమంతరించినను, ధనప్రవాహముపోవుట మానలేదు. ఇంతవరకు నాంగ్లదేశమునకు సరకుల నంపుటకు పెట్టుబడికిక్రింద (Investment) వినియోగింపబడుచుండిన ధనముకంటె ఎక్కువ మొత్తమే సీమఖర్చులనెడి మఱియొకరూపమున నింగ్లాండుచేరుచున్నది. 1814-15 సం॥లో 2,446,016 పౌనులుండిన సీమఖర్చులు 1856-7 లో (కంపెనీపరిపాలనలో నంత్యసంవత్సరమున) 6,162,043 పౌనులయ్యెను. దీనిలో ఏలయిదవ వంతునకో మాత్రము స్తోమస్వరూపముగ హిందూదేశము ప్రతిఫలము పొందుచుండెనుగాని, మిగిలిన భాగమంతయు బ్రతిఫలములేకయే యిండియానుండి యింగ్లాండునకు పోవుధనప్రవాహమేయని యెంచనగును.

ఇండియాప్రభుత్వము; “ధనప్రవాహము” :—కంపెనీ యంతరించి ఇండియాపరిపాలనము పార్లమెంటు స్వాధీనమైనను రాజనీతియందెట్టి మార్పునుగలుగలేదు. ప్రతియేట నిండియానుండి యింగ్లాండునకుపోవు “ ధనప్రవాహము ” క్రమక్రమముగ నధికమగుచు,

మనదారిద్ర్యమును వృద్ధిచేయుచున్నది. అయినను ధనప్రవాహ ముసుగూర్చి ప్రస్తుతము రెండుకక్షులు కలవు దాదాభాయి నౌరోజి, హిండమన్, విలియమ్‌డిగ్బి, రమేశచంద్రదత్తు మొదలగు అర్థశాస్త్రపారంగతులు, ఆంగ్లేయ సంబంధము వచ్చినప్పటినుండియు, ఇండియానుంచి యింగ్లాండునకు "ధనప్రవాహము" పోవుచున్నదనియు దీనివలన భారతీయు లూహింపశక్యముగాని దారిద్ర్య మనుభవించుచున్నారనియు, వ్రాసియున్నారు. వ్యతిరేకాభిప్రాయముగల రెండవపక్షమువారు, ఇండియానుంచి, ఇంగ్లండునకు "ధనప్రవాహము" పోవుట లేదనియు, తాను చెల్లించుచున్న ద్రవ్యమునకు హిందూదేశము ప్రతిఫలము పొందుచున్నదనియు, భారతీయులు మహదైశ్వర్యమనుభవించుచున్నారనియు వాదింతురు. ప్రభుత్వప్రకటనయగు "ఇంపీరియల్ గెజటీర్ ఆఫ్ ఇండియా" యనుపుస్తకముయొక్క గ్రంధకర్తయు, సర్ జాన్ స్ట్రాచీ, సర్ తియడోర్ మారిజన్,—మొదలగువారి పక్షమునందలి ప్రముఖులు, "ధనప్రవాహము" పోవుచున్నదని యున్నతోద్యోగములు చేసినయాంగ్లేయులనేకులు 150 సం॥ నుండియు అభిప్రాయములనొసంగిరి. "ధనప్రవాహము" లేదని వాదించుపక్షము ఈమధ్య 30 సం॥ లనుండి మాత్రము బయలుదేరినది. ఇండియానుంచి ఇంగ్లాండునకుపోవుచున్న ధనమునకు హిందువులు ప్రతిఫలము పొందుచున్నారని ఏదోఒకవిధమున సమర్థించి, ఆంగ్లప్రభుత్వముయొక్క "ప్రతిష్ఠ"ను నిలబెట్టుట కీపక్షము తలయెత్తినట్లు తలంపనగును. కాని భారతపితామహుడు మనదేశమునుంచి విదేశములకు ప్రతిఫలవిహీనముగ ధనము తరలిపోవుటచేతనే, దేశమిట్టిదౌర్భాగ్యస్థితికి వచ్చుచున్నదని ధ్రువపరచియున్నాడు. ఈవిషయమున హిండమన్, డిగ్బి మొదలగు మహనీయు లొసంగిన యభిప్రాయములు ఈవ్యాసమునకు చివరపొందుపరచియున్నాము.

ఏటేటను మనదేశమునుంచి సీమదేశమున కేవిధముగ నెంతధనము పోవుచున్నదో తెలిసికొనినచో, "ధనపరివాహము" యొక్క స్వభావమును, స్పష్టమగును. ఈధనపరివాహము రెండువిధములుగ నున్నది. (1) రాజకీయసంబంధమునది. (2) వర్తక సంబంధమునది.

(1) రాజకీయసంబంధమువలన పోవుధనము.

(2) సీమఖర్చులు.

(3) హిందూదేశమున నున్నతోద్యోగములుచేసినపుడాంగ్లేయులు నిలువచేసి ఇంగ్లాండున కంపెడుధనము.

(క) సీమఖర్చులు:—సీమఖర్చులకై ప్రతిసంవత్సరమును చాల ధనము ఇంగ్లాండునకు పంపబడుచుండును. ఇండియా గవర్నమెంటువారు ఆంగ్లదేశమునచేసిన వ్యయమునకు సీమఖర్చులందురు. (1) మనదేశమునుపాలించుటకు లండనులోనున్న ఇండియాఆఫీసునకగు వ్యయము నిమిత్తమును, (2) ఇండియాలో కొంతకాలము పనిచేసినతర్వాత ఇంగ్లండులో నివశించు సివిలు, మిలిటరీ ఉద్యోగస్తుల ఉపకారవేతనములకును, (3) ఇండియాగవర్నమెంటువారు ఇంగ్లాండులో చేసిన ఋణముకొరకు చెల్లించవలసిన వడ్డీకిని, రైల్వేభాగస్వాములకిచ్చులాభములకును ప్రతిసంవత్సరము ఇండియానుండి యింగ్లాండునకు కొంతధనము పంపబడుచుండును. దీనిలో (2) (3) శీర్షికలక్రింద (అనగా ఉపకారవేతనములు ఋణములకొరకు వడ్డీ) నగువ్యయము ఏటేటను ఎక్కువగుచుండును. 1919-20సం॥ సీమఖర్చులమొత్తము 24,676,700 పౌనులుండెను. అందీక్రింది వివరములు ముఖ్యమైనవి:

| | | |
|---|---|---|
| 1. వడ్డీ | పౌ | 7,819,900 |
| 2. సైనికవ్యయము | | 7,061,000 |
| 3. రైల్వేలవలనఆంగ్లేయులాభములు | | 5,726,500 |
| 4. చిల్లర సివిలు ఖర్చులు | | 2,413,000 |

5. సివి.. 704,100

6. చిల్లర 919,200

సీమఖర్చు... స్టోర్సుకొరకు వెచ్చింపబడిన ద్రవ్యమునకు ప్రతిఫలము వచ్చుచు... గాని మిగిలినవాని కొంతమాత్రము వచ్చుట లేదు. మారిజన్ ... లగు ప్రభుత్వ పక్షపాతులు ఈద్రవ్యమున కిండియా ప్రతిఫల... చున్నదని వాదింతురు. వారివాదమేమనగా-సీమఖర్చులందు ఇం...యాఋణమునకును రైల్వేఋణమునకును చెల్లించు వడ్డీ ప్రధానస్థా... ఆక్రమించును. ఈఋణములో నధిక భాగము హిందూదేశమున రైల్వేలు, జలాధారములు నిర్మించుటకు వ్యయపరుపబడినది. దేశమ... ద్ధిగాంచవలెనన్న నిట్టిపనులకు ధనము వెచ్చించుట యావసరము. ...దూదేశమున ధనము దొరకక పోవుటచే విదేశములలో ఋణ...చేసి ధనము తెచ్చి ఈపనులందు వినియోగించవలసివచ్చినది. ఈఋణమువ... ఇండియాలాభము పొందుచున్నది. గాని దీనిపై చెల్లించువడ్డీని ధ...ప్రవాహముగ నెంచకూడదు. హిందూదేశమొక్కటియే ఇట్టివడ్డీని ...టలేదు. విదేశములనుండి తెచ్చినఋణము దేశీయపరిశ్రమల ...ద్ధిచేయుటయేగాక అనేకులకు వృత్తిని గల్పించి ప్రజల యాదా... పెంపొందించుచున్నది. హిందూదేశమున విదేశీయులు తేయా... పార మొదలగు ...లందు వినియోగించుపెట్టబడి ...లనగూడ ఇట్టియభివృద్ధియే కలుగుచున్నది. ఇదియేవీరివాదము.

విమర్శన:—... వాదమునందెంత సత్యమున్నదియు విమర్శింతము.

(1) ఇండియా ఋణమంతయు దేశాభివృద్ధికొరకు కర్చుపెట్టబడ లేదు. ఐరోపామహాయుద్ధమునకు పూర్వము ప్రతిఫల రహితమయిన (unproductive) ఋణముపై దాదాపు 2,000,000 పౌనులు వడ్డీ చెల్లించుచుండిరి. ఈఋణ మీస్టు ఇండియా కంపెనీవారు కూడ

బెట్టి ఇండియా గవర్నమెంటున కప్పచెప్పినదియు, యితరదేశీయులతో చేసినయుద్ధముల నిమిత్తము తెచ్చినఋణమును అయియున్నది. ఇట్టిఋణమువలన హిందూదేశ మెట్టిలాభమును పొందలేదు. అందుచే నీఋణమునకు చెల్లించుటకు ప్రతిఫలమెద్దియో గానరాకున్నది. ఇట్లే మొన్న ఐరోపాయుద్ధమునకు చేసిన 150 కోట్ల రూలు ఋణమునకును చెల్లించుటకుకూడ మనము ప్రతిఫలము పొందుటలేదు.

(2) రైల్వేలు, నీటిపారుదల పనులు మొదలగువాని నిర్మాణమునకు వినియోగింపబడిన ఋణమువలన కొంత ప్రతిఫలము వచ్చుచున్నది. కాని యీఋణమైనను సరియగు దేశాభివృద్ధి కుపయోగింపబడలేదు. రైల్వేలకంటె యిర్రిగేషనెక్కువ ముఖ్యమైనను రైల్వేనిర్మాణమునకే యీఋణములో చాలభాగము వెచ్చింపబడెను 1900 సం॥ వరకును రైల్వేలవలన దేశమునకపారమగు నష్టమువచ్చియున్నది. ఇంతియగాక ఇండియా గవర్నమెంటువారు ఋణదాతలకిచ్చిన షరతులను మారకపురేటులుకూడ హిందూదేశమునకు ప్రతికూలముగ నుండెను. మరియు దేశమునందలి రైల్వేలన్నియు ఆర్థికాభివృద్ధికొరకే నిర్మింపబడలేదు. పశ్చిమోత్తరప్రాంతముల సరిహద్దులందుగల సైన్యముల యొక్క ఉపయోగార్థము నిర్మింపబడిన రైల్వేవలన చాలనష్టము వచ్చుచుండెను. కావున ఈబాపతు ఋణములకొరకు చెల్లించుటకుకూడ సంపూర్ణమగు ప్రతిఫలమును హిందూదేశమును పొందుటలేదు.

(3) విదేశీయులు తేయాకు, జనపనార మొదలగు పరిశ్రమలందు నిర్ణీతలాభమును గ్రహించినచో, వారు హిందూదేశాభివృద్ధికి తోడ్పడియుందురు. కాని వారపరిమితముగ లాభమును తీయుచున్నారు. హిందువులకంటె నెక్కువగ నీరికిసకల విధముల ప్రభుత్వమువారు ప్రోత్సాహ మొసంగుచున్నారు. వీరికర్మాగారములలో కూడ ఉన్నతోద్యోగములన్నియు విదేశీయులకే యీయబడుచున్నవి. వీరుకొంతమంది

కూలీలకు జీవనోపాధి యొసంగుచున్నారను మాటసత్యమేకాని వీరు రాకపూర్వము దేశమునందుండిన వృత్తులనేకములు వీరిపోటీమూలమున నశించి అనేకుల జీవనోపాధి చెడగొట్టెనని గ్రహింపనగును. మరియు, వీరు, ముఖ్యముగ తేయాకువర్తకులు తమవద్దపనిచేయు కూలీల నెంత క్రూరముగ హింసించుచున్నదియు లోకవిదితమే. స్వల్పజీతములిచ్చుచు నిర్బంధసేవ (indentered Labour) దేశీయులగు పనివాండ్రచే గొనుచు దాము లాభమును పొందుచుందురు. కావున విదేశీయులు మనదేశమున పెట్టుబడిపెట్టి వర్తకముచేసి, దేశాభివృద్ధికి తోడ్పడుచు న్నారనుటలో సత్యమిసుమంతయు లేదు.

సీమఖర్చులలో మిగిలిన ఖర్చులనుగూర్చి విచారింతము. హిందూదేశమున ఉన్నతోద్యోగములలో పనిచేసి పెన్షనుపుచ్చుకొనిన ఆంగ్లేయులకు ఉపకారవేతనములను పంపుటయు ఇంగ్లండులోని ఇండియా ఆఫీసుయొక్క వ్యయమును భరించుటయు, మన పారతంత్ర్యమువలన సంభవించుచున్నవి. హిందూదేశమునకు స్వాతంత్ర్యముండినచో నిట్టి వ్యయమున కవసరముండదు. అందుచే నీద్రవ్యము హిందూదేశము తనపారతంత్ర్యమునకు ఫలముగ ఇంగ్లాండునకు చెల్లించుకప్పమని చెప్ప వచ్చును. ఇండియా ఆఫీసునకగు వ్యయము విషయమైమరియొక ఆశ్చర్య జనకమగు సంగతికలదు. బ్రిటిషుసామ్రాజ్యములో హిందూదేశముయొ క్కటియేగాక, కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా మొదలగు వలసరాజ్య ములుకూడ కలవు. వలసరాష్ట్రములను పాలించుటకొరకు ఆఫీసు (Colonial office) ఇంగ్లండులోనున్నది. ఆయాఫీసునకగు వ్యయమంతయు నాంగ్లేయులే భరింతురు. ఆకలోనియల్ ఆఫీసును, ఇండియా ఆఫీసును ఒక భవనమునందే యున్నవి. కాని ఇండియా ఆఫీసువ్యయమువారు భరింపక, ఇండియానుండి తీసికొందురు. 1859 సం॥ సర్ జార్జివిన్‌గేటు గారు వలసరాజ్యముల వ్యయము భరించునట్లే ఇండియాలోనగు

ప్రభుత్వవ్యయము, హిందూదేశమును, ఇంగ్లండులోనగు వ్యయము, ఇంగ్లండుదేశమును భరించుట ధర్మమని సూచించిరి.

ఇంతవరకును సీమఖర్చుల రూపముగ పోవుచున్న ధనములో నధికభాగమునకు ము ప్రతిఫలము పొందుటలేదని నిర్ధారణ చేసితిమి. ఈసీమఖర్చులు ఏటేట నధికమగుచుండును. అందుచే మనదారిద్ర్యముగూడ నెక్కువగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| 1859-60 | ... | ... | పౌ 5,042,945 |
| 1869-70 | ... | ... | పౌ 7,677,850 |
| 1879-80 | ... | ... | పౌ 14,543,277 |
| 1889-90 | ... | ... | పౌ 14,848,923 |
| 1899-1900 | ... | ... | పౌ 16,392,864 |
| 1909-10 | ... | ... | పౌ 19,122,916 |
| 1919-20 | ... | ... | పౌ 24,676,700 (B.E) |

ఇండియాప్రభుత్వము పరిపాలన మారంభించినకంటె ఇప్పుడు సీమఖర్చులు సుమారు అయిదు రెట్లెక్కువయినవి.

2. ఇండియాలో ఉన్నతోద్యోగములందున్న ఆంగ్లేయులు సీమకు పంపు ధనము:—"ఇండియా ఇంగ్లాండునకు లోబడియున్న పెద్ద రాజ్యము. దాని యస్వతంత్రతవలన చాలనుంది ఆంగ్లేయోద్యోగస్థులను నియమించుకొనవలసియున్నది........................ .........వీరికిచ్చు ఉపకార వేతనములును, ఉద్యోగమున నున్నపుడు వీరు నిలువబెట్టు ధనమును, ఇంగ్లాండునకు పంపబడుచున్నవి. ఆంగ్లేయులు మనదేశమున పుట్టి, పెరుగ జాలరు. కనుక వారిపిల్లలను నాలుగేండ్లురాగానే విద్యాభ్యాసమునకుగాను వారు శీమకుపంపుదురు. తండ్రుల సంపాదనలలో చాలభాగము (ఒక్కొక్కప్పుడు మూడుపాళ్ళు కూడ) వారినిమిత్తము సీమకు పంపబడుచుండును" (యదునాథ

సర్కారు (Indian economics) కావున పెద్దయుద్యోగములలో నున్న యాంగ్లేయులు చాల ధనమును సీమకంపుచుందురు. ఇదియొక స్వల్ప మొత్తముగాదు. 1892సం॥ పార్లమెంటరీ రిటరను ప్రకారము సం॥కు వెయ్యిరూ॥కంటె నెక్కువ వేతనముగల ఆంగ్లేయులకు మొత్తమున రూ 9,46,79,627లు ఇవ్వబడుచున్నవి. దీనిలో ఆంగ్లసైనికులకిచ్చు వేతనములను, మారకపులాభమును చాలహెచ్చుచేయబడినవి. కావునయిప్పుడు ఆంగ్లోద్యోగస్థులకు 9,50,00,000 రూ॥ కంటె ఎక్కువధనమేవ్యయపరుపబడుచున్నది. నిజమాలోచించినచో ఈద్రవ్యమంతయు మనదేశమునకు నష్టమే. ఉన్నతోద్యోగముల నిర్వర్తింపగల హిందువులుండగా వాని నన్యదేశీయుల కొసంగుటవలన, మనదేశమునకు నష్టముకాదా! అన్యదేశీయులయినను; ఇచ్చటనేయుండి, ఆసొమ్మంతయు నిచ్చటనే వ్యయపరచినచో బాగుండును. ద్రవ్యము దేశములోనే యుండును. కాని వారట్లుచేయరు. కనుక ఆంగ్లేయులకిచ్చు వేతనముల మొత్తమంతయు (9,50,00,000) మనకు నష్టమె. సగము యిక్కడ కర్చుచేసినను, మిగిలిన సగము ఇంగ్లాండునకు పంపబడును.

వర్తకసంబంధమునపోవు ధనప్రవాహము:—రాజకీయసంబంధమువలన ధనమీవిధముగ దేశమునుంచి తరలిపోవుటచే, దేశీయపరిశ్రమల నభివృద్ధిచేసికొనుటకు దేశమున మూలధనము సూన్యమగుచున్నది. ఇట్లు ఇంగ్లాండునకు వెడలిన ధనమును తీసికొనివచ్చి వాణిజ్యమునందుపయోగించి, ఆంగ్లేయులు ఇండియానుంచి మరికొంత ధనము గొంపోవుచున్నారు. కావున దీనికంతకును మూలకారణము రాజకీయసంబంధమువలన పోవు ధనపరివాహమే యని గ్రహింపవలెను.

పన్నులు చెల్లించు రయితుల క్షేమమరయుటకు పూర్వము ప్రభుత్వమువారు, ఆంగ్లవర్తకమునకును, ఉద్యోగులకును సకలవిధములసహాయముచేయుచుండిరి. ప్రభుత్వార్థికవిధానము ఆంగ్లవర్తకుల కను

కూలముగ నున్నది. రైళ్ళమీదను, బ్యాంకులమీదను, వాణిజ్యము వలనను, ఓడలు నడుపుటవలనను, బట్టలయంత్రములమీదను, నీలిమందు, బొగ్గుగనులమీదను వచ్చు లాభములు ఇంగ్లాండునకు పంపబడుచుండును. తేయాకు, కాఫీతోటలమీదకూడ నధిక లాభము తీయుచున్నారని యిదివరకె చెప్పియున్నాము. హిందూదేశమునుంచి వాణిజ్యమునేసి ఆంగ్లేయులు గొంపోవుచున్న ధనమెన్నికోట్ల రూప్యములుండునో లెక్కనిదర్శనములు లేకుండుటచే చెప్పజాలము.

మ్యాక్లిన్ దొరగారు ఇండియానుంచి ఆంగ్లేయులు సీమకు పంపెడు ధనమునుగూర్చి యిట్లు వ్రాసిరి. "ఇండియాలోనున్న ఆంగ్లేయులు ప్రతిసంవత్సరము ఈవిధముగ సీమకంపుచున్న ధనముయొక్క మొత్తము 20,000,000పౌనులకంటె తక్కువయుండజాలదని అంచనా వేయబడినది. ఇంతకంటెను అధికముగా, నుండునని మనముతలంచవలెను.

ఇతరవిధముల పోవుచున్నధనము——ఐ. సి. యస్. బారెట్లా మొదలగు పరీక్షలు మనదేశమందు పెట్టకపోవుటచే, వానికొరకు హైందవవిద్యార్థులు ఇంగ్లండువెళ్ళి కొంతధనము వెచ్చింపవలసి వచ్చుచున్నది. 1774సం॥ చార్టరుఆక్టుననుసరించి, బ్యారిస్టరుతప్ప, బి.యల్ ప్యాసయిన ప్లీడర్లు హైకోర్టులో "ఒరిజినల్‌సైడున" వాదింపకూడదు. కనుక హిందువులు ఇంగ్లండువెళ్ళి 3సం॥లుండి చాలధనము ఖర్చుచేసి ఆపరీక్షచదువుటవసరము. బారిష్టరు పరీక్షచదువుటకు వెళ్ళిన ప్రతిమనుజునివలనను, దేశమునుంచి 10,000రూప్యములు పోవుచున్నవి. వకీలుకంటె బారిష్టరు ఎక్కువ జ్ఞానము సంపాదించుట కవకాశములేకుండుటచే, అతడు ఇంగ్లాండులో వెచ్చించిన ధనమునకు జ్ఞానరూపముననయినను ప్రతిఫలము వచ్చుటలేదు. ఈవిధముగ నిండియానుంచి చాలద్రవ్యము పోవుచున్నది. ఒక సంవత్సరములో (1908) 60 కంటె

ఎక్కువమంది హైందవ విద్యార్థులు బారిష్టరు పరీక్ష చదువుటకు సీమ వెళ్ళిరి. కొన్ని పరీక్షలు ఇండియాలో లేకుండుటచేతను, ఇంగ్లీషు డిగ్రీలకు ఎక్కువ విలువయు గౌరవము నుండుటచేతను, అనేకమంది హిందువులు ఇంగ్లాండు వెళ్ళి చదువుచుందురు. గాన దేశమునుండి చాల ధనము పోవుచున్నది.

ప్రతివర్షము ఇండియానుండి ఇంగ్లాండునకు ఇట్లుపలువిధముల ధనము పోవుచున్నది. ఈధన ప్రవాహముయొక్క పరిమితి యెంత యుండునో నిర్ధారణచేయుట చాల కష్టము. దానినిగూర్చి పలుగురు పలువిధముల నభిప్రాయమునిచ్చియున్నారు.

(అ) ప్రతిసంవత్సరమును 30 లేక 40కోట్ల రూపాయలు ఇండియానుండి యింగ్లాండునకు పోవుచున్నవనియు, ఇటువంటి "రక్తముతీయుట" ప్రపంచములో నెంత భాగ్యవంతమయిన దేశమయినను భరింపజాలదనియు గోపాలకృష్ణగోక్లేగారు 1906 సం॥ లక్నో యుపన్యాసమున చెప్పిరి.

(ఆ) 1909 సం॥ ప్రకటించిన గ్రంథములో సర్ హెన్రీకాటన్ గారు ఇండియానుండి ఇంగ్లాండునకు పోవుధనము సంవత్సరమునకు 45 కోట్ల రూపాయలుండునని వ్రాసిరి.

(ఇ) ఎ. జె. విల్సన్ గారు ఇండియానుండి పోవుచున్న ధనప్రవాహము సంవత్సరమునకు 35 మిలియన్లు పౌనులు (రూ52,50,00,000) ఉండునని వ్రాసిరి.

(ఈ) హెచ్. యమ్. హిన్డమన్ గారు ఇండియానుండి సంవత్సరమునకు 40 మిలియన్లు పౌనులు (60కోట్లరూప్యములు) పోవుచున్నవని 1906 సంవత్సరమున వ్రాసియున్నారు.

ఆంగ్లపరిపాలనలో ఇండియానుండి యింగ్లాండునకుపోయిన "ధనప్రవాహము" యొక్క మొత్తము.

"1757 సం॥ మొదలు 1815 వరకు ఇండియానుండి ఇంగ్లాండునకు పౌ 500,000,000 నుండి పౌ 1000,000,000 వరకు పోయియుండునని అంచనా వేయబడినది. సాధారణముగా చివరచెప్పినమొత్తము పౌ 1000,000,000 ప్లాసీయుద్ధమునకును వాటర్లు (1815) యుద్ధమునకునున్న మధ్యకాలములో ఇండియానుండి ఇంగ్లాండునకు పోయియుండును" అని డిగ్బిగారు తమప్రోస్పరస్ బ్రిటిషుఇండియా యను గ్రంథమున వ్రాసియున్నారు.

1860 సం॥ మొదలు 1900 వరకు ఈనూరు వత్సరములలోను పోయిన ధనప్రవాహముయొక్క గొప్పమొత్తమును డిగ్బిగారీక్రింది విధముగ లెక్కవేసియున్నారు

| | పౌనులు |
|---|---|
| మాంటుగోమెరిమార్టిన్‌గారి లెక్కప్రకారము 1835 సం॥రము పూర్వము హిందూదేశమునకు కలిగిన నష్టము. | 723,000,000 |
| దిగుమతులకంటె ఎగుమతులయొక్క ఎక్కువ వలన ప్రతిసంవత్సరమును సగటున 7,500,000 పౌనులునష్టము. ఈవిధముగ 1835-1900 వరకుమొత్తము చేసి నూటికి 5 చొ॥ కాంపౌండువడ్డి కలిపినయెడల. | 4,187,922,732 |
| (ద్రవ్యమప్పుడు హిందూవర్తకులకు, షాహుకార్లకు, పారిశ్రామికులకు 5% కంటె ఎక్కువగనే యుండెను.) | |
| పైనచూపబడినప్రకారము హిందూదేశమునకు వచ్చిన నష్టము. | 4,910,922,732 |

ఆంగ్లయుద్యోగస్థులుఇంగ్లాండునకు పంపుధనము సాలునకు పౌ 2,000,000 చొ॥ 1835-1900 వరకు

నూటికి 5 చొ॥ కాంపౌండు వడ్డీతో సహా మొత్తము 1,044,980,684

తీర్చివేయగా మిగిలినట్టి ఇంగ్లాండులో చేయబ
డిన ఋణములు. 124,268,605

19 శతాబ్దములో పోయిన మొత్తము "ధనప్ర
వాహము" 6,080,172,021

డిగ్బీగారు 1900 సం॥వరకుమాత్రమే సంకెల నిచ్చియున్నారు. 1898-99 మొదలు 1920 వరకు పోయిన ధనప్రవాహమును సూచించుచు అంకెలు ఈక్రిందనీయుబడినవి. చదువరులు 1900 వరకును తేలినమొత్తమును ఈక్రింద నీయుబడిన అంకెలతో వడ్డీసహా కలుపుకొని 1920 వరకు పోయిన ధనప్రవాహముయొక్క పెద్దమొత్తమును తెలిసికొనవచ్చును.

నవరసులు.

| సంవత్సరము. | | దిగుమతులకంటె ఎగుమతుల యెక్కువ. | | సీమకర్చులు. |
|---|---|---|---|---|
| 1899-1900 | ... | 13,841,000 | ... | ... |
| 1900-1901 | ... | 10,983,000 | ... | ... |
| 1901- 2 | ... | 17,989,000 | ... | ... |
| 1902- 3 | ... | 18,570,000 | ... | 17,667,016 |
| 1903- 4 | ... | 24,893,000 | ... | 17,399,728 |
| 1904- 5 | ... | 20,227,000 | ... | 18,827,654 |
| 1905- 6 | ... | 22,360,000 | ... | 17,666,233 |
| 1906- 7 | ... | 13,713,000 | ... | 18,333,943 |
| 1907- 8 | ... | 2,665,000 | ... | 17,768,630 |
| 1908- 9 | ... | 5,271,000 | ... | 18,323,419 |
| 1909- 10 | ... | 22,794,990 | ... | 18,411,709 |

నవరసులు.

| సంవత్సరము. | దిగుమతులకంటె ఎగుమతుల యెక్కువ. | సీమకర్చులు. |
| --- | --- | --- |
| 1910-11 | ... 29,097,946 ... | 18,605,706 |
| 1911-12 | ... 27,224,951 ... | 18,865,246 |
| 1912-13 | .... 18,925,775 ... | 19,302,292 |
| 1913-14 | ... 14,228,512 ... | 19,455 055 |

ధనప్రవాహము విషయమై అభిప్రాయములు.

మాంటుగోమెరిమార్టిన్:—

"బ్రిటిషు ఇండియానుండి యింగ్లాండునకు సంవత్సరమునకు పౌ 3,000,000 ప్రవాహముగ పోవుచున్నవి. ఇండియాలో సాధారణముగ నములులోనున్న నూటికి 12 చొ॥ కాంపౌండు వడ్డీతోసహా, 30 సం॥లో పోయినధనము పౌ 723,000,000 ల బ్రహ్మాండమయిన మొత్తమగుచున్నది. ఇంగ్లండునుండి నిరంతరము పరిమితిలేకుండ ఇంత సొమ్ము పోవుచుండిన యెడల, ఆదేశము సైతము దారిద్ర్యస్థితికి వచ్చియుండును. కార్మికులు దినమంతయు పాటుపడినను 2 లేక 3 అణాలు మాత్రమే కూలిదొరకు హిందూదేశములో ఈమహా "ధనప్రవాహము" వలని ఫలితములు ఎంతభీకరముగా నుండునో చెప్పజాలము" ఈదొరగారు చెప్పిన నాటికంటె నిప్పుడు పోవుచున్న ధనప్రవాహము 15 రెట్లు ఎక్కువయినది.

ఇండియన్ సివిలుసర్వీసులో పనిచేయించను పుచ్చుకొనిన ఒకఆంగ్లేయుడ్వోరసు డిట్లుచెప్పియున్నాడు:—

"హిందూదేశమునుండి ఇంగ్లాండునకు నిరంతరము ధనము త్రోడివేయబడుచున్నది. ఇండియాలో ఆర్జించి నిలుపచేసిన ధనమువలన ఆంగ్లేయులు క్రొవ్వి బలియుచుండగా, హిందువులు తిండిలేకయెప్పటివలె బక్క-

వారుగ నేయున్నారు...............సివిలుమిలిటరీ డిపార్టుమెంటులలో గౌరవముగల గొప్ప ఉద్యోగములన్నియు విదేశస్థులు చేయుచున్నారు. అక్బరుమహారాజు తనకులోబడిన ప్రజలను జాతివర్ణ వివక్షతలేకుండ పరిపాలనయందు నియోగించుచుండెను. మనమాంవిధముగ చేయుట లేదు. తమతమజీతములను మాత్రమేకోరునట్టియు, అసహనశీలురగు ఆంగ్లేయులును, ఆశాపూరితులగు స్కాట్లాండువారును, దేశీయుల కోరికలు భగ్నముచేయుచున్నారు...............ఈపద్ధతివలన వచ్చుఫలితములు భయంకరముగానుండును."

మేజరువిన్గేటుగారు: "గ్రేటు బ్రిటనుకు చెల్లించబడుచున్న కప్పము ఆంగ్లేయరాజనీతియందు కేవలము అసంగతము. పన్నులు ఏదేశమున విధింపబడినవో ఆదేశముననే ఖర్చగుట ఒకతీరు. ఒకదేశమున వసూలుచేయబడి మఱియొక దేశమున ఖర్చగువారి తీరు వేరు. మొదటివిషయములో ప్రజలనుండి సేకరింపబడిన ద్రవ్యము ప్రభుత్వోద్యోగీయులక్రింద వెచ్చింపబడి, ఆధనము తిరిగి వారిద్వారాపరిశ్రామికవృత్తియందున్నవారికే చేరును. ఆపన్నువలన విభజనయే మారునుగాని, దేశముయొక్క మొత్తపురాబడి యందెట్టి నష్టము కలుగనేరదు. ఒకదేశమునుండి సేకరింపబడిన ద్రవ్యము వేరొకదేశమున ఖర్చయ్యెనేని దేశాదాయములో కొంతభాగము, ఒక తెగప్రజలనుండి మఱియొక తెగప్రజలకు మారుటలేదు సరిగదా, ఏదేశమునుండి యాద్రవ్యము సేకరింపబడుచున్నదో ఆదేశమునకు ఆద్రవ్యమంతయు నష్టమే. ఇందువలన దేశముయొక్క ఉత్పాదకశక్తియందెట్టి ఫలము గలుగునని, ఆధనమంతయు సముద్రములోవేచిన నెంతలాభమో, పైదేశములకంపిన, నంత్రియలాభము.

"ఇండియాదేశమునుండి సీమఖర్చులనియెడి కప్పమును గ్రహించుట న్యాయబుద్ధితో నాలోచించినను, నిజమైన మన స్వలాభమును

పట్టిచూచినను, ప్రపంచజ్ఞానము ననుసరించిచూచినను, లోకమున కును, ఆర్థికశాస్త్రములయందలి ముఖ్యసూత్రములకును కేవలము విరుద్ధముగానున్నది." (వేపా సత్యనారాయణమూర్తిగారి హిందూదేశ అర్థశాస్త్రమునుండి)

1900 సం॥ సెప్టెంబరునెల New England Magazine లో రెవరెండు సందర్లాండుగారు, మనదేశముయొక్క క్షామములను గూర్చి వ్రాయుచు, "నియ్యవి వర్షములు సరిగా లేకపోవుటచేతగాని, జనసంఖ్య హెచ్చుగుచుండుటవలనగాని కలుగుటలేదు. ప్రజలయొక్క హేయమును, భయంకరమును నగు దారిద్ర్యమువలననే కలుగుచున్న" వని నుడివెను. "మనము విదేశీయులకు కట్టుచున్నకప్పమును, ప్రపంచములోనెల్ల నెక్కుడువ్యయహేతువగు ప్రభుత్వవర్గమును, సేనలును విదేశములతోడ యుద్ధములును, మన యీమహాదారిద్ర్యమునకు కారణము"లని వ్రాసియున్నాడు:—

"హిందూదేశము విదేశప్రభుత్వముచే పాలింపబడు పరాధీన దేశము. ఈవిదేశప్రభుత్వము దీనిని (ఇండియాను) రాజకీయ, యార్థిక, వాణిజ్య, పరిశ్రామిక విషయములందు తనవశమొనర్చుకొని, భారతీయ భాగ్యమునంతను, ఆంగ్లేయులెంతెంత యైశ్వర్యమునందు చున్నారో, హైందవులంతంత దారిద్ర్యదగ్ధులగునట్లు, నిరంతర ప్రవాహరూపముగ తోడివేయుచున్నది.

1880 సం॥ వెస్టుమినిస్టర్ రివ్యూలో వ్రాయుచు డబ్లుయు, టి. తారనన్ గారిట్లునుడివిరి. "అయోమార్గములు మంచివియే. జలాశయములు (నీటిపారుదల సౌకర్యములు) మంచివియే. కాని ఈరెంటిలో నేదియునుగూడ, భారతదేశముయొక్క హృదయ సీమనుండి నెత్తురు పీల్చుచుండిన ధనప్రవాహమునకు సరియైన పరిహారము నొనర్పజాలదు."

రమేశచంద్రదత్తు:—"ఏదేశములో పన్నులువలన వసూలు చేసిన ద్రవ్యము, ఆదేశములోనే ఖర్చుపెట్టబడినపుడు, ఆధనమంతయు ప్రజలకే జేరును.

వాణిజ్యమును, పరిశ్రమలును, వ్యవసాయమును ఫలింప జేయును. ఏదోఒకరూపమున ప్రజాసామాన్యమునకే చేరును. కాని ఒకదేశమున వసూలయిన పన్నులు, యితరదేశములకు పంపినపుడు, ఆధనమంతయు దేశము శాశ్వతముగ గోలుపోవుచున్నది. దేశీయపరిశ్రమలుగాని వర్తకముగాని వృద్ధిపొందవు. గోలుపోయిన ధనమేరూపమునను ప్రజలకు తిరిగి వచ్చిచేరదు.

హిందూదేశపు ఆదాయమునుండి సంవత్సరమునకు 30 కోట్ల రూప్యములధనము అన్యదేశములకు ప్రవహించుచున్నది. ఈవిధముగ ధనప్రవాహము అనేకవత్సరములనుండి పోవుచుండగా, ప్రపంచమునందెంత భాగ్యవంతమగు దేశమయినను దారిద్ర్యస్థితికి రాకుండుటయసంభవము.



## 9 వ ప్రకరణము.

### కఱవులు.

పూర్వకాలమున కఱవులు:—వర్తమానకాలమున క్షామపరిస్థితులనుగూర్చి తెలిసికొనుటకు ముందు ఆంగ్లపరిపాలనకు పూర్వము కఱవులెట్లుండెనో చూడవలెను. ప్రాచీన భారతవర్షమున వ్యవసాయము పరిశ్రమలు, వర్తకము ఉచ్ఛదశయందుండెననియు, అందుచే దేశము ఐశ్వర్యముతో నలరారుచుండెననియు ద్వితీయ ప్రకరణమున విశదీకరింపబడినది. అట్లు భాగ్యవంతముగనున్న దేశమున క్షామములు మిక్కిలి యరుదుగానుండుట సహజము. ప్రాచీనకాలమున మనదేశమును దర్శించిన విదేశీయులందరును ప్రజలు భాగ్యవంతులుగ నుండిరనియే వ్రాసిరిగాని క్షామముచే దేశము పీడింపబడుచున్నట్లెవరును వ్రాయలేరు. హిందూదేశమున వ్యవసాయము వృద్ధిపొందుచున్నదనియు, సాలుకు రెండుపంటలు పండుచున్నవనియు, కఱవులు లేకుండెననియు మెగాస్తనీసు వ్రాసియున్నాడు. ఫాహియాన్ హ్యూయాన్‌ట్సాంగు మొదలగు చీనాబౌద్ధయాత్రికులుకూడ భారతదేశార్థికౌన్నత్యమును కొనియాడియుండిరి.

అతివృష్టి, అనావృష్టి మొదలగు స్వాభావిక హేతువులవలన పూర్వకాలమున కఱవు లప్పుడప్పుడు సంభవించుచుండెను. అవియైనను దేశమంతటను వ్యాపింపక, స్థానికములై శీఘ్రకాలములో తొలగిపోవుచుండెను. కఱవు వచ్చినప్పుడు ప్రజలిప్పటివలె నిరాధారులై మృత్యువునోటబడునట్టి స్థితియందుండక పంటలు బాగుగా పండిన సంవత్సరములలో నిలువచేసియుంచుకొనిన ధాన్యాదులనుతిని కాలక్షేపము జేయుచుండిరి. కావున క్షామములు వారినంతగా పీడించుట కవకాశము లేకుండెను. ఇంతియగాక పూర్వకాలమున కఱవు లల్పసంఖ్యాకములై

యుదుగా వచ్చుచుండెను. కఱవుల జాబితా శీలకించినచో 11 వ శతాబ్దమునకు పూర్వము కాటకములున్నట్లు కన్పింపదు. 11 వ శతాబ్దమునుండి 17 వ శతాబ్దాంతమువరకు కూడ కఱవులు మిక్కిలి స్వల్పముగ శతాబ్దమునకు రెండో, మూడో మాత్రమున్నవి. వ్యవసాయముతోను, పరిశ్రమలతోను, శోభిల్లుచు విదేశములతో వర్తకము చేయుచు, మహదైశ్వర్యమును ననుభవించిన ప్రాచీన భారతవర్షమున కఱవులు అరుదుగనుండెననుటలో నాశ్చర్యమేమున్నది!

క్షామములు.

ఆంగ్లపరిపాలనము: ఆంగ్లేయ పరిపాలనారంభమునుండియు క్షామములసంఖ్య హెచ్చినది. ప్రస్తుతకు కాటకపరిస్థితులు సామాన్యమయిపోయినవి. ఆంగ్లయుగమునందు కఱవు లెట్లుహెచ్చిపోవుచున్న వోకనుగొన్నచో నేభారతీయుడు విచారాశ్రువుల విడువక యుండగలడు? 19 శతాబ్దమున మొదటియిరువదియైదు సంవత్సరములలో 5 క్షామములు సంభవించెను. ఈశతాబ్దములోనే కడపటియిరువదియైదు సంవత్సరములలో 18 కఱవులు దేశమును పీడించినట్లు కన్పించుచున్నది. వీనిలో నాలుగు మహాభయంకరములైయుండెను. 1854 వ సం॥ మొదలు 1900 వ సం॥ వరకు ఈ 47 సంవత్సరములలోను కాటకమువలన 28,825,000 భారతీయులు మరణించిరి. ఇరువదియవ శతాబ్దమందలి కఱవులనుగూర్చి చెప్పనేల! మనము నిత్యము క్షామము ననుభవించుచునే యున్నాము.

బ్రిటిష్ పరిపాలనములో క్షామములు మిక్కిలి తరచుగావచ్చుచున్నవని నిస్సందేహముగ చెప్పవచ్చును.

ఇంతేగాక యిప్పటిక్షామములు పూర్వపువానివలె స్థానికములుగానుండక సర్వవ్యాప్తములై దేశమున నంతటను సంక్షోభమును కల్గించుచున్నవి. ఈసందర్భములో మరియొకసంగతి ముఖ్యముగ జ్ఞప్తి

యందుంచుకొనవలెను. అతివృష్టి అనావృష్టి మొదలగు స్వాభావిక హేతువులచే సస్యనాశనమగుటవలన పూర్వకాలమున కఱవులు వచ్చుచుండెడివి. కాని యీ కాలపుకఱవులకు ఆహారపదార్థముల లేమికారణముకాదు ప్రజలందరకును సరిపడుపంట దేశములో పండిన సమయములందుకూడ క్షామము వచ్చుచున్నది. ఈపదార్థములు విదేశముల కెగుమతి యగుచున్నవి. గర్భదారిద్ర్య పీడితులగుప్రజలు హెచ్చు ధరలుపెట్టి ఆహారపదార్థములనుకొనజాలక క్షామపీడితులగుచున్నారు. కావున మనలను పీడించుచున్నవి "ద్రవ్యక్షామములు"గాని "ధాన్య క్షామములు"కావు.

డిగ్బిగారిచే తయారుచేయబడిన కఱవులపట్టిక.

బ్రిటిషు పరిపాలనకు పూర్వము.

| | | |
|---|---|---|
| 11 వ శతాబ్దములో | 2 కఱవులు | రెండును స్థానికములే |
| 13 ... | 1 ... | ఢిల్లీచుట్టుప్రక్కల |
| 14 ... | 3 ... | అన్నియు స్థానికములు |
| 15 ... | 2 ... | రెండును స్థానికములు |
| 16 ... | 3 ... | అన్నియు స్థానికములు |
| 17 ... | 3 ... | వివిధప్రాంతములవ్యాపించినవి విస్తీర్ణము గుర్తింపబడలేదు. |
| 18 (1745వఱకుమాత్రము) | 4 ... | పశ్చిమోత్తర పరగణాలు ఢిల్లీసింధుదేశము (రెండుసార్లు) అన్నికఱవులు స్థానికములైయుండెను. |
| | 18 | |

బ్రిటిషుపరిపాలనములోని కఱవులు— బ్రిటిషు గవర్నరు జనర

లు వంగదేశమున పరిపాలన మారంభించినప్పటినుండియు సంభవించిన కఱవుల పట్టిక యీ క్రిందిగున నుదహరింపబడినది.

(i) 18వ శతాబ్దములో కడపటి 30సంవత్సరములు.

1769-70 వంగదేశము. అనావృష్టియు, తదనంతరము వరదలు. మరణము లధికము.

1783 చెన్నపట్టణము, బొంబాయి; మరణములసంఖ్య వ్రాయబడలేదు.

1784 ఉత్తరహిందూస్థానము.

1792 బొంబాయి, చెన్నపట్టణము, దక్కను.

(ii) 19 వ శతాబ్దములో మొదటి 50సంవత్సరములు

1802-3 బొంబాయి. మరణములు అత్యధికము. కాటకహేతువు యుద్ధము.

1803-4 పశ్చిమోత్తర పరగణాలు. రాజపుత్రస్థానము.

1805-7 చెన్నపట్టణము. మరణములసంఖ్య "చాల ఎక్కువ" అని అంచనా వేయబడినది.

1811-14 చెన్నపట్టణము. అధిక సంక్షోభములేదు.

1833-34 బొంబాయి—తీవ్రమయిన కఱవు. మరణముల సంఖ్య తెలియదు.

1812-13 రాజపుత్రస్థానము—క్షామమధికము. మరణముల సంఖ్య బహుశః 15లక్షలనుండి 20లక్షలవరకుండును.

1823 చెన్నపట్టణము. మరణములు తరుచుగానుండెను.

... ... బొంబాయి. ఆహారపదార్థముల కొఱత.

... ... పశ్చిమోత్తర పరగణాలు.

1833-34 చెన్నరాజధాని యందుత్తరభాగము. మరణములత్యధికము కొన్ని జిల్లాలలో నూటికి 50 వంతున జనులు మరణించిరి.

1824_25 బొంబాయి. ఆహారపదార్థముల కొఱత. కఱవు లేదు.

1837_38 ఉత్తరహిందూస్థానము మరణములసంఖ్య బహుశః పది లక్షలు.

(iii) 19 శతాబ్దములో కడపటి యర్ధభాగము.

| | | మరణములసంఖ్య. |
|---|---|---|
| 1854 | చెన్నపట్టణము | |
| 1860_61 | పశ్చిమోత్తర పరగణాలు, పంజాబు మరణములసంఖ్య అనేకవిధములుగ అంచనా వేయబడెను. ఇంతకు మించియుండదు. | 500,000 |
| 1865_66 | ఒరిస్సాలో 6 జిల్లాలలో మాత్రము | 1,300,000 |
| ... ... | బీహారు, వంగదేశము యుత్తర భాగము. | 135,000 |
| ... ... | చెన్నపట్టణము. | 450,000 |
| 1868_69 | రాజపుత్రస్థానము. | 1,250,000 |
| ... ... | పశ్చిమోత్తర పరగణాలు | 600,000 |
| ... ... | పంజాబు. | 600,000 |
| ... ... | మధ్య పరగణాలు. | 250,000 |
| ... ... | బొంబాయి మరణములసంఖ్య తెలియదు. జనులధికముగా వలసపోవుచుండిరి. | |
| 1873_74 | వంగదేశము, బీహారు. | |
| ... ... | పశ్చిమోత్తర పరగణాలు, అయోధ్య. | |
| 1876_77 | బొంబాయి. | 900,000 |
| ... ... | హైదరాబాదు. | 70,000 |
| 1876_78 | చెన్నపట్టణము, పశ్చిమోత్తర పరగణాలు, అయోధ్య. | |
| | ఇంతవరకిట్టి ఘోరమైనకరువెన్నడును హిం | |

దూదేశములో సంభవించలేదు. కాటక విచారణసంఘము వారుజేసిన యంచనా ప్రకారము.

| | | |
|---|---|---|
| | దక్షిణ హిందూదేశమున మరణములు 5,250,000 ఇంతకంటె నధికముగా నుండవచ్చును. ఇతరస్థలములందు మరణములు సుమారు 3,000,000 | |
| | మొత్తము. | 8,250,000 |
| 1876-78 | మైసూరు (అప్పుడు బ్రిటిషుపరిపాలనక్రింద యుండెను. | 1,100,000 |
| 1880 | డక్కను, బొంబాయి, మధ్యపరగణాలు. | |
| 1880 | పాంచాలములో దక్షిణ, ఆగ్నేయ భాగములందు ఆహారపదార్థముల కొఱత జననమరణ లెక్కలప్రకారము క్రిందటి సం॥రం కంటె అధికముగానున్న మరణములసంఖ్య. | 750,000 |
| 1884-85 | వంగదేశము, బీహారు, చోటానాగపూరు. చెన్నరాజధానిలో బళ్ళారి, అనంతపురం జిల్లాలు. | |
| 1886-87 | మధ్యపరగణాలు. | |
| 1888-89 | బీహారు. | |
| 1889 | ఒరిస్సాయందలి ప్రాంతములు. | |
| 1888-89 | గంజాము, చెన్నపట్టణము. (ఈసంవత్సరమునకును, 1890 సం॥నకును. జననమరణ లెక్కలప్రకారము విశేషము గలిగినమరణముల సంఖ్య. | 500,000 |

1890 కుమార్, గార్వాలు.

1892 గార్వాలు, ఆల్మోరా.

1891-92 చెన్నపట్టణము దారుణమైనసస్యనాశనము-

తొామనివారణార్థము పౌ 100,000 ఖర్చు

పెట్టబడినవి.

... ... బొంబాయి, డక్కను.

... ... వంగదేశము, మరణములసంఖ్య అసాధా

రణము.

... ... బర్మాయందుత్తరభాగము.

... ... అజమీర్, మీార్వార్.

[1891-92 సంవత్సరములలో హిందూదే

శమంతటను మామూలుకంటె యధికము

గా సంభవించిన మరణములు.

| | | | |
|---|---|---|---|
| 1891 ... ... | 420,000 | } | 1,620,000 |
| 1892 ... ... | 1,200,000 | } | |

1895-97 మహోగ్రమయిన కఱవు.

బుండెల్కండు, పశ్చిమోత్తర పరగణాలు,

అయోధ్య,వంగదేశము, మధ్యపరగణాలు.

చెన్నపట్టణము, బొంబాయి,పాంచాలము,

బీరారు, బర్మా.

మామూలుకంటె అధికముగసంభవించిన

మరణముల సంఖ్య.

| | | |
|---|---|---|
| 1895 ... ... | 1,200,000 | |
| 1896 ... ... | 1,800,000 | |
| 1897 ... ... | 2,650,000 | 5,650,000 |

| | | |
|---|---|---|
| 1898 | క్షామవిరహితమని చెప్పబడిన సంవత్సరము. ఇందు విశేషమరణములు. | 650,000 |
| 1899-1900 | ఇంతవరకును హిందూదేశములో సంభవించిన క్షామములలోకెల్ల, బహువ్యాప్తమయినట్టియు, మిక్కిలి భీకరమయినట్టియు (ఇది లార్డుకర్జన్‌గారు ప్రయోగించిన పదము) మహాక్షామము. ఇది గంగానదికి పశ్చిమమునను న్న దేశమంతయును కాశ్మీర సరిహద్దులనుండి మైసూరువరకును, చెన్న రాజధానిలో అక్కడక్కడను సింహాదేశమునుండి ఒరిస్సా సరిహద్దువరకును, వ్యాపించెను. సస్యనాశనము పౌ 150,000,000 కంటె తక్కువయుండదు. క్షామవిచారణ సంఘమువారి లెక్కలననుసరించి మరణములసంఖ్య 1 250,000 ఉన్నది. కాని పరిశోధించి చూచినచో దానికంటె మూడు నాలుగురెట్లు ఎక్కువయుండును. కానిగవర్న మెంటుఅంచనాకు రెట్టింపుమాత్రమె ఇచ్చుచున్నాము. | 2,500,000 |
| 1901 | గుజరాతు, డక్కను, బొంబాయి, కర్ణాటకము చెన్నపట్టణము,దక్షిణపాంచాలము. | 750,000 |
| | 1854-1901 వరకు 47 సం॥ లో అనుమతింపబడిన మరణసంఖ్య మొత్తము. | 28,825,000 |

పందొమ్మిదియవ శతాబ్దమును నాలుగు భాగములుచేసి పోల్చిచూచినచో మరణ

సంఖ్యాధిక్యతసంక్షిప్తమగు ఈక్రిందిపట్టిక వలన తెలియును.

| సంవత్సరములు. | కఱవులు. | మరణములు |
| --- | --- | --- |
| 1800-1825 | అయిదుకఱవులు. ప్రాణనష్టము స్వల్పము. కొన్నికఱవులు యుద్ధములవలన కలిగెను. అధికవిస్తీర్ణమునకు వ్యాపింపలేదు. బహుశః | 1,000,000 |
| 1826-50 | రెండుకఱవులు. 1833-1837 సం॥ లందు సంభవించెను. ఇవి రెండును స్థానికమయినవి. చెన్నరాజధానిలో క్షామమధికముగనుండెను. 1833 కఱవులవలననే, గోదావరి నీటిపారుదలపనుల (Irrigation works) నిర్మాణమారంభింపబడెను. బహుశః | 500,000 |
| 1851-75 | ఆరు కఱవులు. ఒరిస్సాలో కఱవుభీకరముగనుండెను. రికార్డుచేయబడినమరణములు. | 5,000,000 |
| 1875-1901 | పదునెనిమిది కఱవులు. వీనిలో నాలుగు కఱవులు మహోగ్రమైనవి. ఇట్టికఱవులు మున్నెన్నడును ఇండియాలో సంభవించియుండలేదు. ఈనాల్గింటిలో మొదటికఱవువలన 6,250,000 ప్రాణములు నష్టమయ్యెను. 1899-1900 ఈపది సంవత్సరములలోను సంభవించిన రెండుకఱవులవలనను "లాన్సెట్" పత్రికవిలేఖకుని లెక్కప్రకారమును స్టేట్సుమన్, ఫ్రెండుఆఫ్ ఇండియా పత్రికల యాచనాపత్రికారమును | |

19,000,000 ప్రాణములు నష్టమయ్యెను.
మరణముల అంచనా. 26,000,000

20 వ శతాబ్దమున వచ్చిన క్షామములు.

1901 కాటక సంవత్సరము. కాటక నివారణార్థము 551,000 నవరసులు వ్యయమయ్యెను.

1902 మధ్యపరగణాలలో "విస్తారమగు సంక్షోభము" నివారణవ్యయము 315,500 నవరసులు.

1903 ఉత్తరబర్మాలో కొన్ని భాగములలో పంటలు నష్టము.

1904 నాగదేశమున "స్థితి బాగుగ లేదు" పంజాబులో అనుకూలముగ లేదు. మధ్యపరగణాలలో పంటలు తక్కువ. చెన్నరాజధానిలో ఎండపంటనష్టము. బొంబాయియందు మిక్కిలి బీదస్థితి; గుజరాతులలో కఱవు; కాని తీవ్రమైనది కాదు. సంయుక్తపరగణాలలో సధకము గానుండెను. బాడిల్ కండులో క్షామము ఆగ్రాలో వ్యవసాయము తారుమారైనది.

1905 నాగదేశమునకొంచెము సంక్షోభము సంయుక్తపరగణాలలో ఆహార పదార్థముల కొఱత; పంజాబులో సంక్షోభము; ఢిల్లీలో నివారణసౌకర్యములుండెను. పశ్చిమోత్తర పరగణాలలో బీదస్థితి. మధ్యపరగణాలు, బీరారులలో వరిపంటనష్టము; చెన్నరాజధాని "ప్రతికూలపరిస్థితులు; బొం

బొంబాయి డక్కనులలో 'కాటకపరిస్థితులు'

1906 వంగదేశముకొంత భాగము బాగుగనున్నది. మిగత భాగము అనుకూలముగ లేదు. తూర్పుబంగాళము అస్సాములలో క్రిందటి సంవత్సరపు కాటకపరిస్థితులు సాగుచుండెను. సంయుక్తప్రాంతములుకూడ ఉన్నట్లై యుండెను.

1907 కాటక వత్సరము.

1908 కాటకము ఎడ తెగకుండయుండెను. ఒరిస్సాలోను, బీహారులోను, అమితసంక్షోభము సస్యనాశనము.

" 1907-8 సంవత్సరములలో శరదృతువు పంట సర్వత్ర నష్టమగుటచేతను, వసంతఋతువు పంటయొక్క విస్తీర్ణము తగ్గి పంటతక్కువగుటచేతను, ప్రజలనేకులు ప్రభుత్వ సహాయమును పొందవలసినవారైరి. 66,000 చతురపుమైళ్ళ విస్తీర్ణముగల భాగముపైనున్న, మూడుకోట్ల జనులకు ప్రభుత్వమువారు క్షామ నివారణ సౌకర్యము లొనర్పవలసి వచ్చెను. ఆగస్టుమాసాంతమువరకు నుచితముగా సహాయము చేసిరి. "

ఈవిధముగ 1907 వ సం॥ లో సంభవించిన కఱవు కొన్ని జిల్లాలలో 1909 వ సం॥ వరకు విడువకుండెను. వంగదేశము, బీహారు మధ్య పరగణాలు, బీరారు, అస్సాము, బొంబాయిలలో కాటకపరిస్థితులు తీవ్రముగా నుండెను. క్షామ నివారణము 1909 వ సం॥ వరకు చేయబడుచుండెను.

1911 వ సం॥ లో గుజరాతులో విశేషభాగమందును, 1921 వ సం॥లో అహమ్మదునగర్ జిల్లాయందును, వర్షములు లేకుండెను.

1913-14 లలో సంయుక్తప్రాంతములలో చాలచోట్ల అనావృష్టి సంభవించెను. 5,250,000 జనులుగల 17,000 చతురపుమైళ్ళ విస్తీర్ణముగల ప్రదేశమున ఈకఱవు వ్యాపించెను. 14,000,000 జనులుగల 30,000 చతురపుమైళ్ళలో క్షామమనుధికముగానుండెను. 1914-15 సం॥లో బంగాళాదేశమున కొన్నిభాగములలో భీకరమగు కఱవుండెను. కాని ఇండియానుండి ధాన్యము నిరభ్యంతరముగ నెగుమతి యగుచుండెను.

కాటకముల భయంకరస్వభావము. హిందూదేశమును పీడించుచున్న క్షామముల స్వభావమును పరికించినచో జనులెట్టి కష్టములకు లోనగుచున్నారో విశదమగును. పైనుదహరించిన పట్టికనుబట్టి కఱవు లాంగ్లపరిపాలనమునకు పూర్వము మిక్కిలి స్వల్పముగానుండెనని తెలిసికొంటిమి. అవికూడ కొన్నిప్రాంతములందు మాత్రమే సంభవించుచుండెను. ఆకాలమున ప్రజలు భాగ్యవంతులయి ధనధాన్యాదులను నిలువచేసి యుంచుకొనుటవలన కాటక సంవత్సరములలో కలిగిన స్వల్పనష్టముల లక్ష్యపెట్టకుండిరి.

ఆంగ్లపరిపాలనముదట్లుగాక క్షామములసంఖ్య హెచ్చుచున్నది. ప్రజల సంక్షోభముకూడ నెక్కువగుచున్నది. వారన్ హేస్టింగ్సు అను ఆంగ్లగవర్నరు పాలించుసమయమున 1769-70 సం॥ వంగదేశమున కాటకము చెలరేగుచుండెను. జనులు మిక్కిలి విషాదకరమగు స్థితియందుండిరి. అయినను ప్రభుత్వమువారు దయాదాక్షిణ్యములు లేక కఠిన హృదయులై పన్నుల నెక్కువగ వసూలుచేసిరి. క్షామమువలన రాష్ట్రములో మూడవవంతు జనులు మరణించినను పొలములు సేద్యముచేయబడక విడిచిపెట్టబడినను, ప్రభుత్వమువారు వెనుకటి సంవత్సరముకంటె నెక్కువశిస్తును వసూలుచేసిరి. క్షామపీడితులగు భారతీయులకు దుర్భరములగు పన్నులుకూడ చెల్లింపవలసిన దుస్థితిపట్టెను.

1837 సం॥ కలిగిన కాటకమువలన సంభవించిన మరణములు మిక్కుటముగ నుండెను. వీథులందును నదీతీరములందును కళేబరములు కుప్పలుకుప్పలుగా పడియుండెను. కాన్పూరు, ఫత్తేపూరు, ఆగ్రా మొదలగు పట్టణములలో శవములను రాజబాటలనుండి తొలగించుటకు ప్రత్యేకముగ ఉద్యోగస్థులు నియమింపబడిరి. గ్రామములందు లక్షలాది జనులు దిక్కుమొక్కు లేక చచ్చిపోవుచుండిరి. పాతిపెట్టుటకును, దహనము చేయుటకునుకూడ మనుష్యులు లేకుండుటచే రోడ్లమీదను, వీథులందును పడియున్న మృతకళేబరములు గృధ్రజాబుకములపాలగుచుండెను.

పది తొమ్మిదియవ శతాబ్దపు చివరభాగమున కఱవు లింతకంటెను భీకరముగనుండెను. చాలు మతిభయంకరముగ చెలరేగుచుండుటయు, ప్రజల దారిద్ర్యము నానాటికి హెచ్చిపోవుచుండుటయు తటస్థించుటచే నమితసంఖ్యాకులగు భారతీయులు తిండిలేక ఈగలవలె నశించిపోయిరి. ఇప్పుడు మనదేశమున భాగ్యవంతుల సంఖ్య బహుస్వల్పము. అది యింకను క్రమక్రమముగ సన్నగిల్లిపోవుచున్నది. గొప్ప గొప్ప కుటుంబములే లక్షలకొలది నశించినవి. భాగ్యవంతులే క్షామదేవతయొక్క నిరంకుశ పరిపాలనపు ధాటికి నిలువలేకుండిరి. ఇక సామాన్యజనులమాట చెప్పనేల? మనదేశమున జనసామాన్యము మిక్కిలి నిరుపేదలు గర్భదారిద్ర్యమున మునిగియున్నారు. కనుక క్షామ సమయమున వీరుపడుబాధలు వర్ణింప నలవికాదు. మరణముల సంఖ్య గణింప తరముగాదు.

కాటకము లనేక గ్రామములను రూపుమాపెను. సిరిసంపదలతో శోభిల్లుచుండిన గృహము లనేకములు పాడుపడి గబ్బిలములకును గూబలకును నివాస స్థానములయ్యెను. కొన్ని నగరములు నాశనమొందెను. పూర్వముకంటెను ఈయిరువదియైదు సంవత్సరములలోను కఱవు లతిభయంకరముగ నుండుటచే శవములు వీథులందు గుట్టలు గుట్టా

లుగా కన్పించుచుండెను. రాజబాటలు కళేబరములతో నిండిపోయెను. నదులందవి లెక్కలేక కొట్టుకొని పోవుచుండెను. జననష్టమిట్లుండ పైరు పంటలెట్లుండెనో చూతము. నాశనమయినపొలములును, పంటపైరులును గణింపతరముకాకుండెను. పశువుల మరణములను లెక్కించుటకు మనుష్యులేలేకుండిరి. 1905సం॥ గోక్లేగారు "గతయెనిమిది సంవత్సరములలో నువచ్చిన క్షామములవలన పశువులు పంటలు నశించుటచే, మనదేశమునకు (ప్రభుత్వ లెక్కల ప్రకారము) 200 మిలియనుల పౌనులు అనగా 300 కోట్ల రూపాయలు నష్టము గలిగెనని చెప్పిరి. ఇంతేల 19 వ శతాబ్దపు చివరభాగమునందు హిందూదేశములో నిపలు ప్రాంతములను నిర్మానుష్యములుగను నిర్భాగ్యములుగను చేసివైచిన యీకరువులవంటికరువులు ప్రాపంచికచరిత్రలో నున్నెన్నడును ఏదేశమందును కలుగలేదనియు, మఱియేపరిపాలనయందును నింతస్వల్పకాలములో నింతయధికముగ ప్రజలు మరణించియుండలేదనియు నెక్కివక్కాణింపవచ్చును.

మనదేశములో సంభవించిన కఱవు లెంతభయంకరమైనవో యీక్రింది విషయము వలన స్పష్టమగును. "1875 మొదలు 1900 సంవత్సరమువరకుగల యీ ఇరువదియైదు సంవత్సరముల కాలములో, ఆంగ్లేయపరిపాలనక్రిందనున్న మనదేశములో క్షామమువలన సంవత్సరమునకు సగటున 10 లక్షలకంటె నెక్కువజనులు మరణించిరి. అనగా ఒక్కొక్క నిమిషమున కిద్దరు ఒక్కగంటలో 120 మందియు ఒక్క దినములో 2880 మందియు మరణించినట్లు తెలుచున్నది. గతపదిసంవత్సరములలోను (1890-1901) క్షామమువలన మరణించినవారిసంఖ్య పరిశీలించినయెడల సగటున ప్రతినిముషమునకు 4 గురును ప్రతిగంటకాలములో 240 మందియు ప్రతిదినమును 5760 మందియు పరలోకగతులయిరి." (డిగ్బిగారి పుస్తకమనుండి) సమస్తసంపదలకు తుల

తూగుచుండిన భారతవర్షమున కెంతగతిపట్టెను ! కటకటా !! తినుటకు తిండిలేక నిమిషమునకు 4 గురు చొప్పున చనిపోవుటయా ?

ఆంగ్లపరిపాలనమున భారతవర్షమెంత ఘోరములగు క్షామములచే పీడింపబడెనో తెలిసికొనుటకు డిగ్బిగారు మరియొక యంశము తెలిపియున్నారు. ప్రపంచమునందన్ని దేశములలోను 1793 మొదలు 1900 సం॥ వరకు అనేకయుద్ధములు జరిగియున్నవి. ఆయుద్ధములలో ఎందరోజనులు మరణించి యుందురుగదా ! ఈ 107 సంవత్సరములో నుప్రపంచమునందంతటను యుద్ధములలో మరణించినవారిసంఖ్య 50 లక్షలని లెక్కలవలన తెలియుచున్నది. మనభారతదేశమున (1890-1901) పదిసంవత్సరములలో క్షామమువలన 190 లక్షలమంది మరణించిరని దొరతనమువారి లెక్కలనుబట్టియే తెలియుచున్నది. చూచితిరా ! నూటయేడు సంవత్సరములలో ప్రపంచమందంతటను జరిగిన యుద్ధములలో మరణించినవారికంటె (50 లక్షలు) పదిసంవత్సరములలో మనదేశములో నించుమించు నాలుగురెట్లు ఎక్కువమంది (190 లక్షలు) క్షామమువలన చనిపోయిరి. ఇంతకంటెను ఘోరమగు స్థితి మఱియేదైనగలదా !

ఇరువదియవ శతాబ్దమందు వచ్చుచున్న కరువులనుగూర్చి యంతగా వ్రాయనవసరములేదు. ఏలయన కాటకపరిస్థితులు మనకనుభవపూర్వకముగా తెలియును. ఒకసంవత్సరము కరువువచ్చినది, ఒకసంవత్సరములేదు అనువివక్షతలేక దేశమునిరంతర క్షామముచే పీడింపబడుచున్నది. కనుకనే మనము కఱవున్నట్లుకూడ తలంపము. కాటకసమయముననుండెడి సంక్షోభము మనకు సామాన్యమైపోయినది. సంపూర్ణముగ క్షుద్బాధ నివారించుకొనుట కాహారములేకయే దినములు గడపుచున్నాము. అందుచే నవ్యాధులును మరణములును నమిత

ము న్నవి. విదేశీయుల యాయుర్దాయము క్షీణించుచున్నది. మరణాముల సంఖ్య హెచ్చుచున్నది.

క్షామహేతువులు.

ఈ క్షామములకు హేతువు లెవ్వియను విషయము తెలిసికొని యాకారణములు తొలగించుటకు ప్రయత్నించుట యవసరము. వర్షములు లేకపోవుటచేత కఱవులు వచ్చుచున్నవని కొందరందురు. మఱికొందరు ఆహారపదార్థములు చాలకపోవుటచే కాటకములు వచ్చుచున్నవందురు. జనసంఖ్య హెచ్చగుచుండుటచే కఱవులు వచ్చుచున్నవని మఱియొకవాదము. రైతులవ్యయస్వభావమును, వారి ఋణగ్రస్థతయు క్షామహేతువులని కొందఱి యభిప్రాయము. ఈ యభిప్రాయములన్నియు విమర్శించి క్షామములకు మూలహేతు వేదో కనుగొనవలెను. ఇవన్నియు పరిశీలించినపిమ్మట భారతదేశముయొక్క భయంకరమగు దారిద్ర్యమే క్షామములకు మూలకారణమని స్పష్టము కాగలదు ?

(1) వర్షములు తక్కువగుటచే పైరుపంటలు నష్టమయి క్షామములు కలుగుచున్నవా ? మనదేశములో సస్యములు పెరుగుటకు సరిపడినంతవర్ష మెప్పుడును కురియుచునేయున్నది. "వర్షములులేని సంవత్సరములందు"కూడ పంటల కవసరమగు నీరు లభ్యమగుచున్నది. కనుక వర్షములు లేకపోవుటచే కఱవులు వచ్చుచున్నవనుటలో సత్యములేదు.

మరియొక విషయమేమనిన కఱవులు సాధారణముగ వర్షములులేని సంవత్సరములందుగాక, ఎక్కువ వర్షములు కురిసినపుడే వచ్చుచున్నవి. వర్షములు సకాలములో కురియక, పంటలసమయమునకు పూర్వమో తర్వాతనో కురియుటచే, ఉపయోగించుటలేదు. ఆ వర్షపునీటి నంతను వ్యవసాయమున కుపయుక్తమగునట్లు, నిలువచేయు

టకు ఇరిగేషనువర్క్సు సమృద్ధిగా లేకుండుటచే రైతులు కష్టములా పాలగుచున్నారు. మదాసులో కఱవుపుట్టిన సంవత్సరము (1877) 66 అంగుళముల వర్షముండెను. ఒరిస్సాలో కాటకమువచ్చిన సం॥లో (1865-66) 60 అంగుళములు వర్షము కురిసెను. 1876 సం॥ బొంబాయిలో కఱవు సంభవించినపుడు 52 అంగుళములు వర్షముకురిసెను. 1895-97 సంవత్సరములలో మధ్యపరగణాలలో కఱవుపుట్టినపుడు, రెండుసంవత్సరములందును క్రమముగా 52 అంగుళములు, 42 అంగుళములు వర్షము కురిసెను. కాటకసంవత్సరమగు 1900 లో క్షామము భయంకరముగనున్న ప్రాంతములయిన మధ్యపరగణాలలో 52 అంగుళములును మధ్యఇండియాలో 36 అంగుళములు, రాజపుటానాలో 20 అంగుళములును, బీరారులో 32 అంగుళములును, బొంబాయిలో 40 అంగుళములును, పశ్చిమోత్తర ప్రాంతములలో 32 అంగుళములును, పాంచాలములో 18 అంగుళములును వర్షముకురిసెను కావున వర్షాభావ మొంతమాత్రము క్షామహేతువు కాలేదనుట స్పష్టము. వర్షములున్నను, నదులు, మొదలగు జలాధారములందలి నీరునునిలువ చేసి, పొలముల కుపయోగించుటకు సౌకర్యములంతగా లేకపోవుటచే, కఱవులు సంభవించుచున్నవి.

(2) ఆహారపదార్థముల లోపముచే కఱవులు వచ్చుచున్నవా?:- సస్యముల కుపయోగమగునట్లు వర్షపునీటిని నిలువచేయుటకు సౌకర్యములు స్వల్పముగానున్నను, ధాన్యాదులు భారతీయులకు సరిపడునంత పండుచునే యున్నవి. స్వాభావికకారణములచేత నెన్నడును, భారతీయులకు లోపము కలుగునంతపంట నష్టముకలుగలేదు. భయంకరమగు క్షామము పీడించుచున్న సమయమునకూడ, అన్యదేశములకు ధాన్యమెగుమతి చేయబడుచునేయున్నవి. కాటకము తీవ్రముగానున్న స్థలములందునను ఆహారపదార్థములు సమృద్ధిగానుండె...

ధనవిహీనులగు పేదజనులు వానిని కొనజాలక మృత్యువునోట బడు చున్నారు. ఈ విషయమును కాటకవిచారణ సంఘమువారే ఒప్పుకొనియున్నారు. 1900 సంవత్సరమున క్షామపీడితమగు గుజరాతు రాష్ట్రమున ధాన్యపువర్తకులవద్ద రెండుసంవత్సరములకు సరిపడిన సరకుండెనని ప్రభుత్వపులెక్కలనుండియే తెలియుచున్నది. కావున ఆహారపదార్థములు తక్కువగ నుండుటచే క్షామము సంభవించుచున్న దను వాదమునిలువజాలదు.

జనసంఖ్య హెచ్చుటచే క్షామములు కలుగుచున్నవా? పరిశీలించి చూచినచో ఈవాదమునందుకూడ సత్యముకాన్పించదు. ఐరోపాయందును అమెరికాదేశములోను జనసంఖ్య వృద్ధియగుచున్నట్లు, మన దేశములో వృద్ధిపొందుటలేదు. జననముల సంఖ్యకూడ ఇంగ్లాండు, జర్మనీదేశములలోకంటె తక్కువగనున్నది. "ఇండియాలో నిజముగ జనసంఖ్య అధికముగా నున్నదనుటకు, నిదర్శనములు చూపుట యసాధ్యము"ని లవెడేగారు వ్రాసియున్నారు. జనసంఖ్య హెచ్చినను మన దేశము భరింపగలదు. సాగుబడిచేయుట కర్హమైయునభూమి యింకను అనేకలక్షల యెకరములున్నది. హిందూదేశములోని జనసంఖ్య యొక్క అభివృద్ధిని, జర్మనీ, బెల్జియమ్, ఇంగ్లండు, జపానుదేశములలోని యభివృద్ధితోపోల్చి చూచినయెడల మిక్కిలి స్వల్పముగా నున్నట్లు తెలియవచ్చుచున్నది. హాజెల్‌గారి "అన్యుయల్" (Hazell's "Annual" for 1917) యను గ్రంథములో నుదహరించిన యీక్రింది యంకెలవలన హిందూదేశమున జనసంఖ్య మిగుల స్వల్పముగా వృద్ధి యగుచున్నట్లు విశదమగును.

జనసంఖ్యయొక్క అభివృద్ధి.

| | 1881-91 | 1891-1901 | 1901-11 | మొత్తము. |
|---|---|---|---|---|
| ఇంగ్లాండు, వేల్సు | 11.7 | 12.2 | 10.9 | [illegible] |

| | | | | |
|---|---|---|---|---|
| ఆస్ట్రేలియా | 41.1 | 18.9 | 18.1 | 78.1 |
| జర్మను సామ్రాజ్యము | 9.3 | 14.0 | 15.2 | 38.5 |
| హంగరీ | 11.0 | 10.3 | 8.5 | 29.8 |
| నెదర్లండ్సు | 12.4 | 13.1 | 14.8 | 40.3 |
| అమెరికా (U.S.A.) | 25.5 | 20.7 | 21.0 | 67.2 |
| ఇండియా | 13.2 | 2.5 | 7.1 | 22.8 |

పై పట్టికవలన మనదేశములో జనసంఖ్యయొక్క అభివృద్ధి మిగత దేశములకంటె చాలతక్కువగ నున్నదని స్పష్టమగుచున్నది. కనుక జనసంఖ్యాభివృద్ధి కాటకహేతువు కానేరదు.

రైతుల జాగ్రత్తవలనను, దుర్వ్యయమువలనను పండిన సంవత్సరము ధాన్యము నిలువ చేసకొనకుండుటచే కఱవుకాలమున కష్టముల పాలగుచున్నారని కొందరు చెప్పుదురు. కాని భారతదేశపు రయితులంత జాగ్రత్తగలవారును, మితవ్యయము చేయువారును, ఈపృథ్వి మీద మఱియొకరు లేరని ఆంగ్లేయ మహానీయులే ఒప్పుకొనియున్నారు.

రైతుల ఋణగ్రస్థత కాటకహేతువా? రయితులు ఋణముల పాలగుటచే, ద్రవ్యవిహీనులయి కఱవుల బారినుండి తప్పించుకొన జాలకున్నారని ప్రభుత్వమువారు చెప్పుదురు. ఈ ఋణగ్రస్థత యెట్లు సంభవించుచున్నది? దీనికి ప్రభుత్వ పక్షవాదు లేమిసమాధాన మొసంగెదరో చూడుడు. వివాహాది శుభకార్యములకును, పండుగలకును, పబ్బములకును ధనము వ్యయపరచుచుండుటచే రయితులు ఋణములపాలగుచున్నారని వారియభిప్రాయము కడుపునిండ తిండి తినుటయన నెద్దియో యెరుగని జనులు పండుగ పబ్బముల కమితముగ వెచ్చించుచున్నారట? అందుచే వారప్పులపాలగుచున్నారట? 1887-88 సంవత్సరమున జరిగిన ప్రభుత్వోద్యోగ సంఘమువారి

తీర్పును పరిశోధించినచో, వారు చెప్పినసంగతి యసత్యమని తేలగల దని డిగ్బిగారు వ్రాసియున్నారు. "మొదటి 20 కేసులును విమర్శించిన వానిలో రెండిటియందుమాత్రము వివాహాది శుభకార్యములవలన ఋణముచేసినట్లు తేలుచున్నది. ఋణములో కొంతభాగము మాత్రము (10 వ వంతు) శుభకార్యముల కుపయోగింపబడినది." "742 కుటుంబములలో మూడింటియందుమాత్రము వివాహమునకు చేసిన దుర్వ్యయము వారిఋణగ్రస్తతకు కారణమగుచున్నది." యని తారనన్‌గారువ్రాసిరి. బీసెంటమ్మగారు తమ "యిండియా ఏ నేషను" అను గ్రంథమున నీవిషయము నిట్లు విమర్శించిరి. "పండుగపబ్బములకు రైతులుచేయు ధనవ్యయమే ఈ మహాదారిద్ర్యమునకు కారణ"మని సర్ ఆంటనీ మెగ్డానల్‌గారు చెప్పిరి. కాని ఈ భోగములకొఱకు వానికి మిగులునది ఏపాటి? ఒకవేళ మిగిలినను ఆంగ్లఉద్యోగి యొకడు క్లబ్బులో నొక్కనాగు వ్యయపరుచు ధనములో నిది యెన్నవవంతుండును? డిగ్బీ మనరైతుల ఆదాయవ్యయముల పట్టికను తయారుచేసియుండెను. అందుండి యొకయుదాహరణను చూపెదను. సంయుక్త పరగణాలలో $5\frac{1}{2}$ ఎకరముల భూమి, ఒకజతఎడ్లు, ఒకనాగలి, కలిగిన రైతునకు ఖర్చులుపోగా సంవత్సరమునకు మిగిలినది రు 45-14-0 వాని కుటుంబమున నైదుగురుండిరి. కనుక తలయొకటికి సంవత్సరమునకు రమారమి రు 9-2-10 అగును. ఇట్టి వనేకములుకలవు." క్రూరమగు నట్టియు. దుర్భరమగునట్టియుశిస్తు వసూలే, రైతుల ఋణగ్రస్తతకు కారణమని చెప్పవచ్చును.

నిజమగుకారణము:—భారతవర్షము క్షామములచే పీడింపబడుటకు దరిలేని దారిద్ర్యమె కారణమని డిగ్బిగారు నిశ్చితాభిప్రాయ మొసంగియున్నారు. రెవరెండు డాక్టరు సండరులెండుగారుకూడ నిట్టి యభిప్రాయమునే యిచ్చియున్నారు. "వర్షములు" సరిగాలేకపోవుట

వలనగాని, జనసంఖ్య హెచ్చుచుండుటవలనగాని క్షామములు సంభవించుటలేదు. అవి హేయమును, భయంకరమునునగు దారిద్ర్యము వలనకలుగుచున్నవి. విదేశములకు ఇండియా కట్టుచున్నకప్పమును, ప్రపంచములో నెల్ల నెక్కుడు వ్యయహేతువగు ప్రభుత్వవర్గమును, దేశీయాదాయములో సగముభాగము దిగమ్రింగుచున్న సైనికవ్యయమును, విదేశములతోడి యుద్ధములును ఈమహాదారిద్ర్యమునకు కారణములని వారువ్రాసిరి.

క్షామనివారణము.

క్షామసమయమున ప్రజల కష్టముల నివారించుటకు ప్రభుత్వమువారు కొంతవరకు తోడ్పడుచుండిరనుట నిజమే కాని వారు క్షామములకు మూలహేతువగు దేశదారిద్ర్యమును తొలగింపకుండుట మిక్కిలి విచారకరము. ప్రస్తుత ప్రభుత్వమువారు చేయుచున్న క్షామనివారణపద్ధతులనుగూర్చి విచారించుటకు పూర్వము ప్రాచీనకాలమున క్షామనివారణార్థమును, క్షామము రాకుండచేయుటకును ఎట్టి ప్రాకర్యములు చేయబడెనో తెలిసికొందము.

పంటలుసమృద్ధిగా పండినచో కరువుల బాధ తొలగిపోవును. వ్యవసాయమును వృద్ధిపొందించుటకు నీటి సౌకర్యములు మిక్కిలి యవసరము. వర్షములు తక్కువయినను, సకాలములో కురియకపోయినను, కాలువలు, చెరువులు, నూతులు మొదలగు జలాధారములవలన పైరులు పండింపవచ్చును, పంటలు పూర్ణముగాపండినపుడు క్షామదేవతకు తావుండదు. ఈయంశముు బూర్వపురాజులు గ్రహించినే, వ్యవసాయమున కవసరమగు నీటిసౌకర్యములయెడల మిక్కిలి శ్రద్ధవహించుచుండిరి. చంద్రగుప్తుడు, అశోకుడు మొదలగు మౌర్యచక్రవర్తులును, సముద్రగుప్త, విక్రమాదిత్యాదిగుప్త చక్రవర్తులును కాలువలు, తటాకములు, నూతులు మొదలగు నీటిసౌకర్యముల నేర్పరచుటయేగాక,

సరకులనొకచోటనుండి మరియొకచోటకు గొంపోవుటకు బాటలు కూడవేయించిరి. చంద్రగుప్తమౌర్యుడు వ్యవసాయాభివృద్ధికొరకు నదులకానకట్టలు కట్టించి, కాలువలుత్రవ్వించి, వానినుండి పిల్లకాలవలును, పంటకాలువలును తీయించి, రైతులకునీటిని నిష్పక్షపాతముగ పంచియిచ్చుచుండెను. జలాధారముల నిర్మించుటలో చోళరాజుల ద్వితీయులుగ ప్రఖ్యాతివహించిరి. మనదేశమున నీటి పారుదలపను లెంత ప్రాచీనకాలమునుండి యున్నవో చెప్పజాలము.

మహమ్మదీయ చక్రవర్తులీ విషయములో హైందవరాజుల కంటె నెక్కువపనిచేసి కీర్తిగడించిరి. పెక్కుకాలువలు త్రవ్వించిరి. కొండలోయలడ్డుకట్టి వర్షపునీటిని నిలువచేసి సరస్సులనిర్మించిరి. బావులను త్రవ్వించుకొనుటకు మహమ్మదు తుగ్లక్ ద్రవ్యసహాయము చేయుచుండెను. ఫిరోజ్ తుగ్లక్ ప్రజోపయోగార్థము మందిరాదికముల నేకముకట్టించెను. "40 మసీదులు, 30 పాఠశాలలు, 100 ధర్మశాలలు, 200 పట్టణములు, 20 రాజమందిరములు, 100 ఆసుపత్రులు, 10 నక్షత్రశాలలు, 10 పెద్దబావులు, 30 తటాకములు, 50 ఆనకట్టలు, 150 వంతెనలు నిర్మించెను. ఇవిగాక గొప్పకాలువలు త్రవ్వించెను. అందులో మూడు ముఖ్యమైనవి. యమునానదినుండి ఒకకాలువతీయించి పానిపత్ వద్దనుండి......హాంసీవరకు గొంపోయెను. అది యిప్పటివరకు పారుచున్నది. రెండవకాలువవలన ఘొగ్రా, సట్లెజ్ నదులు,యమునతో కలుపబడెను. మూడవకాలువ సరస్వతీనదిమొదలు సగర్ నదివరకు త్రవ్వింపబడెను." మ. మహాయుగము K. V. L. PP.58.

40 వ శతాబ్దమున రాజులు తలపెట్టిన ప్రజోపయోగకార్యములను 16,17 శతాబ్దములందు అక్బరు, షాజిహాన్ మొదలగు మొగలాయి చక్రవర్తులు విస్తృతముగ సాగించిరి. ప్రస్తుతము యమునానదీ ప్రాంతమునందున్న కాలువలు, మొగలాయీలు త్రవ్వించినవానిపై

వృద్ధిచేయబడినవే! పాంచాల, సింధుదేశములందలి కాలువల నిర్మాణ కాలమును చరిత్రకారులు నిర్ణయింపజాలకున్నారు. 16 వ శతాబ్దమున ఆంధ్రరాజులు తుంగభద్రానదిమీద ఆనకట్టు (wire.) నిర్మించి, కాలువలు, సరస్సులు త్రవ్వించిరి. ఒక్కసరస్సునిర్మించుటకు, 15 లేక 20 వేలమందికూలీలు పనిచేయుచుండిరట. పనిచేయునపుడు ఆస్థలమంతయు వాక్రమించి వీరందరు చీమలబారులవలె కనబడిరని పెయిస్ అను చరిత్రకారుడువ్రాసియున్నాడు. సాధారణముగ నదియందలి నీరైనంతయును సంపూర్ణముగ నుపయోగించునట్లు నీటిపారుదల సాధనములను నిర్మింపగల యింజనీ యర్లాకాలముననున్నట్లు తెలియుచున్నది. రాజపుత్రరాజులు కూడ క్షామనివారణార్థము కడుశ్రద్ధ వహించుచుండిరి. ("రాజసింహుని) ఈతని రాజ్యకాలమున క్రీ. శ. ౧౬౬౧ లో గొప్ప కఱవు తటస్థించెను. అప్పుడు బీదజనులను రక్షించుటకును, ముందట్టి కఱవులు రాకుండుటకును, అత్యంతవిశాలమైనదియు, సుందరమైనదియు నగు నొక్కతటాకముత్రవ్వించి దానికి రాజసముద్రమని పేరుపెట్టెను. రాజనగరమను నొకపట్టణమును కోటయునుకట్టించెను. ఈపనులన్నిటికిని 96 లక్షల రూపాయలుపట్టెనని ఇంతచిన్నరాజ్యముగల రాజసింహుడు కఱవుకాలములో ప్రజలను పోషించుటకు రమారమి కోటి రూపాయలు వెచ్చించుటవలననే యాతని యద్వితీయ ప్రజావాత్సల్యము వెల్లడించుచున్నది." మ. మహాయుగము. K. V. L. ౨౮౮

ఇంజనీయర్ల సహాయముతో చక్రవర్తులు గొప్పగొప్ప నీటిపారుదలపనులు నిర్మించుచుండ, వానినుపయోగించి మంచిస్థితిలో నుండునట్లు చూచుట గ్రామస్థుల పనియై యుండెను. అట్టిపనిని వారు సంతృప్తికరముగ నిర్వహించి, లాభమును పొందుచుండిరి. ఔరంగజేబు సామ్రాజ్యము విచ్ఛిన్నమయిపోయినతరువాత సంభవించిన యుద్ధములు, పోరాటములువలన, గ్రామకట్టుబాట్లు మూలపడెను.

పూర్వపురాజులు నిర్మించిన జలాధారములు శిథిలమయిపోయెను. అందుచేతనే ఆంగ్లప్రభుత్వమువారు నీటిపారుదలపనులను నూతనముగ నిర్మింపవలసివచ్చెను. పూర్వకాలమున జలాధారము లుండుటయేగాక, ధనము విదేశములకు ప్రతిఫలశూన్యముగ పోకుండుటచే ప్రజలు భాగ్యవంతులయియుండిరి. ఎప్పుడయిన కరువువచ్చునేమోయని, ధాన్యములను గాదెలలోపోసియు, పాతరవేసియు నిలువచేసికొను చుండిరి. కనుక క్షామమువచ్చినను ప్రజలు లక్ష్యముచేయక కాలము గడపుచుండిరి.

ఆంగ్లపరిపాలనము: క్షామనివారణము:—ఆంగ్లపరిపాలనమున క్షామ నివారణపద్ధతులు మిక్కిలి యనుకూలముగనున్నవి. కాని యీవిధముగ నుపయోగించుచున్న, ధనము, బుద్ధికౌశల్యము, ప్రోత్సాహము, క్షామములను రాకుండ చేయుట కుపయోగింపకుం డుట మిక్కిలి విచారకరము. కష్టకాలమున ప్రజాసామాన్యము ప్రభు త్వసహాయమును కోరుటను మిక్కిలి లజ్జాకరముగ భావింతురు. యదార్ధముగ ప్రభుత్వమువారు వ్యయపరచుచున్న ధనమంతయు ప్రజలనుండి పన్నుల రూపముగతీసికొనినదే. అయినను, సామాన్యమానవుడది యెఱుగక, ప్రభుత్వమునుండి దానము స్వీకరించుచున్నట్లు తలచుటచే, చాలపరితపించును. ప్రభుత్వముచేయుచున్న సహాయము శ్లాఘింపదగి నదయినను, ప్రజాసామాన్యమునందు ఆత్మగౌరవమును చంపును. కొన్ని కుటుంబములయొక్క పరువు ప్రతిష్ఠలపోగొట్టును. ప్రజలను బిచ్చగాం డ్రస్థితికి తీసికొనివచ్చును. నీతిని నశింపజేయును.

క్షామనివారణార్థము ప్రతిసంవత్సరమును ప్రభుత్వాదాయ ములో కొంతభాగము ప్రత్యేకింపబడుచున్నది. ప్రభుత్వన్యాయమునం దొక భాగమగు క్షామనివారణవిధియే దేశములో క్షామపరిస్థితులు సామాన్యముగనున్నవని, వ్యక్తపరచుచున్నది. ఈధనము, జలాధారము

లను అయోమార్గములను నిర్మించుట కుపయోగింపబడుచున్నది. ఈవిధముగ సంవత్సరమునకు కోటిన్నరరూప్యములు వ్యయపరుపబడుచున్నవి. ఇందు అయోమార్గములకు 75 లక్షలును, జలాధారములకు 74 లక్షలును ఖర్చుచేయబడును. ఇనుపదారులకు వెచ్చింప ద్రవ్యము ప్రత్యేకింపబడియుండగా, క్షామనివారణ నిధినుండికూడ సగముభాగము వ్యయపరచుట యక్రమము. కఱవులను శాశ్వతముగ తొలగించునవి జలాధారములుగాని అయోమార్గములు కావు. కావున క్షామనివారణ నిధియంతయు జలాధారములకే వ్యయపరచుటుచితము.

క్షామములు రాకుండుటకును, వచ్చినను భీకరముగ నుండకుండుటకును, ప్రభుత్వము నాఁడేమిచేసెరో, ఏమిచేయుచున్నారో తెలిసికొందము.

అయోమార్గములు—క్షామపీడితములగు ప్రాంతముల కితరస్థలములనుండి ధాన్యాదులను తీసికొనిపోయి రైతుల కఱవులబాధను కొంతవరకు తొలగించుచున్నవని చెప్పుచుందురు. ఆహారపదార్థములను కాటకస్థలములకు గొంపోవుటకు అయోమార్గములు తోడ్పడుచున్నను, అవి యధికధరలున్న ప్రదేశములకు ధాన్యాదుల నెగుమతిచేసి పంటలు బాగుగపండిన ప్రదేశములందు ధరలు హెచ్చించి, కఱవు సంభవించునట్లు చేయుచున్నవి. ఇట్లు హెచ్చినధరలు మరల తగ్గుటలేదు. కనుక కాటకపీడితమగు స్థలముకూడ క్రమముగా పెరిగిపోవుచున్నది. అదియుగాక హిందూదేశమునుండి ఆహారపదార్థములను విదేశముల కెగుమతిచేయుటకు, అయోమార్గములు ముఖ్యసాధనములై యున్నవి. దేశములో క్షామము భయంకరముగనున్న సమయమునగూడ ధాన్యాదులన్యదేశముల కెగుమతి చేయబడుచున్నవి. దుర్భరములగు పన్నులను చెల్లింపవలసియుండుటచే, రైతులు కుప్పనూర్చినవెంటనే ధాన్యమును వర్తకుల కమ్మివేయుదురు. ఈవర్తకులు కాటకపరిస్థితుల

ను సరకుచేయక, ఎక్కువధరలువచ్చు విదేశమునకు వానినెగుమతి చేయుచుందురు. కావున పంటలు నష్టమయినపుడు, నిలువధాన్యము లేకపోవుటచే, ప్రజలు తిండిలేక మృత్యువునోట బడుచుందురు. కావున అయోమార్గములు కఱవుగలచోట్ల కాహారపదార్థములను తీసికొని పోవుటకు సాధనములగుచున్నను, ధరలు హెచ్చించి, కాటకమును ఇతర భాగములందు వ్యాపింప చేయుటకుకూడ మూలకారణము లగుచున్నవి.

జలాధారములు:—నీటిపారుదల పనులను నిర్మించి వ్యవసాయమును వృద్ధిచేయుటయే, కాటకములను తొలగించుటకు ముఖ్యసాధనమని యిదివరకే వ్రాసియుంటిమి. 1878 సం॥ కాటకనివారణ సంఘముహారుకూడ క్షామములను తొలగించుటకు జలాధారముల నెక్కువగ నిర్మింపవలెనని నుడివిరి. కాని చాలకాలమువరకు ప్రభుత్వమువారు నీటిపారుదల పనులయెడ శ్రద్ధవహింపక, అయోమార్గములకు హెచ్చు ధనము వ్యయపరచుచుండిరి. నీటిపారుదల పనులు లాభమును సమకూర్చుచున్నను, రైలుదారులకే ఎక్కువ ధనము ఖర్చు చేయుచుండిరి. దీనికి కారణమేమి? రైలుమార్గములు విదేశవర్తకులకు లాభమును సమకూర్చును. కాలువలు దేశాభివృద్ధికి తోడ్పడును.

నిర్వ్యాపారత తొలగించుట:—ఆహారపదార్థములు పుష్కలముగానున్నను, ప్రజలు దరిద్రులగుటచే, వానిని కొనజాలకున్నారు. ధనమార్జించుటకు ప్రతిమానవునకు అవకాశములుండవలెను. మన దేశమున పరిశ్రమలు క్షీణించియుండుటచే, ప్రజలలో నధిక సంఖ్యాకులు వ్యవసాయముమీదనే యాధారపడి యుండవలసివచ్చినది. చేతిపనులవలన జీవించు జనులసంఖ్య స్వల్పముగ నున్నది. కనుక నిర్వ్యాపారత ఎక్కువగుచున్నది. దీనిని తొలగించుటకు పరిశ్రమలను వృద్ధిచేసి పనిలేనివారికి పనికల్పింపవలెను. అట్లు చేసినచో క్షామమువలన

భయముండదు. దేశీయపరిశ్రమలను ప్రోత్సహించి అనేకమందికి జీవనో పాధి కల్పించుట ప్రభుత్వధర్మము. ప్రస్తుతకాలమున దేశమందీ ధర్మము నిర్వహింపబడుచున్నదా ?

సహకార సంఘములు, విత్తనములు కొనుటకును:—ఎరువువే సిభూమి బాగుచేసికొనుటకును, పనిముట్లు కొనుటకును, వ్యవసాయదా రులకు ధనమవసరము కానివారు ద్రవ్యవిహీనులగుటచే పెట్టుబడి పెట్ట జాలరు. కనుక పంటలు పండిన తర్వాత తీర్చుకొను పద్ధతిని రైతులకు ఋణముల నిచ్చుటకు సహకారసంఘములు నెలకొల్పవలెను. వీనిని స్థాపించవలెనని 1884 సం॥ ప్రజలు కోరినపుడు ఇండియాకార్యదర్శి గారు నిరాకరించిరి. కాని కొన్ని సంవత్సరములు ఆలోచించి ఆలోచించి తుదకు సహకార సంఘములయొక్క ఉపయోగమును గ్రహించి 1904 వ సంవత్సరమున గ్రామ సహకారసంఘములు స్థాపింపనా రంభించిరి. ఇప్పుడివి ప్రతిరాష్ట్రమునందును నెలకొల్పబడి కొంతవరకు ఉపయోగకరము లగుచున్నవి.



## 10 వ ప్రకరణము.

### దారిద్ర్యము.

ఈ ప్రకరణమునందు మన యార్థికస్థితి ప్రస్తుత మెట్లున్నదో విచారింతము. పూర్వకాలమున భారతదేశము ప్రపంచమం దన్ని దేశములకంటెను మిక్కిలి భాగ్యవంతమై, సిరిసంపదలతోను, ధనధాన్యములతోను తులతూగుచుండెనను విషయము "చరిత్రప్రసంశ"యను రెండవప్రకరణమున విపులముగా వ్రాయబడినది. వర్తమాన భారత వర్షముయొక్క ఆర్థికస్థితి మిక్కిలి హీనముగా నున్నది. దరిద్రదేవత దేశమందు తాండవమాడుచున్నది. మన పూర్వు లెట్టి యౌన్నత్య మనుభవించిరో మనము చరిత్రముఖమున తెలిసికొనుచున్నాము. గాని మనప్రస్తుత దౌర్భాగ్యస్థితి స్వయముగ అనుభవించుచునేయున్నాము. "అనుభవపూర్వకముగ మన కెల్లరకు తెలిసియున్న విషాదకరమగు విషయమును వ్రాయనేల"యని పాఠకులు ప్రశ్నింపవచ్చును. ఆంగ్లపరిపాలనమునందు భారతీయులు మున్నెన్నడు నెరుగని మహదైశ్వర్యము ననుభవించుచున్నారని ప్రభుత్వమువారును, ప్రభుత్వ పక్షపాతులును చెప్పుచుందురు. కనుక ఆర్థికవిషయములను తీసికొని మనము బ్రిటిషు పరిపాలనమున అనుభవించుచున్న ఐశ్వర్యమేమో చూతము.

ఈ విషయమును కనుగొనుటకు పూర్వము మనయొక్క సంగతి విచారింపవలెను. భారతవర్షము ధనధాన్యాదులందు పూర్వ మెట్లున్నదో, యిప్పుడు నట్లేయున్నది. అప్పటివలె యిప్పుడును ఆహారపదార్థములు కావలసినన్ని లభించుచునేయున్నవి. కాని మనము దారిద్ర్య మనుభవించుచున్నాము. ఇట్లుండుట విరుద్ధముగను, అస్వాభావికముగను గన్పట్టును. అయినను ఈ విపరీతపు పరిస్థితులకు కారణములు తెలిసికొనుట కష్టముకాదు. మనదేశపు భాగ్యలక్ష్మి విదేశీయులపాల

గుచున్నది. ఆంగ్లేయు లనుభవించు హిందూదేశము భాగ్యవంతమయి నది. భారతీయు లనుభవించు హిందూదేశము దారిద్ర్యముతో కూడి యున్నది. ఆంగ్లదేశమునందుండి ఇండియాను పాలించుచున్న ఆంగ్లేయుడును, ఇండియా ప్రభుత్వములో ఉన్నతోద్యోగములను కలిగియున్న ఆంగ్లేయుడును, ఇండియాలో పెట్టుబడిపెట్టి వర్తకము చేయుచున్న ఆంగ్లేయుడును, మన వస్త్రపరిశ్రమల నశింపజేసి తమవస్త్రముల నిచ్చట వ్యాపింపజేసిన లంకషైరు బట్టలవర్తకుడగు నాంగ్లేయుడును, ఇండియాలో తేయాకు కాఫీతోటలపై లాభముతీయుచున్న ఆంగ్లేయుడును, మనదేశపు భాగ్యము ననుభవించుచున్నారు. మన మాంగ్లేయుల దయాదాక్షిణ్యములకు లోబడియుండి, స్వాతంత్ర్యవిహీనులమై, మనదేశపు భాగ్యమును మన మనుభవింపలేక దారిద్ర్యాంబుధి మునిగి పోవుచున్నాము.

ఏ దేశమందైనను మనిషి 1కి సంవత్సరమునకు సగటున వచ్చు ఆదాయమునుబట్టి దేశమందలి ప్రజల యార్థికస్థితి యెట్లున్నదో తెలిసికొనవచ్చును. దేశీయులు దరిద్ర మనుభవించుచున్నారో లేక భాగ్యవంతులుగనున్నారో తెలిసికొనుట కిదియే ముఖ్యసాధనము. కర్జనుప్రభువుగారును, హ్యామిల్టన్ ప్రభువుగారును హిందూదేశమున ఒక్కొక్కని సంవత్సరాదాయము సగటున 30 రూ॥ లుండునని యంచనా వేసిరి. భారతపితామహుడగు దాదాభాయినౌరోజీగారుకూడ హిందువుని సంవత్సరాదాయము సగటున 30 రూపాయలని నిర్ధారణ చేసిరిగాని 20 వ శతాబ్దమున అంతకంటె తగ్గి యుండునని అభిప్రాయపడిరి. రాబడిని తెలిసికొనుట కవసరమగు సర్కారు లెక్కలన్నియు పరిశోధించినతర్వాత విలియమ్ డిగ్బిదొరగారు (1900 సం॥) భారతీయునికి సంవత్సరమునకు సగటున పౌ॥ 1-2-1 (రూ॥ 16-12-0) రాబడి వచ్చుచున్నదని నిర్ధారణచేసె. [illegible]

తులను మినహాయించి, ప్రజాసామాన్యము యొక్క రాబడిమాత్రమే చూచినచో, భారతీయుని సంవత్సరాదాయము సగటున పౌ 0-13-0 (రు 9-12-0) మాత్రమేయని తేలుచున్నదనికూడ వ్రాసిరి.

ఆంగ్లపరిపాలనలో మనరాబడి మిక్కిలి తక్కువగ నుండుటయే గాక క్రమక్రమముగా క్షీణించుచున్నదనికూడ డిగ్బిగారు తెలిపి యున్నారు. 1850 సం॥ భారతీయుని రాబడి దినమునకు సగటున 2 అణాలయియుండెను. 1882 సం॥ సర్కారువారి అంచనాప్రకారము ఒక్కొక్కనికి దినమునకు సగటున $1\frac{1}{2}$ అణాలు రాబడియుండెను. 1900 సం॥ మనిషి 1-కి దినమునకు సగటున 9 పైసలకంటె తక్కువ ఆదాయము వచ్చుచుండెను. ఈ విధముగా దేశీయుల సంవత్సరాదాయ మంతకంతకు క్షీణించుచుండ, మనము దారిద్ర్య మనుభవించు చున్నామనుటలో ఆశ్చర్యమేమున్నది?

మనరాబడిని యితరదేశీయుల రాబడితో పోల్చి చూచినయెడల, మనదేశమెట్టి యధోగతియందున్నదో విశదమగును. ఈ సందర్భమున పాఠకులొక విషయము జ్ఞప్తియం దుంచుకొందురుగాక. సస్యములందును, సిరిసంపదలందును భారతదేశము ప్రపంచమందలి దేశములలో నగ్రశ్రేణియందున్నది. 1900 సంవత్సరమున వివిధదేశములందును మనిషి 1-కి సంవత్సరమునకు సగటునవచ్చు ఆదాయ మీక్రింది విధముగ నున్నది.

(1 పౌ=15 రూ.)

| | | | |
|---|---|---|---|
| స్కాట్లండు | రూ. 675 | ఆస్ట్రేలియా | రూ. 600 |
| సంయుక్త రాష్ట్రములు (అమెరికా) | 585 | బెల్జియమ్ | 420 |
| ఫ్రాన్సు | 405 | [illegible] | 390 |
| జర్మని | [illegible] | [illegible] | [illegible] |

| | | | |
|---|---|---|---|
| నార్వే | 300 | స్విట్జర్లెం.. | 285 |
| ఆస్ట్రియా | 225 | స్పెయిన్ | 240 |
| | | ఇటలీ | 180 |
| రషియా | 165 | ఇండియా | రు. 16_12_0 |

మనదేశము విదేశములతోఁచేయు వాణిజ్యము వృద్ధియగు చుండుటచే, భారతీయులు భాగ్యవంతు లగుచున్నారని యొక వాదము కలదు. ఇది మిక్కిలి పొరబాటు. వాణిజ్యమునుబట్టి దేశముయొక్క ఆర్థికస్థితిని నిరూపింపకూడదు. వాణిజ్య మెక్కువగ నున్నంతమాత్రమున దేశము భాగ్యవంతమైనదని చెప్పజాలము. ఆవాణిజ్యముయొక్క స్వభావమును కొంచెము పరిశీలింపవలెను. ఒకవర్తకుడు నూరు రూపాయల విలువగల వస్తువులను విదేశముల కెగుమతి చేసినయెడల అతడు పంపిన నూరురూపాయలేగాక దానిమీద కొంచెము లాభము కూడ నపేక్షించును. అట్లు ఎక్కువ ప్రతిఫలము వచ్చినపుడే వర్తకము సరళమైన దగును. కనుక మనదేశమునుండి పంపిన ఎగుమతుల విలువకంటె మనదేశమునకు వచ్చు దిగుమతుల విలువ అధికముగా నుండవలెను. ఇట్లున్నపుడే మనదేశమునకు లాభము కలుగును. ఐరోపా దేశములందు ఎగుమతుల విలువకంటె దిగుమతుల విలువ అధికముగా నుండును. 1883_92 వరకున్న కాలములో ఇంగ్లాండు నందు నూటికి 32 చొ॥ నను, ఫ్రాన్సులో నూటికి 20 చొ॥నను ఎగుమతులకంటె దిగుమతులు ఎక్కువగనుండెను. ప్రపంచజ్ఞానముగల ప్రతివాడును తాను పంపినదానికి కొంచెము లాభము కలుపుకొని ప్రతిఫలరూపముగ ఎక్కువ రావలెనని కోరునుగదా! హిందూదేశపు వాణిజ్యమును చూచినచో, విరుద్ధముగా నున్నది. ఎగుమతుల విలువకంటె దిగుమతుల విలువ అధికముగానుండుటకుబదులుగా దిగు

మతులకంటె ఎగుమతులే యధికముగా నున్నవి. దీనినిబట్టి ఏమితేలు చున్నది? మనదేశమునుండి ఏటేటను కొన్ని కోట్లరూపాయలు ప్రతిఫలము లేకయే విదేశములకు పోవుచున్నవి. ఈవిధముగ ధన మేటేటను మహాప్రవాహముగ పోవుచుండుటచేతనే, మనకిట్టి నిర్భాగ్యదశ సంప్రాప్తమయినది.

భారతదేశ దారిద్ర్యమును నిర్ధారణచేయుట కింక ననేకనిదర్శనములు చూపవచ్చును. మనదేశములో క్షామము లెక్కువగుచున్నవి. నిర్వ్యాపారత్వమువలన వేలకొలదిజనులు జీవనోపాధిలేక బాధపడుచున్నారు. మహామ్మారి విశూచి, కలరా, ఇన్‌ఫ్లుయంజా మొదలగు వ్యాధు లెక్కువగ వ్యాపించుచున్నవి. దేశీయుల ఆయుర్దాయము క్షీణించుచున్నది. భారతీయుని యాయుర్దాయము సగటున 23 సం॥ అయియున్నది. ఆంగ్లేయుని ఆయుర్దాయము సగటున 40 సం॥లు. మరణముల సంఖ్య ఎక్కువగుచున్నది. దేశములో నూటికి 90 చొ॥ విద్యావిహీనులయి అజ్ఞానాంధకారమున మునిగి యున్నారు. ఇవన్నియు దారిద్ర్య చిహ్నములా లేక ఐశ్వర్యచిహ్నములా?

గోపాలకృష్ణ గోకేగారు 15-11-1905 తేదీని ఉపన్యసించుచు మనదేశపు టార్థికస్థితిగూర్చి యిట్లు చెప్పిరి. "ఇరువది సంవత్సరముల నుండిగల నాయనుభవమువలన ఆంగ్లేయపరిపాలనలో హిందూదేశ మార్థికముగ నధోగతి పాలగుచున్నదని నేను నిశ్చయముగా జెప్పుచున్నాను. ఇండియాలో జనసామాన్య మిప్పుడు భయంకరమగు దారిద్ర్యాంబుధిని మునిగియున్నారని ప్రభుత్వోద్యోగస్థులుకూడ నొప్పుకొందురు. ఈవిషయమును స్పష్టీకరించుటకు గొన్ని నిదర్శనములను జూపెదను. ఆంగ్లేయుని ఆదాయము సగటున సంవత్సరమునకు సుమారు 42 పౌనులుండునని (630 రూ) యంచనా వేయబడినది. ప్రభుత్వపు లెక్కలప్రకారము భారతీయుని ఆదాయము సగటున

సంవత్సరమునకు సుమారు 2 పౌనుల (రు 30) ని తేలినది. ప్రభుత్వోద్యోగులుగాని మఱికొందఱు ప్రముఖులు వేసిన యంచనాప్రకారమొక నవరసు (15 రూపాయలు) కంటె కొంచమెక్కువయుండును. (ఆంగ్లేయుని సంవత్సరాదాయములో భారతీయునిది 30 వ వంతయిననులేదు!). ఇంగ్లాండులో సగటున మనిషి 1-కి దిగుమతులవిలువ సుమారు పౌ 13 (రు 195) ఇండియాలో మనిషి 1 కి పౌ 0-5-0 (రు 3-12-0) మాత్రమేయున్నది. ఇంగ్లాండులో పోస్టలుసేవింగ్సుబ్యాంకులలో నాంగ్లేయులు నిలువచేసికొన్న ధనము 148,000,000 పౌనులున్నది. ఇవిగాక ట్రస్టీసు సేవింగ్సుబ్యాంకులలో సుమారు 52,000,000 పౌనులున్నవి. ఇంగ్లాండుకంటె నేడురెట్లెక్కువ జనసంఖ్యగల హిందూదేశములో పోస్టలు సేవింగ్సు బ్యాంకులలో జనులు సంగ్రహముజేసిన ధనమించుమించు 7,000,000 పౌనులు మాత్రమేయున్నది. దీనిలోగూడ పదవవంతు యిరోపియనులదై యున్నది. ఇంగ్లండులో జాయింటు స్టాకుకంపెనీలకొఱకు పెట్టుబడిపెట్టిన ధనము 1,900,000,000 పౌనులు. ఇండియాలో 26,000,000 పౌనులు మాత్రమే ఆవిధముగ పెట్టుబడియందుపయోగింపబడినది. ఈస్వల్పధనములో కూడ నధికభాగ మైరోపియనులదే. భారతీయులలో నూటికెనుబదిమంది వ్యవసాయముపై, నాధారపడియున్నారు. కాని వ్యవసాయము క్షీణించుచున్నది. రైతులు కడునిరుపేదలగుటచేతను, ఋణగ్రస్తులగుటచేతను, భూమిమరమ్మతు చేయజాలకున్నారు. అందుచేత, సర్ జేమ్సుకెయిర్డు (Sirjames caird) గారు 20 సం॥ క్రిందటచెప్పినట్లు, సేద్యమువలన భూమినిస్సారమగుచున్నది. ఫలసాయము తగ్గిపోవుచున్నది. ఎకరమునకు 8 లేక 9 బుషెల్సు (Bushels) మాత్రమే పండుచున్నది. ఇంగ్లండులో నెకరమునకు 30 బుషెల్సు (Bushels) పంటపండుచున్నది. గడచినయెనిమిది సంవత్సరము,

లలోను సంభవించిన కఱవులవలన వ్యవసాయదారులకు (విచారణ సంఘము వారి లెక్కప్రకారము) 300 కోట్లరూప్యముల విలువగలపంటయు పసువులును నష్టపడినవి. సర్ విలియమ్ హంటరుగారి (Sir William Hunter) యభిప్రాయానుసారము నాలుగుకోట్ల భారతీయులు ఒంటిపూటమాత్రమే భుజించుచున్నారు. (Sir charles Elliot) సర్ ఛార్లస్ ఇలియట్ గారి యంచనాప్రకారము 7 కోట్ల భారతీయులు కడుపునిండ భుజించుటయన నెట్టిదియో సంవత్సరము నందొక్కసారైన నెఱుగరు. హిందువులదారిద్ర్య మిట్టిదుర్భరావస్థ యందున్నది. ..................... ఇంతియకాదు. ఇట్టివిషాదకరమగు పరిస్థితులునానాటికి వృద్ధిపొందుచున్నవనుటకు నిదర్శనములు పెక్కుకలవు. కఱవులు మిక్కిలి తరచుగావచ్చుచున్నవి. దేశమంతటను వ్యాపించుచున్నవి. దీనికిదోడు మహామ్మారి దేశమున జెలరేగుచున్నది..................19 వ శతాబ్దమునందు కడపటి పదిసంవత్సరములలో గొన్నిపరగణాలయందు జనసంఖ్య వృద్ధిగాకుండ నిలుకడగానున్నది. కొన్నిప్రాంతములలో క్షీణించినది. దేశమునందలి మరణముల సంఖ్య గమనించినచో నీవిషయము సందేహ రహితమగును గడచిన 20 సంవత్సరములను దీసికొని, యీకాలమునందు హిందూదేశమందును, నింగ్లాండునందును మరణసంఖ్య ఎట్లున్నదో చూతము. ఈకాలమును నాలుగుభాగములుగా విభజించి, ప్రతియయిదు వత్సరములలోను మరణములు రెండుదేశములలో నెట్లుండెనో పరిశీలింతము. ఏమి తేలుచున్నది ? మొదటి అయిదుసంవత్సరములలోను ఇండియాలో సంవత్సరమునకు సగటున 1000. 1కి 24 లేక. 25 మందిచనిపోయిరి. ఇంగ్లాండులో వెయ్యికి 20 మందిమాత్రమే మరణించిరి. రెండవ అయిదు సంవత్సరములలోను ఇండియాలో మరణసంఖ్య వెయ్యికి 25 నుండి 32 వరకు నెక్కువయ్యెను. ఇంగ్లండులో, జాగ్రత్తపడినందున,

మరణములసంఖ్య 20 నుండి 19 లేక 18 వరకుతగ్గెను. మూడవ అయిదు సంవత్సరములలోను ఇండియాలో వెయ్యింటికి మరణములు 28 నుండి 30 వరకు హెచ్చెను. ఇంగ్లండులో 18 నుండి 17 వరకుతగ్గెను. చివర భాగమున నిండియాలో మరణసంఖ్య ఇంకను హెచ్చెను. 30 నుండి 32 అయ్యెను. ఇంగ్లండులో నింకనుతగ్గిపోయెను. 17 నుండి 16 కంటెను తగ్గిపోయెను. కడపటిసంవత్సరములో స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు. (Statistical Abstract) ప్రకారము ఇండియాలో వెయ్యికి 35 చొ॥ మరణములుండెను. ఈవిధముగ సిరువది సంవత్సరముల కాలములో ఇంగ్లండులో మరణసంఖ్య తగ్గిపోవుచుండగా, ఇండియాలో వెయ్యికి 10 చొప్పున ఎక్కువయినది. అనగా 30 కోట్లజనసంఖ్యమీద 20 సం॥ పూర్వముకంటె, ఇప్పుడేటేట 30 లక్షల జనులధికముగా చనిపోవుచున్నారు. నిశ్చయముగ ఈవిషాదకరమగు స్థితిభయదావహము. ఈభయంకరమగు స్థితి కెవరుబాధ్యులో మీరే (ఆంగ్లేయులే) యోజింపుడు. హిందూదేశార్థికస్థితినిగూర్చి యింతకంటె మరేమియు చెప్పనవసరములేదని తలచెదను."

లెఫ్టినెంటు గవర్నరు పనిచేసిన సర్ ఛార్లస్ ఇలియట్ (Sir Charles Elliodt) గారు హిందువుల యార్థిక స్థితినిగూర్చి యిట్లు వ్రాసిరి. "వ్యవసాయదారులలో సగముమంది సంవత్సరాదినుండి సంవత్సరాంతమువరకు నొక్కసారియైనను కడుపునిండ భుంజించుటయనసెట్టిదో యెరుగరని చెప్పుట కెంతమాత్రము సందేహించను."

1880 సంవత్సరమున సర్ విలియమ్ హంటరు (Sir William Hunter) గారిట్లువ్రాసిరి "ఇండియాలో 4 కోట్లమంది జనులు ఆహారము కావలసినంత లేకయే జీవింపవలసిన వారగుచున్నారు."

హంటరుగారు వ్రాసిన తరువాత 20 సంవత్సరములకు 1900 సం॥ మున విలియమ్ డిగ్బీగారు భారతీయుల దుస్సహ దారిద్ర్యమును

గూర్చి యిట్లువ్రాసిరి. "సర్ విలియమ్ హంటరుగారు వ్రాసిన నాటికంటె ఇప్పుడు హిందూదేశముయొక్క జనసంఖ్య 3 కోట్లు వృద్ధియైనది. ఈలోపల నీదేశముయొక్క ఆదాయము చాల క్షీణించినది. అందుచే 1880 సంవత్సరముననే 4 కోట్ల ప్రజలకు పూర్తియగు ఆహారములేని సందర్భమున నూతనముగ వృద్ధియైన ఈ 3 కోట్లమందికిని ఆహారము అసలే యుండజాలదనుట స్పష్టము. కావున 20 వ శతాబ్దారంభమున నిరంతరక్షుద్బాధాపీడితులగు భారతీయులసంఖ్య 4,00,00,000 + 3,00,00,000 = 7,00,00,000 ఉండును."

ఐరోపియన్ మతప్రచారకుడగు రివరెండు సి. హెచ్. మెక్ ఫర్లేనుగారు (Rev. Ch. Mecferlane) హిందువుల నిర్భాగ్యస్థితి నిట్లు వర్ణించిరి. "ఆహారము లేకుండుటచే సంభవించు నుపవాసములు, మరణములయొక్క విషాదచరిత్రయు నింకను చెప్పజాలము. కానిప్రజలు రెండుమూడురోజుల కొకసారి మాత్రమే భోజనముచేసి బ్రతుకుచున్నారు. ఇండియాలో నిరుపేదలగు జనులీయవస్థ కెల్లప్పుడు సిద్ధపడి యుందురు. "రెండురోజుల కొకసారి భోజనము దొరకిన యెడల మేమింకేమియు కోరము" అని మాక్రైస్తవులలో నొకడు చెప్పెను. నేను మతప్రచారము చేయుచున్నపు డొకసారి మూడువందలమందిని యొకచోటచేర్చి వారి కెంతెంత రాబడివచ్చుచున్నదో పరీక్షించితిని. సగటున ఒక్కొక్కని రాబడి దినమునకు ఒకఅణాకంటె తక్కువయియుండెను. ఒకపూటతినియు నొకపూటతినకయు జీవనముచేయుచున్న యీప్రజలు కొన్నిరోజులు కూలిపని మానివేసినచో తిండిలేక మాడవలసినవార గుదురు. సకాలములో తగుసహాయము లేనియెడల కఱవువచ్చినపుడు లక్షలకొలది జనులు క్షామదేవత నోటబడుదురు."

హ్యారింగటన్‌దొరగారు "ఆయోధ్యావిషయములు" అనుశీర్షికక్రింద పయనీయర్ పత్రికలో (Poinier) నిట్లువ్రాసిరి.

"ప్రజలలో సుమారు నూటికి 60 మంది గర్భదారిద్ర్యమున మునిగియున్నారు. వారలు కూలిచేసి తెచ్చిన స్వల్పద్రవ్యముకూడ కుటుంబ పోషణార్థము వినియోగింపనియెడల కొంతమంది తిండిలేక బాధపడవలసి యుండెడివారు"

"కర్షకుల ఋణగ్రస్తతకు సంబంధించిన విషయములన్నియు చక్కగా పరిశీలించిన తర్వాత హిందూదేశమునందు పెక్కుమంది కడుపునిండ తిండిలేక బాధపడుచున్నారను నభిప్రాయము యదార్థమని నానమ్మకము."

1874-75 సంవత్సరపు మోరల్ అండుమెటీరియల్ ప్రోగ్రెస్ ఆఫ్ ఇండియా (Moral and material Progress of India) యను గ్రంథమునందిట్లు వ్రాయబడెను. "వంగదేశపు రయితుల విషాదకరమగు స్థితినిగూర్చి కలకత్తా మతప్రచారకసంఘమువారు ప్రసంగించి యుండిరి. సాధారణముగా జీవనమునకు ముఖ్యావసరములగు వస్తువులు లేక వారు పలువిధముల బాధపడుచున్నట్లు నిదర్శనములు కలవు......... పశ్చిమోత్తరపరగణాలలో కార్మికులకూలి యీశతాబ్ద్యారంభమున నెట్లుండెనో యిప్పుడుకూడ నట్లేయున్నది. పన్ను చెల్లించిన తర్వాత రైతునకు జీవించుటకు మిగులు ద్రవ్యమతడు పనిచేసినంత కాలమునకు తుల్యముగాను............ పెక్కుమంది అసహ్యకరమగునట్టియు కడుపునొప్పి పుట్టించునట్టియు, నుతకబియ్యము తిని జీవించుచున్నారు ............వ్యవసాయమునందభివృద్ధి కలుగకుండుటకుగల కారణములలో రైతులయొక్క గర్భదారిద్ర్యమొకటి!"

1883 వ సం॥ లో జె. యస్. కాటన్ గారు (J. S. Cotton.) ట్లు వ్రాసిరి:

"బ్రిటిషు పరిపాలనము జనాభివృద్ధికి తోడ్పడినను దీనియందు దేశ మార్థికాభివృద్ధి గాంచుట లేదు. అట్టియభివృద్ధికి రెండుమార్గములు గలవు—నిమ్నజాతులకు త్తమజీవనము కలుగజేయుటొకటి. జనసామా

స్యము వ్యవసాయముమీదనమాత్ర మాధారపడి యుండునట్లుచేయక యితరవృత్తులు నెలకొలుపుట రెండవది——ఈరెండుపనులుగాక జరుగలేదు. నిమ్నజాతులస్థితి బ్రిటిషు పరిపాలనమునందు మిక్కిలియధోగతియందున్నదని పెద్దలందరు నొప్పుకొని యున్నారు."

1883 సంవత్సరమున హెచ్. యమ్. హిన్డమనుగారు. (H.M. Hyndman) తమ "ఇండియాయొక్క దివాలా"యను గ్రంథమున "హిందూదేశపు ప్రజలు నానాటికి కడుదరిద్రులగుచున్నారనియు, పన్నులు మిక్కిలి దుర్భరముగనున్న వనియు, ప్రతికఱవును దారిద్ర్యమునెక్కువ చేయుచున్నదనియు క్షామములు మిగుల తఱచుగా వచ్చుచున్నవనియు, వాణిజ్యమందధిక భాగము దేశదారిద్ర్యమును, క్రూరమగు పన్నుల పద్ధతిని మాత్రమే సూచించుచున్నదనియు, అంగక్రమముతో నిర్మింపబడిన విదేశీయ ప్రభుత్వమే దేశమునకు భయంకరమగు నష్టమును కలిగించుచున్నదనియు" వ్రాసియున్నారు.

1893 సం॥ లో పయనియర్ (Pioneer) పత్రిక యిట్లువ్రాసెను. "ఆంగ్లపరిపాలనములోనున్న హిందూదేశమున యించుమించుగ 10 కోట్ల జనులత్యంతమగు దారిద్ర్య మనుభవించుచున్నారని తేలుచున్నది." "నిజముగా 15 సంవత్సరములనుండి హిందూదేశము నిరంతరమగు క్షామముచే పీడింపబడుచున్నది"

1893 లో నీపత్రికయందు సంక్షేపముగ ప్రకటింపబడిన గ్రియర్సన్ (Grierson) గారి లెక్కలిట్లు తెలుపుచున్నవి.

"కార్మికజనులందరును, కర్షకులలోను, పారిశ్రామికులలోను నూటికి 10 వంతులు అనగా మొత్తపు జనసంఖ్యలో నూటికి 45 మందికి పరితృప్తిగ నన్నవస్త్రములు లేకుండెను. దీనినిబట్టి బ్రిటిషు యిండియాలో సుమారు 10 కోట్లమంది జనులు దుర్భరమగు దారిద్ర్యమనుభవించుచున్నారని తేలుచున్నది."

1902 సం॥ లో ఒకఆమెరికాదేశపు మతప్రచారకుడు దక్షిణ హిందూస్థానమునుండి యిట్లువ్రాసెను (Digby)

"క్రిందటి సంవత్సరము 1901 సెప్టెంబరులో నేను ఇండియాలో చేసిన మూడువారముల పర్యటనమువలన ఆదేశస్థితి విషయమై నాకు చాలననుభవము కలిగినది. నా డేరాచుట్టును రాత్రింబవళ్ళు జనులు మూగుచుండెడివారు. ఒక్కవాక్యముమాత్రము నిరంతరము నాచెవులు గడియలు పడునట్లు వినిపించుచుండెడిది. "మేము తిండిలేక చచ్చిపోవు చున్నాము." వారు రెండులేక మూడురోజులకొకసారి మాత్రమే భుజించిజీవించుచున్నారు. నేనొకసారి మూడునందలమంది జనుల ఆదాయములనుగూర్చి జాగ్రత్తగ విచారించి ఒక్కొక్కని రాబడి రోజుకు సగటున ఒక పార్తింగు (3 పైసలు)కు తక్కువగనుండెనని తెలిసికొంటిని.

వారు సరిగ జీవించుటలేదు. ప్రాణము నిలబెట్టుకొనుచున్నారు. ఇట్టి జనుల గుడిసెలమధ్య నేనుంటిని. ఈపరిస్థితులు కఱవను పేరుతో వాడబడుటలేదు. భగవంతునిసాక్షిగ ఇవికఱవే కానిచో, మఱేమి? హిందూదేశములో మిక్కిలి నిరుపేదలయొక్క అమితమగు దారిద్ర్యమును తిలకించినచో అసాధారణమగు పరిస్థితులు గోచరించును. వికాసము గలుగునను నాశయేలేక జీవితము సంకుచితమై, మిక్కిలి దుర్భరమై యుండెను. ఆరుగురుగల కుటుంబముయొక్క గృహము, సామాను, వంటపాత్రలు, దుస్తులు, మొదలగు పరికరములన్నియు 30 రూపాయిలకంటె తక్కువ విలువగలిగియుండెను. అట్టికుటుంబములో ఒక్కొక్కని ఆదాయము నెలకు సగటున రు 1-8-0 కు మించదు. సాధారణముగ రు 0-12-0 కంటె కొంచెమధికముగ నుండును. కావున యీరాబడిలో కొంతభాగమయినను జ్ఞాన సంపాదనమునకును, పరిశుభ్రతకును, గృహపారిశుద్ధ్యమునకు నుపయోగింప బడదని చెప్పవచ్చును."

రివరెండుడాక్టరు సండర్లండుగారు (Rev. Dr. Sunderland) భారతదేశ క్షామములనుగూర్చి వ్రాయుచు నిట్లు నుడివిరి.

"హిందూదేశమును నావలె, స్వయముగా జూచినగాని, యచ్చట దారిద్ర్యమెట్లున్నదో యూహింపజాలరు..........కష్టకాలమున జీవించుటకు రైతేమియు నిలువజేసికొనజాలకున్నాడనుటలో నాశ్చర్యమేమున్నది?..........మహమ్మారి చేయుచున్న ప్రజానాశనమునకు దేశమునందలి మహాదారిద్ర్యమే ముఖ్యకారణము. ఈరోగమువలన కలుగుచున్న ప్రజానష్టము భయంకరముగ నున్నది. 1901 సం॥లో 272,000 మరణములుండెను. 1902 సం॥లో 500,000 ప్రాణములు నష్టమయ్యెను. 1903 సం॥లో 800,000 మందిజనులు పరలోకగతులయిరి. 1904 లో 1000,000 కంటె నెక్కువమంది కాలము చేసిరి. ఆవ్యాధినిరాంతకముగ చెలరేగుచున్నది. తిండిలేకపోవుటవలనప్రజలలో రక్తము క్షీణించి దుర్బలత్వము హెచ్చుగుచున్నది. ఈదారిద్ర్యావస్థయెంతకాల ముండునో నంతకాలమును మహమ్మారి రోగమును నిరోధించుట కవకాశము కాన్పింపదు. ఇండియాలో క్షామములు వచ్చుటకు మూలకారణము, వర్షములు లేకపోవుటకాదు; జనసంఖ్య యెక్కువగుచుండుటయుకాదు. అమితము, గర్హ్యము, భయంకరమునగు దారిద్ర్యమే, నిజమగుకారణము"

1903 సం॥మునసర్ రాబర్టుగిప్ఫెన్ గారు (Sir Robert giffen) ఇంగ్లాండు ఇండియాదేశముల యార్థికస్థితులు పోల్చుచు నిట్లుచెప్పిరి. "హిందూదేశములో 30 కోట్లమంది జనులకు సంవత్సరమున కెంతాదాయము వచ్చునో అంతధనమును 4 కోట్ల 20 లక్షల ఆంగ్లేయులు తినుటకు, త్రాగుటకు మాత్రమే ఖర్చుచేయుచున్నారు. దీనినిబట్టి చూచినచో, ఇంగ్లండు, వలసరాష్ట్రములకును, హిందూదేశమునకును ఆర్థికస్థితియందెంత వ్యత్యాస ముండవలయునోకదా!"

విల్ఫ్రిడు స్కావెన్ బ్లంటుగారు (Wilfred Scawen Blunt) తమ "ఇండియా అండర్ లార్డు రిపన్" అను గ్రంథమున (1909) నిట్లు వ్రాసిరి.

"హిందూదేశములో ప్రయాణముచేయుట కలవడిన ప్రతిమనుజునికిని, హైందవ రైతు లెంతనిరుపేదలో, తెలియకమానదు. ఈవిషయమును తెలిసికొనుటకు దేశమునందున్న రైలుమార్గముల వెంబడి ప్రయాణముచేసిన చాలును. రైలు దిగనవసరముకూడలేదు. నేను దర్శించిన ప్రతిగ్రామమందును, దుర్భరమగు పన్నులనుగూర్చియు, పన్నులు ఎక్కువచేయబడుటను గూర్చియు, విధానము పక్షపాత పూరితమయి యుండుటను గూర్చియు, అరణ్య శాసనములను గూర్చియు, పశువులసంఖ్య క్షీణించుటను గూర్చియు, ఉప్పుపన్నువలన సంభవించుచున్న యధోగతినిగూర్చియు, సర్వసామాన్యమగు ఋణగ్రస్తతను గూర్చియు మొఱ్ఱలువినియున్నాను."

మఱియొక తావునందిట్లు వ్రాసిరి. "హిందూదేశమున కఱవులు పూర్వముకంటె భీకరముగనుండి మిక్కిలితఱచుగ వచ్చుచున్నవి. కర్షకుల దారిద్ర్య మెక్కువగుచున్నది; వారధికముగ ఋణములపాలగుచున్నారు; వారి సెలవాని యనివార్యమగుచున్నది. భూమిపన్నును నిరంతరము హెచ్చుచేయునట్టి పద్ధతి మార్పు చెందలేదు. ఉప్పుపన్ను కొంచెము తగ్గింపబడినను బీదజనుల నింకను బాధించుచున్నది. క్షుద్బాధయు, దానివలన వచ్చు నంటువ్యాధులు నధికవిస్తీర్ణము వ్యాపించుచున్నవి. ప్రపంచమునందుదరికంటెను దక్షిణహిందూదేశపు రయితు ఇప్పటికిని మిక్కిలి పేదవాడుగ నున్నాడు. దేశీయ పరిశ్రమల యభివృద్ధి సెకుచేయక ఆంగ్లేయ వర్తకవ్యాపారమున కనుకూలముగనున్న యార్థికవిధాన మిసుమంతయు మార్పుచెందలేదు. ఇరువదియైదు సంవత్సరముల పూర్వముకంటె ఇప్పుడు దేశస్థితి మిక్కిలి అధ్వాన్నముగ నున్నది. ఏదెట్లున్నను

దేశమందలి ఆహారపదార్థములు విదేశస్థుల పాలగుచున్నవి. మహాక్షామములు, మహామ్మారిరోగములు, సర్వసాధారణమగు ఋణగ్రస్తత మొదలగు నాశము లసత్యములని హిందూదేశైశ్వర్యస్థితిని ధృవపరచుటకు తయారుచేయబడిన సర్కారు లెక్కలేవియు నిర్ధారణచేయజాలవు.”

మఱియొక సందర్భమున రైతులస్థితినిగూర్చి వ్రాయుచు నిట్లు చెప్పియున్నారు.

“రైతునకు దుర్భిక్షము వలన మరణభయము లేకుండ మనము రక్షించుచున్నాము. కాని క్షుదోపద్రవమువలని మరణభయము వృద్ధిపొందించుచున్నామని తలంచెదను.”

ఇంగ్లండులో కార్మిక పక్షనాయకుండగు జె. ర్యామ్సే మాక్డొనాల్డుగారు (Mr. J. Ramsey Macdonald) తమ “ఎవేకెనింగు ఆఫ్ ఇండియా” (Awakening of India) యను గ్రంథమున 1910 సం॥ లో హైందవుల ఆర్థికస్థితినిగూర్చి యిట్లు వ్రాసిరి. “హిందూదేశములో నాలుగుకోట్లజనులాహారము చాలకనే జీవించుచున్నారని సర్ విలియమ్ హంటరుగారు చెప్పిరి. వ్యవసాయదారులలో సగముమంది సంవత్సరారంభమునుండి సంవత్సరాంతము వఱకెన్నఁడును కడుపునిండ భుజించి యెఱుగరని సర్ ఛార్లస్ ఇలియట్‌గారు అంచనా వేసిరి. హిందూదేశములో మూడు లేక నాలుగుకోట్ల కుటుంబములు రోజునకు 3 అణాలకు మించని ఆదాయముతో జీవించుచున్నవి. హిందూదేశము దారిద్ర్యమనుభవించుచున్నదను విషయము ఊహమాత్రమే కాదు. అది యథార్థమగు విషయము”

కలకత్తా విశ్వవిద్యాలయమున అర్థశాస్త్రమునందు మింటో ప్రొఫెసరుగానున్న మనోహర్ లాల్. బి. ఏ. (కేంబ్రిడ్జి) గారు మన దారిద్ర్యమునుగూర్చి యిట్లువ్రాసిరి,

"దారిద్ర్యము, నమలివేయుచున్న దారిద్ర్యము మన యార్థిక జీవితమందును, నందుచే మన జాతీయ పరిస్థితులందును, చాలముఖ్యమగు సమస్యగనున్నది. మనదేశమందలి జనసామాన్యములోనున్న యజ్ఞాన విద్యారాహిత్యముల కంటెను ఈదారిద్ర్యము నాయభిప్రాయములో నెక్కువ ప్రాముఖ్యమయిన విషయము. ఈదారిద్ర్యమువలననే మన మువ్యాధులకును, అంటువ్యాధులకును, కలరాలకును, మహామ్మారికిని గుఱియగుచున్నాము. ఇది జాత్యభివృద్ధికి ప్రతిబంధకముగనున్నది."



## 11. వ. ప్రకరణము.

### పన్నులు; అవియెట్లు వినియోగింపబడుచున్నవి.

ఏదేశమందైనను ప్రజలయార్థికస్థితి పరిపాలనా విధానము నను సరించియుండును. ప్రజల క్షేమమునే పరమావధిగ నెంచి రాజు పరిపాలించినయెడల జనులు భాగ్యవంతులుగను నైశ్వర్యవంతులుగను నుందురు. పాలితులనుండి పన్నులరూపమున వసూలుచేసిన ద్రవ్యమును ప్రజోపయోగార్థము వ్యయపఱచుట పాలకవర్గముయొక్క విధ్యుక్తధర్మము. సూర్యుడు సముద్ర నదీతటాకాదిజలాకరములనుండి నీటి నాకర్షించి యా నీటెనిదిరిగి వర్షరూపమున బ్రసాదించి యెట్లుభూమిని సారవంతముగ జేయుచున్నాడో అట్లే రాజుకూడ ప్రజలనుండి పన్నులుగ్రహించి వాని ప్రజోపయోగమునకే వెచ్చింపవలెను. ఏదేశమునందు వసూలైన ధన మా దేశముననే వ్యయపరుపవలెను. ఒకదేశమునుండి అన్యదేశమునకు ధనము ప్రతిఫలములేకయే తరలిపోయినచో, యాదేశమును దరిద్రదేవత యావహించునని వేరెచెప్పనక్కఱలేదు. మఱియు ప్రభుత్వ మా ధనమును జనోపయోగములగు కార్యములందు, వ్యవసాయము, పరిశ్రమలు, ఆరోగ్యము, విద్య, జలాధారనిర్మాణములు, మొదలగువాని కొఱకై వినియోగింపవలెను. అట్లుచేసినపుడే ప్రజలు ధనవంతులుగను, విద్యావంతులుగనునుండి. జీవయాత్రను జయప్రదముగ నిర్వహింపగలరు.

ఈవిషయమును గుర్తెఱిగియే రాజనీతిశాస్త్రజ్ఞులు పన్నులు వసూలుచేయునధికారమును, అవి ఖర్చుపెట్టునధికారమును ప్రజల చేతులలోనుండవలెనని వక్కాణించియున్నారు. ప్రజాప్రతినిధులే పన్నులువసూలుచేసి వ్యయపఱచునధికారము గల్గియుండవలెను. "ప్రజా ప్రాతినిధ్యములేనిదే పన్నులు వసూలుచేయరాదు."నునది (No taxation withot representation) రాజనీతిశాస్త్రములో ముఖ్యమగు

స్వాత్రము. ఈసిద్ధాంతము సభ్యదేశములందెల్ల నాచరణమునయున్నది. అమెరికా, యింగ్లాండు, ఫ్రాన్సు మొదలగు దేశములలో, ప్రజలచే నెన్నుకొనబడి, వారికుత్తరవాదులుగ ప్రతినిధులే యిట్టియధికారమును గల్గియున్నారు.

కాని భారతదేశమున మాత్రము ప్రజాసమ్మతములతో పన్నుల విధింపవలెననియు, ప్రజలసమ్మతిపై వానిని ఖర్చుపెట్టవలయుననియెడి సిద్ధాంతమునకు తావులేదు. దీనికి కారణ మిచ్చట బాధ్యతాయుత పరిపాలనము లేకపోవుటయే! నేడు హిందూదేశమున పరిపాలనమొనర్చుచున్న ప్రభుత్వముయొక్క దృష్టిసదా ఆంగ్లదేశమువైపునకే మరలియుండును. విల్ఫ్రెడు స్కావనుబ్లంటు (Wilfred Scaven Blunt) నుడివినట్లు పన్నులుచెల్లించెడు ప్రజలక్షేమమరయక పూర్వము ప్రభుత్వమును రెండువిషయము లాకర్షించుచున్నవి. 1 ఇండియాప్రభుత్వముయొక్క వివిధశాఖలందు పనిచేయుచున్న ఆంగ్లేయుల వేతనములు; 2 ఆంగ్లేయవర్తకుల లాభములు. ఈకారణమున, ప్రతిఫలములేకయే యింగ్లాండునకు పోవుచున్న ధనప్రవాహమునుగూర్చి యిదివరకే వ్రాసియున్నాము. ఆంగ్లేయులచే నిండియున్న, సివిలు, మిలిటరీ డిపార్టుమెంట్లకును, సామ్రాజ్యరక్షణార్థమై యుంచబడిన సైన్యమునకును, ఆంగ్లవర్తకుల కుపయుక్తములగు రైల్వేలకును, ధనము—ప్రజలనుండి వసూలుచేసినధనములో సమితభాగము—వెచ్చింపబడుచున్నది. నీటిపారుదల (ఇర్రిగేషను) పరిశుభ్రత, విద్య మొదలగు ప్రజోపయోగకార్యములకు స్వల్పభాగము వెచ్చింపబడుచున్నది. ప్రభుత్వముయొక్క ఆదాయవ్యయములు పరిశీలించినచో నీవిషయము మఱింతస్పష్టము కాగలదు.

ప్రభుత్వాదాయములను, విమర్శించుటకు పూర్వమొక్కసంగతిని గుర్తింపవలెను. అన్యదేశములకంటె మనదేశమునపన్నులు, తేలి

కగానున్న వని ప్రభుత్వమువారనుచుందురు. ఈవాక్యమందలి సక్కువము నఱియవలసియున్నది. పన్నులు తేలికగనున్నవో లేక, దుర్భరముగను న్నవో పన్నులుచెల్లించెడి ప్రతిభారతీయునకును అనుభవసిద్ధముగ తెలిసినవిషయమే. హిందూదేశమును జూడవచ్చినకొందఱు విదేశీయులుగూడ నిచ్చట విధింపబడుచున్నంత భూమిపన్నితరదేశములందెచ్చటను విధింపబడుటలేదని వ్రాసియున్నారు. భారతపితామహుండగు దాదాభాయినౌరోజీగారీవిషయమునిట్లు స్పష్టపఱచియున్నారు. (Poverty & Un-British Rule in India P. 221.) ఇంగ్లాండుదేశమున, జాతియొక్క మొత్తపుటాదాయము పౌ 800,000,000 లు. దీనినుండి పరిపాలనముకొఱకు ప్రభుత్వము పౌ 70,000,000లను వసూలుచేయుచున్నది. అనగా జాతీయాదాయమున నూటికి 8.2 చొ॥ ప్రభుత్వముగ్రహించుచున్నది. సంవత్సరమునకు పౌ 30కు లాదాయముపుచ్చు ఆంగ్లేయుడు పౌ 2½ నులను పరిపాలనా నిర్వహణమునకు చెల్లించుచున్నాడు. హిందూదేశమున జాతియొక్క మొత్తపుటాదాయము పౌ 340,000,000 నులు. ప్రభుత్వము స్వీకరించు మొత్తము: పౌ 50,000,000, అనగా నూటికి 15 చొ॥ యగుచున్నది. 40 షిల్లింగులు (రూ 30 లు) మాత్రమే యాదాయముగాగల్గిన ప్రతిభారతీయుడును ప్రభుత్వమునకు 6 షిల్లింగులు (రూ4-8-0) చెల్లించుచున్నాడు. పౌ30ను లాదాయముగలవాడు. పౌ 2½ నులను చెల్లించుటకంటె, రూ 30 లాదాయము గల్గినమనుష్యుడు రూ 4½ లను చెల్లించుట మిక్కిలికష్టతరమనుసంగతి వేఱుగజెప్పనవసరములేదు. సంవత్సరాదాయముల తిలకించినచో, భారతీయునిరాబడి, ఆంగ్లేయునిరాబడిలో 13 వ వంతుమాత్రమేయున్నది. ఐనను ఆంగ్లేయుడు తనయాదాయమున నూటికి 8½ చొ॥ మాత్రము ప్రభుత్వమునకు చెల్లించుచుండగా, అట్టి కార్యమునకే, హైందవప్రజ. తనయాదాయములో నూటికి 15 చొ॥ యిచ్చుచున్నాడు.

## హిందూదేశమున పన్నులు తేలికగనున్నవా?

కేంద్రప్రభుత్వమును, రాష్ట్రప్రభుత్వములును కలిసి, మొత్తము ఇండియాగవర్నమెంటుయొక్క ఆదాయవ్యయముల దెల్పుపట్టిక నిటు వ్రాయుచున్నాము.

1919-20 వ సం॥ము. (Revised Estimates)

| ఆదాయము. | లక్షల రూపాయలు | వ్యయము. | లక్షల రూపాయలు |
|---|---|---|---|
| భూమిశిస్తు | 33,09 | పన్నులవసూలునకు | 18,12 |
| నల్లమందు | 4,49 | వడ్డీ(ఇండియాఋణమునకు | 13,40 |
| ఉప్పు | 5,70 | పోస్టు టెలిగ్రాఫులు | 7,09 |
| స్టాంపులు | 10,84 | టంకశాల (Mint) | 54 |
| ఉత్పత్తిపన్ను Excise. | 19,08 | సివిలుశాఖవ్యయము | 38,73 |
| ఎగుమతి దిగుమతిపన్నులు | 22,38 | చిల్లరసివిలుఖర్చులు | 9,85 |
| రాబడిపన్ను | 23,41 | క్షామనివారణము | 1,84 |
| ఇతర శాపతులు | 7,51 | రైల్వేలు; వడ్డీ;యితర ఖర్చులు | 21,88 |
| వడ్డీ | 6,38 | | |
| పోస్టు; టెలిగ్రాములు | 8,99 | జలాధారములు (ఇరిగేషన్) | 6,33 |
| టంకశాల (Mint) | 2,50 | | |
| సివిలుశాఖలో రాబడి | 3,23 | ఇతరప్రభుత్వ నిర్మాణములు | 10,29 |
| రైల్వేలు | 32,41 | | |
| జలాధారములు Irrigation | 8,77 | సైనికవ్యయము | 88,18 |
| ఇతరప్రభుత్వనిర్మాణములు. | 55 | మొత్తమువ్యయము | 216,25 |
| సైన్యశాఖ రాబడి | 2,65 | నికరపు ప్రొవిన్షియల్ సరప్లసులు | 8 |
| చిల్లరవిషయములు. | 2,79 | | |
| మొత్తము ఆదాయము | 194,77 | మొత్తము వ్యయము | 216,33 |
| లోటు (Deficit) | 21,55 | | |

## భూమిశిస్తు.

ప్రభుత్వాదాయములో నేలపన్ను ముఖ్యమైనది. దీనివలన ప్రభుత్వమునకు విశేషధనము వచ్చుచున్నది. స్వదేశ స్థానాధికారులు చెల్లించుకప్పముకూడ, నీపన్నుక్రిందనే చేర్చబడుచున్నది. ఈపన్నును చెల్లించునది కృషీవలులని వేఱుగ చెప్పనక్కరలేదు. హిందూదేశమున, భూమిశిస్తు నిర్ణయములు శాశ్వతమైనవి కావు. బంగాళాదేశమును, చెన్నరాజధానిలో నాల్గవభాగమును, సంయుక్తపరగణాలలో స్వల్పభాగమునుమాత్రము శాశ్వతనిర్ణయము కలిగియున్నవి. ఈప్రదేశములలో, నేలపన్నును వృద్ధిచేయుటకు వీలులేదు. అందుచే నచ్చటిప్రజలు వ్యవసాయమును వృద్ధిచేసి ధనాఢ్యులైరి. బొంబాయి, సింధు, మధ్యపరగణాలు, మదరాసు రాష్ట్రములందు 'రైతువారీ' పద్ధతి నెలకొల్పబడియున్నది. ఈప్రదేశములందు 20 సంవత్సరములకుగాని, 30 సంవత్సరములకుగాని, భూమిశిస్తునిర్ణయములు మార్పునొందు చుండును. మఱియు పునర్నిర్ణయములలో, నేలపన్ను హెచ్చుచుండును. కావున నీపద్ధతి ప్రభుత్వమునకు మిగుల లాభకరమైనదని చెప్పవచ్చును. భూమిశిస్తువలన ప్రభుత్వమునకు చేకూరెడు ఆదాయము, నూటికి 47 పాళ్ళు రైతువారీపద్ధతి గల్గిన భూములనుండియు, మిగిలిన 53 పాళ్ళును, జమీందారీ, మహాల్వారీ, పద్ధతులుగల భూమినుండియు వచ్చుచున్నది. రైతువారీపద్ధతిలో తఱచుగా మార్పులు జరుగుచుండుటచే, బొంబాయి, మదరాసు, మధ్యపరగణాలు, సంయుక్తపరగణాలలో, నేలపన్ను విశేషముగవృద్ధియైనది.

1893 94 వ సం॥ము. ఈరాష్ట్రములవలని భూమిపన్ను: 14 కోట్ల 40 లక్షల రూపాయలు.

03-04 ... ... ... 15 కోట్ల 40 లక్షల రూపాయలు.

10 సం॥లలో, 1 కోటిరూపాయలు హెచ్చినది.

'భూమిశిస్తు' నుగూర్చి వేఱొకపత్రికరణము వ్రాయబడి యుండుట చే నిటవిస్తరించుట యనవసరము.

నల్లమందు.

నల్లమందు నీదేశమున (తయారు చేయుటకును,) నమ్ముటకును, విదేశముల కెగుమతి చేయుటకునుగూడ ప్రభుత్వమువారికి గుత్తకలదు. గుత్తయగుటచే, సర్కారువారు నిర్ణయించిన ధరలకే, నల్లమందమ్మ బడును. 16 సం॥లకు పూర్వము నల్లమందుపై సర్కారునకు దాదాపు 7 కోట్ల రూపాయలాదాయము వచ్చుచుండెడిది. 415 కోట్ల రూపాయ లు విలువగల నల్లమందును చీనాదేశము వారొక్కరే దిగుమతి చేసి కొనెడివారు. కొద్దిసంవత్సరముల క్రిందట (1907 వ సం॥లో) చీనా వారు నల్లమందుతినుటను మానివేయుటకు నిశ్చయించిరి. వీరితోప్రభు త్వము 1909, 1911. సం॥లలో చేసికొనిన యొడంబడికలవలన, చీనాకు నల్లమందెగుమతి క్రమముగ మానివేయబడెను. 1913 వ సం॥నుండియు, చీనాదేశమునకు పూర్తిగ నల్లమందెగుమతి మానిపోయెను. అప్పటి నుండి నల్లమందువలన నాదాయము క్రమముగ క్షీణించుచున్నది. 1917-18 సం॥లో జపాను, సయాము మొదలగు దేశములకు 240 లక్షల రూపాయలు విలువగల నల్లమందు ఎగుమతియయ్యెను. మఱి యొక 240లక్షల రూపాయలమందు హిందూదేశములో వాడబడెను.

ఉప్పుపన్ను.

హిందూదేశమున డేరాఇస్మేలుఖాను పట్టణపు (ఉప్పు) గనుల లోను, సంభారు సరస్సునందును, బొంబాయి చెన్నరాజధానుల సము ద్రతీరములను, ప్రభుత్వమువారుప్పును తయారుచేయుచున్నారు. ప్రభు త్వమువారి యనుమతిలేనిదే ఉప్పును తయారుచేయ వీలులేదు. మఱి యు, తయారైన ఉప్పుపై ప్రభుత్వము పన్నును విధించుచున్నది.

హిందూదేశములో తయారైన ఉప్పుకాక, విదేశములనుండికూడ ఉప్పు దిగుమతి యగుచున్నది. సముద్రతీరమున నెల్లచోట్లను వలయునంత ఉప్పును తయారుచేయుటకు భగవంతుడు తీవ్రమగు సూర్యరశ్మిని, అపారమగు ఉప్పునీటిని ప్రసాదించియుండగా, భరతవర్షమునకు, ఉప్పువంటి స్వల్పద్రవ్యముకూడ విదేశములనుండి దిగుమతియగుటయు, దానిని మనము వాడుటయు ననుటకంటె వేఱభాగ్యముండునా? హిందూదేశవాసులుపయోగించు నుప్పులో, నూటికి 30పాళ్ళు విదేశములనుండి దిగుమతియైనదే! ఇట్టియుప్పుపైకూడ ప్రభుత్వము కొంతదిగుమతి సుంకమును విధించుచున్నది.

1888 మొదలు 1903 వఱకును, (40 శేరులు=1మణుగు, 80 తులములు=1 శేరు) 1మణుగుపై రూ2-8-0లు పన్నుండెను 1903వ సం॥న నీపన్ను రూ2-0-0లకు తగ్గించబడెను. 1905 వ సం॥న మణుగుపైపన్ను రూ1-8-0యును, 1907 వ సం॥లో ఒకరూపాయియు నయ్యెను. 1916 వ సం॥లో యుద్ధకారణమున వ్యయమగుటవలన తిరిగి ఉప్పుపన్ను రూ 1-4-0లకు వృద్ధిచేయబడెను. మఱియు, ఐరోపామహాసంగ్రామకారణముననేమి, దుర్భరసైనికవ్యయమువలననేమి, సివిలుఉద్యోగులవేతనాభి వృద్ధివలననేమి, ప్రభుత్వవ్యయము క్రమముగ హెచ్చుటయు, నూతనముగ నెన్నిపన్నులు విధింపబడినను నవి వ్యయమునకు తుల్యమగునాదాయమును సమకూర్చక పోవుటచేతను, ఉప్పుపన్నే శరణ్యమనియెంచి శాసనసభ్యులెంత వారించినను వినక, దేశాభిప్రాయమునుగాని దేశాభ్యుదయమునుగాని గుర్తింపక, యీసంవత్సరము (1923) ప్రభుత్వమువారు తిరిగి ఉప్పుపన్నును, మణుగు 1 కి రూ 2-8-0 ల॥ నుండునట్లు వృద్ధిచేసినారు.

ఎంతధనికుడైనను, ఎంతనిరుపేదయైనను ఉప్పు నుపయోగించవలసియున్నది. తినతిండియు, కట్టగుడ్డయులేని దరిద్రావస్థలోనుండు

ప్రజలుసైతముపయోగించెడి యిట్టివస్తువుపై పన్నువిధించుట యెంతయు నన్యాయము. హిందూదేశములోని జనసంఖ్యలో 20 కోట్లు మంది జనులీయుప్పుతక్క వేరువిదేశపుసరుకును కొనియెరుగరని 'డిగ్బి' (Digby's Prosperous British India) వ్రాయుచున్నాడు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారి పద్యములోని 'ఉన్నమట్టును తినకుండ యుప్పుపన్ను' అనువాక్యము నందెంతేని సత్యముకలదు. ఒకసంవత్సరమున నుప్పుపన్ను వృద్ధియైనచో మరుచటి సంవత్సరమున ఉప్పుయొక్క వాడకము తగ్గుటయు, పన్ను తగ్గినచో వాడకము హెచ్చుటయు సంభవించుచున్నట్లు ప్రభుత్వమువారి లెక్కలవలననే విదితమగుచున్నది.

| సంవత్సరము. | ఉప్పువాడకము | |
|---|---|---|
| 1902-03 | 374 లక్షల మణుగులు | 1903 వ సం॥ములో మణుగునకు రూ 0—8—0లు తగ్గినది. వాడకము హెచ్చినది. |
| 1903-04 | 382 ... | |
| 1904-05 | 399 ... | |
| 1906-07 | 413 ... | 1907 సం॥రములో మణుగు 1—0—0 యైనది. వాడకము హెచ్చినది. |
| 1907-08 | 438 ... | |
| 1908-09 | 452 ... | |
| 1914-15 | 483 ... | |
| 1915-16 | 474 ... | |
| 1916-17 | 570 ... | 1916 వ సంవత్సరములో మణుగు రూ 1-4-0 అయ్యెను ఉప్పువాడకము తగ్గినది. |
| 1917-18 | 448 ... | |

(K. T. Shaw Sixty Years of Indian Finance. 229)

పన్నువృద్ధియైనచో ప్రజలు కావలసినదానికంటె తక్కువ ఉప్పును వాడుదురు. ఉప్పును తక్కువ యుపయోగించుటవలన దేహా

రోగ్యము చెడునని ఆరోగ్యశాస్త్రవేత్తలు చెప్పుదురు. అందుచే నెక్కువ యుప్పుపన్ను విధింపబడినచో ప్రజారోగ్యమునకు భంగము కలుగుచున్నది. ఇట్టి సందర్భమున ప్రభుత్వము ఉప్పుపన్ను విధించుటయే కాక దానిని వృద్ధిచేయుటవలన, తన నిజహృదయమును బహిర్వ్యక్తముచేయుచున్నది.

### ఉత్పత్తిపన్ను; ఎక్సైజు రెవిన్యూ:

కల్లు, సారాయి, బంగు, మొదలగు నిషావస్తువులను తయారుచేయుటవలనను, వీనినమ్ముటకు వర్తకులకు లైసెన్సుల నిచ్చుటవలనను, ప్రభుత్వమునకు కొంతఆదాయము వచ్చుచున్నది. విదేశములనుండి దిగుమతియగు సారామీద విధింపబడుపన్నులును, మనవస్త్ర పరిశ్రమాభివృద్ధికి ప్రతికూలముగనున్న ఎక్సైజుపన్నులును, యీయాదాయమునందు చేర్చబడెను. కల్లుసారాయి మొదలగు పదార్థముల యమ్మకమువలనవచ్చు ప్రభుత్వాదాయమెట్లు అక్రమముగ వృద్ధియయ్యెనో యీక్రింద నుదహరించుచున్నాము.

| సంవత్సరములు. | 1<br>స్థూలాదాయము. | 2<br>విదేశములనుండి దిగుమతియైన సారాపై పన్ను. | 3<br>మొత్తపు ఆదాయము.<br>(1 + 2.) | 4<br>వ్యయము. | 5<br>నికరాదాయం.<br>(3—4.) |
|---|---|---|---|---|---|
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| 1880—81 | 3,13,52,260 | 37,98,260 | 3,51,50,620 | 9,54,040 | 3,41,96,580 |
| 1885—86 | 4,15,21,360 | 41,98,100 | 4,57,19,460 | 12,43,720 | 4,44,75,740 |
| 1890—91 | 4,94,77,800 | 60,09,000 | 5,54,86,800 | 17,49,810 | 5,37,26,990 |
| 1895—96 | 5,72,24,170 | 66,25,860 | 6,38,50,030 | 10,79,570 | 6,17,70,460 |
| 1900—01 | 5,90,88,030 | 69,38,205 | 6,59,96,235 | 12,17,640 | 6,25,78,595 |
| 1905—06 | 8,53,17,300 | 97,40,000 | 9,50,57,300 | 38,71,740 | 9,11,85,560 |
| 1910—11 | 10,54,54,715 | 1,20,53,394 | 11,75,08,109 | 60,89,904 | 11,14,18,205 |
| 1915—16 | 12,94,83,132 | 1,17,90,000 | 14,12,73,132 | 70,61,095 | 13,42,12,037 |
| 1916—17 | 13,82,38,495 | 1,25,13,946 | 15,07,52,044 | 71,79,474 | 14,35,72,967 |
| 1917—18 | 15,44,25,590 | 1,09,93,886 | 16,54,22,476 | 73,00,000 | 15,81,22,476 |
| 1918—19 | 17,35,52,770 | 1,10,65,351 | 18,46,18,121 | 82,00,000 | 17,64,18,121 |

From Young India April 27., 21."

లక్షలరూ.




సంవత్సరములు.

మద్యపానమువలన ప్రభుత్వాదాయము.

వ్యసనములలో నెల్ల దుర్వ్యసనమగు త్రాగుడువలన ప్రభుత్వ మొక సంవత్సరము కంటె మరియొక సంవత్సరము ఎక్కుడుధనము సంపాదించుచున్నది. 1919-20 వ సం॥లో 20 కోట్లరూపాయలకంటె యెక్కువాదాయము వచ్చెను. ఒక 40 సం॥లలో (1880-1920) మద్యమువలని ఆదాయము 6 రెట్లు పెరిగెను. మరియు ప్రభుత్వాదాయమే 20 కోట్ల రూప్యములయియుండ ప్రజలు త్రాగుడునిమిత్తమై హెచ్చించు ద్రవ్యము దీనికి రెండురెట్లయిన నుండును. ఈదుర్వ్యసనమును తగ్గించుటకై ప్రభుత్వముకాణముల సంఖ్యను తగ్గించినట్లును పన్నును హెచ్చించినట్లును తెలియబఱచుచుండును. గాని, త్రాగుడు వృద్ధియగుచున్నట్లీ క్రింది యంశములవలన విదితమగుచున్నది.

సగటున 100 మంది మనుష్యులు త్రాగెడుమద్యముయొక్క పరిమితి.

| | | | |
|---|---|---|---|
| 1908-09 వ | సం॥ లో | 4-4 | గాలనులు. |
| 1909-10 వ | ... | 4-11 | ... |
| 1910-11 వ | ... | 4-40 | ... |
| 1911-12 వ | ... | 4-52 | ... |
| 1912-13 వ | ... | 4-75 | ...(Indian year book321 |

1915-16 సం॥లో ... గాలనులు 5-40

ప్రభుత్వమర్థమునుగాక దేశశ్రేయస్సు నభిలషించి త్రాగుడును తగ్గింప కోరినదేమైనయెడల శాంతియుతముగ నిర్వహింపబడు, గాంధి మహాత్ముని మద్యపాన బహిష్కారోద్యమము నభ్యంతరపఱచి, ప్రజలను 'త్రాగవద్ద'ని బ్రతిమాలెడు స్వచ్ఛందసేవకులను నిర్బంధించి యుండడు. పన్నును హెచ్చించుటవలనగాని, దుకాణములసంఖ్యను తగ్గించుటవలనగాని, యీదురభ్యాసమునశింపదు. ఇట్టి దురభ్యాసమునకు తావొసంగకుండుటవలనను, విద్యావ్యాపనమువలనను ప్రజలు సన్మార్గవర్తనులై తమ చెడునడవడిక నుండిమరలగలరు.

## ఎగుమతి దిగుమతిపన్నులు.

'వస్త్రపరిశ్రమము'ను ప్రకరణమున, హిందూదేశపు చేతిపనులు క్షీణించుటకుగల కారణముల దెల్పుచు, నీయెగుమతి దిగుమతి సుంక ముల విషయమై కొంతవఱకు వ్రాసియున్నాము. 1800 వ సం॥ర ప్రాంతముల ఆంగ్లదేశమున దిగుమతియయ్యెడు హిందూదేశపు సర కులపై విశేషముగ పన్నులు విధింపబడెను. హిందూదేశమునకు దిగుమతియయ్యెడు ఆంగ్లవస్తువులపై సుంకములు లేకుండెను. ఉన్నను నామమాత్రము. సుంకములు లేకపోవుటచే, విదేశపుసరకులు సులభ ముగ మనదేశమును ప్రవేసించి వ్యాపనము గాంచగల్గెను. దీనికి రైలు మార్గములు సహాయపడెను. సుంకములే యున్నచో వానిధర లెక్కు వౌటయు, దేశీయవస్తువులతోడి పోటీకి నిలువలేకపోవుటయు, నందుచే క్రమముగ వెనుకకు తగ్గుటయు సంభవించియుండును. హిందూదేశమున రాజ్యాధిపత్యముననున్న ఆంగ్లేయులెంతవఱకునుగూడ తమవర్తక లాభమునే గోరుచు దేశీయవృత్తులను నాశమొందింప నెంచుటచే, యీదేశమునందలి చేతిపనులు సంరక్షింపబడునట్లు విదేశవస్తువులపై నధికసుంకములను విధింపరైరి. సిపాయి పితూరివఱకునుగూడ దిగు మతివస్తువులపై పన్ను నూటికి 5 చొ॥ నుండెను. తరువాత (ఈసమయ మున కే దేశీయపరిశ్రమలు నశించెను.) ప్రభుత్వమునకు ధనమును సంగ్రహించుటకై దీనిని క్రమముగ నూటికి రూ 20 లవరకు హెచ్చిం చిరి. కానియీకాలమున నూతనముగ యంత్రాలయములు (factoiries నిర్మింపబడుటచే, తమవర్తకము క్షీణించునేమోయని భయపడి, ఆంగ్ల దేశమునందలి బట్టలవర్తకులు ఆందోళనము సల్పుటవలన నాసుంక ములు 1875 వ. సం॥ లో నూటికి 5 వఱకు తగ్గింపబడి చివరకు 1882 వ సం॥ లో పూర్తిగ తీసివేయబడెను. హిందూదేశ పరిపాలన మున, ఆంగ్లవర్తకుల శ్రేయస్సు ప్రధానస్థానము నాక్రమించి యున్న

దనుట కిది యొక తార్కాణము. కాని ధన మత్యవసరమగుటచే 1894 వ సం॥ న నూలువస్త్రములుతప్ప మిగిలినవానిపై నూటికి 5 చొ॥ పన్నులు వేయబడెను. ఇంకను ధనమవసరమయ్యెను. లంకాషైరు బట్టల వర్తకులను సంతృప్తిపరచుటకును, ధనము సమకూర్చుటకును, కూడ, నొక నూతనమార్గము లభించెను. దిగుమతియగు వస్త్రములపై నను, ఈ దేశమున మిల్లులలో తయారగు వస్త్రములమీదనుగూడ నూటికి రూ 3-8-0 చొ॥ పన్నువిధించిరి. దేశక్షేమమునుగోరు యే రాజుగాని విదేశవస్తువులతో సమముగ, దేశమున తయారుచేయబడిన వస్తువులపై పన్నువిధింపడు. కాని ఆంగ్లేయులో! తమవర్తకులలాభమే ప్రధానముగ నెంచుకొనుటవలన నిట్టియక్రమమునకు సమకట్టిరి.

1916 వ సం॥ న, దిగుమతియయ్యెడు వస్తువులపై సామాన్యముగ, నూటికి $7\frac{1}{2}$ చొ॥ పన్నువిధింపుచు, కొన్నివస్తువులపై ప్రత్యేకముగ నింతకంటె నధికసుంకములను విధించిరి, 1817-18 వ సం॥ లో యీసుంకము లింకను వృద్ధియయ్యెను. ఈ సం॥ ము దిగుమతియైన వస్త్రములపైకూడ నూటికి $7\frac{1}{2}$ చొ॥ పన్నువిధింపబడెను. కాని ఉత్పత్తి పన్ను హెచ్చలేదు. తిరిగి 1921 వ సం॥ లో సాధారణములగు దిగుమతిపన్నులన్నియు (వస్త్రములుసహా) నూటికి $7\frac{1}{2}$ నుండి 11 వఱకును హెచ్చింపబడెను. కొన్నివస్తువులపై నూతనముగ పన్నువిధింప మొదలిడిరి. అగ్గిపెట్టెకు 1 పైస చొ॥ సుంకమువిధింపబడినది. సంవత్సరమున నే ప్రభుత్వము వ్యయముతగ్గకుండుటవలనను ఎన్నికొత్తపన్నులు విధించినను, సరియైన ఆదాయము రాకపోవుటవలనను, 1922 వ సం॥ న తిరిగి దిగుమతిపన్నులు హెచ్చెను. వస్త్రములుసహా దిగుమతివస్తువులన్నిటిపై నూటికి 15 చొ॥ పన్నువిధించిరి. కాని యీప్రభుత్వము దేశమున నుత్పత్తియగు వస్త్రములపై సుంకమును, నూటికి $3\frac{1}{2}$ నుండి $7\frac{1}{2}$ వఱకును హెచ్చించిరి. దిగుమతియయ్యెడు నూలుపై యీయేటనే నూటికి

5 చొ॥ పన్ను విధింపబడెను. అగ్గిపెట్టెపైపన్ను 2 పైసలయ్యెను. ఇంకను కొ్రత్తవిధముల దిగుమతి సుంకములు హెచ్చెను. 1923 వ సం॥ న దిగుమతిపన్నులలో కొ్రత్తమార్పులు జరుగలేదు.

రాబడిపన్ను.

సిపాయి విప్లవమునకు పిమ్మట 1860 వ సం॥ లో ధనము నవసరమగుటచే యీపన్ను మొదట విధింపబడెను. వ్యవసాయముకాక యితరవృత్తులవచ్చు నాదాయముపై నీపన్ను విధింపబడును. ప్రస్తుతము రూ 1000 ల కంటె తక్కువయాదాయముపై నీపన్ను విధింపబడుట లేదు. 1917 వ సం॥ వఱకును రూ 1000 లు మొదలు 2000 ల వఱకును రూపాయకు 4 పైసలచొప్పునను, రూ 2000-5000 వఱకు 5 పైసలు, చొ॥ను ఇటులే క్రమముగ వృద్ధియగుచు రూ 25,000 లకు పైన రూపాయకు 1 అణా చొ॥ విధింపబడుచుండెను 1917 వ సం॥ లో యుద్ధకారణమున, సూపరుటాక్సు అను కొ్రత్త రాబడిపన్ను విధింపబడెను. సాలునకు రూ 50,000 లకుపైన నాదాయమువచ్చువారు రాబడిపన్నుగాక యీపన్నుగూడ చెల్లింపవలసియుందురు. ఈ సూపరుటాక్సు రూపాయకు 1 అణా మొదలు 3 అ. వఱకు వసూలు చేయబడుచుండెను. కాని 1921, 1922. వ. సం॥ లలో రాబడిపన్ను లింకను వృద్ధిచేయబడెను. 30 వేల రూపాయలు మొదలు, 40 వేలవఱకును, రూపాయకు 15 పైసల చొప్పునను, 40 వేలకుపైన రూపాయకు 18 పైసలు ($1\frac{1}{2}$ అ) చొ॥ పన్ను విధింపబడెను. సూపరుటాక్సు గూడ $3\frac{1}{2}$ లక్షలకుపైన, రూపాయకు 6 అ॥ చొప్పున నియమింపబడెను, ధనవంతులగు వారు రాజ్యనిర్వహణమున నధికభారమును వహించుట న్యాయమేయగుగాని, వారియాదాయమున సగమువఱకును, ప్రభుత్వముగైకొనుట మిగుల అక్రమము. $3\frac{1}{2}$ లక్షలరూపాయలకుపైన నికగాయము వచ్చునతడు రూపాయకు రు. 0-1-6 రాబడిపన్నుకొ్రిందను.

రు 0-6-0 లు సూపరుటాక్సునకు గాను మొత్తము రూపాయకు 0-7-6 (దాదాపు ½ రూపాయి) చెల్లించవలసియున్నది. భూమిశిస్తు నిర్ణయములలో, నికరాదాయమున (మక్తాయందు) సగము (50%) ప్రభుత్వము గ్రహించునట్లు (హమార్క్ ఫూల్ రూల్సు) నిశ్చయింపబడినది. 60 సంవత్సరములు ఆదాయపుపన్ను గైకొనినపిమ్మట, గొప్పమొత్తములపై విధింపబడుచున్న ఆదాయపుపన్నును, నీరీతిగనే పరిణమించినది. ఆదాయపు పన్నింతయధికముగ నున్నప్పుడు వాణిజ్యమున కుత్సాహమెట్లుండగలదు?

స్టాంపుపన్ను—కోర్టులందు ప్లెయింట్లు పిటీషనులు మొదలగునవి దాఖలుచేయుటకు అంటించు కోర్టుఫీజుస్టాంపులనుండియు, పత్రములు, బ్యాంకుచెక్కులు, రశీదులు మొదలగువానిపై నంటించు రివెన్యూస్టాంపులనుండియు, నీద్రవ్యము వచ్చుచున్నది. ఈఆదాయమున మూడింట రెండుపాళ్ళు ప్రధమతరగతికే చెందును. 1914 వ సం॥ లో స్టాంపులవలన ఆదాయము 7 కోట్ల 80 లక్షల రూపాయలుండెను. 1919 వ సం॥న నియ్యది 8 కోట్ల 80 లక్షలరూప్యములయ్యెను. అనగా 5 సం॥ లలో 1 కోటి రూపాయలు హెచ్చినవి. దీనినిబట్టి హిందూదేశమున వ్యాజ్యములెట్లు పెరిగిపోవుచున్నదియు, ప్రజలు కోర్టులలో క్రమముగ నెట్లధిక ధనమును చెల్లించుచున్నదియు తెలియగలదు.

రైల్వేలనుబట్టియు, జలాధారములబట్టియు వచ్చెడు ఆదాయమునుగూర్చియు, వానికగు వ్యయమునుగూర్చియు, వానివలని లాభనష్టములగూర్చియు వేఱుప్రకరణములు వ్రాయబడియుంట నిటతిరిగి వ్రాయుట యనవసరము.

## ప్రభుత్వపు వ్యయము.

గడచిన 60 సంవత్సరముల వ్యయమును పరిశీలించినవారికి యొకసంవత్సరముకంటె మఱియొకసంవత్సరము ప్రభుత్వవ్యయ మధిక

ముగ పెఱుగుచున్నట్లు గోచరించును. వ్యయము ననుసరించి ప్రభుత్వ ముతనరాబడిని వృద్ధిచేయుచుండును. ఆదాయమునిట్లు వృద్ధిచేయుటకై నూతనమగు పన్నులు విధింపబడుచుండును. పన్నులు హెచ్చించినను, సరియగు నాదాయమురానిచో ప్రభుత్వమునకు 'లోటు' (deficit) కలుగవచ్చును. ఈ'లోటు'ను తొలగించుటకై ప్రభుత్వము ఋణముచే యవలసియుండును. గడచిన 5 సంవత్సరములునుగూడ దీనికి తార్కాణముగనున్నవి. 1918-19 వ సం॥ము మొదలు ప్రభుత్వమునకు 'లోటు' లు కలుగుచున్నవి. ఈ'లోటు'లను తొలగించుటకు నూతనమగు పన్నులు విధింపబడెను. కాని లాభములేకపోయెను. సంవత్సరము వెంబడి సంవత్సరము ఆదాయము వ్యయమునకు సరిపోకుండుటచే 'లోటు' గల్గుటయు, ప్రభుత్వము ఋణముచేయుటయు సంభవించెను.

| | | | |
|---|---|---|---|
| 1918-19 వ. సం॥ లో లోటు | | 6 | కోట్లరూపాయలు. |
| 1919-20 | ... | 24 | ... |
| 1920-21 | ... | 26 | ... |
| 1921-22 | ... | 34 | ... |
| 1922-23 | ... (రమారమి) | 6 | ... |

ప్రభుత్వము ముందువెనుక లాలోచింపక వ్యయమునధికముచేయుటనుబట్టియే, యొకవంక నూతనములగు పన్నులు విధింపబడుచున్నవి. మఱియొకవంక ఋణము పెఱిగిపోవుచున్నది. అత్యధికమగు పన్నుల విధించుటవలన నేటిప్రజలు బాధింపబడుటయేగాక, ఋణమును నానాటికి పెంపుజేయుటవలన, ఆంగ్లభూపాలురు భారతవర్ష పురోభివృద్ధి నెంతయు నాటంకపరచుచున్నారని నూయభిప్రాయము.

ప్రభుత్వమువారు వ్యయమును తగ్గించుట యత్యావసరము. ఇతరదేశములందెట్లున్నను, దారిద్ర్యముచే పీడింపబడుచున్న భరతవర్షమున ఆదాయమునుబట్టి వ్యయమును సరిపుచ్చుచుండవలెనుగాని,

వ్యయము ననవసరముగు వృద్ధిచేసి, దానికి సరియగు నాదాయమును రాబట్టుటకై, ప్రజలపై క్రొత్తపన్నులువిధించి ధనమును గ్రహించుట, చాలయధర్మము. 1865 మొదలు 1868 వ సం॥ము వఱకు, హిందూదేశమునప్రభుత్వకోశాధికారిగపనిచేసిన 'మేసీ'గారు (Massey) 1871 సం॥పు కమిటీయెదుట సాక్ష్యమిచ్చుచు ఈయభిప్రాయమునే చెప్పియున్నారు. వ్యయమునకు సరిపోవునట్లాదాయమును వృద్ధిచేయవలెననెడినీతి ఇంగ్లీషురాజస్వమునకు చెందియున్నది. నాయభిప్రాయమున హిందూదేశపు రాజస్వమున దీనికి వ్యతిరిక్తమగు నీతిని యవలంబించవలసియున్నది. ఇందుకుగల ముఖ్యకారణమేమన దేశమునందలి ద్రవ్యసాధనములు బహుస్వల్పములు. వ్యయమునేమాత్రమైనను నధికముచేసితిమేని లోటు సంప్రాప్తమగును. పన్నును విస్తరింప జేయుటకు నవీలులేదు. రాబడిపన్నుతప్ప క్రొత్తపన్నును యిప్పుడు కల్పింపవీలులేదు. నాకు తెలిసినంతవఱకు క్రొత్తపన్నులను వేయుట కెవ్విధమైన యాధారములును లేవు. కావున హిందూదేశపు కోశాధికారులు వ్యయము నాదాయమునకు సరిపుచ్చు నేర్పాటులు గావించుట విధియైయున్నదని నేను వక్కాణించగలను." (Massey)

అభినవ భారతపితామహుఁడనఁదగు దాదాభాయి నౌరోజీగారు ఇండియా గవర్నమెంటు చేయుచున్న యధికవ్యయముగూర్చి యిట్లు వ్రాసియున్నారు. ఇంగ్లాండుదేశము తన ద్రవ్యసాధనములనుండి (మెయోప్రభువు చెప్పినప్రకారము) సాలునకు 70 మిలియను పౌనులాదాయమును సంపాదించుచున్నది. అందుజాతీయ ఋణమునకు చెల్లించవలసిన వడ్డీక్రింద 27 మిలియను పౌన్లను తీసివేయగా 43 మి. పౌనులు మిగులుచున్నవి. ఇంగ్లీషుప్రజల ఆదాయములో ఖర్చు నూటికి $5\frac{1}{2}$ చొ॥ అగుచున్నది. బ్రిటిషిండియా ప్రభుత్వమునకు సాలునకు 50. మి. పౌన్లు ఆదాయమువచ్చుచున్నది. అందు 8 మిలియను పౌను

లను రైల్వేనిర్మాణమునకును వడ్డీక్రిందను తీసివేయగా 42 మిలియను పౌన్లు ప్రభుత్వమునయొక్క యితరఖర్చులకు మిగులుచున్నది. ఇది 30 కోట్ల ప్రజలయొక్క ఆదాయములో నూటికి 14 వ వంతగుచున్నది. ఇండియా గవర్నమెంటువారు బ్రిటిషు గవర్నమెంటుకన్న 2½ రెట్లధిక ముగ వ్యయమొనర్చుచున్నారు.

ప్రభుత్వముయొక్క వ్యయమధికముగ నున్నను ద్రవ్యమంతయు దేశాభివృద్ధి కరముగునట్టియు జనోపయోగ కరములగునట్టియు కార్య ములకు వెచ్చింపబడినయెడల పన్నులధికముగనున్నను భరింపవచ్చును. కాని హిందూదేశమున నట్లుజరుగుటలేదు. వ్యయపట్టికనొకసారి పరీక్షిం చినచో సైన్యమునకును, సివిలు డిపార్టుమెంటునకును 'రైల్వేలక్రిందను' యెక్కువ ధనము వెచ్చింపబడుచున్నట్లు కనుపించును. మఱియు సీమ ఖర్చుల, రూపమున చాలధనము దేశమునుండి పోవుచున్నది. ఈకారణ ముల వలననే మొదటినుండియు ప్రభుత్వవ్యయమధిక మయ్యెను. 1859 సం॥ము మొదలు 1920 వ సం॥ము వఱకును 'సీమవ్యయమును' సైన్యమును నెట్లు క్రమముగ హెచ్చినదియు దానితో ప్రభుత్వ పుమొత్తపువ్యయమును నెట్లుహెచ్చినదియు యీక్రిందగాననగును.

| సంవత్సరము. | సీమఖర్చులు. | సైనికవ్యయము. | మొత్తమువ్యయము. |
|---|---|---|---|
| | రూ | రూ | రూ |
| 1859—60 | 5,04 29,450 | 19 38,05,450 | 50,37,27,110 |
| 1864—65 | 4,80,24,010 | 12,70,99,220 | 45,58,89,050 |
| 1869—70 | 7,67,78 500 | 16,20,87,620 | 50,12,28,410 |
| 1874—75 | 7,88,88,170 | 13 69,78,690 | 49,58,75,750 |
| 1879—80 | 14,54,32,770 | 22,29,16,600 | 48,30,71,160 |
| 1884—85 | 14,10,09,820 | 17,36,17,810 | 46,99,21 990 |
| 1889—90 | 14,84,89,230 | 21,56,60,250 | 50,91,31,670 |
| 1894—95 | 15,70,73,670 | 25,73,50,940 | 56,93,87,290 |
| 1899—1900 | 24,58,92,960 | 23,06,47,095 | 88,07,20,965 |
| 1904—05 | 29,21,03,355 | 31,04,42,895 | 101 51 53,185 |
| 1909—10 | 28,68,43,740 | 28,66,84,845 | 110,98,02,810 |
| 1914—15 | 30,31,28,970 | 30,80,53,725 | 124,41,44,040 |
| 1919—20 | 37,01,50,500 | 85,52,50,500 | 218,46,61,500 |

(B. E.) Figures from K. T. Shaw, Sixty years of Indian Finance

సీమఖర్చులు పౌనులలో లెక్కింపబడు గాన వానిని రూపాయిలలోకి మార్చునప్పుడు 1899-1900 సంవత్సరము వఱకును పౌనునకు 10 రూపాయల చొ॥ నను అప్పటినుండియు పౌనుకు 15 రూపాయల చొ॥నను గణింపబడినవి.

ఈ 60 సం॥లలోను సీమఖర్చులు 7 రెట్లును సైనికవ్యయము 4½ రెట్లును మొత్తపువ్యయము 4 రెట్లును వృద్ధినొందినవి. సివిలు శాఖకగు ఖర్చులు (కలెక్టరులు మొదలగువారి కొసంగబడు వేతనాదులు) కూడ క్రమక్రమముగ హెచ్చినవి.

| సం॥ము | సివిలుశాఖకగు వ్యయము. |
|---|---|
| 1871 | రూ 14,31,89,430 లు |
| 1881 | రూ 15,98,30,360 లు |
| 1891 | రూ 18,9004,640 లు |
| 1901 | రూ 20,72,22,720 లు |
| 1911 | రూ 32,07,74,835 లు |
| 1921 | రూ 42,37,53,000 లు (B. E.) |

1871 మొదలు 40 సంవత్సరములలో సివిలు శాఖవ్యయము రమారమి 3 రెట్లు వృద్ధిజెందెను.

దేశాదాయమంతయు నిట్టివిషయములలో వ్యయమగుచుండె విద్యావ్యాపనము ఆరోగ్యవృద్ధి పరిశ్రామికాభివృద్ధి మొదలగు జనహితైకకార్యములకు తావులేకున్నది. 1919-20 వ స ॥ ములో ఆయా ప్రభుత్వ మాయాశాఖల కెల్లధన ముపయోగించినది యీక్రింది పట్టీవలన గాంచగలము.

## 1919–20 వ సంవత్సరము.

## సీమఖర్చులు.

భారతీయులు పన్నులరూపమున చెల్లించుసొమ్ములో కొంతభాగము హిందూదేశమునను, మిగిలిన భాగమాంగ్లదేశమునను ప్రభుత్వము ఖర్చుపెట్టుచుండును. ఇట్లాంగ్లదేశమున ఖర్చయ్యెడు ధనమునే 'శీమఖర్చు' లందురు. 'ధనప్రవాహ'మను ప్రకరణమున, హైందవులు చెల్లించు ద్రవ్యములో నెంతభాగము సీమఖర్చులపేరిట, ఆంగ్లదేశమునకు పోవుచున్నదియు వ్రాసియున్నాము. రక్తపుష్టికల్గి దేహదార్ఢ్యముతో నొప్పెడి మనుజుని శరీరమునుండి, రక్తము నెప్పటికప్పుడు వెలుపలకు లాగివేసినచో, నెట్లాతడు క్రమముగ, రక్తహీనుడై, బలహీనుడై, కృశించిపోవునో, అట్లే దేశాభివృద్ధికి మూలసాధనమగు ద్రవ్యము నేటేటప్రతిఫలము లేకుండ నొకదేశమునుండి వెలుపలకు పంపుటవలన,నాదేశము క్రమముగ దారిద్ర్యవంతమై దుర్భిక్షమున కాలవాల మగుచున్నది. భారతవర్షావస్థయింతియగదా! ప్రతియేటను, రమారమి 30 కోట్లరూప్యములు, హిందూదేశమునుండి ప్రభుత్వమువారిచే, శీమఖర్చుల రూపమున నింగ్లాడునకు పంపబడుచున్నవి. ఇట్టిసీమఖర్చులు ప్రజలు చెల్లించు భూమిశిస్తునకు ప్రస్తుతము సమముగనున్న ట్లీక్రింది పట్టికవలన జూడగలము:—

| సం॥ము. | సీమఖర్చులు. | భూమిశిస్తు. |
|---|---|---|
| 1912-13 | పౌ. 20,279,572లు. | పౌ. 21,282,468లు. |
| 1914-15 | పౌ. 20, 208,598లు | పౌ. 21,221, 539లు |
| ... ... | ... ... | ... ... |
| 1918-19 | పౌ. 24,034,800లు | పౌ. 21,089 944లు. |

ప్రజలు చెల్లించుపన్నులలో ప్రధానమైనది భూమిశిస్తు. అట్టి భూమిశిస్తునకు తుల్యమగు మొత్తము లీదేశమున వ్యయపరచుచుండగా, భారతదేశ మెట్టియభివృద్ధిని గాంచగలదు?

## సివిలు డిపార్టుమెంటు.

సివిలు డిపార్టుమెంటునందున్న ఉద్యోగస్థుల వేతనాదులకగు వ్యయమునుగూర్చి విచారింతము. చిన్నయుద్యోగులకు బహుస్వల్ప వేతనములును, ఉన్నతోద్యోగుల కత్యధిక జీతములను, నియ్యబడుచున్నవి దీనికి కారణమేమి? ఉన్నతోద్యోగము లంతెక్కువ యాంగ్లేయులు న్నారు. క్రిందియుద్యోగములు హైందవుల వశమునన్నవి. ఉన్నతోద్యోగులలో నూటికి ఆరుగురు హైందవులుండవచ్చును. ఈస్వల్ప సంఖ్యాకుల కైనను ఆంగ్లేయులకున్నంత యధికజీతములు లేవు. ఉన్నతోద్యోగముల నున్న ఆంగ్లేయునిజీతము సగటున నెలకు రూ 700లై యున్నది. ఉన్నతోద్యోగమునున్న హైందవుని జీతము, సగటున రూ 400 లు. పెద్దఉద్యోగుల వేతనము లింతయధికముగ నుండుటచేతనే దీనిని కొందఱు "తల బరువు ప్రభుత్వము" ని చెప్పుచుందురు. జిల్లాయధికారియగు కలక్టరు, సుమారు రూ 2000 లను గ్రహించుచుండ, నాతని కచ్చేరిలో క్రింది హైందవోద్యోగికి నెలకు 20 రూప్యములైనను ముట్టుటలేదు. ఉన్నతోద్యోగి కాతనిజీతమెంత యనవసరముగ నధికముగనున్నదో, చిన్నయుద్యోగికాతని జీతమంత స్వల్పముగనున్నది.

ఐశ్వర్యమునందును, ధనమునందును, మనదేశము ప్రపంచమందలి దేశములలోనెల్ల కడపటిదైనను, ఉన్నతోద్యోగస్థులకిచ్చు వేతనముల విషయమున మాత్రి మగ్రస్థానము వహించియున్నది. మనదేశమున నియ్యబడుచున్నంత విపరీతపుజీతము లేదేశమునందును నియ్యబడుటలేదు.

అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షునకు సంllనకు 75,000
డాలరులు= రూ 2,25,000
జపానుదేశపు ప్రధానమంత్రికి ... ... 12,0000
యెన్నులు=రూ 18,00,

ఇండియా దేశము; వైస్రాయికి ... ...రూ 2,5,0800

| | |
|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రములు రా: జ ప్రభాగములోని మంత్రులకు సం॥నకు | 12,000 డాలరులు = రూ 36,000 |
| జపాను దేశము ... ... | 8000 యెన్నులు = రూ 12,000 |
| ఇండియా దేశము; క్రిందప్రభుత్వము లోని కార్యనిర్వాహక సభ్యులకు-సం॥నకు | ...... రూ 80,000 |
| అమెరికా దేశము: రాష్ట్రములగవర్నరులకు, సంవత్సరమునకు | 2,500 డాలరులు మొదలు 12000 డాలరులు రూ 7,500 మొదలు రూ 36,000ల వరకు |
| ఇండియా దేశము ... | ... రూ 1'00'000—1,20,000 |

(From Lajpat Rai's England's Debt to India Appendix.)

ఇటులే హిందూ దేశమందలి యున్నతోద్యోగుల జీతము లితర దేశములలోని వానికంటె చాలనధికముగ నున్నవి. మఱియొక ఆశ్చర్య కరమగు సంగతియేమన, సీమలోని ప్రధానమంత్రి సంవత్సరమునకు రూ 75,000లను (పౌ 5,000) పుచ్చుకొనుచున్నాడు. అతనిచే నియమింపబడినట్టియు, నాతనికిక్రింది యుద్యోగియునగు హిందూదేశపు వైస్రాయికి రూ 2,50,800 లొసగబడుచున్నవి. ఇట్టివైపరీత్యమునకు కారణమేమి? ఇంగ్లాండు ప్రధానమంత్రి జీతమును జెల్లించునది ఆంగ్లేయులు. ఆతనిజీత మాంగ్లేయులను బాధించును. వైస్రాయిజీతమును చెల్లించువారు హైందవులు. అట్టియెడ నాతనిజీత మధికముగ నున్నను ఆంగ్లేయులను బాధింపజాలదు.

హిందూదేశములో ప్రతివత్సరమును సం॥ నకు రు 1000 లకు మించిన జీతములుగల యూరోపియనులకును హిందువులకును నిచ్చుజీత ములీక్రింది విధముననున్నవి.

13,178 యూరోపియనులకు రూ 8,77,14,431 లు

11,554 హైందవులకు రూ 2,55,54,313 లు

(From the Parliamentary Return of 1892 Quoted in Dr. Beasant's India A Nation.)

1913 వ సం॥ పు లెక్కల ననుసరించి ప్రభుత్వోద్యోగములలో నున్న యూరోపియనులు ఆంగ్లోహైందవులు, హైందవులు వీరెట్లు జీతములు బొందుచున్నదియు నీక్రింద గానవగును.

నెలకు రూ 200 లకు మించిన వేతనముగల యుద్యోగముల మొత్తము. 11,064

వీనిలో ఆంగ్లేయులకును ఆంగ్లోహైందవులకును 6,491

అనగా నూటికి 58.

హైందవులకు 4,573

అనగా నూటికి 42.

మఱియు నీ రూ 200 లకు పైన జీతముగల యుద్యోగముల నీ మూడురకములవారును యీక్రిందివిధమున నాక్రమించియున్నారు.

| జీతము. | ఆంగ్లేయులు. | ఆంగ్లోహైందవులు | హిందువులు. |
|---|---|---|---|
| రూ 200-300 | నూటికి 12 గురు | నూటికి 24 గురు. | నూటికి 64 గురు |
| రూ 300-400 | 19 | 19 | 62 |
| రూ 400 500 | 36 | 15 | 49 |
| రూ 500-600 | 58 | 11 | 31 |
| రూ 600-700 | 54 | 10 | 36 |
| రూ 700-800 | 78 | 8 | 14 |
| రూ 800-900 | 73 | 6 | 21 |
| రూ 900-1000 | 92 | 4 | 4 |

| నెలకుజీతము | ఉద్యోగముల మొత్తము | ఆంగ్లేయులు | ఆంగ్లో హైందవులు | హిందువులు |
|---|---|---|---|---|
| రూ 1000-1200 | 414 | 339 | 24 | 51 |
| రూ 1200-1400 | 264 | 195 | 28 | 41 |
| రూ 1600-1800 | 111 | 97 | 4 | 10 |
| రూ 1800-2000 | 273 | 173 | 1 | 99 |
| రూ 2000-2500 | 300 | 219 | 4 | 77 |
| రూ 2500-3000 | | 131 | | 98 |
| రూ 3000-3500 | 33 | 32 | | |
| రూ 3500-4000 | 25 | 25 | | |
| రూ 4000 పైన | 39 | 39 | | |



(From K. T. Shah's Sixty years of Indian Finance)

జీతము లెక్కువైన కొలదిని ఉద్యోగమున నియమింపబడిన హైందవుల సంఖ్య క్రమముగ తగ్గిపోయినది. చివరకు అత్యున్నతోద్యోగములెల్లనుగూడ నాంగ్లేయుల చేతులలోనే యున్నవి. నూతన సంస్కరణముల మూలమున కొన్నికొత్త యుద్యోగములు హైందవులకు కల్పింపబడినవి. కాని వానిసంఖ్య స్వల్పము.

హైందవోద్యోగము లెట్లున్నను సంస్కరణముల యనంతరము ఇంపీరియల్ సర్వీసునందెట్టి యభివృద్ధి చేయబడినదియు పార్లమెంటు సభలో ప్రకటనము చేయబడెను.

| | | |
|---|---|---|
| ఇండియను సివిలు సర్వీసున జేయబడిన హెచ్చుదల | పౌ | 360,000. |
| ఇండియను పోలీసు సర్వీసు | పౌ | 130,000. |
| ఇండియను ఎడ్యుకేషనల్ సర్వీసు | పౌ | 100,000. |
| ఇండియాసైన్యములోని ఆంగ్లసిపాయీలు ఆంగ్లయుద్యోగస్థులు | పౌ | 1,700,000. |

ఇండియన్ మెడికల్ సర్వీసు పౌ 250,000.

(పౌను 1కి రూ 15 లు) మొత్తము పౌ 2,540,000.

అధిక వేతనముల నటుంచి స్వల్ప వేతనముల గ్రహించెడు క్రింది యుద్యోగస్తులను చూచినచో వారియవస్థ కడుదీనముగనుండును. ప్రభుత్వమొసంగెడు జీతము వారికుటుంబపోషణార్థమైనను జాలకుండును. గవర్నమెంటునకెల్ల ముఖ్యోద్యోగులగు గ్రామకరణములకు నెల రూ 15 లును మునసబులకు రూ 8 లును నొసగబడుచున్నవి. ఇట్లే యితర హైందవ గ్రామాధికారులును, గుమాస్తాలును, జీతములనందు చుందురు. ఈస్వల్ప మొత్తములు తమకుటుంబ భరణమునకైనను చాల కుండుటచే, అక్రమపద్ధతుల ధనమును గ్రహింప యత్నించవచ్చురు. ప్రభుత్వము తానిక్రిందియుద్యోగులకు న్యాయముగ నివ్వవలసినజీతము నిచ్చుటలేదనియు, వారక్రమపద్ధతుల నవలంబించుచున్నారనియుగూడ నెఱుగును. అయినను నేమియు నెఱుగని పోలిక ప్రజలకష్టములయెడ మౌనముద్రను దాల్చియుండును.

ఇండియన్ సివిలు సర్వీసు.

గడచిన పదిసంవత్సరములలో హిందూదేశమున పనిచేయుచుండిన సివిలు శాఖోద్యోగులసంఖ్యను గుఱించియు వారికిచ్చు వేతనములను గుఱించియు విం టర్టనుప్రభువు ఆంగ్లప్రజాప్రతినిధుల (House of Commons) సభలో నిట్లు దెల్పియున్నాడు.

| సంవత్సరము | సివిలుయుద్యోగుల సంఖ్య | జీతములకునుపించను లకును వ్యయము. | సగటు 1కి వ్యయము |
|---|---|---|---|
| 1913-14 | 1370 | పౌ 21,74,000 | పౌ 1587 |
| 1914-15 | 1420 | 22,34,000 | 1573 |
| 1915-16 | 1410 | 22,48,000 | 1594 |
| 1916-17 | 1420 | 22,39,000 | 1578 |

| | | | |
|---|---|---|---|
| 1917-18 | 1380 | 22,75,000 | 1648 |
| 1918-19 | 1350 | 22,39,000 | 1658 |
| 1919-20 | 1310 | 24,40,000 | 1863 |
| 1920-21 | 1290 | 24,97,000 | 1936 |
| 1921-22 | 1290 | 24,72,000 | 1916 |
| 1922-23 | 1315 | 26,61,000 | 2026 |

(From Daily Express. March 20. 23)

ఈ 10 సం॥లోను యుద్యోగుల సంఖ్యలో 55 గురు తగ్గినను వ్యయము సుమారు 5 లక్షల పౌనులు (రూ 75 లక్షలు) హెచ్చినది. మఱియు సగటున నొకయుద్యోగికిచ్చు వేతనము పౌ 1587 లనుండి 2024 వఱకును వృద్ధియయ్యెను. అనగా నూటికి 27½ పా॥ పెరిగెను. ఈపెఱుగుదల యింకను చాలనట్లు సివిలు యుద్యోగుల విషయమై విచారణసల్పి వారికి సౌకర్యములొనగూర్చుటకు నూతనముగ 'రాయలుకమీషను' నియమింపబడినది. ప్రజలపన్నుల భాగమెంతయధికమైన సరియే! ప్రజలనేక కష్టములపాలు గావచ్చును. ఉప్పుపన్ను సైతము విధింపబడవచ్చును. కాని సివిలు యుద్యోగులు మాత్రము సంతుష్టి చెందియుండవలెను. వారు 'తృప్తాస్మః' యనినచో ఆంగ్లదేశమందలి ప్రజలు సంతృప్తి నొందజాలరు. ఆంగ్లప్రభుత్వపు ముద్దుబిడ్డముగదా సివిలు యుద్యోగి! ఆంగ్లసామ్రాజ్యమునకు మూలాధారమై వెలయు ఉక్కుచట్రముగదా సివిలు సర్వీసు.

సైనిక వ్యయమునుగూర్చి వేఱొక ప్రకరణమున ప్రస్తావించి యున్నాము.

## విద్య.

విద్యావ్యాపనముకొఱకై సరియగు ధనమును వెచ్చించుట పాలకవర్గముయొక్క ముఖ్యకర్తవ్యమై యున్నది. ఐరోపా అమెరికా

ఖండములందలి సభ్యదేశములలోని ప్రభుత్వములు విద్యావ్యాప్తికై విశేషధనమును వెచ్చించుచున్నవి. హిందూదేశముకూడ కొన్నిస్వదేశ సంస్థానము లీవిషయమై కడుశ్రద్ధవహించి ప్రారంభవిద్యనుచితముగ నొసగుచున్నవి. ఇండియా గవర్నమెంటువా రీవిషయమై యెంతయు వెనుకబడి యున్నారని చెప్పనగును. విద్యానుచితముగ నెల్లరకుప్రసాదించు విషయమున ప్రశ్నింపబడినపుడు ప్రభుత్వము ధనములేదని బహులు చెప్పుట యాచారమై యున్నది. కీర్తిశేషులగు గోపాలకృష్ణ గోఖలేగారు సామ్రాజ్య శాసన నిర్మాణసభయందు ప్రారంభవిద్యను చితముగను నిర్బంధముగను నెల్లవారికిని కలుపవలయునని రెండుపర్యాయములు తీర్మానముపపాదించిరి. కాని ప్రభుత్వమువా రంగీకరింపలేదు. నేడు విద్యావ్యాపనమున ప్రభుత్వమువారు పూర్వముకంటె కొంచె మెక్కువశ్రద్ధ వహించుచున్నారని చెప్పవచ్చును. అక్కడక్కడ ప్రాథమిక విద్యనుచితముగ నొసగుచున్నారు. అయినను విద్యాప్రచారము శ్లాఘనీయముగనున్నదని చెప్పజాలము. హిందూదేశముననున్న గ్రామములలో ప్రతినాల్గింటియందును 3 గ్రామములలో బడులులేవనియే తెలియుచున్నది.

| | |
|---|---|
| హిందూదేశముననున్న గ్రామములసంఖ్య | 5,39,000 |
| ప్రాథమిక విద్యాలయములుగల గ్రామములు. | 1,29,000 |

అనగా గ్రామముల మొత్తములో నాల్గవవంతున మాత్రమే విద్యాలయములున్నవి.

| | |
|---|---|
| ప్రభుత్వపాఠశాలలందుగాని యితరపాఠశాలలందుగాని విద్యనునేర్చుకొనువారిసంఖ్య | 84,00,000 |
| (ఆంగ్లపాలితమగు హిందూదేశమందలి మొత్తపు జనసంఖ్య | 24,40,00,000 |

అనగా హిందువులలో మొత్తమున నూటికి ముగ్గురు (3. 49

మాత్రము విద్యనభ్యసించువారుగ నున్నారు. మఱియు నీవిద్యాప్రచారము బొంబాయిరాష్ట్రమున నూటికి 4. 9 వంగదేశమున నూటికి 4. 3 చెన్నరాజధానియందు నూటికి 4. 3 బర్మాలో నూటికి 4. 3 పంజాబున నూటికి 2. 7 సంయుక్త రాష్ట్రముల నూటికి 2. 3 మధ్యపరగణాలలో నూటికి 2. 5 బీహారు ఒరిస్సారాష్ట్రమున నూటికి 2. 4 పశ్చిమోత్తరపరగణాలలో నూటికి 2. 2 యీప్రకారములనున్నది.

(Figures taken from India in 1921—22)

మఱియు విద్యాప్రచారమునకై 1921 వ సం॥లో 16 కోట్ల 77 లక్షల రూపాయలు వ్యయమయ్యెను. ఇందుప్రభుత్వము వెచ్చించినభాగము 10 కోట్ల 6 లక్షలు తక్కిన 6 కోట్ల 71 లక్షలు ప్రజలే భరించినారు. అనగా మనిషి 1కి రమారమి 11 అణాలు మాత్రమే ప్రభుత్వము వెచ్చించియున్నది ఈవిషయమై తన పుస్తకమున (India in 1921-22) వ్రాయుచురష్ భ్రూకువిలియమ్సు హిందూదేశమందలి విద్యావ్యాపనము ఆంగ్లదేశములోని విద్యావ్యాపనముతో పోల్పవచ్చునని వ్రాసియున్నారు. హిందూదేశమునకును ఆంగ్లదేశమునకుగల పోలిక యెట్టిదో చూడవలసియున్నది.

| | |
|---|---|
| ఆంగ్లదేశమున ప్రాథమిక విద్యాలయముల చదువుకొనువారు | 125,00,000 |
| *ఆంగ్లదేశముయొక్క మొత్తప్రజనసంఖ్య | 4,55,00,0 0 |
| అనగా ఆంగ్లదేశమున మొత్తము జనసంఖ్యలో ప్రాథమికవిద్య నభ్యసించువారే | నూటికి 30 మంది |
| హిందూదేశమున ... అన్నివిద్యల నభ్యసించువారు | నూటికి 3. 42 |

హిందూదేశముకంటె ఆంగ్లదేశమున విద్యావ్యాపనము 9 రెట్ల

* ఆంగ్లదేశమన ఇంగ్లండు స్కాట్లండు అయిర్లండు యీమూడుదేశములలోని విద్యార్థులసంఖ్యయు జనసంఖ్యయు నివ్వబడినవి.

ధికముగనున్నది. హిందూదేశమునకును ఆంగ్లదేశమునకునుగల పోలిక యీవిషయమునని ట్లున్నది.

1918 19 వ సాలులో ఆంగ్లదేశప్రభుత్వము విద్యకొరకు
వెచ్చించినది. పౌ 53,102,000
రూ 79,65,30,000
... (జనసంఖ్య 455 లక్షలు కావున) సగటున
1 కి వ్యయము రూ 17½

(Figures taken from statesmans year Book)

1918-19 వ సాలులో ఇండియా ప్రభుత్వము విద్యనిమిత్తమై
వెచ్చించినది. రూ 7,19,26,292
(ఆంగ్లపాలితమగు హిందూదేశము జనసంఖ్య 2440 లక్షలు గావున)
ఇండియా ప్రభుత్వము సగటున మనిషి 1 కి వెచ్చించినది.
రూ 0-4-9

ఆంగ్లప్రభుత్వము మనిషి 1కి రూ 17-8-0 లను వెచ్చించియుండగా.
ఇండియాగవర్నమెంటు 0-4-9 మాత్రమే ఖర్చుపెట్టెను.
ఈరెండుదేశములకుగల పోలికలలో యిదియొకటి.

విద్యావ్యాపనమేగాక హిందూదేశమున నవలంబింపబడుచున్న విద్యావిధానముగూడ సంతృప్తికరముగలేదు.

## ఆరోగ్యశాఖ.

ఆరోగ్యము విషయమున హిందూదేశము కడువిషాదస్థితియందున్నది. నిరంతరక్షామములీదేశమును వేధించుచున్నవి. కలరా ప్లేగు మశూచి ఇన్ఫ్లూయంజా మొదలగు భీకరజాడ్యములు దేశమున తమ శాశ్వత నివాసస్థలములనేర్పరచుకొనియున్నవి. ఒకానొక ప్రచండవాయువు వీచినపుడు చెట్లయాకులురాలి క్రింద కెట్లు పడిపోవునో యట్లే యీఘోర జాడ్యములు చెలరేగు సమయమున నిస్సహాయులగు

శైశావస్థలు వేలకువేలు మరణించుచున్నారు. 1918 వ సం॥లో ఇన్ఫ్లూయంజా జ్వరమూలమున డెబ్బదిలక్షల జనులకుపైనమరణించినట్లు యెంచబడినది. (Indian year Books '62) ఈజాడ్యములవలననేమి క్షామముల వలననేమి యితరకారణముల వలననేమి దేశమందలి ఆరోగ్యము కొంచెమైనను తృప్తికరముగలేదు. హిందూదేశముయొక్కయు నితరదేశములయొక్కయు జననమరణములసంఖ్యను పరికించినచో నిది స్పష్టమగును.

19-2-1911 సం॥ల మధ్య.

| దేశము | 1000 మందిలో జననములు. | 100 మందిలో మరణములు. | పుట్టిన 1000 మంది పిల్లలలో 1 సం॥ము లోపున మరణించువారు |
|---|---|---|---|
| రషియా | 487 | 31.41 | ... |
| హిందూదేశము | 38 58 | 34.2 | 300 (సగటున) |
| జర్మనీ | 32.31 | 18.39 | 186.4 |
| జపాను | 32.89 | 20.86 | 159.8 |
| ఇంగ్లండు వేల్సు | 26.8 | 15.15 | 127.3 |
| న్యూజీలండు | 26.79 | 9.16 | 64.3 |
| ఆస్ట్రేలియా | 26.52 | 11.11 | 87.5 |
| స్కాట్లండు | 27.99 | 16.33 | 116.1 |

(Form K. T. Shaws Sixty years of I Finance P. 133.)

హిందూదేశమున జననములసంఖ్య యెక్కువగనున్నను మరణముల సంఖ్యామూలకి మొదటిస్థానము వహించియున్నది. మఱియు పసిపిల్లలమరణములు హిందూదేశములోవలె నెచ్చటను లేవు. జన్మించినవారిలో మూడవవంతు 1 సం॥ము లోపల మరణించుటకంటె విచారకరముగు సంగతి మఱియుండబోదు.

ప్రజలయారోగ్యస్థితియింత హీనముగనుండగ ప్రభుత్వము దీనిని మిగుల నలక్ష్యముతో చూచుచున్నది. ప్రభుత్వముచే స్థాపింపబడిన ఆసుపత్రులు 100 గ్రామములుగల తాలూకాయందొకటి రెండుకన్న మెక్కువయుండవు. ఇతరవిషయములకు కోట్లకొలది వెచ్చింపుచు ఆరోగ్యశాఖకు ఒక కోటిన్నర రూప్యములకంటె మెక్కువ వెచ్చించుటలేదు.

ఈవ్యయము 32 కోట్ల జనసంఖ్యగల భారతవర్షమున కెట్లు సరిపోగలదు? మఱియు నీవ్యయమైన నెక్కువగ ప్రభుత్వోద్యోగుల వేతనములక్రిందనే యగుచున్నదిగాని ప్రజలయారోగ్యాభివృద్ధికై కాదు. ఈశాఖకగు వ్యయము చాల తక్కువగనున్నను నందు నియమింపబడిన ఉన్నతోద్యోగస్థుల సంఖ్య (ఇండియను మెడికలు సర్వీసువారిసంఖ్య) స్వల్పముకాదు. ప్రస్తుతము 709 మంది ఇండియన్ మెడికలు సర్వీసు యుద్యోగులున్నట్లును అందు 504 గురు ఆంగ్లేయులును 155 గురు భారతీయులును నూతనముగ 30 ఆంగ్లేయ మెడికలు యుద్యోగులను నియమించుచున్నట్లును లెజిస్లేటివ్ ఎసెంబ్లీలో ది 18 జనవరి-1923 న ప్రకటింపబడినది. ఈయుద్యోగులు నెలకు రూ750లు మొదలు రూ2500ల వఱకును గ్రహింపుచుందురు. ప్రభుత్వముచేయు నీస్వల్పవ్యయమైనను ప్రజలకందుబాటులో లేకుండ నిట్లు ఇండియను మెడికలు యుద్యోగులకయి యధికముగ వెచ్చింపబడుట మఱింత శోచనీయము.

### మతవిషయకమగు వ్యయము.

ఆంగ్లేయప్రభుత్వము మతవిషయమున సమభావము కల్గియున్నదనియు నొక ప్రత్యేకమతము నెడల పక్షపాతము వహించియుండలేదనియు కొందరు చెప్పుచుందురు. వారివాక్యములెంతవరకు సత్యము కలదో కనుగొందము. ఇండియాప్రభుత్వము క్రైస్తవమతప్రచారమునకై ప్రతిసంవత్సరమును రమారమి 20 లక్షలరూప్యముల వెచ్చించు

చున్నది. (1914-15 లో రూ. 1,27,219 లు) కలకత్తాయందలి బిషపు నకు సం॥నకు రూ 45,977 లును బొంబాయి చెన్నపట్టణములలోని వారికి సం॥మున కొక్కొక్కనికి రూ 25,000 నిచ్చుచున్నది. ప్రజలెల్లరు చెల్లించెడి ద్రవ్యమును (కొంతభాగమును) ప్రత్యేకముగ నొక మతప్రచారమునకయి వినియోగించుట నాగరక ప్రభుత్వమునకు న్యాయము గాబోదును! 1911 వ సం॥లోని జనాభా లెక్కల ప్రకారము క్రైస్తవులసంఖ్య 24,92,284 దీనినిబట్టి ప్రస్తుత ప్రభుత్వము ప్రతిక్రైస్తవునకును మతసంఘమున సగటున రమారమి రు 0-13-0 లు వ్యయము చేయుచున్నట్లు కనబడుచున్నది. ప్రభుత్వము తననిష్పాక్షికబుద్ధిని సువ్యక్తముచేయవలెనన్న అన్యమతములకు విషయమున గూడ నిట్టివ్యయ మొనర్చవలెను. లేదా యీవ్యయమును మానవలెను



## 12 వ ప్రకరణము.

---

### సైనికవ్యయము.

ఇండియా గవర్నమెంటువారి ఆదాయవ్యయములను పరిశీలించిన వారికి సైన్యము నిమిత్తమై ద్రవ్య మెట్లుపరిమితముగ నెచ్చపడు చున్నదియు విస్పష్టముగ తెలియుచున్నది. ప్రజాహితకార్యములగు విద్యకొరకును నారోగ్యముకొరకును స్వల్పమొత్తములు వ్యయపర్చుచు ఆదాయమున రమారమి యొకసగము సైన్యమునిమిత్తమై ప్రభుత్వము వినియోగపరచుచున్నది.

| | | పౌనులు. | నూటికివ్యయము. |
|---|---|---|---|
| 1918.19 వ సం॥లో గవర్నమెంటువారి మొత్తపుటాదాయము. | 86,324,000 | | |
| | రూ. 129,4860,000 లు. | | |
| సైనికవ్యయము. | 44,480,000 | | 50 |
| | రూ. 66,72,00,000 లు. | | |
| విద్యకొఱకు. | 6,123,275 | | 7.1 |
| | రూ. 918,49,125 లు. | | |
| ఆరోగ్యశాఖకు (1919-20)లో | 1,338,100 (B. E.) | | 1.5 |
| | రూ. 2,00,71,500 లు. | | |

మఱియు సైనికవ్యయము తగ్గింపవలసినదని చిరకాలమునుండి ప్రజాప్రతినిధులును కొంతమంది ప్రభుత్వోద్యోగులును, 1885 వ సం॥ మునుండి కాంగ్రెసువారును నివేదించుచుండినప్పటికి, ప్రభుత్వమువారి మాటలను లక్ష్యపెట్టక తగ్గించుటకుమారు సైనికవ్యయము నంతకంతకు వృద్ధిచేయుచున్నది. 1899-1900 వ సం॥పు టాదాయవ్యయములను,

1918-19 వ సం॥పు టాదాయవ్యయములను పరికించినచో ఈసైనిక వ్యయాభివృద్ధి స్పష్టమగును.

| సం॥ము. | ఆదాయము. | సైనికవ్యయము. | ఆదాయమున సైనిక వ్యయమెన్ని శతాంశములు:- |
|---|---|---|---|
| 1899-1900 | రు. 59,65,05,000లు | రు. 230,640,000 | 38.63 |
| 1918-1919 | రు.129,48,60,000లు | రు. 63,72,00,000 లు. | 51.52 |
| ఈ 20సం॥లలో పెఱుగుదల | రు.69,83,55,000 | రు.43,6,560,00లు | 12.86 |
| నూటికి పెఱుగుదల | 117 | 190. | |

ఈరీతిని 20 సం॥ములలో ప్రభుత్వపు టాదాయము నూటికి 117 చొ॥ పెఱిగియుండ సైనికవ్యయము నూటికి 190 చొ॥ వృద్ధిబొంది యున్నది. మఱియు 1899-00 వ సం॥న సైనికవ్యయ మాదాయమున నూటికి 38. 63 చొ॥ ననుండ, 1918-19 వ సం॥న నయ్యది నూటికి 51.52 చొ॥న నున్నది. ప్రజల బాగోగుల లక్ష్యింపక ప్రభుత్వము సైన్యము నెట్లు పెంపు జేయుచున్నదియు నీ యంశములవలన విశదమగుచున్నది.

అన్యదేశములందలి ప్రభుత్వములు తమ యాదాయమున నెంత భాగము సైన్యముకొఱకు వెచ్చింపుచున్నదియు నీక్రింద పట్టీవలన గానవగును.

| దేశము. | ప్రభుత్వాదాయము | సైనికవ్యయము | ఆదాయమున సైనిక వ్యయము నూటికెంత? | సైన్యముయొక్క సంఖ్య. (రిజర్వుకాక) |
|---|---|---|---|---|
| ఇంగ్లాండు (1920-21) | పౌనులు 1,425 984,666 | పౌనులు 181,500,000 | 12.72 | 3,41,000 |
| సౌత్ ఆఫ్రికా యూనియన్. (1920-21) | పౌనులు 28,381,000 | పౌనులు 1,267,395 | 4.47 | ... ... ... |
| కనడా (1920-21) | వ్యయ మొత్తము 440,496,333 డాలరులు | 12,520,106 డాలరులు | 2.84 | 6,700 |
| అమెరికాయునైటెడ్ స్టేట్సు. (1919-20) | 22,993,910,599 డాలరులు | 1,094,834,202 డాలరులు | 4.76 | 2,13,067 |

| దేశము. | ప్రభుత్వాదాయము | సైనికవ్యయము | ఆదాయము న సైనికవ్యయము నూటి కెంత ? | సైనికవ్యయము సంఖ్య. (రిజెర్వ్యు కాక) |
|---|---|---|---|---|
| ఫ్రాంసు (1920) | 217702 లక్షల ఫ్రాంకులు | 42366 లక్షల ఫ్రాంకులు | 19.46 | 6,60,000 |
| జర్మని (1920-21) | 39,891,562,000 మార్కులు | 2,494,332,000 మార్కులు | 6.25 | ... ... ... |
| జపాను (1920-21) | 1,335,355,308 యెన్నులు | 155,942,414 యెన్నులు | 11.68 | 6,00,000 |
| హిందూదేశము (1919-20) | రూపాయలు 194,77,00,000 | రూపాయలు 88,18,00,000 | 45.52 | ... ... ... |

ప్రపంచములోని ప్రభుత్వములకెల్ల ఇండియా ప్రభుత్వమే తనకువచ్చు ఆదాయమున రమారమి యొకసగమును సైన్యముకై వెచ్చించుచున్నది. ఇంతధనమును వెచ్చించు దేశము మఱేదియు కానరాదు. నేడపరిమితమగు సైన్యబలమును గల్గియున్న ఫ్రాంసుదేశముసైతము ఆదాయముననైదవవంతుకంటె సైన్యముకై యెక్కువ వెచ్చించుటలేదు.

సైనికవ్యయముయొక్క సంగ్రహచరిత్రము.

సిపాయి విప్లవమునకు పూర్వము 1857 వ సంవత్సరమునకంపెనీవారి పాలనమున 38,000 బ్రిటిషుసైనికులును 2,21,000 మంది హైందవసైనికులును పని చేయుచుండిరి. ప్రతి బ్రిటిషుసైనికునకును 6 గురు హైందవులు పని చేయుచుండిరి భారతీయసైనికులసంఖ్య యపరిమితముగ నుండుట విప్లవకారణములలో ప్రాముఖ్యముగ నెంచి ఇండియా గవర్నమెంటు ఆంగ్లేయసైనికుల సంఖ్య హెచ్చించి హైందవ యుద్ధభటులసంఖ్య తగ్గింపమొదలిడిరి. అప్పటినుండియు భారతీయసైనికులసంఖ్య ఆంగ్లేయులసంఖ్యకు దాదాపు రెండింతలుగ నున్నది. విప్లవమునకు పూర్వాపరములనుండెడు సైనికులసంఖ్యయు వ్యయమును కీర్తిశేషుడైన గోఖ్లేమహాశయుడు వెల్బీకమీషనెదుట వివరించి యున్నాడు.

| సంవత్సరములు. | సైనికుల సంఖ్య. | | | సగటున సంవత్సరమునకు వ్యయము |
|---|---|---|---|---|
| | మొత్తముసంఖ్య | భారతీయులు | ఆంగ్లేయులు | |
| 1837-1856-7 (20 సం॥లువిప్లవమునకు పూ॥ | 2,26,741 | 2,22,915 | 43,826 | 10 కోట్ల 85 లక్షల రూపాయలు. |
| 1861-62 1873-74 (13 సం॥లు) విప్లవము తరువాత. | 1,86,340 | 1,23,881 | 62,458 | 15 కోట్ల 68 లక్షల రూపాయలు. |

... విప్లవమునకు పూర్వముకంటె పరముస సైనిక సంఖ్య యందు హెచ్చు లేకున్నను సం॥పు వ్యయము 5 కోట్లు. అనగా నూటికి 50 చొ॥ పెరిగినట్లు కనబడుచున్నది. ఇట్టి పెరుగుదలకు ఆంగ్లయుద్ధ కచేరి వారవలంబించిన 'సైన్యసమ్మేళనాపద్ధతి' (Amalgamation Scheme) ఎట్టుల కారణమైనదనియును ముందు వినపింపబడును. హిందూదేశపరిపాలన మాంగ్లదేశపు పార్లమెంటు యధీనమైనప్పటినుండియుగూడ నీసైనికవ్యయ మొకేరీతిని పెరిగిపోవుచున్నది. 1861-62 వ సం॥పు సైనికవ్యయము దాదాపు 13 కోట్ల రూపాయ లుండెను. 1871-2 వ సం॥నకు సుమారు 15 కోట్లును 1881-2 వ సం॥నాటికి 17 కోట్లును నయ్యెను. శాంతిసమయములనే సైనికవ్యయ మధికమగుచుండ యుద్ధకాలములలో ఖర్చుచేయబడు ద్రవ్యము మరెంత మిక్కుటముగ నుండునుకదా! 1880-1 వ సం॥లో ఆఫ్ఘను యుద్ధకారణమున సైన్యముకొరకు సుమారు 28 కోట్ల రూప్యములు వ్యయమయ్యెను. 1885-86 వ సం॥న బర్మాయుద్ధమువలన సైనికవ్యయము గతవత్సరముకంటె (1884-5 లో కోట్లుమాత్రము) 3 కోట్ల రూప్యములు వృద్ధియయ్యెను. (20.06 కోట్లు) 1885-6 వ సం॥నుండియు పరిపాలనమున నూతన పరిపాలనాసూత్రము లవలంబితమయ్యెను. పరిపాలకులకు సామ్రాజ్యసంపాదనా వాంఛ వృద్ధియయ్యెను. పశ్చిమోత్తరదేశముల జయించి వానిని బ్రిటిషురాజ్యమున సంక్రమింప నిచ్చపొడమెను. సైనికవ్యయము నధికముకాజొచ్చెను. నాటినుండియు సైనికసంఖ్య హెచ్చకపోయినను సైనికవ్యయమెట్లు వృద్ధియైనదియు నీక్రింది యంకెలవలన గానవగును.

| | | | |
|---|---|---|---|
| 1885-86 | రూపాయలు. | 20.06 | కోట్లు. |
| 1890-91 | | 21.09 | |
| 1895-96 | | 25.39 | |

| | |
|---|---|
| 1900-01 | 23.02 |
| 1905-06 | 29.50 |
| 1910-11 | 31.90 |
| 1915-16 | 33.39 |
| 1916-17 | 36.39 |
| 1917-18 | 40-18 |
| 1918-19 | 67 73 |
| 1919-20 | 85.61 |
| 1921-22 | 62.20 |

1919 వ సం॥న జరిగిన ఆఫ్ఘను యుద్ధకారణమున నేమి 1920, '21,22 సం॥ము లందలి వజీరుస్తాను ఆక్రమణామువలననేమి ఆగ్లప్రభుత్వమునకు సైన్యముపైగల యధికాభిమానమునలననేమి గత 4 సం॥ల నుండియు సైనికవ్యయ మపారముగనున్నది. గతించిన 60 సం॥లలో సైనికవ్యయము దాదాపు 5 రెట్లు వృద్ధియైనది. దేశాభివృద్ధికి భంగకరముగ సైన్యముపై నిట్లధికముగ నిండియా ప్రభుత్వము ధనమును వ్యయపఱచుచుండ హిందూదేశమెట్లు బాగుపడగలదు? ఆత్మరక్షణము నకుగాని దేశరక్షణమునకుగాని (1879 వ సం॥లోని ఆయుధశాసనము వలన) ఆయుధమును బట్టుటకు వీలులేక భారతీయులు నానాటికి తమ శౌర్యసాహసముల గోల్పోయి నిస్తేజులగుచున్నారు. మఱి దేశరక్షణమునకు వెచ్చింపబడెడు నధిక ద్రవ్యభారమును వహించుచున్నదియువారే! ఇట్లిరువంకలను దేశానర్థకరమగు నాయుధశాసనమును తొలగించిన చో భారతీయు లుత్తేజులగుటయేకాక తమ స్వదేశ సంరక్షణమున కుద్యుక్తులై సైనిక వ్యయభారమునుండి విముక్తులు కాగలరు.

సైనికవ్యయమి ట్లపరిమితముగ వృద్ధియగుటకు ముఖ్యకారణములు మూడు.

1. సైన్య సమ్మేళనాపద్ధతి.
2. సరిహద్దులందలి దేశములను బ్రిటిషు రాజ్యభాగముగ చేయ నెంచుట.
3. బ్రిటిషు సామ్రాజ్యవిస్తరణముకొరకై హైందవ సేనల నన్య దేశములకు పంపుట.

సైన్యసమ్మేళనాపద్ధతి—ఈస్టిండియా కంపెనీ పరిపాలనమున కూడ సైన్యములో బ్రిటిషు సేనాదళములును హైందవ సేనాదళము లునుండెను. నాడు బ్రిటిషుయుద్ధభటులను కంపెనీ యిచ్చటనే పోషిగు చేయుచుండెను. హిందూదేశమందలి బ్రిటిషుసేనలకును ఆంగ్లదేశపు యుద్ధకచేరివారికి నెట్టిసంబంధము లేకుండెను. కాని ఇండియాగవర్న మెంటు పార్లమెంటు వశమైనపిమ్మట సైన్యసమ్మేళనాపద్ధతియను నూత నవిధానము నవలంబించి హిందూదేశమందలి బ్రిటిషుసేనలు ఆంగ్ల యుద్ధకచేరివారిచే పాలితమగునట్లును సామ్రాజ్యసైనిక నికాయమున నొక భాగముండునట్లును నొనర్చిరి. ఆంగ్లదేశమందలి సేనలలో నెట్టి మార్పులుగల్గునో యిచటి బ్రిటిషుసేనలందును నట్టిమార్పులే జరుగు చుండును. అచటి సైనికుని జీతమువృద్ధియైనచో యిక్కడి సైనికుని జీతమును (అవసరానవసరముల గుర్తింపక) హెచ్చింపవలెను. మఱియు ఇంగ్లాండున నవలంబింపబడిన 'స్వల్పకాల సేనాపద్ధతి' (short service system) హిందూదేశమునగూడ బ్రిటిషు సైన్యములవిషయమున నవ లంబితమయ్యెను. ఈపద్ధతి ననుసరించి యిక్కడకువచ్చిన ప్రతిబ్రిటిషు సైనికుడును 5 సం॥ ముల కాలముమాత్రమే పనిచేయుచున్నాడు. ఈ కాలములోనతడు యుద్ధమునకు కావలసిన తరిఫీతునొంది పిమ్మట పిన్షను పుచ్చుకొని ఇంగ్లాండునకు మరలిపోవుచున్నాడు. ఒకసారి యాంగ్లదేశ మునకు వెడలినపిమ్మట అతనికి హిందూదేశముతో సంబంధము పోవు చున్నది. ఆతడు తరిఫీదునొందినది హిందూదేశపు ద్రవ్యముపైనైనను

ఇంగ్లాండునుండికూడ హిందూదేశపుద్రవ్యమును పిన్నగ గ్రహింపుచుండియు నతడవసర సమయముల నింగ్లాండునకు సహాయముచేయుచున్నాడ గాని యెకప్పుడును హిందూదేశ రక్షణమునకు తోడ్పడుట లేదు. మఱియు నాంగ్ల సైనికుల నిక్కడకు గొనివచ్చుటకును 5 సం॥లలో నే తిరిగి గొనిపోవుటకు నయ్యెడి రాకపోకఖర్చులు నధికముగనున్నవి. 5 సం॥ల కాలమున దళములు మారుచుండుటవలన బహుళసంఖ్యాకులగు నాంగ్లేయులు హిందూదేశపు ఖర్చులపై తరిఫీదునొందుట కవకాశ ముగల్గుచున్నది. వ్యయ మాహిందూదేశము భరించుచున్నది. లాభము పొందునది ఆంగ్లేయులు ప్రపంచములోని దేశములకెల్ల హిందూదేశమే తన ఆదాయమున నధికధనమును సైన్యముపై వెచ్చింపుచున్నను అవసరసమయముల నుపయోగపడునట్లు నిలువయుంచబడిన సైన్యసంచయము (రిజెర్వు) చాల స్వల్పముగ గనబడుచున్నది.

మఱియు సైన్యసమ్మేళనాపద్ధతి యవలంబింపబడినప్పటినుండియు బ్రిటిషుసైనికుల నాంగ్లదేశముననే పోగుచేసి యుద్ధకచ్చేరివారు హిందూదేశమున కంపుచున్నారు. ఇట్టి విధానమువలన హిందూదేశ మీాక్రిందిఖర్చులక్రింద యపరిమితముగ ధనవ్యయమును భరింపవలసి వచ్చుచున్నది. (1) కాపిటేషను భత్యము నేడుసైనికునకు పౌ 11-8-0 చొ॥ వసూలుచేయబడుచున్నది. (2) డిపోఖర్చులు. (3) సైనికుల రాకపోకఖర్చులు. (4) గిడ్డంగిఖర్చులు. (5) ఉద్యోగస్తులయొక్కయు సైనికులయొక్కయు జీతములును ఉపకారవేతనములును (6) సగముజీతములపై సెలవుతీసికొని వచ్చినవారికగు వ్యయము. (7) మందుగుండుసామానులు శతఘ్నులు వగైరాలకగు ఖర్చులు (8) ఇతరఖర్చులు; వీనిక్రింద ప్రతియేడును దాదాపు 10 కోట్లరూపాయలను హిందూదేశ మాంగ్లయుద్ధకచ్చేరివారికి చెల్లించుచున్నది. దేశానర్థకరమగు నిట్టి వ్యయమును తగ్గింపు

మని ఇండియా గవర్నమెంటువారు పార్లమెంటును ప్రార్థించినను అ
య్యది పెడచెవిని బెట్టుచున్నది.

ధనవంతమైన ఆంగ్లదేశము సేనాపరిపాలనములో గలిగించుమా
ర్పులను దారిద్ర్యవంతమైన హిందూదేశము అనుకరించుటవలన గల్గెడు
యనర్థకములగూర్చి హెన్రీఫాసెట్టు 1871-72. వ. సం॥ లో నిట్లు
తెల్పియున్నాడు.

"ఈస్టిండియా వర్తకసంఘము ముగింపబడిన కొలది సంవత్సర
ములలోనే సైనికమిశ్రమపద్ధతి (amalgamation scheme) అనుభవసి
యులగు సుప్రసిద్ధహైందవ రాజ్యతంత్రజ్ఞుల సలహాకు వ్యతిరేకముగా
అమలులోకి కొనితేబడినది. ఐశ్వర్యవంతమగు నింగ్లాండుదేశమున కుప
చరించు సైనికనిర్మాణ పద్ధతులు దరిద్రముతో తాండవమాడుచున్న
యిండియాదేశముయొక్క స్థితిగతుల నాలోచించిచూచిన ఆచరణమున
కు కొనిరాదగుస్థితియందు లేకున్నను బలవంతముగా వ్యయాధికమగు
మనఆంగ్లేయసైనిక పద్ధతులనే కట్టబెట్టుచున్నాము. అతిభాగ్యవంత
మగు నింగ్లాండుదేశమునకును అతిబీదదేశమగు నిండియాకును కూడిక
తటస్థించినది. భాగస్వాము లిరువురును సమానహోదాయందున లేని
వారగుటచే సం॥ నకు 20 వేలపౌనులు రాబడిగల ఆసామియు సాలు
నకు వెయ్యిపౌనులు మాత్రమే ఆదాయమునచ్చెడి ఆసామియును కలి
సి సమముగ గృహకృత్యమును నిర్వహించుటవలన ఎట్టిచిక్కులు తట
స్థించుచుండునో అట్టి అసంగతమే ఇండియాకు మిశ్రమపద్ధతి నవలంబిం
చుటవలన యలవడెను. ఇరువదివేల పౌనులురాబడిగలవానికి యుచిత
మైనఖర్చు సాలుకు వెయ్యిపౌనులు రాబడిగలవానికి కష్టతరమైన అప్పు
లపాలు చేయునుగాని వేఱొండుగాదు. చేయబడుచున్నఖర్చంతయు
యుచితమైనదనియే యనుకొందము. అయినను తక్కువరాబడి వచ్చు
చున్నవానికి తన తలకుమిగిలిన వ్యయముచేయుటవలన ఋణగ్రస్తుడై

బాధపడుచుండ నీకుమతి యేయన్యాయము చేయబడుటలేదనియును నీవంతుఖర్చే నిన్ను కోరుచుంటిమనియును చెప్పిననేమిలాభము? వాని దుఃఖ ముపశమించునా! హిందూదేశమువలెనే బలవంతముగా భాగస్వామినిజేసి చేయువ్యాపారమునం దిష్టమున్నను లేకపోయినను వదలి పెట్టకుండ యుండవలసివచ్చుచో వానిగతి చెప్పతరముకాదు. (వేపా సత్యనారాయణగారి 'హిందూదేశ అర్థశాస్త్రము'ను గ్రంథము పే. జీ 300).

ఇట్టి పద్ధతిమూలముననే ఆంగ్లదేశములోని యుద్ధభటుని జీతము రోజుకు 2 పెన్నుల చొ॥న వృద్ధియగునట్టి యేర్పాటులు 1902 వ. సం॥ లో కావింపబడినప్పుడు హిందూదేశములోని బ్రిటిషుయుద్ధభటుని జీతముకూడ అట్టి యభివృద్ధినేపొందెను. ఈవిధానముననే తిరిగి 1904 వ. సం॥ లో బ్రిటిషుయుద్ధభటుని జీతము రోజుకు 4 పెన్నులచొప్పున వృద్ధియగునట్లేర్పాటుచేయబడెను. 1916-17 వ. సం॥ లో చేయబడిన యభివృద్ధియు నీవిధానము ననుసరించియే యున్నవి. హిందూదేశము నకవసరమున్నను లేకపోయినను ధనమున్నను లేకపోయినను ధనవంతమగు నాంగ్లదేశముతో సమ్మేళనము కాంచియుండుటవలన నమితవ్యయమును భరించి నష్టపడవలసి వచ్చుచున్నది.

మరియు నిసందర్భమున ఇండియాగవర్నమెంటువారి కొలువుననున్న బ్రిటిషుసైనికునకును హైందవసైనికునకును నయ్యెడి వ్యయములలో భేదము గాననగును. సైనికవ్యయచరిత్ర పఠించినవారికి బ్రిటిషు సైనికుని జీతభత్యములు హైందవసైనికునికంటె మెట్లధికముగ వృద్ధియైనదియు గోచరించగలదు. 19 వ. శతాబ్దములో కెల్నరను దొర (Kelner)మొగ్గురాంగ్లేయుల కగు వ్యయము 7 గురు. హైందవులకగు దానితో సమానమని నిరూపించియున్నాడు. 1909-10 వ. సం॥ పు వ్యయమునుబట్టి ఆసంవత్సరము ప్రతిబ్రిటిషు యుద్ధభటునకును

రూ 1142 లును హైందవ సిపాయికి రూ 392 లును (అనగా ఒకఆంగ్లే యునికగు వ్యయము ముగ్గురు హైందవుల వ్యయమునకు సరిపోవునట్లు) ఖర్చుచేయబడినట్లు డిన్షా వాచాగారు తెల్పియున్నారు. నేడాంగ్లయుద్ధ భటునికయ్యెడి వ్యయము (1920 వ. స॥ములో) మిగులనధికమైనది. హైందవయుద్ధభటునకొకనికి నేడు రూ 500 లు ఖర్చగుచుండ బ్రిటిషు వానికి రూ 2110 లు ఖర్చగుచున్నవి. ప్రతిబ్రిటిషువానికిని హైందవుని కంటె 4 రెట్లధికముగ వ్యయమొనర్పబడుచున్నది. మఱియు బ్రిటిషు దళములకును హైందవదళములకును నయ్యెడి వ్యయములను వింటర్టను పార్లమెంటులో తెల్పియున్నాడు.

| | |
|---|---|
| బ్రిటిషుదళమునకు | పౌ 196,000 లు |
| హైందవదళమునకు | పౌ 44.000. |
| ఘూర్ఖాదళమునకు | 49,000. (Daily Express. 20-3-23) |

అనగా ఒక హైందవదళముకంటె బ్రిటిషుదళమునకు $4\frac{1}{2}$ రెట్ల ఖర్చగుచున్నది. ఇట్లాంగ్లదళముల పోషణనిమిత్తమై హిందూదేశపు ద్రవ్యమధికముగను అనవసరముగను వ్యయముచేయబడుట (తమదేశజులయెడ పక్షపాతమును సహించు) ఆంగ్లపాలకుల రాజనీతిని వ్యక్తము చేయుచున్నది.

2. సరిహద్దుదేశముల ఆక్రమణము :—

సైనికవ్యయము వృద్ధియగుటకు ఆంగ్లేయప్రభువులు సరిహద్దు దేశములపై సల్పినదాడులును యుద్ధములును ముఖ్యకారణముగ నెంచవలసియున్నది. అందు పశ్చిమోత్తరమున ఆఫ్ఘనిస్థానముతోడను యితర పార్వతీయులతోడను జరిగిన పోరాటములు లెక్కకు మిక్కుటమై యున్నవి. ఈస్టిండియాకంపెనీ పాలనమున ఆక్లాండు (గవర్నరు జనరలు) కాలమున మొదటి ఆఫ్ఘను యుద్ధముజరిగెను. 1897 వ సం॥న మరల ఆఫ్ఘనుదేశముతో యుద్ధమయ్యెను. 1885 వఱకును హిందూదేశ

ముగ పాలించినరాజ ప్రతినిధులను సరిహద్దుదేశముల నాక్రమింప నుద్దేశములేకుండెను. కాని 1885 వ సం॥న ఇండియా కార్యదర్శిగా నుండిన 'చర్చిలు' (Churchall) సరిహద్దు దేశముల నాక్రమించుకొనువిషయమున 'ముందంజ వేయవలెనను పద్ధతి' (Forward policy) ఏర్పఱచి హిందూదేశపు పశ్చిమోత్తర సరిహద్దులు 'శాస్త్రీయముగ' (Scientific Frontier.) నుండుటకై సింధు నదీతీరమునుండి వెనుకకు గెంటివేయవలెననెడి సూత్రము నమలులో బెట్టినప్పటినుండియు సైనికవ్యయము మఱింతవృద్ధికాజొచ్చినది. ఆ సం॥ననే రషియాదేశము హిందూదేశముపై దాడివెడలునను నెపమున 30 వేల సైనికుల నధికముగజేర్చి సైనికవ్యయమును 3 కోట్లు హెచ్చించిరి. అప్పటినుండియు నేటిదనుక యొకపర్యాయమైనను రషియనులు దండెత్తలేదుగాని సరిహద్దులలోమాత్రము అనేకయుద్ధములుజరిగెను. గిల్జిటు, హుంజా, నాగ్యారు లాక్రమింపబడెను. తరువాత చిత్రాలుదాడి జరిగెను. 1897 వ సం॥న 'తిరుహత్'పై దాడివెడలిరి. 1901 వ సం॥న పశ్చిమోత్తర ప్రదేశముల నాక్రమించి కర్జనుప్రభువు 'పశ్చిమోత్తరపరగాణాల'ను పేరనొక నూతనరాష్ట్రమును కల్పించెను. 1904 వ సం॥న టిబెటు దాడిజరిగెను. 1919 వ సం॥న తిరిగి ఆఫ్ఘనుయుద్ధముతటస్థించెను. 1921 వ సం॥మునుండియు వజీరుస్తాను ఆక్రమణము జరుగుచున్నది. పశ్చిమోత్తరమునగాక తూర్పుదెసనుగూడ బర్మాపై కంపెనీకాలమున నొకదాడియు పిమ్మట 1885 వ సం॥న మఱొకటియు జరిగెను. ఈదాడయాత్రలలో నింగ్లీషువారి బర్మానుజయించి స్వాధీనపఱచికొనిరి :—

హిందూదేశమున కీదాడులతోగాని యుద్ధములతోగాని నెట్టి సంబంధముగాని యుపయోగముగాని లేకపోయినను ఆంగ్లదేశమే తన సామ్రాజ్యాభివృద్ధికై యీయుద్ధముల కుద్యమించినను వ్యయము మాత్రము హిందూదేశము భరించినది. ఈయుద్ధములు సామ్రాజ్య

మునకు చెందినటు 1885 వ సం॥న గ్లాడ్స్టను అంగీకరించెను. మఱియు 1895 వ సం॥న "కొండజాతులు మనలనే సార్వభౌములుగ పరిగణించి మనయధికారముపైన నాధారపడియుండవలెన"ని బాల్ఫరు నుడివియు న్నాడు. ఇట్లు సమర్థులగు ఆంగ్లప్రధానమంత్రులీయుద్ధములు సామ్రాజ్యవిస్తరణముకొరకు జరుపబడినవని యంగీకరించినప్పటికిని వ్యయభారము నధికముగ భారతవర్షమే వహించినట్లు తేలుచున్నది.

1879 వ సం॥న 2 వ ఆఫ్గను యుద్ధమునకు పౌ 21,000,000లు (21 కోట్లరూపాయలు) వ్యయమయ్యెను. అందు పౌ 5,000,000, లు మాత్రము (5 కోట్లరూపాయలు) ఇంగ్లాండుభరించెను. మిగిలిన పౌ 16,000,000 లను (16 కోట్లురూపాయలు) చెల్లించినదిహిందూదేశమే. ఆంగ్లదేశము న్యాయముగ తానుభరింపవలసిన దానిలోకొంత పాలైనను గ్రహించియున్నది యీయొక్కయవసరముననే. ఇతర దాడులందలివ్యయమంతయుగూడ హైందవుల మస్తకముపైననేబడెను. 1882 మొదలు 1891 వరకునుగల 10 సం॥లలో పశ్చిమోత్తర సరిహద్దులందలి దాడులకు మిత్తమై రూ 12,85,74,590 లు ఖర్చయ్యెను. గత 2 సం॥లలో జరిగిన వజీరుస్తాను ఆక్రమణమునకై 1920-21 లో రూ 14,4010,480లును 1921-22లో రూ6,92,97,139 లునువ్యయమయ్యెను ఆఫ్గను యుద్ధమునకై 1919 వ సం॥న జరిగిన నపరిమితవ్యయముకాక 1920-21 1921-22 యీసం॥లలోదాదాపు 15½కోట్లు వ్యయమయ్యెను ఈయంకెలనుబట్టి భారతదేశపు వాయవ్యసీమయందు ఆంగ్లప్రభుత్వము భారత ద్రవ్యమునెంత నిర్లక్ష్యముగ పారబోయుచున్నదియు గ్రహింపనగును. ఇట్టి యపరిమితసైనికవ్యయమునకుతోడు సైనికోపయోగమునకై వాయవ్యసీమయందు ప్రభుత్వము నిర్మించిన 'స్ట్రాటిజిను' రైల్వేలకైనఖర్చును (Strategic Railways) వానివలన దేశమునకు గల్గిన ఆర్థికనష్టమును పరికించినచో ఆంగ్లసామ్రాజ్య విస్తరణమునకై

దారిద్ర్యవంతమగు భారతదేశమెట్టి దుర్భరమగు భారమును మోయుచు క్రమముగ కృంగిపోవుచున్నదని విదితమగును.

సరిహద్దుదేశముల జయించుటకేకాక జయించినపిమ్మట వాని పరిపాలనమునకగు వ్యయములోగూడ హిందూదేశము పాల్గొనియున్నది. ఉత్తరబర్మాదేశమును (1885) ఆక్రమించిన 10 సం॥లలో నాదేశపరిపాలనమునకు వ్యయమున రూ 14,57,95,210 లను హిందూదేశము భరించియున్నది. ఇల్లేపశ్చిమోత్తర పరగణాలు పరిపాలనమున 1901 మొదలు 1915 వఱకునుగల 15 సం॥లలో 5 కోట్ల 34 లక్షల రూప్యముల వ్యయమును హిందూదేశము వహించియుండెను. ముందు వెనుక లాలోచింపక ఆంగ్లప్రభువులు తమసామ్రాజ్యమును విస్తరింపజేయుటవలన హిందూదేశము తనకొకించుకయు సంబంధములేనట్టియు ప్రయోజన రహితమైనట్టియు వ్యయమున పాల్గొనవలసి వచ్చుచున్నది.

3. సామ్రాజ్య సంరక్షణముకొరకై హైందవ సేనల నన్యదేశములకంపుట:—సంపూర్ణ భారతవర్షము హైందవ సేనల సహాయమునను హిందూదేశముయొక్క ధనముతోడను జయింపబడెను. భారతవర్షమున పొడసూపిన విప్లవములును స్వాతంత్ర్య ప్రయత్నములునుగూడ హైందవద్రవ్యముతోడను హైందవ బలముతోడను నణగగొట్టబడెను. భారతవర్షమున నాంగ్లపరిపాలనమును సంరక్షించుటకేమి సరిహద్దుల కాపాడుటకేమి సమీపదేశములజయించి ఆంగ్లసామ్రాజ్య భాగములుగ జేయుటకేమి హైందవధనమును హైందవసైన్య నికాయమును నుపయోగింపబడెను. ఇక హిందూదేశముతో నెట్టిసంబంధముకాని లేనట్టియు సముద్రముల కవ్వలఖండాంతరముల నున్నట్టియు దేశముల నాంగ్లసామ్రాజ్యమును నెలకొల్పుటకును స్థిరపరచుటకును రక్షించుటకును హైందవసేనలు హైందవద్రవ్య సహాయమున ననేకమారులు పంపబడెను. ఈస్టిండియాకంపెనీ హైందవసేనలనంపి ఘెంచివారి

యొద్దనుండి మార్షియనును, డచ్చివారినుండి సింహళము నితరద్వీపములును, జావాను, సింగపూరు రేవుస్థలములను జయించెను. వీరికాలముననే (1840. లో) చీనాదేశముపైగూడ నొకదాడి జరిగియుండెను. మఱియు కంపెనీపరిపాలనా ప్రారంభమున ఆంగ్లేయులు పరాసులపైనను డచ్చివారిపైన్ను చేసినయుద్ధముల వ్యయమును హిందూదేశము భరించెనని చెప్పవలసియున్నది.

ప్రభుత్వము పార్లమెంటు వశమైనపిమ్మటగూడ విదేశములకు భారతదేశ సైన్యములంపుట మానలేదు. ఈయుద్ధములలో హిందూదేశ మెట్టిభారమునువహించినదియు నీక్రింది పట్టికవలన తెలియగలదు.

| యుద్ధములు. | సాధారణ వ్యయము. హిందూదేశము భరించినది. | సాధారణ వ్యయము. ఇంగ్లాండు భరించినది. | విశేషపుఖర్చు. హిందూదేశము భరించినది. | విశేషపుఖర్చు. ఇంగ్లాండు భరించినది. |
|---|---|---|---|---|
| మొదటిఆఫ్ఘను యుద్ధము (1838—42) | అంతయు | ౦ | అంతయు | ౦ |
| మొదటిచీనా యుద్ధము 1839—40 | అంతయు | ౦ | ౦ | అంతయు |
| పెర్షియా యుద్ధము 1856 | అంతయు | ౦ | సగము. | సగము. |
| అబిసీనియా యుద్ధము 1867—68 | అంతయు | ౦ | ౦ | అంతయు |

| | | | | |
|---|---|---|---|---|
| పీరాకుదాడి 1875 | అంతయు | ౦ | ౦ | అంతయు |
| రెండవ ఆఫ్ఘను యుద్ధము 1875—80 | అంతయు | ౦ | పౌ. 5,000,000 అనగా 5 కోట్ల రూ॥ తక్క మిగిలినది. | 5000000 పౌ. లేక 5 కోట్ల రూపా॥ |
| ఈజిప్టుయుద్ధము 1882 | అంతయు | ౦ | 50 లక్షలరూపాయలుతక్క మిగిలినది. | రూ॥ 5000000 |
| సూడానుయుద్ధము. 1885-86 | అంతయు | ౦ | ౦ | అంతయు |

(Report of the Royal Commission on Indian. Expenditure quoted by R. C. Dutt and L. L. Lajpat Rai.)

ఇవికాక 1899 సం॥ న బోయరు లాంగ్లేయులపై తిరుగబడి నప్పుడు హైందవసైన్యములు ట్రాన్సువాలు దేశమున కంపబడి ఆంగ్లేయుల కెంతయు సహాయ మొనర్చెను. కాని విచిత్రమేమన తిరుగబడిన బోయరులకు ఆంగ్లేయులు స్వాతంత్ర్య మొసగిరి. రాజభక్తి కిదియా ఫలితమనునట్లు చిరకాలమునుండియు తమ సామ్రాజ్యమునకు సహాయపడుచువచ్చిన హైందవులు నేటికిని దాసత్వమునుండి విముక్తిని బొందజాలకున్నారు.

1904-వ సం॥ న కర్జనుప్రభువు "టిబెతు" దేశముపై నొక సైన్యమును బంపెను. ఈదాడికైన వ్యయమును హిందూదేశము వహించెను. ఐరోపా మహాసంగ్రామమున హిందూదేశపు ద్రవ్యము హిందూదేశపు సేనలును ఆంగ్లసామ్రాజ్య సంరక్షణముకొరకు ఎట్లు వినియోగింపబడినవి. పాఠకమహాశయులకు తెలిసి యుండవచ్చును. యుద్ధము ప్రారంభమయిన కొలది దినములలోనే ఫ్రాంన్సు దేశమునకు

లక్షల రూ.




సంవత్సరములు.

సైనిక వ్యయాభివృద్ధి.

పంపబడిన భారతదేశ సైన్యములు మహాతరంగములవలని ప్రచండచల నముతోగూడి నేతెంచెడు సముద్రమును బోలిన జర్మనువాహిని నరిక ట్టగల్గెను. గల్లీపోలీయుద్ధమున హైందవసేన లుపయోగింపబడెను. మెసొపొటమియా దేశము హిందూదేశపు సైన్యములతోడనే జయిం పబడెను. ఈజిప్టువాసుల స్వాతంత్ర్యప్రయత్నములను భగ్నమొన ర్చుటకుగూడ భారతదేశ సైన్యములే పంపబడెను. ఇట్లు ఫ్రాంసు, తూర్పుఆఫ్రికా, మెసొపొటమియా, ఈజిప్టు, గల్లిపొలి, సెలోనికా, పర్షి యన్‌గల్ఫు మొదలగు ప్రదేశములకు సంధిజరుగు పర్యంతము భారత దేశమునుండి పంపబడిన యుద్ధభటులసంఖ్య 1215,338 ఈ 12 లక్షల జనులలోను హతులై తమప్రాణముల నాంగ్లసామ్రాజ్య సంరక్షణమున కర్పించిన వారు రమారమి 1,15,000 మంది యుందురు. యుద్ధమునకు పూర్వము 'ప్రాథమికవిద్యను నిర్బంధముచేయుటకై 5 కోట్ల రూపాయ లను నధికముగ వెచ్చింపవలసినదని శాసనసభ్యులు కోరినప్పుడు ప్రభుత్వము నిరాకరించెను. కాని హిందూదేశాభివృద్ధి కెంతమాత్రము తోడ్పడని మహాసంగ్రామమునకై 145,000,000 పౌనులను (217½ కోట్ల రూపాయలను) 'బహుమాన పూర్వకముగ నాంగ్లదేశమునకు సమర్పించుటకు ప్రభుత్వమునకు వీలయ్యెను, మఱియు నీ 'బహుమా నము సమర్పించుటకు, ప్రభుత్వము ధనమునప్పుగొని ఇండియాఋణము నధికముగ పెంచివేసెను. 6 కోట్ల భారతీయులు, తమకు వలయు నాహా రము లేకక్షుద్బాధ పీడితులై కృశించిపోవుచుండ, దేశమునకెట్టి సంబం ధములేని యూరోపుమహాసంగ్రామ నిమిత్తమున 200 కోట్ల రూపాయలను పైగ భారతదేశపైన్యము పరదేశమునకు చెల్లింపబడుటకంటె శోచ నీయమగు సంగతికలదా! ఇది యాబహుమానము! మఱియు భార తీయు లిదివఱకు చెల్లించుదానితో యీకార్య మంతముందుటలేదు.

ఇకముందు ప్రతియేటనుగూడ నప్పుదెచ్చిన సీమహాధనముపై వడ్డీని చెల్లింపవలసియున్నది.

సైనిక వ్యయచరిత్రమును ముగించుటకు పూర్వమొక విచారకరమగు సంగతిని తెలుపగోరుచున్నాము. భారతీయులు స్వదేశమున నేహ్యమగు పారతంత్ర్యము ననుభవించుటయేకాక, యితరదేశముల గూడ, నట్టిపారతంత్ర్యమునే నెలకొల్పుటయందు వారుగూడ పాల్గొనియుంట, చాలదుఃఖకరము. తమదేశము నన్యులంచు సేనము చేయుటను భారతీయులే కారకులు. ప్రాచ్యఖండముల స్వాతంత్ర్యము ననుభవించు ననేకదేశముల పరరాజ్యస్థాపనము చేయుటకును భారతీయులే చాల సాధన భూతులైయున్నారు. భారతీయుల కింతకంటె తలవంపు కార్యమేదికావలెను? ఈజిప్టుదేశము 'సంరక్షణదేశము' (Protectorate) క్రిందమార్పబడి పరులచే నాక్రమింపబడినపుడు ఈజిప్టువాసులొనరించిన స్వాతంత్ర్య ప్రయత్నముల నణచుటలో, భారతీయసైన్యములు సేవ చేయూతనొసగియున్నవి. ఆక్రమణము నొనరించియున్న సైన్యములో (Army of occupation) 1920 వ సం॥న 20,463 హైందవ సిపాయిలున్నట్లు తెలియుచున్నది. (Statesman's year book) మరియు ఆంగ్లేయులు మెసొపొటేమియా దేశమును జయించిరనియు హైందవ సేనలసహాయముననే. ఇంతియకాక 1920 వ సం॥లోని వేసంగిలో (జూనుమాసములో) మెసొపొటేమియాలోని అరబ్బులు, స్వాతంత్ర్యము సంపాదింపయత్నించి, తిరుగబడిరి. వెంటనే హిందూదేశమునుండి రెండు హైందవసేనలు మెసొపొటేమియాకు పంపబడెను. 1920 వ సం॥ము ఆఖరునకు మెసొపొటేమియాలో 1,30,000 హైందవసైనికులుండిరి. (Statesman's year Book 1921.) అరబ్బుల విప్లవములణచివేయబడెను. మెసొపొటేమియా దేశమునకు పారతంత్ర్యము స్థిరమయ్యెను.

హిందూదేశమున నారోగ్యాభివృద్ధికై ధనము వెచ్చించవలె నన్న ప్రభుత్వమునకు ధనలోపమగుపించును. విద్యాభివృద్ధికి ధనలోపము గనుపించును. పరిశ్రమాభివృద్ధికై ధనములోపము గనుపించును. కాని యీసైన్య మహాభూతముయొక్క కుక్షిని నింపుటకు ప్రభువులకు ధనలోపమగుపడుట లేదు. ఒకవేళ యగపడిననో అద్దానిని కూడబెట్టుటకై, క్రొత్తపన్నుల విధించుట కున్నవిగదా భారతీయుల మస్తకములు. భారతీయుల కార్థిక స్వాతంత్ర్యము లభింపనంతవఱకు, తమ సైన్యముల విదేశములకంపుట మానిపించి నధికారము వారికిగల్గువఱకు తెల్లసిపాయీలకును నల్లసిపాయీలకును గలభేద మంతరించువఱకును, భారతీయులీ మహాభూతమును పోషింపవలసినదే గదా!



13 వ ప్రకరణము.

---

రైల్వేలు: (అయోమార్గములు.)

ఇండియా ప్రభుత్వమువారు రైల్వేలకును, నీటివసతుల నిర్మాణమునకును చాల దగ్గఱసంబంధము కల్పించియున్నారు. ఈ రెంటిని గూడ 'పబ్లికువర్క్సు' అని పిలుచుచున్నారు. ఈ రెంటిని నిర్మించుటకు 'ప్రతిఫలయుక్త ఋణము'నుపేరిట (Productive debt) ధనము నప్పుగాని వెచ్చింతురు. ఈ రెండునుగూడ ప్రభుత్వమున కాదాయమును సమకూర్చునవియై యున్నవి. మఱియు సరిగ నుపయోగింపబడినయెడల రెండునుగూడ కాటక నివారణమునకై యుపయోగించును. నీటివసతులకును, రైల్వేలకును గల సామ్యమింతవరకే! జలాధారములు ప్రాచీనమైనవి. ఇనుపదారులు నవీనములు. జలాధారములు వ్యవసాయమునకు తోడ్పడి పంటలయొక్క పరిమితి వృద్ధిచేయగలవు. ఇనుపదారులో పండిన పంటలను వలయు నితరప్రదేశములకు గొనిపోవును. జలాధారములు రైతుల కుపయోగకారులు. ఇనుపదారులు వర్తకులకు లాభము సంపాదింపగలవు. నీటివసతులు దేశమున దుర్భిక్షము రాకుండ నరికట్టగలవు. ఇనుపదారులు కాటకములు సంభవించిన ప్రదేశములను నాహారపదార్థములను త్వరితముగ నందజేయ గలవు. రైల్వేలయందును దేశాభివృద్ధికి తోడ్పడెడు సహజ లక్షణములుకొన్ని గలవు. కాని వాని పరిపాలనము భారతీయుల హస్తములనుగాక, పరుల యధీనమున నుండుటచేతను, ఆ పరిపాలకులు తమదృష్టిని భారతదేశాభ్యుదయముపైగాక, కేవలము ఆంగ్లేయుల వర్తకుల లాభముపై నిగుడ్చి యుండుటచేతను, హిందూదేశమునందలి ఇనుపదారులు దేశక్షేమమునకుగాక దేశానర్థమునకే మిగుల సహాయపడినవని చెప్పవలసియున్నది.

రైల్వేనిర్మాణచరిత్రము:—క్రీ. శ. 1845 వ సం॥న కొన్ని వర్తకసంఘము లేర్పడి తమంతటతాము చెన్నపట్టణము, బొంబాయి, కలకత్తా ప్రాంతముల కొన్ని మైళ్ళ పొడవున నినుపదారులు నిర్మించెను. కాని కొలదికాలముననే ప్రభుత్వ సహాయాపేక్షలేక తమపనిని నిర్వహింపలేకపోయెను. రైల్వేనిర్మాణము తమ యధికారమును సుస్థిరము చేయునని తలచుచుండిన ఈస్టిండియా కంపెనీవారు వెంటనే ఈ కంపెనీలకు సహాయము చేయుటకు సిద్ధపడిరి. డాల్హౌసీప్రభువు వ్రాతలను బట్టి, ఈస్టిండియా కంపెనీవా రేయుద్దేశములతో నినుపదారుల నిర్మింప మొదలిడినది స్పష్టమగుచున్నది:(Dalhousie's minute on Railways)

1. తాము నూతనముగ నాంగ్లసామ్రాజ్యమునకు సంక్రమింపజేసిన రాష్ట్రములు శాశ్వతముగ నాంగ్లపాలితములుగ నుండునట్లొనర్చుటకు రైల్వేలెంతయు తోడ్పడగలవు. మఱియు తమ సామ్రాజ్యమున నెచటనైన విప్లవములు సంభవించినచో, రైల్వేలమూలమున సేనల నతిశీఘ్రముగబంపి విప్లవకారులను నిర్మూలము చేయగలరు.

2. ఇంగ్లాండు ఇండియా దేశములలోని ఆంగ్లేయులయొద్ద నిలువయుండినధనమును నొక వ్యాపారమున వినియోగించి లాభమును పొందుటకు రైల్వేనిర్మాణ మవకాశమును నిచ్చుచున్నది. రైల్వేలను నిర్మించుటకు కావలసిన ధనముక్రింద, ఆంగ్లేయులు తమయొద్ద నిష్ప్రయోజనముగ పడియున్న ద్రవ్యమును ఋణముగనొసంగి, తగిన ప్రతిఫలమును బడయగలరు. మఱియు ఆంగ్లేయుల వర్తకవ్యాపారముగూడ రైల్వేల మూలమున నభివృద్ధి గాంచగలదు.

3. హిందూదేశము వాణిజ్యసాంఘిక విషయములలో చాల బాగుపడును. ఒక ప్రదేశమున మిక్కుటముగనున్న పదార్థములను నవిలేని ప్రదేశములకు సులభముగ గొనిపోవచ్చును.

4. ఇంగ్లాండుదేశమునకు దూదియొక్కయవసరము. హిందూ

దేశాంతర్భాగమున దూది విశేషముగ తయారగుచున్నది. కావున దూరప్రదేశములనుండి రేవుపట్నములకు నీ దూదిని సులభముగ జేర వేయగల్గినచో, రేవుపట్టణములనుండి ఇంగ్లాండునకు నోడలపై సులభముగా గొనిపోవచ్చును. రైల్వేలు దేశమునందలి దూదిని మిక్కిలి సులభముగ రేవుస్థలములకు జేరవేయ గల్గునుగాన, వీని నిర్మాణము వలన ఆంగ్లేయ వాణిజ్యమున కెంతయు లాభముగలదు. మఱియు దూది యొక్కటేగాక, దేశములో నుత్పత్తియయ్యెడు పదార్థముల నెన్నినైనను, విదేశస్థులు తమదేశమున కెగుమతిచేయ నుద్యేశించిన యెడల, రైలుమార్గము లెంతయు తోడ్పడగలవు.

5 ఇంతియకాక, యూరపుఖండమున తయారు చేయబడిన వస్త్రములను, హిందూదేశమున విరివిగ వ్యాపింపజేయుటకుగూడ రైల్వేలు మిగుల సహాయపడును.

ఇట్టి యుద్దేశములతో రైల్వేనిర్మాణము ప్రారంభమయ్యెను. రైల్వేకంపెనీలకు నూటికి 5 చొప్పున లాభమునిచ్చుటకు ఈస్టిండియాకంపెనీవారు పూచీపడిరి. రైల్వేలవలని యాదాయము ఇట్టి లాభము నొసంగుటకు సరిపోవనప్పుడు, వారు ప్రజలు చెల్లించినపన్ను రూపమగు ధనసికరమునుండి యాలోటునుపూర్తిచేయ సమకట్టిరి. 1869 వ సం॥ము వఱకునుగూడ పూర్తిగనిట్టి పూచిపద్ధతిపైననే రైల్వేలు నిర్మింపబడి నడుపబడెను. కాని లాభమునకు గవర్నమెంటు పూచీపడియున్న కారణమున, రైల్వేకంపెనీలు వానిని నడుపువిషయమున శ్రద్ధవహింపకుండిరి. ఏయేటకాయేట యమితనష్టములు తటస్థించుటయు, ప్రజలొసగినపన్నులనుండి యధిక మొత్తములు రైల్వేకంపెనీల లాభముక్రింద చెల్లింపబడుటయు సంభవించెను. ఇట్లు రైల్వేలవలన దేశమున కమితనష్ట మొనగూడుచున్నప్పటికిని ఆంగ్లేయప్రభుత్వము మాత్రము తన రైల్వేనిర్మాణమును మానలేదు. సంవత్సరములు గడచినకొలదిని

యినుపదారుల పొడ వతిశయించెను. పొడవభివృద్ధి నొందినకొలదిని నష్టమును మిక్కుటమయ్యెను. పూచీకత్తులవలన 1858 వ సం॥న ఈస్టిండియా కంపెనీపరిపాలన మంతమొందునప్పటికి, అప్పటికి నిర్మింపబడిన రైల్వేలవలన, యి. ఐ. రైల్వేకంపెనీవలన రూ 1,52,80,460 లును, జి. ఐ. పి. రైల్వేకంపెనీవలన రూ 45,60,490 లును, చెన్నపట్టణపు రైల్వేకంపెనీవలన రూ 26,07,340 లును, అనగా మొత్తము రూ 2,24,48,290 లు నష్టమువచ్చెను. ఈ నష్టమునంతనుగూడ హిందూదేశమే భరించెను.

ఇండియా ప్రభుత్వము పార్లమెంటు వశమైనపిమ్మట గూడ రైల్వేలవలన నమిత నష్టము కల్గుచున్నప్పటికిని ప్రభుత్వవిధానము మారలేదు. మఱియు సిపాయి విప్లవము రైల్వేలయొక్క రాజకీయోపయోగమును వారికి సువ్యక్తము చేసెను. అందుచే రైల్వేనిర్మాణము మునుపటికంటె త్వరితముగగూడ జరుగమొదలిడెను. సింధురైల్వేకంపెనీ, బొంబాయి బరోడా సెంట్రలిండియాకంపెనీ, ఈస్టర్న బెంగాలు రైల్వేకంపెనీ, గ్రేటుసౌతాఫ్ ఇండియా రైల్వేకంపెనీ, కలకత్తా ఎండు సౌత్ఈస్టరను రైల్వేకంపెనీ మొదలగు ననేక కంపెనీలు ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వమంతరించక పూర్వమే తలయెత్తెను.

పూచీపద్ధతివలన గల్గుచున్న యమిత నష్టమును గమనించి 1869 సం॥న ఇండియా గవర్నమెంటు తనంతటతానే ప్రభుత్వపు రైలు మార్గముల (State railways) నిర్మింప నారంభించెను కాని యీయినుపదారులుగూడ ప్రభుత్వమునకుగాని దేశమునకుగాని లాభకారులు కాలేదు.

హైందవ ప్రజలు భరింపవలసిన నష్టమానాటికానాడు హెచ్చిపోయెను. కాని రైల్వేనిర్మాణాభివృద్ధి యొకించుకయు తగ్గలేదు. 1778 వ సం॥ నకు రమారమి 95 కోట్లరూపాయలను రైల్వేకంపెనీలును

5 కోట్లరూపాయలను ఇండియాగవర్నమెంటును (మొత్తమున 100 కోట్లురూపాయలు) రైల్వేలపై పెట్టుబడిపెట్టెను. "ఇప్పటికి రైల్వేనిర్మాణము చాలవఱకు పూర్తియయ్యెను. ఇక క్రొత్త నిర్మాణముల కుద్యమింపనిచో వీనియార్థికస్థితి బాగుపడునని తలపవచ్చున"ని 1872-73 వ సం॥పు పార్లమెంటరీ కమిటీవారు వ్రాసియున్నారు. కాని వారి సూచనలు వ్రాతలలోనే యంతరించెను. ప్రభుత్వపు రైలుదారులు (State railways) నిర్మింప మొదలిడినది మొదలు (1870 వ సం॥ము మొదలు) 10 సం॥లలో రైల్వేలపై రూ 24,64,47,020 లును ఇర్రిగేషనుపై రూ 11,8511,930 లును వెచ్చింపబడెను. 1881 వ సం॥ము నాటికి రైల్వేలపై గవర్నమెంటేమి రైల్వేకంపెనీలేమి మొత్తము రూ 124,11,70,000 లు వెచ్చించెను. ఆనాటికి ఇనుపదారుల పొడవు 9891 మైళ్ళయ్యెను. మఱియు తొలినుండియు నిప్పటివఱకును తేలిన నష్టము రూ 28,42,51,190 లయ్యెను. 1880 వ సంవత్సరమున విచారణ సల్పిన క్షామసంఘమువారు (Famine commission) రైల్వేలకంటె జలాధారములే (ఇర్రిగేషను) దేశమున కెక్కుడు క్షేమదాయకములని తెల్పుచు క్షామనివారణార్థమై రైల్వేలకంటె జలాధారముల నిర్మాణమునకు పెద్దమొత్తముల వెచ్చింపవలెనని సూచించిరి. రైల్వేలవలన దేశమున కమితనష్టము చేకూరుచున్నను దేశమున రైల్వేనిర్మాణమున కావశ్యకత లేకపోయినను క్షామసంఘమువారు సైతము జలాధారములకే యెక్కుడు ప్రాముఖ్యము నొసగవలెనని కోరియుండినను, రైల్వేనిర్మాణమునకై అత్యాతురమును జూపుచుండిన ఇండియాగవర్నమెంటు తనప్రయత్నములనేల విడుచు? 1880 వ సం॥నకు పిమ్మట నిరువది సంవత్సరములలో రమారమి 15,000 మైళ్ళ పొడవున నవీనముగ నినుపదారులు నిర్మింపబడెను. 1901 వ సం॥ నాటికి నినుపదారుల పొడవు దాదాపు 25,000 మైళ్ళు వీనిపై మొత్తపుపెట్టుబడి

340,15,98,000 రూపాయలును నయ్యెను. మఱియు నీనాటికి వీనిపై మొత్తముమీద 55 కోట్ల 69 లక్షల రూప్యములు నష్టము వచ్చియుండెను. కాని 1880 వ సం॥మందలి క్షామవిచారణ సంఘమువారేమి 1897 వ సం॥ మందలి క్షామవిచారణ సంఘమువారేమి 1900 వ సం॥ మందలి క్షామవిచారణ సంఘమువారేమి కోరియున్నట్లు రైల్వేనిర్మాణ మాపబడకుండుటయేగాక వీరు వాంఛించియున్న జలాధారముల నిర్మాణమైనను ప్రభుత్వామోదమును బడయకుండుట శోచనీయము. ఇంతవఱకును ఇర్రిగేషను కొఱకై ప్రభుత్వము వెచ్చించియుండినది మొత్తము రమారమి 36 కోట్లరూపాయలు మాత్రమైయున్నది. ప్రజల బాగోగులనుగాని ప్రజాభిప్రాయమునుగాని గవర్నమెంటు లక్ష్యపెట్టుటలేదని ధ్రువపర్చుటకు నింతకంటె వేఱొక యుదాహరణము కావలెనా ?

20-వ శతాబ్ద ప్రారంభమునుండియు రైల్వేలచరిత్రము కొంత మారినదని చెప్పవచ్చును. అప్పటినుండియు ఇండియా గవర్నమెంటువారికి రైల్వేలమూలమున కొంతలాభము రామొదలిడినది. 1908-1909 లోని నష్టము (1 కోటి 86 లక్షల రూపాయలు)ను గణింపనిచో, 1900 మొదలు 1910 వఱకును వచ్చినమొత్తపు లాభము 16 కోట్ల 71 లక్షలరూపాయలు. మఱియు 1910-11 సం॥రము మొదలు 1913-1914 వఱకును రమారమి 23 కోట్ల రూపాయలు లాభము వచ్చియుండెను. మఱియు నైరోపా మహాసంగ్రామము ప్రారంభమైనప్పటినుండియు, 1921 వఱకుగూడ గవర్నమెంటునకు రైల్వేలవలన నమితలాభము చేకూరియున్నది. ఇట్లు 1900 సం॥ము మొదలు 1921 సం॥ము వఱకును వచ్చిన నికరమగు లాభము 108 కోట్ల రూపాయలు కాని 1921-22 వ సం॥మునుండియు రైల్వేలు తిరిగి తమసహజగుణమును వ్యక్తముచేయుచున్నది. ఈసం॥రమున ప్రభుత్వమునకు వేలిన

నికరభ్రష్టము రూ9,27,30,501లు(Indian year Book, 23 P. 252) మఱియు 1922-23 వ సం॥మునగూడ రమారమి యొకకోటిరూప్యములు నష్టమువచ్చినట్లు ఆర్థికసభ్యుడగు బ్లాకెటు తనబడ్జెటునుగూర్చిన యుపన్యాసమున సామ్రాజ్యశాసనసభయందు తెల్పియున్నాడు. ఇట్లు తిరిగి నష్టము రామొదలిడినప్పటికిని గూడ ఇండియా గవర్నమెంటువారు ద్విగుణీకృతమగు దీక్షతో రైల్వేనిర్మాణమును కొనసాగించుట చాల చిత్రము. 1922వ సం॥మున మార్చి 31 వ తారీఖు వఱకును హిందూదేశమున రైల్వేలకొఱకు వెచ్చింపబడిన మొత్తపు ద్రవ్యము 656 కోట్ల 6 లక్షల రూపాయలు. రైల్వేకంపెనీలును, స్వదేశసంస్థానములును జిల్లాబోర్డులును వినియోగించిన ధనమునందుం డితీసివేసినచో కేవలము ఇండియాగవర్నమెంటు రైల్వేలకై వెచ్చించిన మొత్తము 506 కోట్ల 12 లక్షల రూపాయలని తేలుచున్నది. ఇట్టి యధికమొత్తము రైల్వేలపై ఖర్చుపెట్టబడియున్నప్పటికిని రైల్వేలవలన దేశమునకుగల్గిన నితరహానులుగాక ప్రభుత్వమునకుగూడ నాసంవత్సరము (1922) రమారమి 9 కోట్ల రూపాయలు నష్టమువచ్చియున్నప్పటికిని, 1922 వ సం॥మున ఇండియాగవర్నమెంటువారు, రాబోవు 5 సం॥ములును, సం॥ము ఒక్కంటికి 30 కోట్ల రూపాయలచొ॥న (5సం॥ములలో 150 కోట్ల రూప్యములు పూర్తియగునట్లు) రైల్వే నిర్మాణముకొఱకై వెచ్చించవలెనని తీర్మానించియున్నారు. రైల్వేలపై వచ్చిన నష్టమునెల్లను భరించువారు ప్రజలైయుండ, వారి బాగోగులు లెక్కింపక, రైల్వేలమూలమున నష్టముగల్గుసూచనలు గన్పడుచున్నను, వాని నిర్మాణమునకై కోటానుకోట్లుగ ద్రవ్యమును వ్యయపఱుచుట ఎంతయు సంతాపకరము.

రైల్వేలు: ఇర్రిగేషను, నదీనహరులనిర్మాణమొక ప్రాముఖ్య ప్రత్యేకత్వము వాంఛనీయముగా ప్రాముఖ్యమును బడయలేదు. 1850 వ సం॥ము వఱ

కును నీటివసతుల విషయమై తలపెట్టనైన లేదుగదా! ఈకారణము చేతనే పూర్వపు ప్రభువులు నిర్మించిన జలాశయములన్నియు వానివంక చూచువారైన లేకపోవుటచే చెడిపోయెను. ఇక 1830 వ సం॥ము నుండి జలాశయముల నిర్మాణము ప్రారంభించినను ఈనిర్మాతలకు ధనాకర్షణమే ప్రధానోద్దేశముగ నుండెనుగాని దేశక్షేమముగాదు. 1845 వ సం॥మున రైల్వేనిర్మాణము ప్రారంభమైన నాటనుండి రైల్వేలే ప్రభుత్వదృష్టిని తమవంక కాకర్షించుకొనెనని వేఱుగ చెప్పవలెనా? పార్లమెంటుచే నియమింపబడిన విచారణసంఘము నెదుటసాక్ష్యమునిచ్చుచు 1879 వ సం॥న సరార్తరు కాటనుదొర (Sir Arthur Cotton) రైల్వేలు మనుష్యులకుగాని జంతువులకుగాని యాహారము నివ్వజాలవనియు దేశమందలి సరకులన్నియు రైల్వేలమీదనే పంపబడుటలేదనియు పంపినను రైల్వేలపై పంపుట కయ్యెడివ్యయమధికమనియు వాని నిర్మాణమునకును నడుపుటకునునైన వ్యయమునకు రావలసినప్రతిఫలము వచ్చుటలేదనియు నిర్జలభూములనివి తడుపజాలవనియు తుదకు పానయోగ్యమగు జలమునైన ప్రసాదింప జాలవనియు కాని నీటివసతులీ పనులనన్నిటిని చక్కగ నిర్వర్తించగలవనియు నుడివియున్నాడు. మఱియు రైల్వేనిర్మాణమునకు కావలసిన ధనమత్యధికము. ఒకమైలు పొడవున నినుపదారిని వేయుటకు రమారమి రూ 23000లు ఖర్చగుచున్నవి. (R.C. Dutt) నీటివసతులనిర్మించుటకింతయధికవ్యయము కాజాలదు ఇంతియకాక రైల్వేలవలన ననేకసంవత్సరముల వఱకును నమితనష్టమువచ్చియున్నది. అధికముగ ధనమునింకను హెచ్చించినచో నేడుగూడ కోట్లకొలది నష్టమురావచ్చు ననెడి భయముగలదు. నీటివసతులట్లుగాక తొలినుండియు ప్రజలకుపచరించుచు ప్రభుత్వమునకును లాభముగడించుచుండెను. ఇట్లయ్యును సం॥నకు ప్రభుత్వమే కోటిన్నర రూప్యములో 'ఇరిగేషను' పై వెచ్చింపుచు కోట్లకొలదిని

రైల్వేలపై వెచ్చించుచున్నది. నేటికి, 1922 వ స॥ మార్చి 31 వ తారీ ఖునకు రైల్వేలపై మొత్తముపెట్టుబడి 656 కోట్ల 6 లక్షల రూపాయ లైయుండ ఇరిగేషను నిమిత్తమై (1921 వ సం॥ము మార్చి 31నాటికి) 78 కోట్ల 61 లక్షల రూప్యములను మాత్రము ఖర్చుపెట్టియున్నది.

భారతవర్షము నితర దేశములతో పోల్చి చూచినయెడలనుగూడ నిక్కడి యినుపదారు లెంతయధికముగ నున్నవో తెల్లమగుచున్నది.

| దేశము. | రైలుదారుల పొడవు. | దేశమొత్తమున మనిషి 1 కి సంపద | మనిషి 1 కి సం॥ ఆదాయము. |
|---|---|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రము | 2,52,000 మైళ్ళు | రూ 5865 లు | రూ 750 లు |
| జర్మనీ ... | 39,500 ... | రూ 5490 లు | రూ 705 లు |
| రష్యా ... | 50,000 ... | రూ 1140 లు | రూ 135 లు |
| హిందూదేశము | 35,300 ... | రూ 165 లు | రూ 20 లు |
| ఫ్రాంసుదేశము | 32,000 ... | రూ 4380 లు | రూ 495 లు |
| కనడా ... | 29,300 ... | రూ 3885 లు | రూ 435 లు |
| ఇంగ్లాండు ... | 23,400 ... | రూ 4800 లు | రూ 600 లు |
| ఆస్ట్రియా హంగేరి | 29,200 ... | రూ 3600 లు | రూ 405 లు |
| ఆస్ట్రేలియా ... | 20,000 ... | రూ 3930 లు | రూ 480 లు |
| ఇటలీ ... | 11,100 ... | రూ 3420 లు | రూ 345 లు |
| న్యూజీలాండు ... | ... ... | రూ 4410 లు | రూ 570 లు |

సంపదయందును, నాదాయమునందును, హిందూదేశ మధమ స్థానము నాక్రమించియుండగా, రైలుదారుల పొడవున నాల్గవదియై యున్నది. దేశక్షేమముతో నిమిత్తము లేకయే హిందూదేశమున నధికముగ రయిల్వేలు నిర్మింపబడినవనుట కీనిదర్శనమె చాలును?

రయిల్వేలవలని లాభములు (?):—

రయిల్వే నిర్మాణమును ప్రోత్సహించువారు, వానివలన దేశమున కీలాభములు గలుగుచున్నవని పలుకుచుందురు.

1. రయిల్వేలు దేశీయవాణిజ్యమును వృద్ధిచేయుచున్నవి.
2. రయిల్వేలుక్షామమునరికట్టుటకై మిగులసహాయపడుచున్నవి
3. దేశమునందలి వేనవేలుప్రజలకు వృత్తినికల్పించి జీవనోపాధి నొసగుచున్నవి.
4. ఇతరవిధములను హిందూదేశాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

ఈవాక్యము లెంతవఱకు సత్యములో పరీక్షింతము.

(1) వాణిజ్యము:—ప్రస్తుతము హిందూదేశము సల్పుచున్న వాణిజ్యమునుగూర్చి ఏడవప్రకరణమున తెల్పియున్నాము. ఇక్కడనుండి ముడిసరుకు లెగుమతియగుటయు, తయారయిన వస్తువులు దిగుమతియగుటయు, నీవ్యాపారముయొక్క ప్రాముఖ్య లక్షణమనియు నట్టివ్యాపారమునందు హిందూదేశము ఆంగ్లదేశమునకు వలయుపదార్థములను మాత్రము సమకూర్చు "పెరటితోట" (Farm ground) గా నొనర్పబడెననియు, తెల్పియుంటివి. దేశానర్థకమగు నీవాణిజ్యమున రయిల్వేలెట్లు ఆంగ్లేయుల కుపకరించి హైందవ శ్రేయస్సును భంగమొనర్చినదియు, రయిలుమార్గములను రయిల్వేరేట్లను పరికించినచో స్పష్టమగును.

హిందూదేశములోని ఇనుపదారులపటమును జూచినవారికి నీ విషయము సులభముగ ప్రకటితముకాగలదు. హిందూదేశములోని రైలుదారులు వివిధప్రాంతములనుండి బయలుదేరుచు బొంబాయి, కరాచీ, కలకత్తా, చెన్నపట్టణము మొదలగు రేవుపట్టణములను తమ గమ్యస్థానములుగా కల్గియున్నవి. హిందూదేశములోని ఏయినుపదారిని తీసికొనినను యీరేవుపట్టణములతో సంబంధములేని దొక్కటియు

కాన్పింపదు. దీనికి కారణము, గృహమునకు బహిర్గ్వ్యాపకములవలె, యీ దేశమునకీ రేవుపట్టణములే ప్రపంచముతో సంబాధముగల్గియుండి విదేశములకు ద్రవ్యముల నెగుమతిచేయుటకును, విదేశములనుండి దిగుమతి చేయుటకును, కారణభూతము లగుచున్నవి. దేశములోపల నొకభాగమునకు మఱియొక భాగముతోడకన్న ప్రతిభాగమునకునుగూడ నీరేవు పట్టణములతో సంబాధముగలుగజేసెడి ఈరైలుదారులు దేశములోని వాణిజ్యమునకంటె విదేశములతోడి వ్యాపారమునకే యెక్కుడు చేయూతనొసంగి ప్రోత్సహించుచున్న వనుటలో వైపరీత్యముండజాలదు.

రైల్వేరేట్లు—రైల్వేరేట్లను పరికించినను ఇట్టి ఎగుమతి దిగుమతి వర్తకమునకే ప్రోత్సాహమివ్వబడినట్లు తెలియగలదు. దేశములోని ఒక ప్రదేశమునుండి మఱియొకప్రదేశముకంటె నాప్రదేశమునుండి రేవుపట్టణములకు (దూరము, సమానముకాదుగదా ఎక్కువ యున్నప్పటికిని) రేట్లుచాల తక్కువగ నున్నవి. ఈరీతిని రేవుపట్టణములకు రేట్లను తగ్గించుటవలన దేశములో నుత్పత్తియైన పదార్థములు, రేవుపట్టణములకును, తద్వారా విదేశములకును ఆకర్షింపబడుచున్నవి. పశ్చిమోత్తర పరగణాలయందు రమారమి 16,85,000 * ఎకరముల ప్రత్తి పంటగలదు. అక్కడికి సమీపమందలి రేవుపట్టణమగు కారాచీకిని, దేశముయొక్క అంతర్భాగమునన్న ఢిల్లీపట్టణమునకును, ప్రత్తి నెగుమతిచేయుటలో రేట్లయందుగల వ్యత్యాసము గమనింపనగును.

దూదినిమోసికొనిపోవుట.

దూరము. రేట్లు.

పెషావరునుండి కరాచీరేవుపట్టమునకు 929 మైళ్లుమణుగునకు రు1-8-0.

(రైల్వేరిస్కుతో)

---

* ఈఅంకెలు ఆర్. డి మెహతాగారి Indian Railway Policy యను పుస్తకమునుండి గ్రహింపబడినది. (1913 సం. లో ప్రచురింపబడినది.)

ఢిల్లీపట్టణమునకు 585 ... రూ 1-8-8

పెషావరునుండి కరాచీకి, లెక్కింపబడినరీతినే ఢిల్లీపట్టణమునకునుగూడ లెక్కవేసినచో (585 మైళ్ళకు) రైల్వేరేటు రూ 0-13-0 అగుచున్నది. అనగా న్యాయము ననుసరించి యుండవలసినదానికంటె పెషావరునుండి ఢిల్లీపట్టణమునకు మణుగునకు రూ 0-11-8 ఎక్కువ తీసికొనుచున్నారు. ఈవ్యత్యాసమువలన రైల్వేవారు దూదిని పెషావరునుండి కరాచీకి అచటనుండి ఇంగ్లాండునకు, పెషావరునుండి మిక్కిలి సమీపముననున్న ఢిల్లీపట్టణముకంటెగూడ, మిగుల చవుకగ జేరవేయుటకు తోడ్పడుచున్నారు. పెషావరులో నొకేధరయున్న దూదినికొనినచో నింగ్లాండులోని వర్తకునకు రైల్వేరేట్లమూలమున(ఇంగ్లాండులోనిబట్టలమిల్లులకు) సులభముగను చవుకగను దూది దొరకుచుండ ఢిల్లీపట్టణములోని మిల్లులకయ్యది ప్రియముగనున్నది. ఒక్కపెషావరు ఢిల్లీలమధ్యనేకాదు దేశాంతర్భాగములోని వర్తకులకు నష్టప్రదమగు నిట్టివిధానమే యెల్లడల నవలంబించి రైల్వేలు విదేశవర్తకులను, విదేశవర్తకమును ప్రోత్సహించుచున్నవి.

ఆహారపదార్థముల విషయమున గమనింపదగినది వేఱొండు యంశముగలదు. విదేశముల కెగుమతిచేయుటయందు తయారైన పదార్థములకంటె, తయారుకానట్టి ముడిపదార్థములకే ప్రోత్సాహమొసగబడుచున్నది. పంజాబునుండి, కరాచీ రేవుపట్టణముద్వారా గోధుములు విశేషముగ నెగుమతి యగును. పంజాబులో ఫలించెడు గోధుమపంటలో రమారమి నాల్గవవంతు కరాచీపట్నముద్వారా యెగుమతియగుచున్నదనిచెప్పవచ్చును. (R. D. Mehta's Indian Railway Policy P. 98.) మఱియు పంజాబులో గోధుమలను పిండిజేయు మిల్లులున్నకారణమున, తయారైన గోధుమపిండినిగూడ నెగుమతి చేయుటకు చాల నవకాశమున్నది. కాని రైల్వేవారు తమరేట్లమూలమున, అంత

గోధుమపిండికంటె గోధుమలకే చాల ప్రోత్సాహము నిచ్చు చున్నారు.

కరాచీరేవు పట్టణమునకు.

| | గోధుమలకు మణుగునకు రైల్వేరేట్లు. | గోధుమపిండికి మణుగునకును. |
|---|---|---|
| దూరము | రూ అ. పై. | రూ. అ. పై. |
| ఫిరోజుపూరునుండి—730మైళ్ళు | 0—9—0 | 0—11—4 |
| లాహోరునుండి—757 ,, | 0—10—0 | 0—11—8 |
| అమృతసరము—788 ,, | 0—10—6 | 0—12—1 |

ఒకమణుగు పిండికిని, ఒకమణుగు గోధుమలకును, ఫిరోజుపూరు లెక్కలను తీసికొనినచో రు 0-2-4 భేదము కన్పడుచున్నది. అనగా ఈలెక్కలనుబట్టి గుణించినచో ఫిరోజుపూరునుండి కరాచీరేవు పట్నముకు, ఒకటన్నుగోధుమలకంటె ఒకటన్ను (27 మణుగులు) గోధుమపిండిని పంపుటకు రూ 3-15-0 లు ఎక్కువగ చెల్లింపవలసియున్నది. ముడిగోధుమలకివ్వబడిన సౌలభ్యమింతియకాదు. వీనిని రైల్వేంపై పంపునపుడు, దారియందు వర్షములవలనగాని యితర ఉపద్రవముల వలనగాని సంభవించిన నష్టమును రైల్వేవారుభరించెదరు. దీనినే 'రైల్వేరిస్కు' అందురు. కాని గోధుమపిండి విషయమున దారియందలి యుపద్రవములవలన సంభవించెడునష్టమును యజమానులే భరింపవలెను. గోధుమలయెగుమతిని ప్రోత్సాహపఱుపుచు రైల్వేలు. రేట్లనెక్కువగ విధించుటవల్లను, యజమానులే దారియందలి నష్టమును భరింపవలెనను నియమముచేయుటవలనను, యితర కృత్యములవలనను, గోధుమపిండి యెగుమతిని, తన్మూలమున భారతభూమిలోని 'పిండిని తయారుచేయు' పరిశ్రమను నిరుత్సాహపఱచుచున్నవి. ఒక్కగోధుమ

పిండియనసేటి నూనెవిషయమునగూడ రైల్వేలు యిట్టులేపనిచేయు చున్నవి.

కరాచీ రేవుపట్నమునకు.

| | నూనె విత్తులకు మణుగునకు రేటు. | నూనెకు మణుగునకు రేటు. |
|---|---|---|
| ఫిరోజుపూరు | రూ. 0—9—0 | రూ. 0—15—6 |
| లాహోరు | 0—10—0 | 1—0—0 |
| అమృతసరము | 0—10—6 | 1—0—7 |
| సయాల్‌కోట | 0—11—1 | 1—1—0 |

నూనెవిత్తులకంటె నూనెకు నూటికి 60 చొ॥ ఎక్కువగ గ్రహించుచున్నారు. మఱియు యీపదార్థముల విషయమునను దేశములోని పరదేశములకంటె రేవుపట్నములకంటె రేట్లు తక్కువగ నున్నవని మఱువకూడదు.

| గోధుమపంటగల | దూరము | మణుగునకు రేటు. |
|---|---|---|
| ముల్తానునుండి, కరాచీకి | 576 మైళ్ళు | రూ. 0—7—6 |
| అలహాబాదునకు (ఢిల్లీద్వారా) | 454 మైళ్ళను | రూ. 0—8—0 |

ఈ సంగతుల గ్రహించినచో, భారతీయుల యవసరముల దీర్చుటకంటెను, భారతీయ పరిశ్రమలను వాణిజ్యమును ప్రోత్సహించుటకంటెను, రైల్వేలు, విదేశీయుల యవసరముల దీర్చుచు, విదేశ వణిజులకు ప్రోత్సాహము నొసంగుచున్నవని స్పష్టమగుచున్నది. రైల్వేలను నడుపుటలో దేశమునకల్గిన నష్టమునెల్లను భరించునది భారతవర్షము. రైల్వే పరిపాలనమువందును, రేట్లనిర్ణయమందును, నితరవిధములను నష్టములను భరించునది భారతవర్షము రైల్వేల

వలని సకలలాభములను, యనుభవించునవి విదేశములు, అనుభవించు వారు విదేశస్థులు.

2 రైల్వేలు క్షామములు:—క్షామనివారణమునకై రైల్వేలుపచరించునని చాలమంది పల్కుదురు. రైల్వేనిర్మాణము నెడలపక్షపాతబుద్ధిగల్గిన ప్రభుత్వమువారును క్షామములను పూర్తిగ నరికట్టుటకై రైల్వేలనింకను నిర్మింపవలెననుచుందురు. కాని దేశచరిత్రమును పరికించినచో హిందూదేశమును కలతపెట్టిన ఘోరక్షామములు రైల్వేలు నిర్మింపబడిన తరువాత సంభవించినవని తెలియనగును. 1891-1900 సం॥ ల మధ్య రైలుదారుల పొడవు కొన్ని వేలమైళ్ళు విస్తరింపజేయబడిన కాలముననే సుమారు 1,90,00,000 మంది జనులు క్షామములవలన ఇహలోకమును బాసినారు. మఱియు నీకాలమున సంభవించు క్షామముల విషయమై గుర్తింపదగిన అంశమొకటి గలదు. ఆంగ్లపాలనమున దేశము నకల్గుచున్నవి ధనకాటకములుగాని ఆహారక్షామములుగావు. ప్రజలు నేడు ఆహారము తమదేశమున దొరకకపోవుటచే మరణించుటలేదు; యాహారము కొనుటకు వలయుధనము తమయొద్దలేకపోవుటచే ఆహారములేక కాటకమహాదేవతకు బలియగుచున్నారు. ఇట్టిస్థితియందు రైల్వేలెట్లు ప్రజలకుపచరింపగలవు? అవి దుర్భిక్షమున్న ప్రదేశములకు ఆహారపదార్థములను గొనిపోగలవుగాని దరిద్రులగు జనులకు ఆహారము కొనుటకు నవసరమగు ధనమునెట్లు ప్రసాదింపగలవు. ఈసంగతుల నుబట్టి రైల్వేలు కాటక సమయముల చేయగల సహాయము చాలసంశయాస్పదమని తలంపవలసియున్నది.

కాని యీసందర్భమున రైల్వేలుచేయు మఱియొక కృత్యమును గాంచవలసియున్నది. దేశమందలి ముడి పదార్థములతోబాటు ఆహారపదార్థములనుగూడ రైల్వేలు విదేశమునకు కొనిపోవుటలో నిశ్శేష సహాయముచేయుచున్నవి. ఆహారపదార్థముల మెగుమతివలన దేశము

నకు కల్గెడుహాని యింతయని తెలుపజాలము ఇట్టియెగుమతివలన దేశములోని కొంతమంది ప్రజలక్షుధను నివారింపగల్గిన పదార్థములు విదేశగతమగుచున్నవి. అందుచే నాప్రజల యాకలి నివారింపబడనిదై తన సహజతైక్ష్ణ్యమును చూపుచునే యున్నది. మఱియు నిట్టియాహారపదార్థముల యెగుమతివలన, వానిధరలు పెఱుగుచున్నవి. ధరలు వృద్ధి యగుటవలన, భూమిశిస్తు వృద్ధిచేయబడుచున్నది. భూమిశిస్తు రొఖ్ఖరూపమున చెల్లింపవలసియుండుటచే నెగుమతిదారుడిచ్చు ధరకు, రైతు ధాన్యము నమ్ముచున్నాడు. ఎగుమతులవలన రైల్వేలు లాభమును గాంచుచుండును. కాని తన ధాన్యముల నమ్ముకొనిన బీదరైతు, సంవత్సరమంతయు కుటుంబ భరణమునకై పెక్కు చిక్కులకు లోనగుచున్నాడు. రైల్వేలు నిజముగ క్షామనివారకరములా, క్షామకారకములాయను విషయమునుగూర్చి 1883వ సం॥న ఎ. కె. కానెల్ గారొక్కింది. వ్యాసమును రచించియున్నారు. వారిమాటలు నేటికి సత్యములై యున్నవి.

"మొత్తముమీద రైతుదాసులయొక్కయు స్వేచ్ఛాపద్ధతి యొక్కయు ఫలితములను క్లుప్తముగా నిట్లుచెప్పవచ్చును. హిందూదేశమింతవఱకును తనకవసరమగు వస్త్రములను తానేతయారుచేసికొనుచుండెడిది; నేడో ఇంగ్లాండుదేశమీ వస్త్రముల బంపుచున్నది. ఇట్టిమార్పులవలనగల్గిన ఫలితమేమన హైందవులగు నేతపనివాండ్ర జీవనాధారము నాశముచేయబడినది. హైందవవస్త్రములకంటె చవుకగనున్న ఆంగ్లేయవస్త్రములను కొనుటలో ప్రజలు కొంతలాభమునందియుందురు. కాని దేశమొత్తమున ఆంగ్లేయవస్త్రములను కొనవలెనన్న యావస్త్రములకు బదులుగ హిందూదేశము చాలయాహారపదార్థముల నెగుమతిచేయవలసియుండును. మఱియు నిట్టియెగుమతివలన ఆహారపదార్థముల నమ్మువారు పూర్వముకంటె నెక్కువగ లాభమును బడసియుందురు. ఈరీతిని వస్త్ర

ములు చవుకగనుండుటవలనను ధాన్యము ప్రియముగ నుండుటవలనను కొంతమంది హైందవులు బాగుపడవచ్చును, కానిదేశమునకిట్టి స్థితిసంభవింపవలెనన్న వారురైల్వేనిర్మాణమునకు వలయుధనము నివ్వవలసి యుందురు: మఱియు కఱవుకాలములలో నితరులకెక్కుడుగ సహాయము చేయవలసినవారై యుందురు. ఈరీతిని దేశమునకల్లు నార్థికవిషయములగు మార్పులనన్నిటిని పరీక్షించినచో భారతదేశము ఆర్జనసాధనమును విశేషముగ కోల్పోయెనని తేలుటలేదా? ఇచటకు వస్త్రముల దిగుమతియు, నిటనుండి ధాన్యపు ఎగుమతియు రేపే కట్టిపెట్టినయెడల ఇండియాగవర్నమెంటువారు వికలమనస్కులు గావచ్చును, గాని హైందవులుమాత్రము లాభము నేపొందుదురు. ముఖ్యవిషయమేమన ఈయుభయుల లాభములును ఒకటిగాదు. మారకమువలన తనకు గల్గునష్టమును తగ్గింపజేయుటకై ఇండియాగవర్నమెంటు ప్రస్తుతము గోధుమలయెగుమతిని వృద్ధిచేయుటకు మిగుల పాటుపడుచున్నది. కాని యిట్టి ఎగుమతివలన హిందూదేశములో నాహారపదార్థములు మిగుల ప్రియమగును. హంటరుగారుచెప్పిన వాక్యముల యర్థమును మనమిప్పుడు గ్రహింపగలము. ఆంగ్లపాలితమగు భారతదేశమందలి జనులను 5 భాగములుగజేసినచో, నిందు రెండుభాగములలోనిజనులు పూర్వమెన్నడునుస్వదేశరాజుల పరిపాలనమున ననుభవించియుండని యైశ్వర్యము ననుభవించుచున్నారు. మరియు రెండుభాగములలోనివారంత యమితముకానట్టియు క్రమముగ క్షీణించుచున్నట్టియు జీవనము సంపాదించుచున్నారు. ఇక నైదవభాగములోని 4 కోట్ల ప్రజలును తమకుసరిపోవు నాహారము లేకుండగనే జీవముల గడపుచున్నారు. మరియు కేర్డ్ (Kaird) గారు వ్రాసినచొప్పున మరి పదివత్సరములు గడచుసరికి వీరివలె నాహారములేనివారిసంఖ్య రెండుకోట్లువృద్ధియగును. రెయిల్వేలపై నధిక

ముగ పెట్టుబడి పెట్టుటవలన హిందూదేశముయొక్క యార్థికస్థితి బాగుపడుచున్నదని యికవాదింపగలమా ?

"కాని, క్షామకాలముల దుర్భిక్షములగు ప్రదేశములకు రైల్వేలాహారపదార్థముల గొనివచ్చి మహోపకార మొనరించుట లేదాయని కొందఱు సంశయాత్ములు ప్రశ్నింపవచ్చును రైల్వేలేతోడ్పడియుండనిచో గత క్షామమునందు చెన్నపట్టణము, బొంబాయి, మధ్యపరగణాలు, మున్నగురాష్ట్రములందలి జనులేమైయుందురు? నాసమాధానమేమన, వారేమైయుందురు ? రైల్వేలు ధాన్యమును గొనివచ్చిన మాటతథ్యమే! కాని గతకాలములో నారైల్వేలే అక్కడి ధాన్యమునితర స్థలములకు తీసికొనివెళ్ళియుండెను. ఇప్పుడు నాల్గింతల ధరతో తిరిగి తీసికొనివచ్చెను. మఱియు నీధాన్యమును బీదలుకొనగల్గునట్లు చేయుటకై ప్రభుత్వమువారు కోట్లకొలది ద్రవ్యములను వెచ్చింపవలెను. అయినప్పటికిని భయంకరములగు మరణములు తప్పుటలేదు. అనావృష్టికాలములో తమ్ము రక్షించుకొనుటకై హైందవప్రజలనాదినుండియు అవలంబించిన పద్ధతియేమి ? ఈజిప్టులో నిజోసెఫు అవలంబించిన సులభపద్ధతియే ! ధాన్యమును నిలవజేయుట. మైసూరుక్షామమును గుఱించి ప్రకటింపబడిన గవర్నమెంటు రిపోర్టునందిట్లుగలదు:

" గతకాలములలో దేశ మనావృష్టికారణమున బాధపడియుండెను. కాని, అట్టిసమయములలో, పూర్వమునుండియు, భూమియందు త్రవ్వబడిన గోతులలో నిలువజేయబడిన రాగిధాన్యమును పైకితీసి, యాహారముక్రింద నుపయోగించుచు, ప్రజలు దుర్భిక్షమునుండి కాపాడుకొనుచుండిరి. భూమియందలి గోతులలో నిట్లునిలువజేయబడిన ధాన్యము 40 లేక 50 సం॥ములు చెడిపోకుండ నుండగలదు.' క్షామవిచారణ సంఘములో కేర్డ్ (Kaird) సుల్లివాన్ (Sullivan) అను నిద్దఱుసభ్యులు ప్రాచీనయాచారముయొక్క ప్రాముఖ్యమును కనిపెట్టి

గిల్గిరని తోచుచున్నది. పైరిపోర్టులోని ప్రథమభాగము చివరనున్న అనుబంధమునందు, ధాన్యమును నిలువచేయుటనుగుఱించి వీరిట్లు తెల్పి యున్నారు. 'సామాన్యపు ధాన్యమును, ఉప్పును, నంజుకొనుట కుప యోగించు కొన్నిపదార్థములును, ప్రజల యాహారపదార్థములైయు న్నవి. ధాన్యమును పక్వస్థితికి గొనివచ్చుట కడు తేలిక. గోతులలో పాత రవేసినధాన్యము చాలకాలముండును. మఱియు జనులు తమకు కావ లసినప్పుడే దానినిబయటకుతీసి వినియోగింతురు. భూమియందిట్టి గోతులు త్రవ్వి పాతరవేయువిధము భారతీయులకు తెలియును. తమ అభ్యాసముచొప్పున వీనిని నిర్మించుచుందురు. మఱియు వీనిని నిర్మిం చుటకై గోతులుచుట్టును నెలకొల్పవలసిన కాల్చిన మట్టివరలకొఱకును గోతులత్రవ్వు కూలిపనివాండ్రకొఱకును తక్క, వారికేవిధమగు వ్యయమును గానేరదు. ఈధాన్యపునిలువయే వారికన్నిటికంటెను శ్రేష్ఠమగు క్షామసంరక్షకనిధి. అవసరములబట్టి ఒకప్రదేశమున నెక్కు వ నిలవయున్నను మఱియొకప్రదేశమున తక్కువనిల్వయున్నను హిం దూదేశమొత్తమున నీవిధానమే యవలంబింప బడుచున్నది.

"రైల్వేలు నిర్మింపబడినప్పటినుండియు రైతు వెంటనే ధనము తనచేతిలో బడుననుయాశచేతనేమి, పన్నుల చెల్లించుటకొఱకు ధాన్య మునమ్ముకొనవలసి వచ్చుటచేతనేమి, ధాన్యమునకు మారు రూపాయల ను నిలువజేసికొనుచున్నాడని నమ్మవచ్చును. కాని యీరూప్యములను గాని ఆభరణములనుగాని రైతుభక్షింప నేరని కారణమునను భూము లకు కావలసిన యెఱువును కొనలేడుగనుకను, మఱియు క్షామకాలము ల (క్షామసంఘసభ్యులు చెప్పినచొప్పుననే) నిజమగు ధరలకంటె 4 రెట్లధికముగ ధాన్యముకై యివ్వవలసి యుండుటచేతను రైతుమొత్త ముమీద పొందులాభముచాల సంశయాస్పదము. ఇకభూమిలేని కాం ణమున నెట్టిధనముగాని నిలువలేని కూలిపనివానికి మాత్రము పలుపు

కాలమున ధాన్యమలభ్యముగనుండును. అట్టిసమయములలో గవర్నమెంటువారు తమ క్షామనివారక కార్యములతో నీరిసహాయమున కేతెంతురు, రైల్వేలపరిమితముగ లాభములగడించును. నిజముగా కఱవులును యుద్ధములును దేశస్థులగు హైందవులకు గొప్పసంక్షోభమును గల్గించునవియైనను రైలుదారులపై పెట్టుబడి పెట్టిన విదేశధనాఢ్యులకవి పరిపూర్ణమగు భగవత్ప్రసాదిత శుభములై యొప్పుచున్నవి. ఇట్టి సహాయమొనర్చి నందుకు తనయెడ ప్రత్యేకాభిమానమూని స్తుతింపుచుండెను ఆంగ్లేయ ప్రజలయెదుట ఇండియా గవర్నమెంటువారు తమ ప్రజాసేనాపద్ధతిని సగర్వముగ చాటుచుందురు. కాని యీక్రిందివిషయము లెన్నడును వారికి తెలియజెప్పరు. రెయిల్వే నిర్మాణమునకైన ధనముపై వడ్డీచెల్లించుటకొఱకు గతసంవత్సరములలో రమారమి 30 కోట్ల రూప్యములు హైందవులను కష్టపెట్టి లాగికొని యుండిరి. మఱియు నీధనమేకనుక వ్యవసాయదారులయొద్ద నిలువయున్న యెడల వారు కష్టకాలముల తమ్ముకాపాడుకొనుటయేగాక కూలిపనివాండ్రను కూడ మిగుల తోడ్పడియుందురు. ఈసంగతులను గవర్నమెంటు వారాంగ్లేయులకు తెలియజెప్పరు. సర్ జాన్ స్ట్రాచీ యీవిషయము నసలేగుర్తించుట లేదు. అతడు క్షామనివారక కార్యములపై తనచూడ్కిని నిగుడించుటతో సంతృప్తినొంది ఇకముందు వచ్చు క్షామముల నెదుర్కొనుటకై యింకను నధికముగ రయిల్వేల నిర్మింపవలెననుచున్నాడు. ఈరయిల్వేలను ఉదార మనస్కులగు ఆంగ్లేయ ధనాఢ్యులు హిందూదేశమునకు దత్తముచేసియుండిరని యెవరయిన అనుకొనవచ్చును. కాని యథార్థమేమన ఆకలిబాధచే కృశింపుచున్న భారతీయులగు పేదరయితులనోటి తిండిపడగొట్టి యీరయిల్వేలు నిర్మింపబడినవి. భారతదేశమీఁరెయిల్వే నిర్మాణమునకై పన్నులు రూపమున 30 కోట్లరూప్యముల చెల్లించి యుండెను. ఇవికాక 15 కోట్లరూపాయలను (ఇందును కొంతభాగము

రెయిల్వే పోషణమునకే వినియోగింపబడినది) క్షుద్బాధా నివారణార్థమై వెచ్చించియుండెను. ఇకపర్యవసానము 50 లక్షల ప్రాణములను గోల్పోయెను.

రైల్వేనిర్మాణము వలన నిట్టిఫలితములు గలుగుచుండ రైల్వేనిర్మాణము వ్యవసాయదారులకు శ్రేయోదాయకమనిగాని క్షామనివారకమనిగాని యెట్లుభావింపగలము ?

రైల్వేలు అనేకవేల భారతీయులకు జీవనోపాధిని కలిగించుచున్నవని కొందరు చెప్పుచుందురు. నేడు రైల్వేలయందు నుద్యోగములు గలిగి వానియాధారమున జీవించువారనేకులు గలరు. ఇంతమాత్రమున రైల్వేలు నూతనముగ అనేకులకు జీవనోపాధిని కల్పించుచున్నవనుట గొప్పపొరపాటు. ఏలయన రైల్వేనిర్మాణమునకు పూర్వము దేశమున భూమార్గమునను, జలమార్గమునను రాకపోకలు సల్పుటకు బండ్లను నౌకలను నడిపెడివారు చాలమందియుండిరి. పూర్వముగంగానదిపై పడవలు నడుపుకొనుటవలన రమారమి ముప్పదివేలమంది తమ జీవనముల గడపుచుండిరి. కాని రైల్వేలునిర్మింపబడిన చోటనే యితర విధములగు ప్రయాణము లాగిపోవుట వలన నీరీతిని జీవించెడివారనేకులు తమ జీవనోపాధిని గోల్పోయిరి. రెయిల్వేలు తొలుదొల్త నిట్టివారి నెత్తిగొట్టి అటుపైన కొందరు దేశీయులకు జీవనోపాధిని కల్పించెను. మఱియు పూర్వమున రాకపోకలు నడిపెడివారికును, నేటి రెయిల్వే యుద్యోగియులకును నొక గొప్పభేదముకలదు. వారి జీవనము స్వతంత్రమైనది. వీరిది అస్వతంత్రమైన దాస్యవృత్తి. ఇంతియేకాక యీ రెయిల్వేలయందైనను ఉన్నతోద్యోగము లన్నియు తెల్లవారివియు, క్రింది యుద్యోగములన్నియు హైందవులవియునై యున్నవి. ఈ కారణములచే రెయిల్వేలు నూతనముగ ననేకులా

తీయులకు వృత్తిని కల్పించి దేశమునకు మేలొనర్చుచున్నవని చెప్పుట కూడ చాల అసమంజసము.

4 రైల్వేనిర్మాణము, విదేశఋణము. రైల్వేనిర్మాణమునకు కావలసినధనములో చాల భాగము నాంగ్లదేశమునుండి అప్పుదెచ్చి, ఇండియా గవర్నమెంటువారు రయిల్వేలపై వెచ్చించుచున్నారు. నేటివఱకును రెయిల్వే నిమిత్తమున చేయబడిన ఋణములో చాల నధికభాగము ఆంగ్లదేశమునుండియే తేబడినది. ఇట్లు తీసికొనబడిన ఋణముపై ప్రతియేటను భారతదేశము వడ్డీని చెల్లించుచున్నది. 'ధనప్రవాహ' ప్రకరణమునసీమవ్యయమునుగూర్చివ్రాయుచు,నిట్టివడ్డీకూడ,సీమవ్యయములో నొకభాగమని వ్రాసియున్నాము. రెయిల్వేలవలన హిందూదేశము పొందులాభము లేకపోయినను, రెయిల్వే ఋణమునకు వడ్డీక్రింద మాత్రము అధికధనమును ప్రతియేడును విదేశమునకు చెల్లింపవలసియున్నది. హిందూదేశమునకింత విస్తారమగు రెయిల్వేలనవసరము. మఱియు రెయిల్వే నిర్మాణమునకు కావలసినధనమును హిందూదేశముననే అప్పు దెచ్చుటకు ఇండియా గవర్నమెంటు ప్రయత్నించి యుండవలసినది. ఒకవేళ హిందూదేశమున ధనము విశేషముగ దొరకకుండినచో, లభించిన దానితోడనే సంతృప్తిజెంది యుండవలసినది. ఇట్లుచేయక, విశేషధనము నాంగ్లదేశములో నప్పుగొని రెయిల్వేల నిర్మించుటవలన నేడు ఫలితమేమైనది? హిందూదేశమున కవసరము లేకుండనే, ఈదేశముయొక్క భాగ్యముతోనిమిత్తములేకుండనే, రెయిల్వేలు నిర్మింపబడి విశేషముగ నవి వానివలన ఆంగ్లేయవాణిజ్యము బహులాభముల నందుచున్నది. ఆంగ్లేయ ధనాఢ్యులకు వడ్డీని చెల్లించుటకై ఇండియా గవర్నమెంటు ప్రజలు చెల్లించెడి పన్నులనుండి కొంత ధనమును ఆంగ్లదేశమున కంపుచున్నది. ఇట్టి ధనప్రవాహమువలన పరిణామము భారతదేశ దారిద్ర్యమని వేఱుగా తెల్పననవసరము.

భారతదేశమున కిట్లనేక విధముల ననర్థదాయకములగు రయిల్వేలేల పెంపొందింపబడుచున్నవి? ఈప్రశ్న కీప్రకరణము మొదటనే తెల్పబడిన డాక్టరు స్ప్రాతలు సమాధానమొసగగలవు. హిందూదేశమున నాంగ్లేయసామ్రాజ్యమును సంరక్షించుకొనుటయే వీని నిర్మాణమునకు ప్రథాన కారణము. ఆంగ్లేయవర్తకలాభము రెండవ కారణము. హిందూదేశమునందలి రెయిల్వేలలో కొన్ని ప్రత్యేకముగ ఆంగ్లసామ్రాజ్య సంరక్షణోద్దేశముతో (స్ట్రాటెజిక్ రెయిల్వేలను పేర) నిర్మింపబడినవి కలవు. వీనివలన నెట్టి ఆదాయముగాని లభింపకపోయినను ఇండియాగవర్నమెంటువారు తమ సేనల యుపయోగమునకై వీనిని పోషించుచునేయున్నారు. కేవలమివి మాత్రమేగాక యితర రెయిల్వేలుకూడ ప్రభుత్వమున కవసరసమయములందు సేనలతీసికొనిపోవుటయందేమి యితరవిధములనేమి సహాయపడుచున్నవి. ఆంగ్లసామ్రాజ్యమును సుస్థిరముగ భారతదేశమున నుండునట్లు జేయుటకు కల్పింపబడిన సాధనములలో రెయిల్వేలు ప్రధమగణ్యములని గ్రహింపనగును.

ఎగుమతి దిగుమతులందును రెయిల్వేరేట్ల నిర్ణయమునను ఆంగ్లేయ వాణిజ్యమెట్టి సౌకర్యమును పొందుచున్నదియు నిదివఱకే జూచియున్నాము.

మఱియు రెయిల్వేనిర్మాణము కతన నెందరెందఱాంగ్లేయులు ఏయేప్రకారములు లాభముగాంచుచున్నదియు చూచినచో ఆశ్చర్యముగలుగక మానదు.

హిందూదేశమున రెయిల్వేనిర్మాణముకతన ఆంగ్లేయ ధనాఢ్యులకు తమయొద్ద నిలువయుండిన ధనమును ఋణముగనొసంగి లాభముపొందు నవకాశ మేర్పడుచున్నది. ఆంగ్లదేశములో తయారయిన రయిల్వేసామగ్రినే ఇండియాగవర్నమెంటు యిచ్చటకు దిగుమతిచే

యుటవలన ఆంగ్లకర్మాగారములకు పనికలుగుచున్నది. ఆంగ్ల పరిశ్రమాధికారులు లాభము పొందుచున్నారు. కర్మాగారములలో పనిచేయు కూలి పనివాండ్రకు పనిదొరుకుటచే జీవనము లభించుచున్నది. ఐరోపా మహా సంగ్రామానంతరము సరియగుపని లేకజీవనమునకై చిక్కుపడుచున్న యనేక కూలిపని వాండ్రకు 5 సం॥ వరకు ప్రతియేటను 30 కోట్లరూప్యములు రయిల్వేలపై ఖర్చుపెట్టవలెనను, 1922 వ సం॥ పు ప్రభుత్వమువారి తీర్మానము నిజముగ సంజీవినివలె పనిచేసి యనేక ఆంగ్లేయ కార్మికులకు పనిని కల్పించి జీవనము కలుగజేసెనని చెప్పవచ్చును. ఇక రయిల్వేసామగ్రిని హిందూదేశమునకు తీసికొనివచ్చు ఆంగ్లేయుల పొగయోడలును విశేషధనము నార్జించెను. తనదేశమున జీవనము దొరకక హిందూదేశమునకే తెంచు ఆంగ్లేయులకు రయిల్వే లున్నతోద్యోగముల నొసంగి యధికారమును అత్యధిక వేతనములను ప్రసాదించుచున్నవి. ఈసంగతులన్నిటివలనను రయిల్వేలు భారతవర్షమునుండి ధనము నాకర్షించుట కుపయోగింపబడిన సాధనములని తెలియుచున్నది.



## 14 వ ప్రకరణము.

### హిందూదేశపు ఋణము—(The Indian debt)

1923 వ సం॥ము మార్చి 31 వ తారీఖునాటికి ఇండియాగవర్న మెంటువారు, హిందూదేశపు ఋణమనుపేరిట 781 కోట్లరూపాయలను ఋణముచేసి యున్నారు. ఈ ఋణము ఆంగ్లేయప్రభుత్వముననే యుద్భవించి యుండెనని పాఠకమహాశయులకు తెలిసియే యుండవచ్చును. హిందూరాజులుగాని, మహమ్మదీయ పరిపాలకులుగాని, హిందూదేశమును పాలించునప్పుడు తమకవసర సమయములందు కావలసిన ధనము నప్పుగొని స్వల్పకాలములోనే తీర్చివైచుచుండెడివారు. నాడు వంశానుక్రమముగ వచ్చుచుండిన ఋణము లేకుండెను. 200 సంవత్సరములకు పూర్వము పాశ్చాత్యదేశములందుసైతము జాతీయఋణమను పేరిట నప్పుపుచ్చుకొను పద్ధతి లేకుండెను. 1688 వ సం॥న ఆంగ్లజాతీయఋణము 6,64,223 పౌనులుమాత్రమే యుండెను. కాని తమదేశముల సంరక్షించుకొనుటకును, సామ్రాజ్యమును విస్తరింపజేయుటకును, వలసరాజ్యముల కల్పించుటకును, దేశీయగౌరవప్రతిష్ఠల నిలబెట్టుటకును, పాశ్చాత్యప్రభుత్వములు జాతీయ-ఋణమనుపేరిట, జాత్యాభ్యుదయము నిమిత్తమై అప్పుపుచ్చుకొను పద్ధతి నవలంబించెను. హిందూదేశమన్ననో పరాధీనమై యున్నది. ఆమె యితరరాజ్యముల జయించుటకుగాని, అధనివేశముల స్థాపించుటకుగాని ఋణము చేయవలసిన యవసరము లేదు. అయినను ఆంగ్లపాలకులు భారతజాతీయ ఋణమనుపేరిట (ఇండియన్ నేషనల్ డెట్) ధనమును విశేషముగ నప్పుగొని, యీ ఋణమును పెంపుజేయుచున్నారు.

ఈ ఋణముపైనగు వడ్డీని ప్రతిసంవత్సరము భారతదేశము

చెల్లింపుచున్నది. ఈఋణమునుదీర్చు భారమునుగుండ నీదేశముపై బడ వేసియున్నారు. ఈ[illegible]చే అర్థశాస్త్రవేత్తలు పెక్కుమంది యీ ఋణమును జాతీయ-ఋణమని పిలుచుచుందురు. ఈఋణము జాతీయమా? జాతీయ-ఋణమును స్వీకరించుచున్న పాశ్చాత్యదేశములు స్వాతంత్ర్యమును, ప్రజాప్రభుత్వమును గల్గియున్నవి. అచ్చోట పాలకులు, పాలితులకు సంపూర్ణబాధ్యత వహించియున్న కారణమున, పాలకవర్గముచే చేయబడుచున్న ఋణము జాతికంతకును చెందుచున్నది. కావున జాతీయ-ఋణ మగుచున్నది. భారతదేశము పారతంత్ర్యము ననుభవించుచున్నది ఇచ్చట ప్రభువులు, ప్రజలకు బాధ్యత వహించియుండకపోవుటచే, ప్రభుత్వముచే, జేయబడిన ఋణమునకు ప్రజలు బాధ్యత వహింపజాలరు. కావున యీ ఋణము ప్రభుత్వఋణమని పిలువబడదగునుగాని జాతీయ-ఋణము కాజాలదు. ఏనాడు ప్రభుత్వము ప్రజలకు సంపూర్ణమగు బాధ్యతనువహించియుండునో, ఆనాటియుండియు ప్రభుత్వముచేయు ఋణము జాతీయ-ఋణము కాగలదు.

### ఋణముయొక్క సంగ్రహ చరిత్రము.

ఈఋణము ఈస్టిండియాకంపెనీవారి పరిపాలనమున నుద్భవించినది. 1792 వ సం॥ నాటికి కంపెనీవారు చేసిన ఋణము 7 కోట్లరూపాయలకంటె కొంచెమెక్కువగ నుండెను. 1799 వ సం॥న కిది 10 కోట్లరూపాయలయ్యెను. వెల్లెస్లీప్రభుత్వ కాలమున జరిగిన యుద్ధకారణమున కంపెనివారుచేసిన ఋణము 1805 వ సం॥ నాటికి 21 కోటి రూప్యములును 1807 వ సం॥ నాటికి 27 కోట్లును అయ్యెను. పిమ్మట కొలది వత్సరముల వఱకును ఋణములో హెచ్చుతగ్గులు లేకుండెను. 1829 వ సం॥ నాటికి 30 కోట్లరూపాయలయ్యెను. కాని విలియంబెంటింగు ప్రభువు ప్రజలయెడ సానుభూతిగల్గి వారికష్టముల గమనించి వ్యయమునుతగ్గించి కొంతఋణమును దీర్చగల్గెను. అందుచే 1836 వ సం॥నాటికి

ఋణము 27 కోట్లరూపాయల వఱకుతగ్గెను. కాని ఆక్లెండుప్రభువు తరువాత వచ్చిన గవర్నరు జనరలుల యుద్ధములవలనే వ్యయముచాల నధికమయ్యెను. అందుచే ఋణము హెచ్చెను. ఆక్లెండుప్రభువుచే నొనర్పబడిన ఆఫ్ఘనుయుద్ధమువలన 1844-5 వ సం॥ నాటికి యీ ఋణము 43½ కోట్లరూపాయలయ్యెను. ఎల్లెన్‌బరోప్రభువు సింధుదేశమునాక్రమించుటవలనను హార్డింజి డాల్హౌసీప్రభువులు సిఖ్ఖులతో యుద్ధమునకు బూనుకొనుటవలనను 1850-51 వ సం॥ నాటికి ఋణము 55 కోట్లరూపాయలయ్యెను. తరవాత కొంచెముచ్చుతగ్గులు కన్పడెను. ఋణమును తగ్గించుటకు ప్రయత్నములుగూడ జరిగెను. కాని అవియన్నియు వృథాయయ్యెను. డాల్హౌసీప్రభుత్వ మంతమొందునాటికి కంపెనీవారు చేసినఋణము 59½ కోట్ల రూపాయలయ్యెను. 1857 వ సం॥మున ప్రారంభమైన సిపాయివిప్లవము నణచివైచుటకై కంపెనీవారింక నుధనము నప్పుగొని ఋణమును పెంపుజేసిరి. 1858వ సం॥ము ఏప్రిలు 30 వ తారీఖునకు కంపెనీవారుచేసిన మొత్తము ఋణము 69½ కోట్ల రూపాయలుండెను.

ఆనాడే పార్లమెంటువారు హిందూదేశ పరిపాలనమును ఈస్టిండియాకంపెనియొక్క స్వాస్తములనుండి తొలగించి తమవశము జేసికొనిరి. కాని యట్లుచేయుటలో ప్రత్యేకపు ప్రయత్నములతో కూడిన కంపెనీ తనస్వలాభమునిమిత్తమై చేసియుండిన ఋణమునుదీర్చు భారమావ్యక్తులపైగాని నూతనముగ పరిపాలనము వహించిన పార్లమెంటుపైగాని గాక భారతీయులపై బడవైచిరి. ఇంతియగాక ఈస్టిండియాకంపెనీ యొక్క మూలధనమగు 12 మిలియను పౌన్లను (12 కోట్లరూపాయలు) చెల్లించుటకుగూడ భారతీయులనే బాధ్యులుగ జేసిరి.

ఇందు గమనింపదగిన యంశమొండుగలదు. భారతప్రభుత్వపక్షమున హిందూదేశమునను ఆంగ్లదేశమునను గూడ ధనము వ్యయమగు

చున్నట్లును, రెండవవిధమగు వ్యయమును, సీమ వ్యయమని పిలుతురు నియు నిదివఱకే వ్రాసియున్నాము. ఇట్టి సీమ వ్యయమును పరిగణింపక కేవలము భారత దేశమందలి ఆదాయవ్యయములను పరికించినచో 1792 మొదలు 1838 వఱకునుగల 46 సంవత్సరములలో, కంపెనీ ప్రభుత్వమునకు 32 సం॥లు నిల్వయును, 14 సం॥లు లోటును కనబడెను. నిల్వయొక్క మొత్తము 49 కోట్ల రూపాయలును, లోటు 17 కోట్లను నుండెను. కావున నికరపునిల్వ 32 కోట్ల రూపాయలు ఈసంవత్సరములన్నిటియందును భారత దేశపరిపాలనకు కంపెనీకైన వ్యయమునంతను భారతీయులు భరించిరి. భారతదేశమును జయించుటకై ఈస్టిండియాకంపెనీకైన వ్యయమునుగూడ వారేభరించిరి. అన్యదేశములతోను, అన్యదేశీయులతోడను కంపెనీవారుచేసిన యుద్ధముల వ్యయమునంతయు కూడభరించిరి. అయినను యీ 46 సం॥ములలో 32 కోట్ల రూపాయలు భారతదేశమున నిలువ తేలెను. కాని యీనిలువ తేలినమొత్తము భారతదేశమున కుదువబెట్టబడలేదు. నీటివసతుల నిర్మాణమునకుగాని, యితర ప్రజోపయోగ కార్యములకుగాని వినియోగింపబడలేదు. ఈధనము ఆంగ్లదేశమునకు కప్పము క్రిందవెడలియుండెను. ఈస్టిండియాకంపెనీ వాటాదార్లకు లాభములచెల్లించుటకు (సీమవ్యయమనుపేర) ఆంగ్లదేశమునకు వెడలియుండెను. మఱియు నీనిల్వయొక్క మొత్తము సీమవ్యయమొత్తమునకు తుల్యముకానట్లు గూడ గోచరింపగలదు. అధికముగనున్న సీమవ్యయమును చెల్లించుటకై కంపెనీ ప్రభుత్వము ఋణమునుగైకొనెను. సీమవ్యయమే లేకుండినచో ఋణమే లేకుండెడిది. ఋణమునకుచాలుగ నిల్వకనబడియుండెడిది. తన రాజకీయపరాధీనతవలన హిందూదేశము ఆంగ్లదేశమునకు చెల్లించుచుండిన ధనమే, (దీనినేకప్పమనిన అనవచ్చును) పాలకులు ఋణముచేయుటకు కారణమైయున్నది.

ఋణము తీసికొనబడిన ధనము హిందూదేశాభివృద్ధికి వినియోగింపబడలేదు. స్వార్థపరత్వమున నిరుపమానమగు కంపెని, ఆంగ్ల దేశమునందలి తన వాటాదార్లకు లాభము చెల్లించుటకయి ధనము నప్పుగొని యుండెను. కాని కంపెనీప్రభుత్వముమారి పార్లమెంటు ఇండియా గవర్నమెంటును స్వీకరించునపు డీఋణమును (69½ కోట్లు రూపాయలు) హిందూదేశముపై బడవయిచిరి. ఇదియేటిన్యాయము? "బ్రిటిషున్యాయము"ను ప్రకటించు విషయములింకను గలవు. కంపెనీ ప్రభుత్వమంతరించునప్పుడు కంపెనీ మూలధనమగు 12 కోట్ల రూపాయలను (ఏద్దానిపయి విశేషలాభముల చెల్లించుటకు సంవత్సరము వెంబడి సంవత్సరమొక నూరువత్సరములు. హిందూదేశమునుండి ధనము గొంపోబడెనో అట్టిమూలధనమును) దీర్చుభారమునుగూడ భారతీయుల మస్తకకములపై బడవైచిరి. ఈస్టిండియా కంపెనీమూల ధనమునకును, భారతదేశమునకునుగల సంబంధమేమి? ఆధనము హిందూదేశమునకు తీసుకొని రాబడెనా? హిందూదేశాభివృద్ధికి వినియోగింపబడెనా? కొందఱు వర్తకులు తమ స్వలాభమున కయి వాణిజ్యమున పెట్టుబడిపెట్టిన ధనమును చెల్లించుభారమును హిందూదేశముపై బడవేయుట యేటిన్యాయము? పారతంత్ర్యకారణమున గదా, ఆంగ్లేయులిట్టి భారములను హాయిందవుల శిరములపై బడవైచుచున్నది!

సిపాయివిప్లవము నణచుటకైన ఋణము:—సిపాయివిప్లవము ప్రారంభమై ఒకసంవత్సరము గడచిన పిమ్మట పార్లమెంటువారు హిందూదేశ పరిపాలనమును తమ హస్తగతము జేసికొనిరి. ఈసంవత్సరములో కంపెనీవారు విప్లవము నణచునిమిత్తము 10 కోట్లురూప్యముల నప్పుచేసి ఋణముయొక్క మొత్తమును 69½ కోట్లు గావించిరి. ఇదిగాక 1862 వ సంవత్సరము లోపుగ పార్లమెంటువారును

విప్లవకారణముననే, మఱియొక 30 కోట్లు రూపాయలను ఋణముచేసి ఋణమొత్తమును 100 కోట్లుగావించిరి. ఇట్లు విప్లవమునణచుటకైన మొత్తము 40 కోట్లు రూపాయలను హిందూదేశ ఋణమునకు జేరెను. భారతదేశమునందలి విప్లవమునణచి, తమ సామ్రాజ్యమును నిష్కంటకముగ జేయుటకైన, వ్యయమునంతను తామే భరించుటకు మారుగ ఇంగ్లీషు పార్లమెంటువారు భారతదేశముపై బడద్రోసిరి. ఆంగ్లేయులు తమ యధినివేశ రాజ్యముల(కాలనీల) జయించుటకైన వ్యయమునంతను తామే భరించియుండ, భారతదేశమును జయించుటకైన వ్యయమును భారతదేశముపై బడవేయుటజూడ ఆంగ్లేయులు హిందూదేశమునెడ నెట్టియభిప్రాయములతో ప్రవర్తించుచున్నారో స్పష్టము కాగలదు.

ప్రపంచమున నెన్నడైన, న్యాయమగు విప్లవము జరిగియున్న యెడల నయ్యది గోవులయొక్కయు, పందులయొక్కయు క్రొవ్వులతో పూయబడిన తూటాలనెడ క్రోధము నహించి హిందూదర్పులును, మహమ్మదీయులును సల్పియున్న తిరుగబాటై యున్నదని, లెకీయను చరిత్రకారుడు వ్రాసియున్నాడు. అపరాధనమును గావించినది ఆంగ్లేయ పరిపాలకులు. వ్యయమును భరించినది భారతదేశము. ఇంతకుపూర్వము భారతదేశసైన్యములు ఆంగ్లదేశపక్షమున చీనాదేశమందును, ఆఫ్ఘనిస్థానమందును, బంపబడియుండెను. కాని దేశాంతరములలో సైన్యము నుపయోగించినందులకు పార్లమెంటువారొక షిల్లింగునయినను చెల్లించియుండలేదు. భారతీయులు చెల్లించిన పన్నులనుండియే కంపెనీవారు వ్యయమునంతను భరించియుండిరి. కాని సిపాయివిప్లవము నణచుటకై బ్రిటిషు సేనలు పంపబడినపుడు, వీనికైన వ్యయమునంతను ఆంగ్లదేశము హిందూదేశమునుండి యక్రమముగ పుచ్చుకొనెను. ఇంతియకాదు; ఈబ్రిటిషుసేనలు హిందూదేశమునకు

బయటు దేయులకు పూర్వపు ఆరుమాసముల జీతమునుకూడ హైందవ ద్రవ్యమునుండి పార్లమెంటువారు చెల్లించిరి. సిపాయిపితూరీ బాధుఅణచుటనిమిత్తమైన నీ 40 కోట్ల రూపాయలను గురించియు, సర్ జాన్ బ్రైటు అనుసుప్రసిద్ధ ఆంగ్లేయుడు ఇట్లు చెప్పియున్నాడు. "తిరుగ బాటు నణచుటకు ఖర్చైన నీ 40 కోట్ల రూప్యముల భారమును భారతీయులపై బడవైచుట విచారకరము. అయ్యది (తిరుగబాటు) ఆంగ్లేయుల యొక్కయు, పార్లమెంటు యొక్కయు దుష్పరిపాలనము వలన సంభవించినది. న్యాయము ననుసరించి ఆ 40 కోట్లరూప్యములను ఈదేశపు (ఆంగ్లదేశపు) ప్రజలపై విధింపబడిన పన్నులనుండి చెల్లించవలసియుండును."

ఇట్లు ఋణము 100 కోట్లును, ఈస్టిండియా కంపెనీ మూలధనము 12 కోట్లును, మొత్తము 112 కోట్లు రూపాయల ఋణమును భారతదేశముపై బడవయిచి ఇండియాగవర్నమెంటువారు తమ పరిపాలనమును ప్రారంభించిరి.

ప్రతిఫలయుక్తమగు ఋణము:— ఈ 112 కోట్లు రూపాయీలనుగూడ యుద్ధముల వలనను, సీమవ్యయము వలనను చేయబడిన ఋణమేగాని దేశాభివృద్ధికి చేయబడినదికాదు. ఈ ఋణమును "సాధారణ రుణ"మని పిలుచుచుందురు. పార్లమెంటు హిందూదేశ ప్రభుత్వమును స్వాధీనముచేసికొనిన పిమ్మట రెయిల్వేలను, జలాశయములను నిర్మించుటకు ప్రత్యేకముగ ప్రతిఫలయుక్తమగు రుణమని పేరట నప్పుగొన మొదలిడిరి. ఈప్రతిఫలయుక్తమగు రుణమైనను పూర్తిగ దేశాభివృద్ధికి తోడ్పడియుండలేదు. రెయిల్వేలకై వెచ్చింపబడిన నధికద్రవ్యముపై చాలాకాలమువరకు ప్రతిఫలము రాకపోవుటచే హిందూదేశ మధికనష్టమును భరింపవలసివచ్చెను. రెయిల్వేలకొఱకును, నీటికట్టడములకొఱకును తీసికొనబడిన రుణమీక్రింది విధమున వృద్ధియైనది.

| | రైల్వే ఋణము. | ఇరిగేషను ఋణము. | ప్రతిఫలయుక్త ఋణమొత్తం |
|---|---|---|---|
| 31వమార్చి 1893 వ సం॥నకు | రు. 136.5కో॥ | రు.28.9కో॥ | రు.165.4కో॥ |
| 1898 | 159.0 | 32.5 | 191.5 |
| 1903 | 192.1 | 37.2 | 229.3 |
| 1908 | 266.6 | 44.8 | 311.4 |
| 1913 | 317.7 | 56.4 | 374.1 |
| 1918 | 358.8 | 65.9 | 424.7 |
| 1920 | 381.0 | 67.5 | 448.5 |

సాధారణఋణము:—పెట్టుబడులక్రింద వినియోగించు నిమిత్తముగాక, యితర ప్రయోజనములకు చేకొన్నఋణమును సాధారణ ఋణమందురు. ఇండియాగవర్నమెంటు ప్రారంభమున నిది 112 కోట్లు రూపాయలుండెను. తరువాత సంభవించిన కఱవుల కారణముగను, యుద్ధములవలనను, మారకపు నష్టములవలనను నీఋణముచాల హెచ్చియుండవలసినది. కాని యొక విచిత్రపద్ధతి నవలంబించి, పాలకులీఋణముయొక్క మొత్తమును తగ్గుచున్నట్లగపడ జేయుచున్నారు. ఏసంవత్సరమైనను ప్రభుత్వమునకు నిల్వ చేకూరినయెడల, ఆమొత్తమును రెయిల్వేలపైననో, నీటికట్టడములకొఱకో వెచ్చింతురు. సాధారణ ఋణమునందీమొత్తము తీర్చబడినట్లు భావించి, యీమొత్తమును సాధారణ ఋణపుజాబితానుండి తగ్గింతురు. నిర్మాణములకొఱకు క్రొత్తగ ఋణముగ్రహింపబడినట్లు భావించి, యీమొత్తమును ప్రతిఫలయుక్తఋణముయొక్క జాబితాకు జేర్చెదరు. ఈ ప్రకారముగనే ఋణముగాని తీర్చకపోయినను, సాధారణఋణము తగ్గినట్లును ప్రతిఫలయుక్తఋణము హెచ్చినట్లును అగపడుచుండును. ఇట్టి విధానమువలన, సాధారణఋణ మీక్రిందివిధమున క్రమముగ తగ్గినది.

| సం॥మునాటికి | సాధారణరుణము. |
| --- | --- |
| 1888 | 109.5 కోట్ల రూపాయలు. |
| 1893 | 97.0 |
| 1898 | 105.5 |
| 1903 | 88.7 |
| 1908 | 56.1 |
| 1913 | 37.5 |
| 1914 | 19.2 |
| 1915 | 93 3 |
| 1916 | 3.0 |
| 1917 | 10.5 |
| 1918 | 132.5 |
| 1919 | 129.9 |
| 1920 | 117.8 |

1917 వ సం॥న హిందూదేశప్రభుత్వము ఐరోపామహాసంగ్రామమునందు ఇంగ్లాండు దేశమునకు ధనసహాయము చేయనిశ్చయించుటచేతను, 1919 వ సం॥మునుండియు, అమితసైనికవ్యయమువలన 'లోట్లు' కలుగుచుండుటచేతను, నీరుణము గడచిన 7 సంవత్సరములలో చాల నధికమయ్యెను.

## ఐరోపా మహాసంగ్రామము.

ఈమహాసంగ్రామము ప్రారంభమైనప్పటినుండియు ఆంగ్ల దేశమునకు సహాయమొనర్చిన కారణమున హిందూదేశము భరింపవలసిన వ్యయము చాలఅధికమయ్యెను. యుద్ధముప్రారంభమైన వెంటనే రెండు హైందవ సిపాయిదళములు హిందూదేశపు ఖర్చులపై ఫ్రాంసురణ

రంగమునకంపబడెను, కాలక్రమమున 12,50,000 సైనికులు పోగుచేయబడి వివిధరంగములకు పంపబడిరి. మఱియు సంగ్రామకారణమున సైనికవ్యయము 1914-15 సం॥ మొదలు 1918 వ సం॥ము మార్చి 31 వ తారీఖువఱకు 24 కోట్ల 75 లక్షలరూప్యములు హెచ్చెను. అటుపిమ్మట గూడ సైనికవ్యయము రమారమి 37 కోట్ల 75 లక్షల రూప్యము లభివృద్ధి జెందెను. మఱియు రాజకీయపు ఖర్చులు సుమారు 2 కోట్ల 25 లక్షల వఱకు హెచ్చియుండెను. ఈకాలమున సివిలుశాఖకగు వ్యయముగూడ $37\frac{1}{2}$ లక్షల రూపాయలు వృద్ధియయ్యెను. ఇంతియకాక యుద్ధకారణమున చేయబడిన ఋణముపై 20 కోట్ల రూపాయల వఱకును వడ్డీచెల్లించబడెను. ఇట్లు ఐరోపా సంగ్రామమువలన మొత్తము రమారమి $87\frac{1}{2}$ కోట్ల రూపాయల వఱకును హిందూదేశము వ్యయముచేసియుండెను.

ఇంతియకాదు. 1917 వ సంవత్సరారంభమున (మార్చి నెలలో) ఇండియా గవర్నమెంటువారు 100 మిల్లియను పౌన్లను (అనగా 150 కోట్లరూపాయలను) సామ్రాజ్య ప్రభుత్వమునకు సహాయముచేయ నిశ్చయించిరి. ఆంగ్లరాజనీతిజ్ఞులు దీనిని భారతదేశమయాచితముగ సమర్పించిన కానుకయనిపిలుచుచు భారతీయుల ఔదార్యమును కొనియాడ నారంభించిరి. కాని యదార్థమేమన ఈ 150 కోట్ల రూప్యముల సమర్పించు విషయమై భారత సామ్రాజ్యశాసనసభకు జెందిన సభ్యులయభిప్రాయమైనను తీసికొనబడలేదు. భారతదేశ ప్రజల కాసంగతి యసలే తెలియదు. రాజప్రతినిధి ఇండియా కార్యదర్శితో నీవిషయమై తంతిమార్గము ద్వారా సంభాషణముసల్పి 150 కోట్లను ఆంగ్లదేశమునకు సమర్పించుటకు నిశ్చయించినవాడై అటుపిమ్మట భారతదేశము 150 కోట్లరూపాయలను ఆంగ్లదేశమునకు బహుమానముగ నర్పింపనిశ్చయించినదని ప్రజలకు వెల్లడిచేసెను. ఇందలి చోద్యమెల్లరకు

గోచరము కాగలదు. భారతీయుల యభిప్రాయమును కనుగొనకయే తన అవ్యాహతమగు నిరంకుశాధికారము నుపయోగించి అర్పింపడల చిన కానుకను రాజప్రతినిధి భారతదేశమయాచితముగ సమర్పించిన బహుమానమని పలుకుట కడుసాహసముగదా! ఈ 150 కోట్లను సమకూర్చుటకై హిందూదేశమున యుద్ధరుణము (War loan) చేయబడెను. కొంతరాజభక్తివలనను కొంతప్రోత్సాహమువలనను చాలవఱకు ప్రభుత్వోద్యోగుల నిర్బంధమువలను యీరుణము 1917 వ సం॥న 50 కోట్లరూప్యములును 1918 వ సం॥న మఱియొక 57 కోట్లును ప్రోగు చేయబడెను.

ఇంతియకాక 1918 వ సం॥న (యుద్ధమంతమగుటకు ఒక నెల పూర్వము) భారతశాసన సభ్యులయనుమతిపై మఱియొక 45 మిల్లియ నుపౌన్లను (అనగా $67\frac{1}{2}$ కోట్లరూపాయలను) సహాయము చేయుటకు ఇండియాగవర్నమెంటువారు నిశ్చయించిరి. అనగా యుద్ధకానుకక్రింద మొత్తము $217\frac{1}{2}$ కోట్లు గ్రహింపబడెను. హిందూదేశము ఆంగ్లదేశమున కొసఁగిన యీయుద్ధసహాయము విషయమై కొన్ని సంగతులగుర్తింపవలసియున్నది.

1. ఆంగ్లసామ్రాజ్యముకొరకై భారతదేశ మింతకుపూర్వ మనేక యుద్ధములలో దిగెను. ఒక్క రెండవఆఫ్ఘను యుద్ధమునజేసిన 5 కోట్ల రూపాయల సహాయముతక్క, ఆంగ్లదేశము మరెప్పుడును, యుద్ధవ్యయమును భరింపకపోవుటయేగాక, కొంత సహాయమునైనను జేసియుండలేదు. ఆంగ్లదేశ మైశ్వర్యముతో తులతూగుచున్నది. భారతదేశము బీదదేశము. అట్టితరి ఆంగ్లదేశము యుద్ధములో దిగినప్పుడు భారతదేశమునుండి $217\frac{1}{2}$ కోట్లరూపాయలను సమర్పించుట యెంతయు న్యాయవిరుద్ధముగదా !

2. యుద్ధకానుక $217\frac{1}{2}$ కోట్లునుగాక, యుద్ధకారణమునవృద్ధియై

రమారమి 87½ కోట్ల రూపాయల వ్యయమును భారతవర్షము భరించినట్లిదివఱకే చెప్పియున్నాము. ఇదికాక ఇండియా గవర్నమెంటు వారు రమారమి 200 కోట్ల రూపాయలను బ్రిటిషు సెక్యూరిటీలలో పెట్టుబడిపెట్టెరి. వడ్డీరేటు తరువాత హెచ్చుటవలనను, రూపాయి ధర పెరుగుటవలనను, ఈమొత్తములో దాదాపుగ నొకసగము భాగమును హిందూదేశము నష్టపోవలసియున్నది. వీనితోపాటు యుద్ధఋణకారణమున ప్రతియేడును 15 కోట్ల రూపాయలు వడ్డీ చెల్లించవలసియున్నది.

3. భారతదేశ మొనర్చిన సహాయమేమి? భారతదేశపు యదార్థావస్థయేమి? రెంటికిని యెంతవ్యత్యాసముగలదు? 1917 వ సం॥పు ఏప్రిల్ మాసపు క్వార్టర్లీరివ్యూయందు భారతదేశపుస్థితిని గూర్చి, డబ్ల్యు హెచ్. మూర్లండు (W. H. Moreland) ఇట్లువ్రాసియున్నాడు "భారతీయుల, సాధారణ జీవనమెంతహీనముగ నుండునదియు అనేకులకు తెలియును. జనసామాన్యము, జీవనమున కత్యంతావశ్యకములగు వస్తువులను మాత్రమేకల్గియున్నది. ఇండ్లులేనివారు, ధరించుటకు వలయువస్త్రములులేనివారు, వైద్యసహాయము లేనివారు, చదువులేనివారు, విశేషపరిశ్రమచే యలసటనొందువారు, చివరకు భుజించుటకైనను సరియగు నాహారములేనివారు అనేకులుగలరు. ప్రస్తుతపు దేశాదాయము అందఱకును సమానముగ పంచిపెట్టబడినచో, అత్యావశ్యకములగు జీవనాధారములకయినను సరిపోదు. భారతదేశముయొక్క బీదావస్థను నిరూపించుచు ఆంగ్లదేశములోని "నేషన్" "మాంచెస్టరుగార్డియన్" పత్రికలుకూడ 150 కోట్లు రూపాయల యుద్ధకానుకను ఖండించియున్నవి.

4. వలసరాజ్యములు (కాలనీలు) ఆంగ్లసామ్రాజ్యమునకు చేసిన ధనసహాయము ఋణపూర్వకముగాని, బహుమానముగాదు.

కాలనీలిచ్చినధనముచు ఆంగ్లదేశముకొంతకాలమునకుతిరిగి యిచ్చివేయవలెను. కాని భారతదేశమొసగిన ధనమట్లు చెల్లింపబడదు. కాలనీలు స్వాతంత్ర్యము ననుభవించుచు ఐశ్వర్యము నొందుచున్నవి. అయిననవి చెల్లించినధనముచు తీర్చివేయవలెను. భారతదేశమో ఆర్థికస్వాతంత్ర్య హీనమైయుంతకంతకు దారిద్ర్యమహాంబుధిని మునిగిపోవుచున్నప్పటికిని నామెచెల్లించినధనము తిరిగిరాదు. సహాయముచేయవలసి వచ్చినప్పు డాంగ్లేయపాలకులు భారతదేశమును పెరటితోటవలెగదా నుపయోగించుచున్నారు.

1916 వ సం॥ లో ఐరోపామహా సంగ్రామము ముగిసెను, కాని సంగ్రామమువలని ఆర్థికఫలితములు, ఇండియాదేశమునింకను కలతపెట్టుచున్నవి. దీనికితోడు గవర్నమెంటువారు 1919 వ సం॥ లో ఆఫ్ఘనుదేశముతో యుద్ధము ప్రారంభించిరి. 1920 వ సం॥ములో పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతములలోని 'వజీరుల' తో పోరాటము మొదలిడిరి. ఈయుద్ధములవలన సైనికవ్యయ మపరిమితముగ హెచ్చిపోయెను. గవర్నమెంటునకు వచ్చుఆదాయమునుకంటె వ్యయమధికమయ్యెను. 1922 వ సం॥ వఱకును వ్యయము తగ్గించుటకు ప్రభుత్వము వారెట్టిప్రయత్నమును గావించియుండలేదు. ప్రతి సం॥ మును గూడ ప్రజానాయకులును శాసనసభ్యులును సైనికవ్యయమునుతగ్గింపవలెనని కోరిరి గాని లాభములేకపోయెను. ఆదాయమును వృద్ధిచేయుటకునూతనముగ ననేకపన్నులను ఒకటివెంబడి యొకటి ప్రభుత్వమువారు విధింప మొదలిడిరి. కాని కృతకృత్యులుగాలేరు. ప్రభుత్వమునకు 'లోటు' లే కల్గుచుండెను. ఇట్లుగత 5 సం॥రములలోను ప్రభుత్వమునకు గల్గినలోటుమొత్తపు 100 కోట్లు రూపాయలను మించిపోయెను. ఈలోటును పూర్తిచేయుటకు గవర్నమెంటువారు ఋణముతీసికొనవలసి వచ్చెను. ఈ కారణమును ఇండియా ఋణము పెరిగిపోయెను.

ఐరోపామహా సంగ్రామమునకు పూర్వము 1914 వ సం॥ మార్చి నెలాఖరునకు ఇండియారుణము 411 కోట్ల రూపాయిలుండెను. 9 సం॥ ములలో నయ్యది అఖండముగ వృద్ధియై 1923 వ సం॥ము మార్చి నెలాఖరునకు 781 కోట్లరూప్యములయ్యెను. పార్లమెంటువారు పరిపాలమును స్వీకరించి నప్పుడు (1860 వ సం॥లో) 100 కోట్లరూపాయల రుణముండెను.

అది మొదలు (అనగా 1914 వ సం॥నాటికి) రుణము 311 కోట్ల రూపాయలు హెచ్చెను. కాని తరువాత 9 సంవత్సరములలో రుణము 370 కోట్ల రూపాయలు వృద్ధియయ్యెను. మొదటి 54 సంవత్సరముల కంటె తరువాత 9 సంవత్సరములలోనైన రుణము మొత్తమే 59 కోట్ల రూపాయలధికముగా నున్నట్లు దీనివలన గోచరించుచున్నది.



## ఉపసంహారము.

---

## మనకీదారిద్ర్యమేల ?

ప్లాసీరణరంగమున నాంగ్లేయులు విజయమొంది భారతదేశమున పారతంత్ర్యము నెలకొల్ప ప్రారంభించి నేటికి రమారమి నూటయేబది యారు వత్సరములగుచున్నది. ఆంగ్లేయ రాజ్యారంభమునకు పూర్వపు దేశస్థితిని మనస్సునభావించి, యద్దానితో నేడు మన కనులకు గోచరించుయవస్థను పోల్చినచో, విశేష భేదము కన్పడుచున్నది. మహోన్నతమగు సౌధరాజమొకటి పిడుగుపడి భిన్నభిన్నములుగ శిథిలమైనటుల, భారతాభ్యుదయము పరిపాలనాహతమై క్రమముగ జీర్ణమైనది. ఏదేశము అనేక శతాబ్దములు తనసుందరములగు దుకూలములకును, విశేష వాణిజ్యమునకును, అతుల వైభవమునకును ప్రపంచమందంతటను పేరు గాంచియుండెనో, ఏదేశముతోడ వర్తకమొనరించుటయే పరమావధిగా నెంచి, విదేశస్థులామె పంచను జేరి మనుచుండిరో, ఏదేశము తన సంపదలతోడను, విజ్ఞానముతోడను, పరదేశములగూడ సంతృప్తి నొందించుచుండెడిదో, అట్టి భారతభూమి, నూటయేబదియారు వత్సరములలో దారిద్ర్యమునకునిక్కమై, క్షామములకు పుట్టినిల్లై, రోగబాధితయై, తేజోవిహీనయై, మనకనులయెదుట నగపడుచున్నది. ఎంతస్వల్పకాలమున, నెట్టి గొప్పమార్పు !

ఈగ్రంథమును మొదటినుండియు పఠించిన చదువరులకు, ఈ మార్పునకుగల కారణము, స్ఫుటమై, యున్నది. ఆంగ్లేయప్రభుత్వ పరిపాలనావిధానమే దీనికి కారణము. మహమ్మదీయ చక్రవర్తు హిందూదేశమును జయించి పాలించినప్పటికిని, వారికాలమున హి దేశైశ్వర్యమున కెట్టి భంగమును గలుగలేదు. వారి పరిపా దేశీయ పరిశ్రమలకును, వాణిజ్యమునకును, సంపదకును, నెట్టిహా

గలుగజేయక, దేశాభివృద్ధికి మిగుల తోడ్పడెను. ప్రజాభివృద్ధియే తమ యభివృద్ధియని, వారు భావించి దేశమును పరిపాలించిరి.

ఈస్టిండియాకంపెనీ వారవలంబించిన రాజనీతి వేఱు. "ఆంగ్లేయ జాతి యొక దుకాణదారులజాతి"యని నెపోలియను నుడివినట్లు ప్రతీతి గలదు. హిందూదేశపరిపాలనమున ఈస్టిండియాకంపెనీ యవలంబించిన నీతి దుకాణదారుని నీతికంటె నుత్కృష్టముగ గన్పడదు. దుకాణదారుని ఆదర్శమేమి? లాభము. వానికర్తవ్యము? వాణిజ్యము. వానికి న్యాయము? లాభముగడించునది. కంపెనీవారి యాదర్శమును కర్తవ్యమును న్యాయమును నింతియె హైందవవాణిజ్యమును నిర్మూలమొనర్చి తమ వ్యాపారమును పెంపొందించుకొనుటయందును హైందవపరిశ్రమల జంపి తమవాని నభివృద్ధిచేసికొనుటయందును హైందవ ధనము నొక ప్రవాహముగ తరలించుకొనిపోయి తమ్మును తమదేశమును భాగ్యవంతముగ జేసికొనుటయందును తమకుగల రాజకీయాధికారమును వినియోగించుటలో కంపెనీవారు న్యాయాన్యాయములనుగాని ధర్మాధర్మములనుగాని పాటించియుండలేదు.

1858 వ సం॥న హిందూదేశపరిపాలనమును కంపెనీవారి చేతులనుండి తొలగించి తమవశము గావించుకొనినపుడు విక్టోరియామహారాజ్ఞి యీక్రింది భావపూరితమగు ప్రకటనమును గావించియుండెను. "ఇతరపాలితులయెడ నెట్టిధర్మముల నాచరించుటకుబద్ధులమైయుంటిమో హిందూదేశవాసుల యెడలగూడ నట్టి సమానధర్మములతో ప్రవర్తించుటకు కట్టువడియున్నారము. భగవత్కృపవలన నీధర్మములనెల్ల విశ్వాసముతోడను మనఃపూర్వకముగను నిర్వర్తించెదము.

"మఱియు మాపాలితులెల్లరును, ఏజాతికిచెందినను ఏమతము నవలంబించినను సరియే, పరిపాలనమునందలి యుద్యోగముల నిర్వహించుటకు వారికిగల విద్యాశక్తి సామర్థ్యములనుబట్టి ఆయా యుద్యో

గములందు నిరాటంకముగ నిష్పక్షపాతబుద్ధితో జేర్చుకొనబడవలెనని మేము కోరుచున్నాము.

"భగవంతుని కటాక్షమున దేశమున శాంతి స్థాపింపబడినపిదప అక్కడ నివసించు ప్రజలందఱియొక్కయు హితమున కనుగుణ్యముగ ప్రభుత్వము నిర్వహింపబడవలెనని మేము హృదయపూర్వకముగ వాంఛించుచున్నాము. వారి శ్రేయోభివృద్ధియే మాకు బలము. వారిసంతుష్టియే మా క్షేమము. వారికృతజ్ఞతయే మే మాశించు బహుమానము. ప్రజాహితార్థములగు నీమాకోర్కెలను నెఱవేర్చుటకు సర్వశక్తిమంతుడగు భగవంతుడుమాకుసుమాక్రిందియధికారులకును బలము నొసగుగాక!"

ఉదారభావములతో నిండియున్న యీప్రకటనమందలి వాగ్దానములు [illegible]మైనను చెల్లింపబడలేదు. ఆంగ్లేయప్రభుత్వము నేటికిని జాతిభేదము పాటించియే పరిపాలనము కొనసాగించుచున్నది. హైందవునకెచ్చోటగాని యితరపాలితులతో సమానములగు హక్కులుగాని గౌరవమర్యాదలుగాని లేవు. బ్రిటిషువారిచే పాలింపబడుచున్న కెన్యా, దక్షిణాఫ్రికా, ఫిజీమొదలగు దేశములకు వలసపోయిన భారతీయమానవులకు సహజములగు హక్కులనైన బొందజాలక పలుకష్టములననుభవించుచున్నారు. ఇం హిందూదేశమున భారతీయునకు వి[illegible] జున[illegible]కిగల [illegible]నమునఆంగ్లేయునియొకటభారతీయుడుపొందు హైన్యము మనము [illegible] [illegible]చుచున్నాము. ఉన్నతోద్యోగములందు పరిపాలనమున ముఖ్యశాఖ [illegible] [illegible]యందుగాని సేనాదళము నాయకత్వమునందుగాని [illegible] నాయుధమును పట్టుటయైనను హైందవులు న్యాయముగ బడయజాలకున్నారు. నిష్పక్షపాతబు[illegible] నెచ్చటగాంచగలము? జాతిగుతభేదముల పాటింపక వారివారి విద్యా[illegible] శక్తిసామర్థ్యముల ననుసరించి మే యుద్యోగములెచటనొసగబడుచున్న[illegible] ప్రభుత్వమునగూడ భారతీయుల శ్రేయస్సే ప్రధానముగ

చబడుటలేదు. రైల్వేరేట్లయందేమి ఎగుమతి దిగుమతి పన్నుల విధించుటయందేమి హైందవవాణిజ్యముకంటెఆంగ్లేయవాణిజ్యమునకు పాలకులు తోడ్పడుచున్నారు. ప్రజాభీష్టమునకు వ్యతిరేకముగను ప్రజాభివృద్ధికి భంగకరముగను నొనర్పబడు కార్యములనేకములు. సైనికవ్యయమును వృద్ధిచేయుటయందును రైల్వేల నపరిమితముగ నిర్మించుట యందును సివిలు శాఖను నిరంతరాభిమానముతో పోషించుటయందును నూతనముగ పన్నులవిధింపుచుండి ప్రజలుమోయు భారమును హెచ్చించుట యందును, ఉప్పుపన్నును రెట్టింపుచేయుటయందును ఇంకను ననేకవిధములను ఈప్రస్తుత ప్రభుత్వమువారు భారతీయుల కోర్కెలను గడ్డిపోచకంటె చులకనగనెంచి త్రోసివేసిరి. వారిశ్రేయోభివృద్ధియే మాకు బలము" హైందవ శ్రేయోభివృద్ధియే వారికి బలమొసంగునని భావించినచో హిందూదేశమునుండి ధనమును నిరంతర ప్రవాహముగ నాకర్షించి హైందవులను నిస్సహాయులగు దరిద్రులుగ జేసియుండజాలరు. తొలినుండి నేటివఱకును ఆంగ్లపరిపాలకులు ఒకేవిధానము నవలంబించినారు. ఇంగ్లాండుయొక్క శ్రేయోభివృద్ధియే ప్రధానముగానెంచి వారు హైందవ వాణిజ్యమును పరిశ్రమలను ధనమునుగూడ నాదేశాభ్యుదయమున కర్పణముగ జేసిరి.

నూటయేబదిమూడు వర్షముల బ్రిటిషు పరిపాలనమున, భారతదేశమునకు గల్గిన యార్థికలాభములెవ్వి ?

1. ప్రభుత్వము వ్యవసాయాభివృద్ధి కేవిధముగను తోడ్పడుటలేదు. భారతదేశమంతయు వ్యవసాయముపై నాధారపడియున్నప్పటికిని, వ్యవసాయమును బోధించు కళాశాలలు దేశమంతటిలో యేకొలదియోకలవు. అవియైనను ప్రజల కుపయోగపడుట లేదు. వ్యవసాయాభివృద్ధికై నూతన మార్గము లవలంబింపబడక పోవుటచేతను, రైతు దారిద్ర్యము ననుభవించుచుండు

టచే భూమికి బాగు చేయలేకపోవుటచేతను, భూసారము క్రమముగ తగ్గుచున్నది. వ్యవసాయము క్షీణించుచున్నది.

2. హిందూదేశమంతయును మూడుపాళ్లు రెండుపాళ్లు శాశ్వతభూమి శిస్తు నిర్ణయమును పొందకుండుటచే, ఇతరదేశముల భూమిపన్నులు క్రమముగ హెచ్చుచేయబడుచున్నవి. భూమ్యా దాయమున సగముకంటె గూడ నెక్కువగ పన్ను గ్రహింపబడుచున్నది. పన్ను చెల్లింపగా మిగిలిన ఆదాయము రైతు కుటుంబ భరణార్థమైనను సరిపోకున్నది.

3. భూమిపన్ను లధికముగనుండుటచే, రైతులు వానిని సక్రమముగ చెల్లింపజాలక, 'సాహుకారు' యొద్దనుండి యెక్కువ వడ్డీలకు ధనమును ఋణముతెచ్చి వానిని చెల్లించుచున్నారు. కాని ఋణముల దీర్చుట కశక్తులగుటచే, చివరకు రైతులు తమయాస్తులనుగూడ గోల్పోవుచున్నారు. ప్రతిగ్రామమునందును రైతులు చేయుఋణములు హెచ్చిపోవుచున్నవి.

4. పూర్వము దేశమందెల్లెడల వ్యాపించియుండిన వస్త్రపరిశ్రమ నిర్మూలింపబడినది. విదేశములకు వస్త్రముల నెగుమతిచేయుచుండిన భారతదేశము నేడు ప్రతివర్షమును రమారమి 60 కోట్లరూపాయలు విలువగల బట్టలను విదేశమునుండి దిగుమతి చేయుచున్నది. గ్రామములందలి ప్రజలు వ్యవసాయముతక్క తామభ్యసింపదగిన మారు వృత్తిలేక క్రమముగ బీదలగుచున్నారు.

5. నేడు మనదేశమున పొగయోడలు కాదు సరికదా, సాధారణ నౌకలైనను నిర్మింపబడుటలేదు. విదేశ వ్యాపారమున నుపయోగింపబడునవి ఆంగ్లేయుల స్టీమరులో, అమెరికనుల పొగయోడలో! కోస్తావర్తకమునందైనను హైందవనౌకలు చాల

తక్కువగ నుపయోగింప బడుచున్నవి. [illegible]

ణాము నశించినది.

6. భారతీయ పరిశ్రమల నద్ధోంముఖను ప్రభుత్వమెట్టి తీవ్ర ప్రయత్నములను గావింపక [illegible]యమును బూనియున్నది.

7. హైందవ పరిశ్రమల తాంపత్యము వహించుటకుగాక ప్రభుత్వము, ఈదేశమున తమపరిశ్రమల నెలకొల్పి విశేషలాభముల గడించు విదేశ ధనాఢ్యులకు చేయూతనొసగుచున్నది. [illegible] మొదలగు కొత్తపరిశ్రమలన్నియు విదేశజుల య[illegible] నుండిన కారణమున హైందవ ద్రవ్యము ఈవిధమునను విదేశ గతమగుచున్నది.

8. ఆంగ్లేయ ప్రభుత్వ మవలంబించిన స్వేచ్ఛావ్యాపార పద్ధతి (సుంకములు లేకుండనే దిగుమతులు దేశములోనికి రానిచ్చుట) అనేకవిధముల హిందూదేశమునకు హానినొనగూర్చినది. [illegible] ద్ధతివలననే హిందూదేశ పరిశ్రమలు వృద్ధిబొందకున్నవి.

9. హిందూదేశము విదేశములకు ముడిసరకులను, ఆహార పదార్థములను, ఎగుమతిచేయుచు, తయారైన వస్తువులను దిగుమతి చేయు స్థితికల్గినది. ఆంగ్లదేశ పరిశ్రమలకు వలయు [illegible]లను సమకూర్చు 'పెరటితోటయు హిందూదేశమే. ఆంగ్లేయ వస్తువులమ్ముట కుపయోగింపబడు విక్రయ స్థానమును [illegible] దేశమే!

10. పారతంత్ర్యకారమున ప్రతివర్షమును భారతదేశమునుండి, ప్ర[illegible] [illegible]ముగ, రమారమి 40 కోట్ల రూపాయలు పరదేశము[illegible] తరలి పోవుచున్నవి. ఈకారణమున, మనదేశముయొక్క ఐశ్వర్యము నానాటికి తగ్గిపోవుచున్నది. దారిద్ర్యము [illegible]న్నది. [illegible] దేశమున తాండవమాడుచున్న[illegible].

18. ఇతరదేశములతో బోల్చి చూచినచో హిందూదేశమున విద్యావ్యాపనము బహుస్వల్పముగ నున్నదని తెలియఁగలదు. వాణిజ్యమునకుగాని పరిశ్రమలకుగాని విద్యానసలే కఱపుట లేదు. మఱియు, నేడుప్రభుత్వ మొసగుచున్న విద్యయందు భారతదేశ వాఙ్మయములకంటె పరభాషా ప్రచారమే విరివిగ కొనసాగుచున్నది.

19. ఆరోగ్యాభివృద్ధికై యెట్టిప్రయత్నముల గావించకపోవుటచే, దరిద్రులగు భారతీయులు కృశించిపోవుటకు తోడుగ, రోగపీడితులై తమశక్తిని తేజమును గోల్పోవుచున్నారు. హైందవప్రజల జీవితము ఆయుష్కాలమును తగ్గిపోయినది. సగటున బ్రిటను దేశమున ప్రతిమనిషియు 40 సం॥ లు జీవించుచుండ, భారతీయుడు 23 సం॥ లు మాత్రమే బ్రతుకుచున్నాడు.

20. ప్రభుత్వము, దేశాభివృద్ధికొఱకు గానిఋణముల చేయుచు, వానిని తీర్చుభారమును మాత్రము హిందూదేశముపై బడవేయుచున్నది.

21. హిందూదేశమున కనేకవిధముల నష్టదాయకమగు మారకపుపద్ధతి యవలంబింపబడుచున్నది.

ఇట్టిపరిపాలనా విధానమునకు ఫలితము మనదారిద్ర్యమే కదా!

సంపూర్ణమగు నార్థికస్వాతంత్ర్యమే మన దారిద్ర్యమును పోగొట్టగలదు. ఆర్థికస్వాతంత్ర్యమును, సంపూర్ణాభ్యుదయమును ప్రసాదింపగల స్వరాజ్యమును సంపాదించుటకు భారతీయులు కృషిసల్పుట వారివిధమై యున్నది. భారతీయులు స్వకృషిచే స్వరాజ్యము నచిరకాలములో బడయుదురుగాక!

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B138 |
| పుస్తకం పేరు | భారతవర్ష ఆర్థిక చరిత్ర |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 347 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| | NO |
| తయారు చేసినది | P. Jasamma |
| పేజీలు విడదీసినది | Jayamma |
| Scan | Ch. Ramya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |